# శ్రీ పూదోట
# తత్త్వ గీతామృతము






తత్త్వ ప్రదాతలు

శ్రీశ్రీశ్రీ పూదోట లింగావధూత స్వాములవారు

# శ్రీ పూదోట
# తత్త్వ గీతామృతము




తత్త్వ ప్రదాతలు

## శ్రీశ్రీశ్రీ పూదోట లింగావధూత స్వాములవారు

ప్రచురణ - పూదోట సేవకులు

శ్రీ అవధూత ఆనందనాదస్వామి

శ్రీ నాగావధూతస్వామి

# శ్రీ పూదోట తత్త్వగీతామృతము

## విషయ సూచిక



ఓం
తత్త్వజ్ఞాన పరం.
అవధూత లింగ ప్రబోధయాత్రి



శ్రీ శ్రీ శ్రీ లింగావధూత స్వాములవారు కొనాలలో తపమొనర్చిన

పవిత్ర స్థలము

# శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి
# దివ్యావతార తత్త్వము

వందే వందే పూదోట రామం
వందే వందే శ్రీ శివరామం
వందే వందే పూదోట లింగం
వందే వందే శ్రీరామ లింగం

## మధునివేదన

### —: శ్రీ భగవానుడు :—

శ్రీకరుడును సచ్చిదానంద సాగరుడును అఖండ సత్య జ్ఞానానంద స్వరూపుడును అమృతమయుడును ఆనంద సాగరుడగు భగవానుడు పరబ్రహ్మదేవుడు. అనంతలోకాధినాథుడు అఖండ విశ్వమూర్తియై తన దివ్యానందముకొరకు అనంతలీలలను జూపుచుండును. ఆయన సర్వద్రష్ఠ, సర్వశక్తిధరుడు. సర్వమును ఆ దయామయుని యిచ్ఛానుసారమే జరుగుచుండును. ఆయన ఆనంద లీల లనంతములు. ఒక పరి జగన్నిర్మాణలీల, మరియొకపరి విశ్వపాలనాడోల, ఇంకొక పరి సర్వ విశ్వరూపలయానందఖేల. ఇట్టి అనంత లీలలా దేవదేవునకి సంకల్ప మాత్రములు మాత్రమే.

ఈ విశ్వ మా జగన్నాధునకు సుందరబృందావనం. ఆ ఆనంద బృందావనిలో ఆయన అనంత కళావిలాసిత లీలాక్రీడ యొనర్చును.

### —: దేవ దేవుని కరుణ :—

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥శ్రీగీత॥

అని తానే యనుగ్రహించినట్లు అనేకసార్లు భగవంతుడు యీ పృథివీమండలమున నవతరించి సర్వజీవులకు అమృత ప్రసాదము

నొసంగెను. యిక ముందును సత్య ధర్మపాలనమును ఆ ప్రభువే నిర్వహించుచుండును. ఒకొక్కొక్క సమయమున యొకొక్కొక్క ప్రాంత్యము దైవీజ్ఞాన తేజములనుండి దూరమై దుఃఖతప్త మగుచుండును. ప్రజాళిహృదయ చైతన్య బింబములు అజ్ఞానాంధకారముచే మాసి పోవును. తన సహజ స్వస్వరూపానందమును బొందలేక చుక్కానిలేని నౌక వలె దారిదప్పి పోవుచుండును. అప్పుడు జగన్నౌకాధారి పరమాత్మ డవతరించి విశ్వనౌకను సుగమ్య మొనరించును. ఇది యీ దేవదేవుని సహజకరుణ. అటుగాకున్న అనంత విశ్వాధి నాథుడేడ! సామాన్య మానవరూపము ధరించి యాత్మ దర్శోద్ధరణ జేయుటేడ! ఇత్యాది శ్రీనాథుని సర్వశక్తిధారణకు సహజ స్వతంత్రకు నిదర్శనం.

## —: ధ ర్మ ము న కు హా ని :—

దాదాపు 500 సం॥రముల క్రిందట కొందరు దేవునిపేర; ధర్మముపేర; శివ, కేశవ విభేదములను. సగుణ, నిర్గుణ ఉపాసనా బేధమును, జాతిబేధమును అర్హాజాతి, అనర్హాజాతి, బేధమును, ద్వైత, అద్వైత విభేదములను ప్రచారముజేయుచు అఖండవేదలక్ష్యార్థ స్వరూప వేద ధర్మమును సంకుచిత మొనర్చుచుండిరి. యీ నానా విధ బిన్న భిన్న ధర్మప్రచారముచేతను, బిన్న బిన్న భాష్యాదుల రచనచేతను ప్రజాళిలో నొక విధమగు ద్వేష, భయ, నిస్పృహ నిరాశలు కలిగెను.

యెయ్యది నిక్కమగు ధర్మమను నిశ్చయమును బొందలేక ప్రజలు అధైర్య, అవిశ్వాసములను బొందిరి.

## —: ధార్మిక జీవనశాంతి నౌక దారిదప్పి పోయెను :—

ఏతత్కారణమున అనేకమంది ప్రజలు దుఃఖ బాధలనొందుటకు కారణమగు అజ్ఞానము రాజ్యపాలన జేయుచుండెను.

## —: మాతృశ్రీ గరిమిరెడ్డి అచ్చమాంబగారి అవతారం :—

ఇట్టి సమయమున అఖిలేశ్వరునకు ఈ లోకముపై దయకలిగెను. తన బిడ్డల నుద్ధరింప నా దేవ దేవుడు సంకల్పించెను. అప్పుడు భగవానుడు ఒకేసారి తన మూడు దివ్యశక్తులతో మూడు రూపములు ధరించి పశ్చిమాంధ్రమున నవతరించెను. తన కరుణాగుణముచే శ్రీ మాత గరిమిరెడ్డి అచ్చమాంబగాను, తన పరశివాంశచే శ్రీ పూదోట లింగావధూతస్వామిగాను, తన మహా వైష్ణవాంశచే శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామిగాను, దాదాపు ఒకే సమయమున నవతారము దాల్చిరి. ప్రథమమున కరుణామూర్తియగు గరిమిరెడ్డి అచ్చమాంబా జనని యవతరించెను.

చక్కని చరిత్ర లేనిలోపమున యీ జననితలిదండ్రులు నాయమ శ్రీవారి పవిత్రనామములు మనకు లభింపవు. గాని అఖిలాంధ్రమున ప్రసిద్ధిగాంచిన గరిమిరెడ్డి అచ్చమ్మ జనని (చింతమాను మఠం) అను తన స్వగృహమున వ్యవసాయము జేయించుచు, నావుల బోషింపుచు, అతిథి యభ్యాగతుల నాదరించుటేగాక యొకదీనజన సేవాశ్రమముగా తనమందిరమును మార్చివేసి యుండెను. తన సన్నిధి కేతెంచినవారిని కరుణతో సమాదరించుటయే గాక గోసేవలో నియుక్తులజేసి ఆధ్యాత్మ పథమువైపు మరల్చి 'చింతమానుము' యని ప్రబోధించుచుండెడిది. ఈ మాతృమూర్తి పవిత్ర ప్రబోధ చిహ్నమే చింతమాను మఠం.

## —: శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల అవతారం :—

తరువాత శ్రీ వీరప్పయ్య యను పేర వైష్ణవాంశమున మహా సిద్ధయోగిగా శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి యవతరించి క్రమముగా శ్రీ అచ్చమాంబా మాత మధుర ప్రేమాశ్రయుడై యలనాటి గోపాలునివలె, తానును మాతృశ్రీ మందిరమున నివసించుచు గోవులగాయుచు క్రమముగా మహోజ్జ్వల తపోవిజ్ఞాన ద్రష్టలై సిద్ధాచార్యులై అఖండ వేద వేదాంత సారమును, కాలజ్ఞానమును, తత్త్వ రహస్యగ్రంథముగా భావగర్భితముగా రచించి ప్రసాదించిరి.

## —: శ్రీ లింగావధూత స్వాముల యవతారం :—

శ్రీ వీరబ్రహ్మేంద్రులకు యొకింత వెనుక పవిత్ర ప్రారబ్ధయగు అవుకు పురమున బనగానిపల్లెకు దక్షిణమున 10 మైళ్ళ దూరమున శ్రీ లింగావధూత స్వాములవారు అవతారమును దాల్చిరి.

## —: బ న గా ని ప ల్లె యా త్ర :—

శ్రీ లింగగురుని తలిదండ్రులగు పుణ్యదంపతులు పూర్వము దేవకీ వసుదేవులవలె తమ పవిత్ర హస్తాలతో జగత్తునకొక అమృత బాలుని అందజేసిన ధన్యజీవులు. శ్రీమతి సోమమ్మ సహిత సోమిరెడ్డి గారలు బాల లింగస్వామినివిడచి త్వరితముగనే ముక్త జీవులగుటచే శ్రీ బాల లింగస్వామివారు దీనజనసేవలో ప్రసిద్ధిగాంచిన అచ్చమాంబా జనని సన్నిధిజేరి యా జనని దివ్యప్రేమలో పెరుగుచు నామె యాజ్ఞానువర్తియై గోవుల గాయుచుండిరి.

## —: శ్రీ శివరామ దేశికుని సన్నిధి :—

ఇట్లు కొంతకాలము గడువ శ్రీ లింగస్వామిని శ్రీ శివరామ స్వామియను నొక మహాయోగీంద్రుడు బనగాని పల్లెకు సమీపమున గల ఏగంటియను నతి ప్రాచీన చిన్మయ తత్త్వలింగ క్షేత్రమున తాను నివసించు గుహాలకు దీసుకొనివెళ్లిరి శ్రీ శివరామ పరబ్రహ్మ స్వామి అనుపమాన యోగద్రష్టయును, అఖండ తత్త్వవేత్తయునై యుండెడివారు.

## —: శ్రీ గురుసన్నిధిని ఏగంటి గుహానివాసము :—

శ్రీ లింగస్వామి సద్గురు శివరామప్రభుసన్నిధిని గుహానివాస మొనర్చుచు సద్గురునిసేవించుచు వినమ్రుడై వారి యాజ్ఞాపాలన మొనర్చుచు శ్రీగురు దేవులచే తత్త్వ శ్రవణ మొనర్చుచు, ఆధ్యాత్మ సాధనజేయుచు శ్రీ గురుకృపచే సర్వశాస్త్ర సర్వధర్మ సర్వతత్త్వ సర్వయోగ రహస్యములను గ్రహించి సంపూర్ణముగా తదనుభూతి

నొంది సాటిలేని మేటి విజ్ఞానజ్యోతియై వర్ధిల్లిరి. జగత్తుయొక్క భాగ్యము గాక యిట్టి మహాపురుషావిర్భావము జరుగుట చాలా యరుదు. నిజముగా జెప్పవలయునన్న శ్రీ లింగమూర్తి స్వామివారు, వేద వేదాంతముల పూర్ణత్వానుభూతికి యొక అద్వితీయ చిహ్నమై యుండెను. శ్రీ లింగదేవుని తత్త్వజ్ఞాన యోగసిద్ధిని గమనించిన శ్రీ శివ రామ దేశికులు శ్రీ లింగస్వాములనుగని ఆత్మలింగా! ఇక లెమ్ము. విశాల విశ్వమే నీ ప్రబోధాకేంద్రము. జీవుల నందరిని ఆధ్యాత్మ జ్ఞానమువైపుకు మరలించి నీ యఖండ మహాద్వైత తత్త్వ బోధలతో జగతికొక చైతన్యజాగృతిని గల్పింపుము. ఈ జగత్తును చిన్మయ యోగవిభూతిచే పూదోటగా జేయుము అని సందేశించియాశీర్వదించిరి.

—: ఏగంటినుండి బనగానిపల్లెకు ఆగమనం :—

శ్రీ శివరామగురు పరమేశ్వరుని దివ్యసందేశముతో లింగ మూర్తిస్వామి లింగావధూతస్వామియై బనగానిపల్లె జేరిరి. రవ్వల కొండమీద నొక చిన్నచరియ శేషాకృతిగా నుండిన దానిపై విశ్ర మించుచూ తనభావి జగదుద్ధరణ మహాయాత్రకు అనువగు తత్త్వ ప్రణాళికను భావపలకమున జిత్రించుకొనుచు దానికి రూపురేఖలు దిద్దుకొను చుండిరి.

—: సేవా మూర్తి :—

శ్రీ లింగావధూత స్వాములవారు విశ్రమించు కొండకు రవ్వల కొండయని సార్థకనామము గలదు. సర్వదా విశేషించి వర్ష ఋతువు లలో అనేకమంది ప్రజలా కొండపై రవ్వలకై యన్వేషణ జేయు చుందురు.

ఆ సమయమున రవ్వలు వెదకువారు కొంతదూరముననున్న జుర్రేరు నదీతీరమునుండి జలమును మట్టికడవలతో దెచ్చిపెట్టమని యా పేదజనులు ఈ సాధులోక చక్రవర్తిని యాదేశింప పార్థనకు సేవజేయు పరబ్రహ్మ దేవునివలె యా పేదలకు తన అమృత హస్త

స్పర్శతో దెచ్చిన యీ దివ్య గంగను బోసి వారి దాహమును దీర్చువారు.

—: గురుదేవుని సంకల్పముచే రాళ్ళు రత్నాలుగా మారెను :—

ఒకపరి శ్రీ లింగావధూతస్వామి రవ్వలకొండ నధిష్ఠించియుండ యెన్నాళ్ళు వెదకినను రవ్వలు దొరకక ఋణబాధకోర్వలేని దీనకుటుంబ మొకటి నాత్మహత్యాయత్నమున నుండెను, శ్రీలింగదేవుడు కరుణించి వారి సన్నిదికేగి యివిగో వజ్రాలని యొక రాతి క్రిందినుండి చేతితో దీసి యిచ్చిరి. గ్రామము పరిసరములన్నియు శ్రీలింగస్వాముల దివ్య మహిమావర్ణనముచే యాశ్చర్యానందముల నొందుచుండిరి.

—: శ్రీ లింగగురుని, నవాబుగారు దర్శించుట :—

ఈ మహిమాలీలలు విన్న నవాబుగారు శ్రీ లింగావధూత స్వామిని దర్శించి కేమోడ్చి యాశ్చర్యమగు మీ లీలామహత్తు నన్నా కర్షించినది. నే నెక్కివచ్చిన ఈ గుర్రముయొక్క గర్భమునగల పిల్ల లక్షణములు జెప్పవలెన మోస మెరుగని గురుపరమేశ్వరుడు చూలాలగు గుర్రముయొక్క గర్భముననున్న పిల్లకుగల లక్షణములన్నియుదెల్పెను. అపుడు నవాబుగారు గుర్రముయొక్క ప్రసవమువరకు యోచ్యజాలక కఠోరముగా గర్భచ్చేదముజేసి స్వామి వాక్కుల సత్యత్వమునకు నివ్వెరబోయి స్వామీ మీరిటనే యుండుడు మీకు గొప్ప మాన్య మిత్తుననె. నిత్యభిక్షుడగునాకు జగమేమాన్యమని స్వామిమానియుయ్యె. నవాబు తిరిగి పోయెను. గుర్రమునకు కలిగిన ఘోరమరణము శ్రీలింగ దేవుని కరుణాహృదయమును కలచివేసెను. త్వరలో బనగానిపల్లె విడచి మరొక క్షేత్రమున గొంతకాలము మానము వహింపనిశ్చ యించిరి.

—: తత్త్వార్థమున ఏగంటి చిన్మయ క్షేత్రము :—

క్షేత్రములు అందలి మూర్తులు సంస్కృతీ ధర్మసాధనమునకు లక్ష్యార్థములగు చిహ్నములు. భారత ఋషులు ప్రతి క్షేత్రమునను

గంభీరమగు తత్త్వార్థ సాధనా గోప్యమును దాచియుంచిరి. శ్రీ ఏగంటి క్షేత్ర ప్రాదుర్భావమునకు పూర్వమిచట తప మొనరించిన మహర్షులు శుద్ధ చైతన్యమును జడమగు బాహ్య భూమికనుజేర్చి ఆత్మనేగాక దేహమునుగూడ చిన్మయ మొనర్చి జీవన్ముక్తులై స్వేచ్ఛా జీవనముగడుపుచు తమ కెపుడీ యిహలోకజీవనము తృప్తినొందిన సపుడపుడు వారు విరాట్ చైతన్యమున గలియుచుండిరి కాబోలు! అందు కనుగుణ్యారీతిని యొకపురాణగాధయు నొకవిచిత్ర శివ మూర్తియును నా క్షేత్రమున బ్రతిష్టించిరి. క్షేత్ర పురాణగాధయిది. శ్రీశంకరుడు గౌరినివిడచి గంగనే ప్రేమించుచుండెనట. అపుడు శ్రీగౌరీమాత గంగా శంకరులవీడి భూలోకమునకువచ్చి దీనయై తపమొనర్చుచుండెనట. కొన్నాళ్ళకు శంకరుడు శ్రీగౌరీస్మృతితో పృధులోకమునకు వచ్చి యా క్షేత్రమున తపమొనర్చు గౌరీమాతను జూచి అహో ఏన్ గంటి గౌరిన్ అని దివ్య ప్రేమతో శ్రీ గౌరీమాతను ఆలింగన మొనర్చుకొనిరట. దీనికి తత్త్వార్థమిది.

శివదేవుడగు శుద్ధ జీవునకు గౌరియను జ్ఞానప్రకాశము గంగయను మనస్సు రెండావరణములుగలవు. తన స్వప్రకాశావరణమును వీడి (శివుడు) జీవుడు మనోబద్ధుడైయున్నాడు కొన్నాళ్ళకు స్మృతిగలిగిన శివుడు (జీవుడు) అజ్ఞానావరణమును విచ్ఛిన్న మొనర్చుకొని శుద్ధ ప్రకృతియగు గౌరితో నేకమగుచున్నాడు. శ్రీగౌరీశంకరుల యేకత్వము ముక్తియంతగాక పృధుస్థానమున నగుటచే బౌతిక దేహము స్వయం ప్రకాశ చిన్మయమగుచున్నది ఇది శ్రీ యేగంటిక్షేత్ర పౌరాణికగాధ లోని తత్త్వరహస్యము. ఈ క్షేత్ర సంస్కృతీ యోగప్రణాళికను శ్రీ శివరామ దేశికులు పూర్తిగా సాధించి యుండిరి. శ్రీ శివరామ దేశికుని కరుణా ప్రసాదమున శ్రీ లింగావధూత స్వామివారికి స్వయం ప్రకాశ చిన్మయదేహము సహజమైయుండెను శ్రీ లింగస్వామిని నీడ లేని నిజలింగమూర్తియని ప్రజలీ నాటికి జెప్పుకొనుచుండ మనము శ్రీ లింగస్వామివారి మఠప్రదేశములలో వినవచ్చును. శ్రీ చిన్మయ లింగనిగన్న త్రిలింగజననీ నీకివే జేజేలు. పూర్వము శ్రీశంకరాచార్యులకీ

చిన్మయ దేహముండెడిది శ్రీ బసవాచార్యులు:ను యీ యోగసిద్ధికై తీవ్రముగ బ్రయత్నించిరి. మహాసిద్ధులగు శ్రీ వడలూరు రామలింగ స్వాములవారికి యీ యోగము సహజానుభవమైయుండెను. అత్యం తాధునికులును ప్రపంచప్రఖ్యాత యోగీంద్రులు:నునగు. శ్రీ అరవిందు లీయోగమును గ్రహించి 45 సంవత్సరములు ఏకాంతవాసియై తప మొనర్చి చిన్మయసాధనలో నూతన ప్రయత్న మొనర్చిరి. యీ లక్ష్య మున చాలా గ్రంధములు వ్రాసిరి.

—: బనగానపల్లె నామ నిర్వచనం :—

ఆంధ్రదేశమునగల మహనీయమగు ఆధ్యాత్మ పీఠములుగల నగరములలో బనగానిపల్లె అత్యంత ప్రధానమైనది. ఈ బనగానపల్లె పుణ్యభూమికి శ్రీ వీరక్షేత్రమను నానుడి ప్రజలలో బాగుగావ్యాపించి యున్నది. యిట్టి బ్రాహ్మీక్షేత్రమున శ్రీ భగవానునియొక్క శ్రీ శివ కేశవ, పరాశక్త్యాత్మక, పూర్ణావతార స్వరూపులు శ్రీ లింగావధూత స్వామి శ్రీ వీరబ్రహ్మేంద్రులు మాతృశ్రీ గరిమిరెడ్డచ్చమాంబ. సమ కాలిక జీవనులై సేవా తపములొనర్చి జగత్తున బనగానిపల్లెకు బ్రాహ్మీపీఠస్థితిని గల్పించిరి. కానీ అనేక తాత్త్వికనామములు కాల వాహినిలో రాను రాను యుచ్చారణాది మార్పులు జెందుచుండును. సహజముగా శ్రీ వైకుంఠపురమునకు పర్యాయపదమే (బాను, గాని, పల్లె) శ్రీ గీతలోగల 'నతద్భాసయతే సూర్యో' అను సూత్రముచే గూడ సూర్యుని తేజ మెచట ప్రకాశింపదో యది పరమపదము. లేక కైవల్యమని దాని యర్థము. లలితమగు శబ్దార్థముచేతను శ్రీ భగ వానుని దివ్యావతారముల నివాసమై యొక మహావిజ్ఞానావిర్భావము నకు కేంద్రమై యుండుటచేతను, శ్రీ వైకుంఠమే భానుగనిపల్లె యనుట తత్త్వపరముగా నెంతయో తగియున్నది.

—: జు ర్రే రు న ది :—

భానుగానిపల్లెమధ్యలో నొక పవిత్రమగు నది సదాప్రవహించు చున్నది. శివకేశవ పరామాతలచే సేవింపబడిన యీ నదీమ తల్లి-

భాగ్యము వర్ణనాతీతము. యీనది నామము ఒక సమాసమువంటిది. మరియొక దివ్యశబ్ధమును గలుపుచో, అద్భుతార్థము వచ్చును. (శివకేశవులగొల్వ జు(్రేరు మధురం) యీ నదీమతల్లిని గూర్చి అనేక మహిమాగాధలుగలవు. పరమపావని గనుకనే, జు(్రేరమ్మ కుత్తర గట్టున శ్రీ వీరబ్రహ్మేంద్రుల కాలజ్ఞానమఠం, దక్షిణ తీరమున రవలకొండపై శ్రీ లింగావధూత స్వామివారి మఠం ప్రకాశింపుచూ నిత్య నూతనచైతన్య భాండారములై భక్తుల నేలుచున్నవి.

—: శ్రీ వీర బ్రహ్మేంద్రస్వాములు :—

శ్రీ భగవానుని వైష్ణవాంశమున యవతరించి బనగానిపల్లె కేగి పరమజనని గరిమి రెడ్డచ్చమ్మగారి మందిరమునజేరి మాతృశ్రీ యాజ్ఞానువర్తియై గోపాలన జేయుచు తనకుగల సహజ జ్ఞాన యోగముచే ఆత్మసిద్ధికొరకు తపోసాధనల జేయుచు. అమృతసిద్ధి నొందిన శ్రీ వీరబ్రహ్మేంద్ర గురుస్వామి కాలజ్ఞానమను మహనీయ, తత్త్వసాధనారహశ్య గ్రంథమును రచించెను.

కేవలం మహావిష్ణు అంశాసంభూతులగు శ్రీ వీరగురుని తత్త్వ గోప్యమగు కాలజ్ఞానమును యేదో భావి కాలగతులనుదెల్పే జ్యోతిష గ్రంథంగానే భావించుట చాలా విచారకరము. మహాపురుషుల యవతారములు అఖండమగునాత్మోద్ధరణకేగాని యేదో సామాన్య జ్యోతిశ్శాస్త్ర భవిష్యత్తులు ద్వంద్వాలు లాభనష్టాలు జెప్పడానికిగాదు.

ఉదా:- కడపపురమువద్ద కమలాపురంలోన కప్ప
కోడికూత గూసేరన్న శివగోవింద గోవింద.

తత్త్వార్థము:- కడపపురం = ఇహపరములకు సంధియగు భ్రూమధ్యను, కమలాపురం = ఆజ్ఞాచక్రమున, కప్ప = ఓంకారం, కోడి కూత మేల్కొల్పు; తెలివిలేక స్మృతి తా॥ భ్రూమధ్యమున గల యాజ్ఞాచక్రమున ఓంకారసాధన జేయుచో నేను నే ననుస్మృతి లేక దైవజ్ఞ నము కలుగునని ఈ దివ్య ప్రబోధములోని తత్త్వార్థము.

ఉ॥ చింతమానుమీద చామంతి పూవులు బూశేని

తత్త్వార్థము:- ఓ జీవుడా చింతమానుము. ఆ పైని ప్రకాశవంతమైన చామంతిపుష్పవర్ణమై ముక్తికాంతానివాసమైన హిరణ్మయకోశము వికసించి పరతత్త్వమును జేరగలవు. ఇట్టి అత్యద్భుతములగు ఆధ్యాత్మ తత్త్వ రహస్యాలతో నింపి కాలజ్ఞానమన = కాలమే అఖండ విరాట్ స్వరూపము. అతితురీయభూమిక (కాలశ్చ నారాయణః అని వేద ప్రమాణం) అనగా కాలస్వరూప విరాట్పురుష జ్ఞానముచే దేహాత్మభావమును వీడమని బోధించిన లోకగురుడు మహాతపస్వి, మహాయోగి, మహాజ్ఞాని, మహాసిద్ధులగువారిని తత్త్వ గురువులుగా స్వీకరించి జన్మ తరింపజేసికొనుటకై జీవులు ప్రయత్నించు సుదినము వచ్చుగాక. అంతియెగాని శ్రీ కాలజ్ఞానమును సామాన్య జ్యోతిశ్శాస్త్రగ్రంథముగా జూడవలదని నా ప్రార్థన.

—: మ హా సం స్క ర్త లు :—

శ్రీ వీరగురుడు శ్రీ లింగావధూత గురుడు వీరిద్దరు వేద ధర్మ పునరుద్ధారణకై యవతరించిన శివకేశవులు. అందు కనుగుణ్యారీతిని (వారు) శ్రీ వీరగురుడు శ్రీ శివ పంచాక్షరీ యుపాసనను శ్రీ లింగ గురుడు శ్రీ రామోపాసనను జేసి శివకేశవ తత్త్వమున అభేదమును జాటిరి. (శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే) వారిద్దరు తత్త్వ వాఙ్మయమును, గొప్ప విద్యావంతులకేగాక సామాన్యులును జాతి మతభేద రహితముగా జదివి యాత్మానందమును బొందుటయే లక్ష్యముగా నుంచిరి. బ్రహ్మ విద్య, యే యొక్క-జాతికే పరిమితమను వాదమును పూర్తిగా త్రోసివేసిరి. అందు కనుగుణ్యముగా వెనుకబడిన జాతుల వారందరికి బ్రహ్మవిద్యా ప్రసాదమిచ్చిరి. మాదిగ కక్కన్న, దూదేకుల శిద్దయ్య భద్రావధూత యిందుకు నిదర్శనాలు. ఇట్టి మహనీయ నిదర్శనములు వారి దివ్య జీవితముల నందెన్నియోగలవు.

—: శ్రీ లింగగురుదేవులు కానాలకు వచ్చుట :—

బనగానిపల్లె కొండమీద తన సన్నిధిలో నవాబుసాహెబు జరిపిన ఘోరకృత్యమును జూచిన గురుస్వామి హృదయము ద్రవించి

కొంతకాలము మహోపవాసమునకై బయలుదేరి ధన్యతాయోగము గూడిన, కానాలవచ్చి యా వూరివెలుపలగల దుర్గమమగు ముండ్ల పొదలతోగూడిన యొక నీటిగుంట సమీపమున నొక వృక్షము క్రింద మరల తపోనియుక్తుడాయెను. ఇపుడు స్వామి తన యజ్ఞాననివృత్తి కొరకుగాక సర్వలోక కల్యాణవాంఛాసిద్ధికై యీ తపోదీక్ష బూనిరి నిజానికది ధ్యాన జపాదియోగ ప్రయత్నముగాదు, సహజానంద సమాధి. ముక్తపురుషుని సహజానందము తనలో అనంత జగము, జగత్తులోని అనంతజీవులలో తాను ఇట్టి పరిపూర్ణ యోగసిద్ధుడా లింగదేవుడు. తనపై యనేకపక్షులు మలినకార్యములు జేయుటయు తనకు గ్రామములోని యొక పుణ్యసతి బిక్షదెచ్చి యుంచుటయు గాంచకుండుట వారికి సహజము. అంతటి యఖండస్థితి స్వామివారిది.

—: శ్రీ లింగదేవుని దివ్యకరుణ :—

ఒకపరి కానాలప్రాంతమున క్షామసూచనలు గోచరించుటచే బిక్షనిడుతల్లి తనకుటుంబమునెంట గ్రామాంతరము వెళ్ళక తప్పనిస్థితిలో శ్రీ గురులింగని సన్నిధినిజేరి వీడలేక విలపించెను. అపుడు జాగ్రత్తు నొందిన యవధూతచంద్రుడా తల్లి దుఃఖకారణమును విని యఖండ వర్షమునకై తనయిష్టదైవమగు శ్రీరాముని బ్రార్థించెను. వారి ముఖతా ప్రార్థనాగేయము వెడలెనో లేదో వర్షమారంభమై కాటక మంతరించె నట. కానీ యిట్టి లీలలన్నియు మనదృష్టికి మహనీయతగావచ్చు సర్వ విశ్వమున కొక అధ్యాత్మ జీవితపథమును చిన్మయయోగ నిరూపణ మును జూపింప వచ్చిన యా మేటి కివి యేపాటి? ఇవన్నియు శ్రీవారి సంకల్ప మాత్రమున సాగిపోగల విభూతులు! మహాసాగరమున చిన్ని తరంగముల వంటివి మాత్రమే.

—: శ్రీ దాసావధూతస్వామి శరణాగతి :—

శ్రీలింగదేవునితపోదీక్ష కొంతకాలము అతిప్రశాంతముగా సాగెను. ఒకానొక మంత్రవేత్త యాత్మవిభూతిని బొందలేక ప్రయాసనొందుచు

చివర శ్రీ లింగదేవుని సన్నిధిని తన క్షుద్రమంత్రశక్తులు ప్రయోగించి నవియన్నియు నిరుపయోగమై పోగా సంపూర్ణ శరణాగతులైరి. కరుణాపయోరాసి శ్రీ గురుదేవు డనుగ్రహించి దాసా! యని సంభోదించి తనబిడ్డగా స్వీకరించిరి.

## —: అవతారకార్యమగు తత్త్వనిర్మాణము (పూదోట) :—

శ్రీలింగగురుదేవునికి శ్రద్ధాభక్తులతో దాసుడు సేవజేయుచున్నాడు. అట్టితరి గురునాధుడు తన హృదయ విజ్ఞానమునకు నొక నామకరణము జేసెను. తాను దర్శించు భావించు సేవించు యీ విశ్వము పరబ్రహ్మ దేవునిలో నుండి యావిర్భవించిన మహాపద్మముతో ప్రారంభమై వర్ధిల్లుచున్నది. అందుచే యీ సుందర విశ్వరూప పద్మమునకు పూదోటయని నామకరణ మొనర్చెను. యీ విశ్వాండమెట్లు పూదోట యయ్యెనో నట్లే పిండాండమును నొక పద్మమై అనేక పువ్వులతోగూడిన యనంత జీవస్వరుపయగు యీ విశ్వమెల్లను పూదోటయని శ్రీగురుస్వామి విశ్వధర్మ నామకరణ మొనర్చెను.

## —: మహాద్వైతము - పరమయోగము :—

శ్రీ లింగభగవానులది అద్వైత హృదయము. తాను ప్రేమించునది, తా ననుభవించునది, తాను ప్రభోదించునది సర్వమూ అద్వైతమే. అయినను నాకాలమున అద్వైత మతముపేర చాలా దారుణములు జరుగుచుండెను. అద్వైత మతవాదుల మనువారు జాతులపేరున, జన్మపేరున, నానావిధ ద్వైత జీవితమును ప్రబోధ మొనర్చుచుండిరి. అనేకమంది అద్వైత పీఠాచార్యులు బ్రహ్మసత్యం జగన్మిధ్యా యని ప్రభోదించుటేగాని వైరాగ్యరహితులై అనేక భూ, ధన వస్తుజాలములగూర్చికొని ప్రజామధ్యమునుండి దూరమగుచుండిరి. ప్రజలందరికి సమతాభావమున తత్త్వబోధలు జేయకుండిరి. జ్ఞానముపేర అహం బ్రహ్మాఽస్మిపేర నహంకార హృదయులై యతి తురీయమైన భక్తియోగమును, సేవాయోగమును మరచియుండిరి. అందుచే నైతిక ధార్మికతాత్త్వికసూత్రములకు విరుద్ధముగా పాషండమగు గురుధర్మము

వ్యాపించియుండెను. ఈ కారణమున శ్రీ లింగావధూత స్వామివారు తాను ప్రబోధించు మహామార్గమునకు మహాద్వైతమను దివ్య నామ కరణ మొనర్చెను. తనపవిత్ర చిన్మయ యోగమునకు పరమ యోగ మని నామాంకితము జేసెను.

సర్వప్రజాళియు, తన యాధ్యాత్మ తత్త్వజ్ఞాన యుక్త పరమ యోగమును గ్రహించి శాశ్వతానందమును బొందుటకు ననువుగా తేట తెనుగున అత్యంత రమణీయమగు గేయమార్గమున శ్రీ గురులింగ దేవుడు ప్రబోధ మొనర్చెను.

మహాపురుషుల దివ్యభావములకు శ్రీ వాణీమహాజనని స్వయ ముగా కవితావాహినియై పొంగులువారునోయన్నట్లు శ్రీ లింగదేవుడు సహజతన్మయావస్థలోనుండియు సంకల్పమాత్రమున రాగతాళ సహిత మైన పదభావ లాలిత్యమధుర యుక్తములగు ప్రబోధ గేయము లాశువుగా గంగాప్రవాహంవలె గానముజేయుచుండెను. ఆ దివ్యాతి దివ్యమును మధురాతి మధురమును గుహ్యాతి గుహ్యమును నగు తత్త్వ గీతములను శ్రీదాసావధూత సహిత భిక్షువులు వెంటవెంటనే తాళ పత్రములపై లిఖించుచుండిరి. ఒక్కొక్కపుడు ముముక్షు జనాళి శ్రీవారి నేదైన తత్త్వ గోప్యమునుగూర్చి సంశయ నివృత్తినిగోరిన యెడలనూ నాగురుస్వామి ముఖతా గంగాప్రవాహమువలె తత్త్వగీతములు బహిర్గత మగుచుండెను. ఆలోకోత్తర తత్త్వగీతావళిని వ్రాసి ప్రజాళికి యఖండ తత్త్వధనమును జేకూర్చిన యానాటి లేఖకులకును యీ నాటివరకు వాటిని రక్షించిన శ్రీ పూదోట గురుపీఠపరంపరా సేవకులకును ధన్యాం జలిని సమర్పింప దగియున్నది. శ్రీ కృష్ణదేవుని హృదయాన్ని మనం శ్రీ గీతలద్వారా గ్రహించుచున్నట్లే శ్రీ లింగదేవుని తత్త్వహృదయాన్ని శ్రీ వారి తత్త్వగీతల ద్వారానేగదా గ్రహించి యనుభవింపగలము?

—: శ్రీ లింగావధూత ప్రభువుల చిన్మయ యోగసిద్ధి :—

సర్వలోక కల్యాణదాయకములై వేద, ధర్మ, హృదయము నకు సాటిలేని అమృతానుభవ పూర్ణప్రబోధకములగు శ్రీ లింగస్వామి

తత్త్వ గీతములు శ్రీవారి ప్రధాన సేవకులచే లిఖించబడు చుండుటచే నవి క్రమక్రమముగా ప్రజలలో ప్రచారమునకు వచ్చుచుండెను. ఆ తత్త్వ గీతావళిని పాడుకొనుటకెంత మధుర లాలిత్యమో యందలి తత్త్వ లక్ష్యములు వాటి మధురానుభూతియూ సంతటిగుహ్యామూ ప్రసిద్ధమూనై యుండెను. శ్రీ గురుదేవులభావము సర్వ ప్రజాహృదయ సముద్ధరణము గావున ప్రతివారును నా తత్త్వములను జదివి యానందించుచు ధన్యులగుచుండిరి. క్రమముగా శ్రీలింగమూర్తిస్వాములవారి పూదోట తత్త్వాలు తెలుగు దేశమంతటా వ్యాపించుచుండెను. అనేకులు బిక్షుకులు శ్రీ లింగస్వామి తత్త్వావళిని తమ బిక్షాసమయమున బాడుటయు నందలి దివ్యభావములువిన్న గేస్తులు శ్రీ లింగదేవునిపట్ల తమకుగల గాఢప్రేమకు చిహ్నముగా వాటిని పాడినవారికి యధికముగా బిక్ష నొసగుచుండిరి. యిట్లు శ్రీ లింగమూర్తి స్వామి వారి పూదోట తత్త్వ గీతాలకొక మహాప్రచారము వచ్చెను. ఎటు జూచినను పూదోట తత్త్వములే గానము జేయబడుచుండెను.

## —: శ్రీ పుష్పగిరి పీఠాధిపతుల సందర్శనము :—

శ్రీ లింగదేవుడు కానాలలో తాను తపమొనర్చిన వృక్షము చెంత సహజ తన్మయానందములోనే యుండెడివారు. ఆ సమయమున పుష్పగిరి శ్రీ శంకరగురు పీఠాచార్యులు నంద్యాలలో ధర్మప్రబోధము జేయుచుండిరి. వారి విడిది సమీపమున నొక బిక్షుకుడు శ్రీ అవధూతస్వాముల తత్త్వ గీతములను బాడుచూ వెళ్ళుచుండెను. ఆ తత్త్వ వాణిని శ్రీ శంకరాచార్యులవారు విని సంభ్రమాశ్చర్యములను బొంది. యా బిక్షుకుని రావించి ఈ తత్త్వగీతా రచన మెవరొనర్చిరి ! అని యడుగ సమీపమున కానాలలో నొక దిగంబరుడైన పూదోట లింగస్వామి యున్నారు. వారు అనుగ్రహించినవే యీ తత్త్వాలు అని విన్నవించెను. తాను సర్వభూమికలకు ద్రష్టనగు పరతత్త్వమనియు సర్వవిశ్వము తన స్వరూపమేయనియు యున్న ఆ తత్త్వ హృదయమును మననమొనర్చి యఖండానందముతో నొక

దివ్యమగు పల్లకీనిచ్చి కొందరు భక్తులను శ్రీ లింగగురుల నాహ్వానించి దీసుకరమ్మనిపంప వారు శ్రీ గురునాథునిదర్శించి శ్రీ శంకరాచార్య స్వామివారు తమ తత్త్వ మహత్వమును చవిజూచి తమరిని ఈ పల్లకీ నెక్కి రమ్మని యాహ్వానించి యున్నారు. దయసేయుడని ప్రార్థించగా సుందహాస వదనుడైన మహాలింగమూర్తి యిట్లనియెను. బిడ్డలారా! నే నెచటికినీ కదలలేను నేను లేనిచో నెక్కడ? అందుచే వారికి అవసరమగుచో శ్రీశంకరులవారిని యొంటరిగా నావద్దకు రమ్మని జెప్పితి నని దెల్పుడని సందేశ మొసగె.

ఈ వర్తమానం శ్రీ శంకరాచార్యుల వారికి భక్తులు నివేదించిరి. వారునూ ఆశ్చర్యమున ప్రజలందరుతీర్థయాత్రవలె నన్నుదర్శించిసేవించు చుండ నన్నేరమ్మని నేను లేనిచో నెక్కడిది యనిన యాసాధుమూర్తి స్థితి యసాధారణముగా నున్న దే! అయినను సాధు దర్శనము పవిత్ర మని భావించి యొకపల్లకీనెక్కి కానాలజేరి కొంతదూరమున పల్లకి నుండి దిగి యొంటరిగా అవధూత లింగస్వామిని దర్శించెను. దూరము నుండియే వృక్షచ్ఛాయలలోనున్న తెల్లింటి దక్షిణామూర్తి స్వరూపు లగు శ్రీ లింగపరమేశ్వరునిజూచి యానందించి సమీపించి భావనమ స్కారమొనర్చి నారాయణ స్మరణ మొనర్చెను. అపుడు శ్రీ శంకరా చార్యులనుజూచి మహాలింగ ప్రభువు ఆచార్యా! ఏమి! ఒక్కరుగాక యిరువురుగా వచ్చియున్నారు? అనగా నాయతివర్యులు ఓ సాధు సత్తమా! నేనొక్కడనే వచ్చితిని మీసంబోధన నా కర్థముగాలేదు! అనెను. అప్పుడు శ్రీ గురులింగస్వామి యతివర్యా! మీరు దైహికమగు ఛాయతోగూడ వచ్చి యున్నారు. ఇదియును అద్వైతమునకు నాటంకమేగదా! ఇదిగోచూడుడు అని తమ సహజ చిన్మయః స్వయం ప్రకాశ దేహమును జూపిరి. ఒక్కసారి అన్నివైపులను ప్రకాశించు చున్న తత్త్వావతారుడు చిన్మయః మూర్తియగు శ్రీ లింగమూర్తిస్వామి మధుర మందహాసవదనుడై దర్శనమయ్యెను. శ్రీ శంకరాచార్యులవారి యొడలు పులకరించెను. హృదయముప్పొంగెను. పట్టలేని యానందమున ఆ పరశివావతారుని అనేకరీతుల గీర్తించి ధన్యుడనైతినని మరలి

పోయెను. ఈ దివ్యసంఘటన తర్వాత శ్రీ లింగమూర్తి స్వామిని గూర్చి మరీ ప్రచార మధికమాయెను. ప్రజలు తండోపతండముగా వచ్చి శ్రీ వారిని దర్శించి వారిచే ప్రబోధింపబడి ధన్యతనొంది వెళ్ళు చుండిరి. మరికొందరు వారి స్వగ్రామములకు శ్రీ లింగపరమేశ్వరుని ప్రార్థించి దీసుకొనివెళ్లి శ్రీ గురుదేవుని యఖండప్రబోధములువిని తన్మ యులై పూదోట భక్తులగుచుండిరి. ఇట్లు శ్రీ లింగపరమాత్మ క్రమ ముగా కానాలవిడచి యితర ప్రదేశములకువెళ్ళి కొన్నాళ్ళుగడిపి ప్రబోధించి తిరిగి తన యథాస్థానమునకు వచ్చుచుండిరి.

## —: శ్రీ లింగప్రభువులు మృతబాలుని జీవింపజేయుట :—

శ్రీ లింగప్రభువులు తరుచు భక్తమండలితో గలిసి గ్రామాంత రము ప్రబోధనములకై వెళ్ళివచ్చుచుండుట పరిపాటి. శ్రీవారి యాశ్రమ జీవితమునకు నవసరమగు యాహారాదికము నిత్య ప్రసాదభిక్ష ద్వారా గడుపబడుచుండెను. శ్రీవారి వద్ద యెట్టి ధనధాన్య సంబంధ మగు నిల్వలునుయుండవు. శ్రీ పూదోటగురుని భక్తులు గ్రామములలో పాత్రచేగొని బిక్షకు వెళ్ళునపుడు గృహస్థు లత్యంత భక్తిశ్రద్ధలతో (శ్రీ గురుపాదుల కాలమునుండి నేటివరకు) బిక్షను సమర్పింతురు ఒకనాడు సుదూర గ్రామాంతరమునుండి పయనము సాగింపవలసి వచ్చుటచే శ్రీ లింగావధూత ప్రభువులు కానాలకు జేరుసరికి రాత్రి ప్రొద్దెక్కినది ప్రజలంతా నిదురించు సమయమైనది. అయినను, నొక భక్తురాలి మొర దూరమునుండియే విన్న శ్రీ గురుస్వామి దాసావ ధూతను బిలిచి దాసా లెమ్ము గ్రామములోనికి బోయి బిక్షగొనిరమ్ము ఆకలి వేయుచున్నదనిరి. యిది అకాలము అయినను శ్రీ గురుదేవుల యాజ్ఞయని గ్రామ వీధులవెంట బిక్షాపాత్రగొని వెళ్ళుచుండ నొక ధార్మిక వైశ్యగృహమువద్ద అనేక జనము గుంపులుగానుండి కొందరు దుఃఖించుచుండ మరికొందరు సానుభూతితో పరామర్శ జేయుచుండిరి. దానికి కారణ మా వైశ్యుని కుమారుడు నూత్నవివాహితుడు నాటి సాయింత్రమె మరణించియుండెను. దారివెంట మాతా ! బిక్షాందేహి

యను, దాసావధూతస్వామివారాయింటినిసమీపించి మాతా పూదోట బిక్ష యనెను. అనేకులు ఆపత్సమయ బిక్షను విమర్శించుచుండినను, జ్ఞానమూర్తియగు నా యిల్లాలు ఆ గురుమూర్తిని విమర్శింపవలదు. అది శ్రీ లింగదేవుని బిక్ష నేజేసినపుణ్యమున గలిగిన మహాభాగ్యము, ఇంటిలో నొక పాత్రనిండ అన్నము పెరుగు యున్నవి అని, దివ్య భావయుక్తయై పెరుగు అన్నము కలిపి దాసగురుని బిక్షాపాత్ర నింపెను. ఈ తల్లి దివ్యప్రేమ దాసగురునికి ఆశ్చర్య కారణమయ్యెను. త్వరత్వరగా శ్రీ లింగనిదరిజేరి ప్రభూ బిక్షయని శ్రీ అవధూత గురునికా పెరుగన్నమునుబిక్షనిడెను. స్వామి మూడుముద్దలారగించిపొంగినయానం దముతో యీయన్నమును బెట్టినతల్లి కడుపుచల్లగానీ యనిరి. అపుడు దాసావధూతస్వామి ఓగురుదేవా! మీవాక్యములు సత్యస్వరూపములు గనా నేనుబిక్షదెచ్చినయీయింటిలో నొక బాలుడుమరణించియున్నాడు తమ పరప్రసాదమున నా బాలుని నుద్ధరింపుడని ప్రార్థింప అటులే లెమ్ము అని యా మృతుని దెప్పించి భస్మమునుబూసి యాశీర్వదించి శ్రీవారి తపోభూమి సమీపమునగల నొక తీర్థమున ముంచిరి. ఆ బాలుడు శ్రీ లింగదేవుని కరుణా ప్రసాదమున మరల జీవించి తల్లి దండ్రులకు ప్రజలకు ఆనందాశ్చర్యముల గలిగించెనట. నాటినుండి యెచట విన్నను శ్రీ లింగపరమేశ్వరుని మహిమాగాధలే జెప్పుకొను చుండిరి. క్రమముగా దర్శనార్థులు, ప్రబోధార్థులు అనేకులువచ్చి శ్రీవారిని సేవించుచుండిరి. యింకను దూరదృష్టి దూరశ్రవణము సుదూర నివాసులను రక్షించుట ఒకసారియే అనేక దేహధారణ జేసి యనేకచోట్లనుండుట ఈ యనంతసిద్ధ లీలావినోదము శ్రీవారికి సామాన్య కార్యములుగా నుండెను. అనంత లోకాధినాధుడగు పర శివదేవునకే విభూతులొక మహాకార్యములగునా! యివన్నియు మహాసాగరమునగల యొక చిన్న తరంగము వంటివి. శ్రీవారి తత్త్వ గీతామృతము వారి యమృతహృదయ సాగరమునగల మణులమూట ఆ మూటను విప్పినపుడే మన హృదయ ముప్పొంగి భావనేత్రము ప్రకాశించును. శ్రీ లింగదేవుని బోధాప్రసాదమగు పూదోట శిష్య

గీతామృతం సమస్త భూమండలమునకే యొక అమృత విభూతి, ఆంధ్రవాణీమతల్లి కంఠమునకొక మాణిక్యమాల.

—: శ్రీ లింగావధూతస్వామి తత్త్వగీతలు :—

శ్రీ లింగదేవుని అవతారమునకు పూర్వము భక్తిజ్ఞానములనునవి వేరువేరని విభాగించుచు కొందరు ప్రబోధకులు ప్రచారము జేయుచుండిరి. జ్ఞానయోగి అహంబ్రహ్మాఽస్మియని నేనేబ్రహ్మముగదా! యింక నాకు కర్తవ్యములేదని కర్మత్యాగము జేయుటేకాక సమిష్టిరూప సమాజ విశ్వములయెడ విన్రమతాభావము లేక యహంకారిగానుండెను. తానుదేవుడుగాన తానెవరిని సేవించ నవసరములేదనియు అందరూ తననే సేవించవలయుననియు నతనిభావము.

భక్తయోగి సర్వదా దాసోహ భావముతో సగుణమును మాత్రమేనమ్మి నిర్గుణ బ్రహ్మాశ్రయమును బొందక క్రమముగానాత్మానుభూతిలేమిచే దైవభావరహితుడై భావబలహీనత నొందుచుండెను. తనకు పరమేశ్వరునికిగల అవినాభావ మేకత్వ సంబంధమును విశ్వసింపలేక పోవుచుండెను.

ఈ భిన్నభావ ద్వయముచే ప్రజలు శివకేశవ భేదమును కల్పించుకొని ద్వేషముచే దుఃఖముల పాలగుచుండిరి. సగుణ నిర్గుణ సమైక్యతను గూర్చిన స్పష్టమగు ప్రబోధము, ఆధ్యాత్మిక జీవితము, తక్కువగుచుండెను ఏకత్వమున, అనేకత్వము అనేకత్వమున యేకత్వమును ప్రజలు దర్శింపలేకుండిరి. యీ ఘోరసంకటము నుండి లోకమును శ్రీ లింగదేవు డుద్ధరించెను. సాకారదైవముగా సద్గురుమూర్తిని శివకేశవ రామకృష్ణాది అర్చరా మంత్ర మూర్తుల నుపాసింపుమనియు యీ వుపాసనచే నీహృదయజ్యోతిమేల్కొని యాత్మానుభూతిని బొంది క్రమముగా అఖండ నిరాలంబ పరబ్రహ్మమును బొందుదు వనియు బోధించెను.

సర్వమతములు దర్శనములు దూష్యములు గాదనియు దేశకాలముల ననుసరించి తీసుకరాబడిన ఉపాసనా సంస్కారణములే

యనియు వాటన్నిటియందును సమతా సామరశ్యములతో ఏకత్వాన్ని దర్శించమనియు ప్రభోదించిరి.

అసలు దేవుడు మతము జాతి విశ్వము అనునవి యొక్కొక్కటి యేగాని, అనేకముగాదు. అను మహా సూత్రములను దెల్పెను. ఒక్కొక్కజాతి యొక్కొకభాష మాత్రమే దైవ ప్రతిపాదకములు, దైవీసంపదలను పొందుటకు స్వర్గములు అను దుష్ట ప్రచారమును త్రోసి పుచ్చెను. తప్పెట గొట్టు వానినుండి తత్త్వవేత్తల వరకును సనువగు రీతిని ఏకధర్మ సూత్రములను బోధించెను. సర్వులకు ఆధ్యాత్మికము సహజ ధర్మమని సిద్ధాంత మొనర్చెను. అఖండమగు బ్రాహ్మీఫలిత మును బొందుమార్గమును లలితమగు గీతములలో గానము జేసెను. దీనజనాళినిజూచి కన్నీరు గార్చెను. హింసాకాండనుజూచి ఆయన హృదయము ద్రవించి పోయెను. దుష్కర్మలను మాంసాహారులు మధ్యపాన మత్తులను జూదరులనుజూచి విచారించుచు సత్యమార్గమున నడువుడని యుపదేశించెను.

కామ పీడితులను సంసార బద్ధులనుజూచి చింతించెను, వారికి విరాగమును ఆత్మమార్గమును బోధించెను. జాతి మతాది భేదములచే ద్వంద్వభావమున దైవమునుమరచి యున్నారని, సర్వవిధ అహంకార త్యాగమే దైవసన్నిధికి బాట యని ప్రబోధించెను! శ్రీ లింగదేవుని తత్త్వగీతలను భావపూర్ణముగా బఠించినచో ఆయన యఖండ విశ్వ రూపియయ్యు సర్వ జనాళిని తత్త్వజ్ఞానమున మేల్కొల్ప వచ్చిన పరమ పురుషులగు భగవానుడుగా మనకు స్పష్టముగా గోచరించగలదు. ఆయన దృష్టిలో ప్రతి జీవితము లేక సర్వ ప్రపంచమూ ఒక పూల తోట ప్రతి హృదయ మొక బంగారుపేట మానవుడు తత్త్వ జ్ఞాన యుక్త పరమ యోగముచే మాధవుడైన వెనుకనే నిజమైన జీవితము ప్రారంభమగునని, దేవుడగు మానవుని జీవితమును లేదా తత్త్వమయ ముక్త జీవితమును ప్రబోధించెను.

ఆయన ప్రబోధించిన సాధించి చూపిన యోగము పరమ యోగము ఆయోగమును చక్కగా ననుష్టించిన ప్రతివాడు జీవన్ము

క్తుడై చిన్మయదేహియై చివర స్వేచ్ఛానుసార రీతి తనదేహమును విరాట్ పురుషుని చిన్మయ దేహమున గలుపవచ్చునని నిరూపించి ప్రబోధించెను.

—: శ్రీ గురుస్వామి తత్త్వగీతికల రచనారీతి :—

సామాన్యులగు ముముక్షులకు నర్థమగు భాషలోనే ప్రారంభించినను యొక్కొక్కచోట జగద్విఖ్యాత తత్త్వవేత్తలును గ్రహింప నసాధ్యమగు సూత్రరచనలు స్వాములవారు సాగించినారు. కానీ స్వాములవారి రచనా విధానము సహజముగా మధుర మంజులమై భక్తి జ్ఞాన యోగముల మేళవమై - ప్రతితత్త్వము హృదయ మూలమును స్పందించగల శర్కరాపాకముగా నున్నవి.

ప్రతి తత్త్వమునను శ్రీ లింగదేవుడు పరబ్రహ్మ తత్త్వలక్ష్యార్థము - ఉపాసన అనుభూతి యను మూడు ప్రాధాన సూత్రములకే ప్రాముఖ్య మిచ్చి యున్నారు. నిజానికి జీవోద్ధరణావతారులగు శ్రీ వారికి నానావిధ గాథలతో కూడిన ప్రబోధము ప్రియతమము కాక పోవచ్చును. శ్రీ లింగదేవుని తత్త్వగీతామృత రచనా చిత్రమున తుమ్మెదా చందమామా చిలుకా తప్పెటతత్త్వగీతి తాల్లో తాన తందానా ఎరుకా అల్లో గురుమూర్తి యిత్యాదులన్నిటిని పాత్రలుగా జేసి తన యమృతకావ్యమున చిత్రించినారు. అసామాన్య పదభావ రస మధుర అనుభూతులతో మేళవమైనవి శ్రీ లింగదేవుని తత్త్వ గీ త ము లు.

శ్రీపూదోటతత్త్వగీతామృత మొక విశ్వవీణవోలె గోచరించును. ఆ తత్త్వ గీతలను భావోద్దీపకముగా జదువనారంభించితిమేని యొక సుధాసరోవరమున బ్రవేశించినట్లగును యింతియేగాక యొక మధుర ప్రవాహమును అనుభవింపబోయిన చిరు జీమ కొద్ది కొద్దిగా చవి జూచి యింకను ముందుకుబోవ నా యగాధానందప్రవాహమున గొట్టుకొని పోయినట్లు శ్రీ లింగదేవుని దివ్యతత్త్వ హృదయమున బ్రవేశించితిమేని ఆ యఖండానందవాహినిలో మనమును గొట్టుకొనిపోయి,

మన భావము లంత మొందె యెయ్యదియో యొక అఖండత్వము మనల నావేశించును. ఆనంద మధురానుభూతి లభించును. నాకుగల యల్పాతి యల్పజ్ఞాన దర్పణముతో శ్రీ లింగ పరతత్త్వ శిఖరమును జూచినపుడు ఆయన మానవత్వవాది సమతాజీవనుడు సర్వ జీవ సేవామూర్తి నిరాడంబరుడు మహాభక్తుడు మహాజ్ఞాని మహాయోగి మహాకవి మహాబోధకుడు మహనీయ పరమ చిన్మయ యోగసిద్ధుడు అఖండ తత్త్వవేత్త విశ్వ ప్రేమి విశ్వరూపుడు విశ్వద్రష్టయగు భగ వానుడు అఖండ తత్త్వావతారి. యిది యంతయు నా యల్ప జ్ఞాన దర్శనమే! ఆ తత్త్వ గురుడే యొకచోట తనమహనీయతనుగూర్చి హరిహర బ్రహ్మాదులరసిజూడగరాని నిజ సత్పదంబునై నేను వెల్గుదును అని మరియొకచోట నేనె భూతము లైదు, నేనె సచరాచరము, నేనె విద్యావిద్య నేనె ప్రణవంబునని మరియొకచోట జగములు నిర్మింతు సంపూర్ణముగ నేను జగములునా శూన్యజఠరమున వెల్గున్, అని తానే వక్కాణించిన మహామహిత మూర్తినిగూర్చి నేను వ్రాయబూనుటెల్లను చంద్రబింబమును అద్దమున జూపి శ్రీరామునికి తృప్తిగూర్చిన సుమంతుని యుక్తివోలె నుండును. గావున శ్రీ పూదోట లింగావధూత పరబ్రహ్మదేవునిగూర్చి వ్రాయ నే సమర్థుడనుగాను కానీ ఈ వాక్యరచనయు శ్రీ వారి కృపచేతనే సాగి పోయినది. నేనొక కార్యదర్పణము మాత్రమే. శ్రీ లింగదేవుని గన్న తెలుగుమాత మరియు భారతమాత లేక జగన్మాతకే ధన్యతగలిగినది. శ్రీ గురుదేవుని తత్త్వవాణి తెలుగులో బహిర్గతమగుటచే నాంధ్రవాణీ జనని వీణాతంత్రులమధురనాదమునకే తత్త్వరాగోదయమైనది. శ్రీలింగ గురుదేవుని తత్త్వగీతామృతమును శ్రీ వీరబ్రహ్మేంద్రుల కాలజ్ఞానమును తెలుగు బిడ్డల పవిత్ర హృదయాలలో కలకాలమూ స్థిరనివాస మేర్పరచుకొని వారలధన్యుల జీవన్ముక్తులను, అఖండ చిన్మయ మూర్తుల జేయుగాక. ఓం.

ప్రస్తుతం శ్రీ పూదోట లింగావధూతస్వాములవారి సేవాపుష్పములు గాను ఆధ్యాత్మ చిహ్నములుగానున్న మఠముల వివరం.

1. శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి మఠం
రవ్వల కొండమీద బనగానిపల్లె

2. శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి మఠం
బనగానిపల్లె, కొండపేటలో నున్నది

3. శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి మఠం
కానాల, నంద్యాల తాలూకా

4. శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి మఠం
బేతంచర్ల, డోన్ తాలూకా

5. శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి మఠం
శివ వరం, బనగానిపల్లె తాలూకా

6. శ్రీ పూదోట పీఠాంతర్గత శ్రీ రామభజన మందిరం
తరిమల అనంతపురంజిల్లా

7. శ్రీ పూదోట పీఠాంతర్గత శ్రీ గీతామందిరం
కామినేనిపల్లె, ఆళ్ళగడ్డ తాలూకా

ఓం. ఓం. ఓం. ఓం. ఓం.

పూదోట పాదుకా సేవకుడు

శ్రీ అవధూత ఆనందనాదస్వామి



శ్రీ పూదోట గురుపుత్ర రత్నము

## శ్రీ నా గా వ ధూ త స్వా మి

దివ్యవనములలో సుగంధ వృక్షాలవలె మానవులలోనే మహనీయు లవతరిస్తారు. అనంతపురం జిల్లా తరిమలలో శ్రీకరమగు గుత్తిరెడ్డి వంశమున పుణ్యాదంపతులు శ్రీ తిప్పారెడ్డి శ్రీమతి నాగమ్మ గార్లకు దాదాపు 75 సం॥ క్రిందట నొక బాలుడుదయించెను. ఈ బాలుడు మహాతపస్వియై ఆధ్యాత్మ రత్నమగునని వారికి మాత్ర మేమి దెలియును? యీ బాలుని పేరు నాగిరెడ్డియని నామాంకిత మొనర్చుకొనిరి. క్రమముగా పెద్దవాడై విద్యల నభ్యసించెను. తల్లి దండ్రులు వివాహ మొనర్చిరి. గాని ఆయనలోగల విరాగము ధర్మ పత్ని ఆగమనముతో నిలిచిపోక క్రమ క్రమముగా బెరిగెను. పెద్దలను దర్శించుచు దైవవిషయాలను శ్రవణంజేస్తూ హరికీర్తనలు బాడుచు క్రమముగా సంతతిని గనుచు పరమ శ్రేయస్సుకై తీవ్రముగా సద్గురుని వెదకుచు శ్రీ శ్రీ శ్రీ పూదోట భక్తులగు మలగవల్లి హనుమయార్యులవద్ద శరణాగతి యొనర్చి శ్రీరామతారకమునుగొని మహావిరాగియై గృహస్థజీవితమునుండి విడుదలబొంద నంతరాత్మ ప్రేరేపింప తరిమలకు పడమరగా నొక శ్రీరామ మందిర నిర్మాణమునకు సమకట్టి త్వరిత గతిని అతి రమణీయ మందిరముకు నిర్మించి యందే తప మొనర్చుచు శ్రీ రామ దేవుని సేవించుచుండిరి. ఈ మందిరమునకు యెందరో నార్థిక సేవ యొనర్చిరి. అందులో శ్రీ తరిమల సుబ్బారెడ్డి శ్రీ మలగవల్లి రామచంద్రారెడ్డి గారలసేవ విశేషమైనదిగా నున్నది.

క్రమముగా నాగిరెడ్డిగారి హృదయమున విజ్ఞానజ్యోతి వెలుగుచుండ అనేక ఆధ్యాత్మ గ్రంథముల శోధించి ఆత్మను సాధించుచుండిరి. వారి ఆధ్యాత్మ వాఙ్మయ శోధనా ఘనతకు శ్రీరామ మందిరమున గల గ్రంథాలయమే నిదర్శనం.

క్రమముగా వారి ఆత్మప్రకాశము అనేక ప్రాంతములకు విస్తరిల్లెను అనేకులువచ్చి శరణాగతులై వారి యాదేశానుసారం తపస్సాధనలు జేయుచుండిరి.

కొంతకాలము ఆంధ్రలో ప్రసిద్ధులగు శ్రీ మళయాళ స్వామిని సందర్శించుచు వారితోగలసి తత్త్వచింతన జేయువారు. శ్రీ మళయాళ స్వామికి వీరియెడలగల యభిమాన మత్యధికమైనది.

నాయనగారు గొప్పవిరాగి. వీరి 50 సం॥రముల ఆధ్యాత్మిక జీవితమున యే కొద్దిపాటి ధనమును నిల్వచేసిన వారుకారు. కేవలము శ్రీరామదేవుడే తన సర్వస్వమని నమ్మిన మహనీయుడు. కొన్నాళ్ళ యిన వెనుక శ్రీ శ్రీ శ్రీ పూదోట గురులింగదేవుని ప్రేరణకాగా తమ గురుస్వామిచే శ్రీ లింగస్వామి మహామహిమలను విన్నవారగుటచే, కానాలకేగి అందు శ్రీ పూదోట మఠమునగల తాళపత్ర గ్రంథమును వెలికిదీసి శ్రీ రామిరెడ్డి శ్రీ సిద్దయ్య శ్రీ సుబ్బయ్య మొదలగు పూదోట భక్తులను గూర్చుకొని అనేక మాసములు శ్రమించి యెత్తి వ్రాయించి అనేకమంది భక్తాళి సహకారమున, శ్రీలింగదేవుని అమృత తత్త్వములను ప్రకటించిరి. ఇపు డాప్రతుల నిల్వ తగ్గిపోవుటచే శ్రీ గురులింగదేవుని దివ్య సంకల్పముననను అనేకమంది పూదోట గురుపుత్రుల సహకారముననను యిపుడు శ్రీ పూదోట తత్త్వ గీతామృత మహా గ్రంథమునకు చాలా వృద్ధులయ్యు దేహము అశక్తమయ్యు వెనువెళ దాదాపు రు. 16-18 వందలకుపైగా ధనమును సమకూర్చిరి. నాకు అన్నివిధముల చేదోడు వాదోడై శ్రీ పూదోట విజ్ఞానమును లోకమునకు వెల్లడించుటకు దోడ్పడిన మహాధర్మ నిష్ఠుడగు ఈ మహనీయుడు శ్రీ శ్రీ శ్రీ నాగావధూతస్వామి వారికి నా హృదయపూర్వక అభినందనములు. యీ మహాసాధుమూర్తి అఖండారోగ్యానందములతో పూర్ణశతాయువులై శ్రీశ్రీశ్రీ పూదోట మహాద్వైత తత్త్వజ్ఞాన పీఠమును సేవించుచు అనేకమంది ముముక్షువులకు మార్గదర్శకులై వెలయుదురుగాక. శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగ గురుదేవులు 450, 500 సంవత్సరాలనాడు ప్రసాదించిన యీ తత్త్వామృతం బహిర్గతమగుటకు కార్యకారణస్వరూపులైన శ్రీ నాగావధూత వారిని ఆధ్యాత్మజీవనులైన ఆంధ్రులెల్ల కాలము స్మరించుకొందురుగాక

ఓం ఓం ఓం ఓం

## —— శుభాసీస్సులు ——

శ్రీ పూదోట లింగావధూత స్వాములవారి తత్త్వగీతామృత మహాగ్రంథమును ముద్రణ వేయుటకై శ్రీ గురుస్వాముల సంకల్పాను సారం పేద భాగ్యవంతులు అనుభేదము లేక అనేకరీతుల ఆర్థిక సమ ర్పణ జేసిన శ్రీ పూదోట గురుపుత్ర భక్తజనాళి యెంతేని ధన్యులు. మానవుల ధనమంతయు సద్వినియోగమవుట చాలకష్టం. యీ గ్రంథ ముద్రణకై సమర్పించుకొన్న ధనము పాలసముద్రమున బడిన వర్ష బిందువులెట్లు పవిత్రమగు క్షీరమగునో భగవత్పూజకై యర్పించిన పుష్పలెటుల పవిత్రమై ప్రసాదమయ్యెడినో అట్లే ఈభక్తాళి ధనము శ్రీ లింగభగవానుని తత్త్వగీతామృత స్వరూపమునొంది అత్యంత పవిత్రమై ధన్యమైనది వారును ధన్యులైరి. వారికి శ్రీ పూదోట లింగ దేవుడు అఖండానందైశ్వర్య ప్రసాదము నొసంగ నా ప్రార్థన.

—: సాధుసేవాప్రియుత దైవభక్తిగల సద్ధర్మ గృహస్థులు :—

ఏలూరులో యీ పవిత్ర గ్రంథమును ముద్రణ జేయుకాలమున నాకు నా వెంటనుండు పూదోట భక్తులకు నిత్య సమారాధనవలె 50 దినములు భిక్షజేసి, పసిబిడ్డనువలె నన్ను సమాదరించి సేవజేసిన పుణ్యదంపతులు శ్రీమతి మాగంటి పుష్పవతమ్మా సహిత వీరయ్య గారలు ధన్యులు. వారికి శ్రీ పూదోట లింగ పరమాత్మ అఖండానంద మును ప్రసాదింప నా ప్రార్థన.

ఓం. ఓం. ఓం. ఓం. ఓం.

అవధూత ఆనంద నాదస్వామి



# శ్రీ అవధూత లింగమూర్తి

[శ్రీ అవధూతస్వామి జీవనపరిచయ మిది. తాళపత్ర గ్రంథములలో నటనట లముగా కనపడు వచనసముదాయము, దానికన్న బలీయమైన జనవాణి ఈ రచన ధారములు. శ్రీవారి స్థాయి, దివ్యశక్తి - వీనిని తత్త్వసముదాయమే చెప్పుచున్నను శ్రీవారి దివ్యలీలలు ప్రజాజీవితములో అవినాభావంగా సంధించుకొన్న దృశ్యాలు యందు చిత్రితములు. ఇంతకన్నను ప్రమాణపురస్సరముగా శ్రీవారి జీవిత విశేష ములు లభించిన భక్తాదు లందజేయ ప్రార్థితులు ]

మహాత్ముల జీవన మొక ప్రవాహము వంటిది. ఆధ్యాత్మిక దాహము గలవార లా జీవన ప్రవాహమునుండి యే రెండు దోసిళ్ల నీరు త్రాగినను ధన్యులయ్యెదరు. అది వారి జీవనమాహాత్మ్యం - అని మహనీయుల జీవిత చారిత్ర చిత్రణల గురించి శ్రీరామదాసస్వామివా రన్నారు. అట్టి మహనీయుల శ్రేణికి చెందినవారు శ్రీ యవధూత లింగమూర్తి స్వామి.

పరమ శివుని శుద్ధావతారమైన శ్రీ లింగమూర్తిగా రవుకు గ్రామమున జన్మించినారు. అవుకు గ్రామమునగల సోమమ్మ సోమిరెడ్డి యను పేరులుగల పుణ్యదంపతులు శ్రీవారిని గన్నవారు. పూవునకు పుట్టినతోడనే తావి యబ్బునుకదా! శ్రీ వారు చిన్ననాటినుండే సజ్జనుల గోష్ఠియందు పాల్గొనుట కలపడినారు. ఏ హరికథా కలక్షేప ముసకైనా, ఏ పురాణ శ్రవణమునకైనా మన స్వామి హాజరు.

ఈ సామరస్య మబ్బినది లింగమూర్తికి వంగడమునుండియే తల్లి దండ్రులు గూడా యీ పథమున కలపడినవారే. ఆ దంపతులకు ప్రియతమమైనది భాగవత మహాగ్రంథము. భాగవతము, పోతన ఈ రెంటి సామరస్య మవినాభావముగా నా దంపతుల హృదయా లలో హత్తుకొంది. శ్రీ కృష్ణుడు వారికి ప్రియతమమగు దైవమూర్తి.

ఆ మూర్తి యాకారమును తమ యెదలలో చిత్రించుకొని నిరంతరము భగవన్నామ కీర్తనమునందు నిమగ్నులైయుండిరి.

అట్టి భగవద్భక్తుల గర్భమునుండి వెలువడిన దివ్యజ్యోతి కనుకనే, స్వామివారు యిట్టి మహనీయత గాంచినారు. వంశానుగత సాంప్రదాయముల శిశువులు బెరిగి భావిజీవితమున నా సాంప్రదాయముల ప్రతి బింబింపచేసికొనుట మనము చూచుచున్నాము.

నాలుగువత్సరములవరకు చెప్పుకోతగిన సంఘటనలు స్వామి జీవితమున కలుగలేదు. కాని పంచమవర్షమున నొక విషాదఘట్టము స్వామి జీవితమున కలిగినది. అది యింతింతకాదు. నవమాసములు మోసి కని, ప్రేమతో పెంచిన మాతృమూర్తి మరణము గుండెలను కలచివేయు సంఘటన. మానవునకు జీవితావసరవస్తువుల నందించుచు, భావిజీవితాభ్యుదయమునకు తోడ్పడు ప్రేమశక్తిని, దివ్యజీవితమును గడుపుట కనువగు ధర్మసారమును, సాహసమును ఉగ్గుపాలతో సమాదరభావమున నొసగుతుంది మాతృమూర్తి. అట్టి మాతృదేవి మరణము యే మానవునిహృదయమును గలచివేయదు ?

బాల లింగమూర్తికి స్తన్యపానావస్థలోనే మాతృదేవి గతించుట జీవితమున మాయనిమచ్చ. విషాదఘట్టము తలపునకు వచ్చిన మాత్రముననే కలచివేస్తుంది. అది ఒక పీడకల. అయినను మానవ జీవిత చక్రమున చావు బ్రతుకులు, సుఖ దుఃఖాలు, కలిమి లేములు సహజముగా కలుగు మార్పులు. ఇవి ప్రాపంచిక పరిణామములే కాని సత్యరూపమగు నాత్మను కలచవు. అది నిర్వికారము అట్టి పరిణామము లింగని జీవితముననే మార్పును గొనిరాలేదు. తల్లి జీవించినపుడెట్టి యానందానుభవమును గాంచుచుండెనో అట్టి యానందానుభవమే, యిపుడు మాతృమూర్తి మరణానంతరము బాలలింగ డనుభవమున గనుచున్నాడు. భావిజీవిత రేఖలు ఛాయలు ఛాయలుగా బాల్యమందే యా లీలాబాలుని ముఖమున కన్పడుననుట సత్యదూరము కాదుకదా ? అట్టి మహాపురుష చిహ్నము లాతని బాల్యముననే కన్పట్టెననుట కిది ప్రబల నిదర్శనము కాదా ?

మరువత్సరమే పితృదేవుడు తన సతిని గలసికొనుటకై దివి కేగి నాడు. దెబ్బతగిలిన చోటుననే దెబ్బతగులుట లోకమునందు సహజ ముగా జరుగునదే. అట్లే లింగమూర్తి జీవితమున మాతృదేవి మరణము, దాని వెనువెంట వత్సరమునకే పితృదేవుల మరణము మాటలాడుకొనునట్లు కలిగినవి. మహాపురుషుల బాల్యమున నిట్టి సంఘటనలు జరుగుట నితర మహర్షుల చరిత్రమునను గానదగు. అద్వైత మహాపథము నాంధ్రముననే గాక ప్రపంచమునకంతకు నెఱుక జేసి తన దివ్యప్రబోధముల మూలమున మానవాళి నుద్ధరించిన ఆచార్య శ్రీ శంకరుల జీవితమునకూడ పితృవియోగము చిన్ననాటనే కలిగినదని శ్రీవారి జీవితచరిత్రము చెప్పుచున్నది. ప్రాపంచిక బంధములు బాల్యముననే మహర్షులకు వీడిపోవుట యించు స్పష్టముగా గన్పట్టు విషయము.

పితరుల మరణానంతర మా బాలుని యెవరును సమాదరించ లేదు. మరణసమయమున ఆదరించారో ఏమోకాని యిపు డాబాలుడు నిరాధారుడు. తలిదండ్రులా లేరు. తనను పెంచు బంధువు లంతకన్న లేరు. ఇదంతా మన భావన. కాని అతనిలో చిరునవ్వు, దుఃఖముల వంటి యే అనుభూతియు లేకుండ మొగమున జడత్వము తోచుచుండును.

గ్రామీణులా బాలుని వెఱ్ఱివాడన్నారు. వెఱ్ఱి ఎవరికో? ఆ బాలు డవుడు గ్రామాన్ని విడచినాడు. బనగానపల్లె చేరినాడు. అట నా బాలుని యాదరించువా రెవరు?

బనగానిపల్లెలో ప్రసిద్ధిగన్న గరిమరెడ్డివారి యిల్లా లా బాలు నాకర్షించినది. ఆ యింటి యిల్లాలుచే బాలుడాకర్షింపబడినాడు ఆ మాతృదేవి కా బాలుని ముఖంలో దివ్యతేజం ఛాయలు ఛాయలుగా గోచరించింది. ప్రేమ వెల్లువవలె పెల్లుబికింది. ఆ బాలుని సమాద రించింది. బాలుని లౌకిక కృత్యములకు దూరముగా నుంచుతూ సాకింది. సమాదరించింది. సంతరించింది. ఏనాటి ఋణానుబంధమో యీ దివ్యానుబంధము?

బాలు డష్టవర్ష వయస్కుడైనాడు. పశువుల కాపరిగా నియమింపబడ్డాడు. పశువులు, బాలుని చేతిచలువో ఏమో సమృద్ధిగా, ఇబ్బడిగా పాలీసాగినవి. తమ లౌకికావసర వస్తువృద్ధిలో తోడ్పడుతున్నందుకు ఆ బాలుని యింటివారందరు సమాదరించారు. ప్రేమించారు గౌరవించారు. బాలునిలో మహనీయత గలదని గురుభావముంచారు. లౌకిక వస్తుజాలమే యిట్టి గురుభావాన్ని సమాదరాన్ని కలిగిస్తుంటే శాశ్వతమైన బ్రహ్మానుభవమున నెట్టిభావముంటుందో కొంచెము యోచించండి ?

ఒకనాడు బాలలింగడు అలవాటుప్రకారము పశువుల మేపుటకు పోవుచున్నాడు. ఆనాడే బాలలింగని జీవితమునందొక సువర్ణఘట్టము నాటి సంఘటన జీవిత పరివర్తనాధ్యాయమునకు నాంది. ఒక నదిగట్టున నుండు పూదోట రామయోగి మన బాలలింగని చూచాడు. బాలలింగనిలో ఏదో మహనీయత యా యోగికి గోచరించినది. బాలలింగని పిలిచాడు. చిన్ననాటినుండియే సత్పురుషుల దర్శనమన్ననుబలాటపడు బాలలింగడు రామయోగిని చేరాడు. వినయ వినమితాంగుడై నమస్కరించాడు.

రామయోగి బాలకునికి, పశువులను యజమాని కప్పగించి యతని శలవు తీసికొని రమ్మని యాదేశించినాడు. కొంచెము సేపు తటపటాయించినాడు. ఎట్టకేలకు ఆధ్యాత్మికపథము, ధర్మరూపమును అధిగమించింది. పశువుల యజమానికప్పగించి బాలలింగడు పూదోట రామయోగి సన్నిధికి వచ్చెను.

రామయోగి అతనిని చేరదీసి తన యావాసమగు ఏగంటి గుహలోనికి దీసుకవెళ్లి తత్త్వ ముపదేశించి నిష్ఠచే నారాధింప నాజ్ఞాపించినాడు. జన్మతః నతనికి సహజజ్ఞానముంది. కొలదికాలములోనే ఆత్మను సాధించినాడు. గురువుచే నిహపర తారకమగు బ్రహ్మవిద్యోపదేశమును సాధించినాడు. గురువు శిష్యుని తనంతటివానిగాచేసి లోకకల్యాణమునకై అవతరించిన నీ దివ్యయాత్రను ప్రారంభించమని సందేశ మొసగి దీవించెను.

ఇప్పు డవధూత లింగమూర్తిగా బాలలింగడు మారాడు. లింగమూర్తికిగల గురుభక్తి యింతింతనరానిది. తన ప్రతి తత్త్వములో గురుస్మరణ చేశాడు. గురువే సత్య మన్నాడు. గురువే సర్వస్వ మన్నాడు. అచంచలమైన దా గురుభక్తి.

## ఏగంటినుండి బంగనపల్లెకు వచ్చుట

శ్రీ పూదోట శివరామ దేశికుని సేవ ముగించి ఏగంటినుండి సుప్రసిద్ధమగు బనగానపల్లె జేరి, జుర్రేటికి దక్షిణమునైపునగల రవ్వల కొండపై పడగులువిప్పిన శేషాకృతినిగల యొక చిన్న చరియలో తొంటె శేషశాయివలె విశ్రమించి యుండిరట. అప్పటి కింకను శ్రీ పూదోట లింగదేవుని తత్త్వజ్ఞాన తేజము దశదిశలు నిండియుండ లేదు. ఈ రవ్వలకొండలో నాటినుండియు నేటివరకును వెదకికొను వారికి రవ్వలు దొరుకుచుండును. అందుకై ఆ కొండమీద అనేకులు రవ్వల వెదకుచుందురు.

శ్రీ లింగమూర్తి స్వాములవారిని రవ్వలు వెదకువారు జూచి యొక సామాన్యునిగాను, అమాయకునిగాను భావించి సమీపమున నున్న జుర్రేటినుండి తమకు మంచినీరు తెచ్చిపెట్టుమని జెప్పగా భక్తజనవరదుడగు నా దయామయుడు కడవతో నీరు తెచ్చి వారందరికి పోయుచుండువారట. వీరందరి అమాయకమగు కోరికచే ఒక్కొక్క సారి ఆ దయాసాగరుడు, తన భుజముపై కడవను వుంచుకొని అట్లే నిలుచుండువారట. తమకు మంచితీర్థమును నిచ్చువాడు పరమశివుడని వారికేమి దెలియును? ఇట్లు అమాయకులగు ఆ జనాళికి నీళ్ళను తెచ్చిపెట్టుట స్వామికి మామూలు ధర్మమైనది. వారందరు ఈ యోగవిరాట్టును వెర్రిలింగన్నా! యని బిల్చువారట. ఈ ఘట్టము శ్రీకృష్ణావతారమున గోపబాలుర సాహచర్యమును స్మృతికి దెచ్చు చున్నది. అభేదదర్శనులగు మహాత్ములు ఏ సేవనైనను జేయగలరు గదా!

ఒక పేదకుటుంబము కొన్నాళ్ళనుండియు శ్రీ లింగమూర్తిస్వామి వసించుచుండు కొండకరాతికిసమీపమున రవ్వలకై వెదకుచు అంగడిలో

బాకీ నెచ్చము దినుచుండిరట. వారందరికి కొన్నాళ్ళు వెదకినను రవ్వలు లభించలేదు సరిగదా వెచ్చమిచ్చిన వర్తకుని ఒత్తిడి యధికముగా నుండెడిదట. అందునను వారు మరీ నిరుపేదలట. ఈ స్థితిలో వారు యీనాడు కష్టించి వెదకుదము, రవ్వలు దొరికెనాసరి, లేకున్న కొండమీదనుండి క్రిందబడి మరణింతమని నిర్ణయించుకొని వచ్చి రవ్వలు వెదకుచుండిరట. పరమేశ్వరునిలీల. వారెంత వెదకినను నాడు రవ్వలు దొరకలేదు. వర్తకుడా వత్తిడి జేయుచున్నాడు. ఇక నిరాశోపహతులై సాయంత్రము సమీపజనమంతయు యిండ్లకు పోయిన వెనుక నొక పెద్ద గుట్టనెక్కి క్రిందబడి మరణింప సిద్ధమగుచుండ హఠాత్తుగా శ్రీ లింగావధూతస్వామి యట కరుదెంచి వలదు, ఆత్మహత్య వలదు. నేను మీకు కోరినన్ని రవ్వల నిత్తు రమ్మని వారిని సమీపించి ఒక కొండరాతిక్రిందికి చేయిదూర్చి బయటకుదీసి యివిగో అమూల్యమైన రవ్వలు నమ్ముడు, యికనుండి సుఖముగా జీవించుడని వారిని ఆశీర్వదించె. వారికొంగున తళతళ ప్రకాసించు రవ్వలను జూచి వారికిని కొద్దికొద్దిగా రవల నాణ్యము తెలియుటచే ఆశ్చర్యానందమొంది, బాబూ నిన్ను మేము వెర్రి లింగన్నవని నీటికడవలు మోయించి శ్రమ నిచ్చితిమే నీ వెవరవో, మహాత్ముడవో లేక భగవంతుడవో గదా! యని స్వాములచుట్టు ప్రదక్షిణ నమస్కారములొనర్చి బనగానిపల్లెలోనికి పరుగుపరుగున జేరి ప్రముఖులకును, రవ్వల వర్తకులకును స్వామి మహత్తును జెప్పి రవ్వలను జూపిరట. ఆ రవ్వలు మామూలు రవ్వలకంటె అధిక ప్రకాశవంతమై మూల్యాధిక్యత నొందగల ఉత్తమములుగానుండుటచే అందరునుచేరి బాలలింగనిదర్శింపగుంపులుగా రాగా స్వామి అచటివారికి నగుపించలేదట. ఆ తరువాత బనగానిపల్లె, దాని చుట్టుప్రక్కల గల ప్రదేశాలన్నిటిలోను శ్రీ లింగావధూతస్వాముల వారి మహత్వ కథలే జెప్పుకొనుచుండిరి.

ఈ మహిమాగాధలు బనగానిపల్లె నవాబుగారికిని తెలియ వచ్చెను. ఒకరోజు శ్రీ లింగస్వామి స్వస్థలమందుయున్నతరి నవాబుగారు ఒక నిండుచూలాలగు గుఱ్ఱము నెక్కి స్వాములను దర్శింపగోరి

వచ్చి, ఆ దివ్యమూర్తిని జూచి సలామొనర్చి స్వామీ! అందరు మీ మహిమ తెల్పుచున్నారు. మీరు యీ ప్రదేశముననే యుండుడు. మీకు కోరినంత మాన్య మిత్తునని చెప్ప, స్వామివారు నవ్వి యీ జగమంతయు నా మాన్యమే గాన మీ రేమాన్య మివ్వ బనిలేదు. నేను నిత్య భిక్షుకుడనని తెల్పెనట అపుడు నవాబుగారు స్వాముల వారి విరాగమునకు ఆశ్చర్యమొంది, స్వామి తాము చాలా మహ నీయులని వినుచుంటిమి. అటులైన ఈ గుఱ్ఱము త్వరలో ప్రసవింప గలదుగదా, దీని కడుపులో ఏ బిడ్డ ఏ రంగుగలది పుట్టునో తెల్పుమన నవాబు దుష్టహృదయమును గమనించని గురుమూర్తి పుట్టబోవు గుఱ్ఱపుపిల్లయొక్క గుర్తులన్నియు కన్నులకు గట్టినట్లు తెల్పెనట. అపుడు శ్రీ లింగమూర్తి దివ్యవాణిని విని, ఓర్పుకు సహించలేని ఆ దుష్టనవాబు దయాళునగు స్వామియెదుట ఆ గుఱ్ఱమును చంపి కడుపుచీల్చి అందున్న పిల్లనుజూడ, స్వాములు చెప్పిన గుర్తులన్నియు తూ.చా. దప్పకయుండెనట. అపుడు స్వామిమహిమను గొనియాడుచు ఆ తురుష్క దొర మరలిపోయెనట.

కానీ దయాసాగరుడు శ్రీ లింగ దేవుడా ఘోరదృశ్యమునుజూచి చింతాక్రాంతుడై ఆ గుఱ్ఱమునకు దివ్యలోకప్రాప్తి నొసగి, అటనుండి వీడి సంద్యాల సమీపమునగల కానాల యనుచోట జేరి అందు దుర్గమమగు ముళ్ళపొదలమధ్యన గల నొక వృక్షముక్రింద దక్షిణా మూర్తివలె మరల తపోనిమగ్నుడయ్యెను.

కానాలలో స్వామి ఆ చెట్టుక్రింద అఖండ స్థితిలో సహజ సమాధిలో నుండిరి. పైనుండి కొంగలు, కాకులు స్వామిని అపవిత్ర మొనర్చుచుండినను ఆ గురులింగస్వామి చలించువారుకారు. దీనిని చూచిన కొందరు గ్రామీణులు ఎవరో మన గ్రామానికి ఒక వెర్రి వాడు వచ్చియున్నాడు అని స్వాముల మహత్వ తపమును గమనించని ఆ అమాయకులు శ్రీవారిని కొంగల పిచ్చివాడు అని పిల్చుకొను చుండిరి. ఇదేమియు శ్రీవారికి దెలియదు. అఖండ సమాధి నుండుట వారి స్వభావము.

ఈ స్థితిలో ధన్యప్రారబ్ధయు, పరమేశ్వర ప్రేరితయు నగు నొక పుణ్యవతి స్వామి దర్శించి ధన్యోస్మియనుకొని ప్రతినిత్యము ఉదయమే ఒక పాత్రలో మజ్జిగ కలిపిన అన్నము, మరియొక పాత్రలో మంచి నీరు వుంచి వచ్చుచుండెడిది. ఒకొక్కరోజు స్వామి ఆమె నివేదన స్వీకరించువారు. మరొకొక్కసారి స్వీకరించకుండుటయు జరుగు చుండెను. ఎట్లయినను ఆ మాతృమూర్తి తన సేవనుమాత్రము వీడక శ్రీ లింగగురునికి భిక్ష జేయుచునుండెను.

ఇట్లు కొన్ని మాస, వత్సరాలుగడచెను. శ్రీవారి అఖండసమాధి యథావిధి సాగుచుండెను. ఒక సంవత్సరము శ్రీవారున్న ప్రదేశము వర్షాభావ మయ్యెను అప్పుడు విధిలేమిచే శ్రీ లింగదేవునికి నిత్య ప్రసాదము నిచ్చుచున్న ఆ పేద కుటుంబము జీవించుటకై అన్య గ్రామాంతరము వెళ్ళ మూటగట్టి పయనమాయెను. పరమ గురునికి నిత్యభిక్ష నిచ్చు ఆ తల్లి అప్పటికి చివరభిక్షగా భావించి, రెండు మట్టి పాత్రలతో నీరు, అన్నము దెచ్చి శ్రీ లింగస్వామి సన్నిధి నుంచి మూర్తీభవించిన బ్రహ్మణ్యదేవుని వీడలేక, కాళ్ళాడక, తన పమిట కొంగు ముఖమునకు అడ్డగించుకొని గొల్లున ఏడ్చెను. ఆ తల్లి రోదన ధ్వని శ్రీవారి సమాధిని గూడ కదల్చివేసెను. భక్తుల హృదయావేదన భగవానుని హృదయాన్ని కదలించుట సహజమేగదా !

సమాధిలోనున్న శ్రీ లింగ గురువు జాగ్రత్తి నొందెను. తన ఎదుట కన్నీటిదారలతో విలపించు ఆ పుణ్యజననినిజూచి ఎందుకమ్మా ! నీ దుఃఖము. భయపడకుము. నీకేమివలయునో వెంటనే దెల్పుము అని అభయమిచ్చిరి.

అపుడాతల్లి గద్గదస్వరముతో స్వామీ ! నేటినుండి నాకు మీ భిక్షచేయు భాగ్యము కరువగుచుండుటచే భరించలేక ఏడ్చుచుంటిని. ఈప్రాంతమున వర్షములులేక కాటకముప్రాప్తించుచుండుటచే అందరు గ్రామమిడిచి వెళ్ళుచున్నారు. మా కుటుంబమునూ ఈ గ్రామ మిడిచి దూరప్రదేశము వెళ్ళ, మూల్లె మూటగట్టుకొనిరి. నేను వారివెంట వెళ్ళక తప్పకున్నది. మిమ్ము విడిచి పోనొల్లక నాహృదయము బాధ

నొందుచున్నది అని దీనయై విన్నవించె. అప్పుడు శ్రీ లింగప్రభువు తల్లీ మీ రెల్లరును భయమును వీడుడు. తప్పక వర్షము వచ్చును. నీవు త్వరగా యింటికి వెళ్ళుమని స్వామి ఆజ్ఞాపించె. అప్పు డానంద ముతో ఆ సాధ్వి వెనుకకు మరలెను.

వెంటనే శ్రీ లింగమూర్తిస్వామి తన యిష్టదైవమగు శ్రీరాము నుద్దేశించి యొకగీతముబాడెను. అది వర్ష ప్రార్థన. స్వామి ముఖమునుండి ప్రార్థనాగేయము ప్రారంభమాయెనో లేదో వర్ష మారంభమయ్యెను. స్వాముల సంకల్పానుసారం వాగులు వంకలు పొంగులువారునట్లు నదీనదము లేకమగునట్లు గొప్ప వర్షము గురిసెను. కాటకము దీరిపోయి ప్రజాళి సుఖంచిరి.

తరువాత మహానంద విలాసితులై కొన్ని కొన్ని గేయాలు అఖండ తత్త్వజ్ఞానబోధలుగా స్వామివారు పాడుచుండిరి. అదృష్టవంతు లైన భక్తులు ఆ గీతాలను అప్పటికపుడే వ్రాసికొనుచుండిరి. అందులో మాధుర్యము తత్త్వబోధ వర్ణనాతీతమైయుండెను. ప్రతి తత్త్వమును తన గురుదేవులగు శ్రీ పూదోట శివరామదేవునికి అంకిత మీయ బడినదై యుండెను.

ఆ గురుభక్తిచేతనే శ్రీ లింగమూర్తి కీ ప్రచారము కలిగినది. శంకరుల సిద్ధాంతవ్యాప్తికి, వెనుక గోవిందభగవత్పాదుల మహామహాన మూపై నిలచినట్లు – శ్రీ లింగదేవుని సిద్ధాంతప్రచారమునకు, వ్యాప్తికి వెనుక నతని గురువగు పూదోటరాముని మహామహానము, గాఢతపస్సు ఆపై నిలిచాయి. అట్టి గురువునకు తగిన శిష్యు డితడు.

శ్రీ లింగావధూతస్వామి ప్రచారముచేసిన కాలము పాషండ మతము దావాగ్నివలె వ్యాపించినకాలము. ధర్మమునకు పట్టుతప్పి పరుగులిడినకాలము. అధర్మ మధికారముద్రవేసి భీకరముగా పరిపాలన కొనసాగించుకాలము. అట్టి పరిస్థితులలో, భీకర వాతావరణములో ఆధ్యాత్మిక వాణిని తన గేయాలతో వినిపించారు. ఆధ్యాత్మిక గేయాలను తెలుగు పొలాలబండించి సర్వమత ధర్మసామరస్యాన్ని – స్థాపన జేసినారు.

శ్రీవారిది బహు చక్కని మధురస్వరమట. ఆ మధుర స్వరములో దివ్యవాణి వీణాతంతులవలె నినదించింది. తన నెందరో దూషించారు. తనమాటల వినటానికి నిరసించారు. అయినా ఆ ధర్మవీరుడు తాను పూనినపట్టు విడువలేదు. ధర్మదీక్ష విడువలేదు నిరసించిన వారిని గూర్చి —

'ఘనకోకిల స్వరము కాకులకు గానట్లు
చెనటులకు సుజనాళి శబ్దములు గావు॥'

అని యెలుగెత్తిచెప్పారు. ఆ మధురగాత్రానికిదాసులై ప్రజలు వారిని గౌరవించారు. దివ్యశక్తి లీలలయెడ ఆశ్చర్యము నందినారు. ఎందరో శిష్యులయినారు వారిలో దాసావధూత, సుబ్బావధూత, భట్టుచెంచయ్య పేర్కొన దగినవారు.

## దాసావధూతవారి శరణాగతి

బనగానిపల్లెకు సమీపముగా నొక గ్రామముండెడిది. అందు నొక ప్రసిద్ధుడగు మంత్రశాస్త్రవేత్త యుండెడివాడు. తన మంత్రశక్తి ప్రభావమున నాతడు ఒక ప్రాణిని చంపుట మరల బ్రతికించుట ఇత్యాది శక్తులుకలిగి యుండినాడు. ఇంతటి గొప్పశక్తి కలిగియుండియు ఆతనికి ఆత్మజ్ఞానము లేమిచే ఆనందము లేకుండెను. భగవత్ప్రసాదిత శాంతి లేకుండెను. కరుణానంద స్వరూపమగు శ్రీగురు ప్రబోధము లేమిచే అతని హృదయము ఆత్మ ప్రసాదము ను బొందియుండ లేదు. ఇతని జన్మాంతర ఫలభాగ్యముగా యితడు తన శక్తులతో సంతృప్తి నందక ఆత్మానుభూతిని ప్రసాదించు శ్రీ గురుసన్నిధికై నిరీక్షించుచు అట్టి దేశికుని కొరకై వెదకుచుండెను. యీ మంత్రవేత్త తనకు గావలయు సద్గురుని వెదకుచుండు పంథా బహు చిత్రమైనది. ఎవరేని యొకరు మహాత్ములని చెప్పబడుచుండిరో అట్టివారి వద్దకు తానువెళ్ళి వారిపైన తా నుపాసించు మహాశక్తిని ప్రయోగించుట ఆ శక్తి పాతముచే అతను మరణించెనో, వీడెవరో నాకంటె అధముడు వీనివలన నాకు ఆత్మజ్ఞానము లభింపదు అని అతనిని తిరుగా బ్రతికించి వెళ్లుచుండును.

ఇట్టి దివ్యశక్తులుగల ఈ బ్రాహ్మణుడు శ్రీ లింగ భగవానుని దివ్య తపోమహత్త్వమును విని వెంటనే శ్రీవారిని దర్శింప నొక తురంగము నెక్కి హుటాహుటిని వచ్చెను. అల్లంత దూరమునుండియే దిగంబరుడును జటాధారియు అఖండ ప్రకాశానంద శాంతిసాగరుడును నగు శ్రీ లింగావధూత గురుదేవుని జూచెను. హృదయ ముప్పొంగెను. కానీ తాను తన శక్తులతో పరిశీలించనిదే శ్రీ గురుడుగా ఆత్మ సమర్పణ చేయడు గదా! అందుచే గుర్రమునుండి క్రిందికి దిగకనే తన అపూర్వ శక్తిపాత మొనర్చెను. అందరివలెనే ఈశక్తి శ్రీ లింగస్వామి వారిపై కురికెను. గాఢాంధకారము భాస్కరుని స్వాధీన పరచుకొన జాలనట్లు ఈ శక్తి మహత్త్వము ఆముక్తినాదుని ఏమియు చేయ జాలకపోగా ఆశక్తిని శ్రీ లింగదేవుడు తన కాలిక్రింద వేసుకొనెను. ఇట్లు 3 సార్లు ఆ బ్రాహ్మణుడు తన వైరి శక్తులను లింగదేవునిపై ప్రయోగించి విఫలు డాయెను. స్వామివారు చిరునగవుతో ఆ దుష్టశక్తి త్రయమును తన స్వాధీన మొనర్చుకొనిరి. ఈ బ్రాహ్మణుని హృదయము మేల్కొనెను. అహంకారమను కారుచీకట్లు అంతరించెను. అంతర్వాణి అడుగో అతడే నీ ప్రభువు ఆ ఆనందదాతకు శరణాగతుడవు గమ్ము నీకు అఖండానందము లభించి నీ జన్మము సార్థకత నొందునని మరిమరీ సంబోధించెను.

వెంటనే గుర్రమునుండి దిగి పరుగు పరుగున వచ్చి శ్రీ లింగ పరంజ్యోతి ఎదుట సాష్టాంగ శరణాగతుడై కన్నీటి ధారలతో పడిపోయెను. అనాథనని విలపించు చుండెను. శ్రీ లింగస్వామి సుప్రసన్నానందవదనులై తన సహజానంద సమాధిలోనే యుండెను. ఇట్లు మూడు రాత్రింబవళ్ళు గడచెను. ఆత్మదేవుని ఎదుటనుండి యీ బ్రాహ్మణుడు లేవలేదు. స్వామికి అనుగ్రహముకల్గునంతవరకు విడువనని నిర్ణయించు కొనెను. అప్పుడు దేవదేవుడగు శ్రీ లింగావధూత భగవానుడు అనుగ్రహించి ఓ దాసా! లెమ్ము అభయమిచ్చితినన్నెను. అప్పుడా దాసుడు మహానందము నొంది శ్రీ లింగస్వామి వారి శ్రీపాద పద్మముల నాలింగన మొనర్చుకొని శ్రీవారే తన గురు పరబ్రహ్మగా

నాత్మార్పణ మొనర్చుకొని గురుదేవుని అమృత పాదసేవా పుష్పమై శ్రీ దాసావధూత స్వామిగా ప్రసిద్ధినొందెను.

శ్రీ వారు, ఆంధ్ర దేశమంతయు పర్యటించినారు. తన యమృత బోధలచే నాంధ్రావనిలో చైతన్యమును రేకెత్తించినారు. శిష్య గణముతో తన యమృతగానముతో నాధ్యాత్మికపిపాస నాంధ్రులో ప్రబుద్ధం చేసినారు. అంతటితో ఊరుకొనలేదా మహనీయుడు. కాలి నడకతో నాసేతుసీతనగపర్యంతము సంచరించి ప్రాంతీయభాషలలో తత్త్వప్రబోధము చేసినారు. దీనికి నిదర్శనము శ్రీవారు వ్రాసిన మహారాష్ట్ర, ఘూర్జర, తమిళ, కర్ణాటక భాషలయందు గల తత్త్వములే. ప్రాంతీయభాషలలో, ఆంధ్రేతరభాషలలో నంత చక్కగ కవనము చెప్పుటరిది.

శిష్యగణముతో నాయన మెట్టినచోటెల్ల పవిత్ర తీర్థమైంది. ఊరూర స్వాగతాలే. మహాభక్తిప్రపత్తులతో ముముక్షువులా మహా పురుషునకు స్వాగత మిచ్చారు. వారి దివ్యవాక్కు వీనులవిందుగా విన్నారు. జన్మ తరించుట కనేక సాధనలను తెలిసికొన్నారు. ఇట్టిది వారి ప్రచారక శక్తి. అదేగదా మన యభ్యున్నతి.

ప్రచారానంతరము వారు పర్యటిస్తూ నంద్యాల తాలూకా పెదకానాల గ్రామమునకు వచ్చినారు. శ్రీవారి రాకనుగురించి యొక వింత కథను, అమానుషలీలను ప్రదర్శించే సంఘటనను చెబుతారు. అది—

శ్రీవారొక నాడర్ధరాత్రికాలమున కానాలకు శిష్యగణముతో వచ్చారట. ప్రజలంతా నిద్రాదేవికి పరవశులై నామె యొడిలో పరుండిరి. ఆ కాలమున కానాల గ్రామమునందొక ధనాఢ్యుడగు వైశ్యుడుండెడివాడట. నాడు లింగమూర్తి కానాలలో ప్రవేశముచేసి నారు. ఆ వైశ్యుని ఏకమాత్ర పుత్రుడును, నూత్న వివాహితుడును నగు యువకుడు చనిపోయినాడట. ధార్మికులగుటవలన నా యువకుని తలిదండ్రుల నోదార్చుటకై యర్ధగ్రామ మట చేరినది. వారినోదార్చు వారు కొందరు, వారితోపాటు నేడ్చువారు కొందరు, తాత్కాలిక

వేదాంతములు పలుకువారు కొందరు, వీరు వారననేల ? నన్నిరకముల వారట చేరియుండిరి.

అట్టి సమయమున శ్రీలింగావధూతస్వామి ప్రవేశించినా డా గ్రామమునందు. తన యనుంగు శిష్యుడగు దాసావధూతను పిలిచి 'దాసా ! గ్రామము లోనికి వెళ్ళి భిక్ష చేసికొని ర'మ్మన్నారట. అపుడు దాసావధూత లింగమూర్తిని జూచి 'స్వామీ ! సగము రేయి యగుచున్నది. ఇపుడందరు నిదుర బోవుచుందురు. ఇలాంటి వేళల్లో భిక్షకొరకై యెవరి నడిగేది !' అన్నాడట. అపుడు శ్రీ లింగమూర్తి శిష్యునిజూచి 'శిష్యా ! ఎవరియింట దీపముంటుందో అక్కడికివెళ్ళి తీసుకొనిర'మ్మన్నారట. అపుడు శిష్యుడగు దాసావధూత వెళ్ళినాడు. గురునాజ్ఞ మీరరానిదిగదా ?

గ్రామమంతా గాలించాడు. ఏ యింటను దీపము మిణుకు మిణుకు మను ఛాయ కన్పడలేదు. కొంతదూరము సాగాడు. కొన్ని సందులు దాటాడు. అపుడు దీపకాంతి కనపడింది. గురునాజ్ఞ నెర వేర్చ గలుగుతున్నానుగదా అనే ఉత్సాహ మతనికి బలాన్నిచ్చింది. ఎట్టి పవిత్రమైన భక్తి అది ? అట్టి శిష్యులు అరుదుగదా లోకంలో. అట్టిదేగదా పరమభక్తి ! అట్టి భక్తి మనలో మోసులెత్తి చిగురించి పటిష్ఠంగా పాదుకొనిననాడె మనం ధన్యులం. అంతవర కీ చీకట్లో అజ్ఞానాంధకారములో దారిలేక అల్లల్లాడాల్సిందే ! తప్పదు. ఏనాడు మన కబ్బుతుందో ఆ పరమనిష్ఠ ? యదార్థంగా శ్రీగురుసేవను మించిన భాగ్యమేమున్నది ?

సాగాడు సమధికోత్సాహముతో అడుగులు ముందుకు వేస్తు న్నాడు. కాని రోదనాలు; ఆక్రందనాలు; ఓదార్పు మాటలు దుఃఖ పిశాచ తాండవము అతని ఉత్సాహాన్ని భంగపరచింది. కాని స్థిరదీక్ష అచంచల మనము గలవాడుగాన అతడు చలించలేదు. దుఃఖ పిశా చానికి దాసుడై తాను దుఃఖించలేదు. గురువునందుగల విశ్వాసంతో భక్తితో ఆ యింటిముందు జేరి 'భవతీ భిక్షాం దేహీ' అన్నాడు.

అక్కడ చేరినవారంతా చీదరించారు. 'పుత్రుడు మరణించి వారు దుఃఖిస్తుంటే నీగోలేమయ్యా సన్యాసీ' 'ఎదురుగా శవము కన పడుతుంటే ఎట్లు అడుగుతున్నావయ్యా' 'తిండిగోల తప్ప ప్రపంచము పైదృష్టి లేదేమయ్యా! సాధూ' అని తలొక మాటన్నారు.

కాని ఈమాటలన్నింటిని వింటున్న ఒక స్త్రీ కంఠ స్వరము 'ఆగండి' అని తీవ్రంగా హెచ్చరించింది. ఇంతవరకు దుడుకుగా మాట్లాడుతున్న వాళ్ళంతా ఎవరికివారు సర్దుకొన్నారు. ఆ కంఠస్వర మిట్లాసాగింది. "మీ రా యతి నేమీ అనకండి. ఆకలితో వచ్చాడు. 'అభ్యాగతః స్వయం విష్ణుః' అన్నట్లు అతడు విష్ణురూపుడే ఇంట్లో వండిన అన్నం సిద్ధంగా ఉంది. ఇస్తాను. మనము తినేది ఎట్లాగు లేదు. అతని కిచ్చిన తింటాడు." ఎవరీ మాటలన్నది? మరెవరో కాదు. పుత్ర శోకంతో తపించే వైశ్యునిభార్య! మనోస్థైర్య మా తల్లిది పుత్రుడు చనిపోయినాడని శోకమును చూపక, సమయముగాని సమయమున వచ్చిన సాధువును నలుగు రవమానిస్తుంటే వారిని వారించి ఆ సాధు కోర్కెను నెరవేసుస్తుందే? ఆకలిగొన్నవాని కన్నము పెడ్తుందే! అట్టి మహాతల్లు లుంటే మన మెట్టి కొఱతపడక సుఖింపమా! భారతాంబా! నీ వెంత ధన్యురాలవో గదా! ఇట్టి తల్లులను కడుపార గంటివి.

ఆధర్మజ్యోతి వెంటనే సాధు దాసావధూతను పిలిచింది. ఇంటి లోనికి వెళ్ళి అన్నము, గట్టి మీగడపెరుగు తీసుకువచ్చింది. సాధూ కిచ్చింది. కడుపార ఆరగించమని అర్పణచేసింది.

అన్నము, పెరుగు తీసుకు వెళ్ళాడు దాసావధూత. శ్రీ లింగ మూర్తి ఒక చింతచెట్టుక్రింద కూర్చొనివున్నాడు. శిష్యుడు తెచ్చిన గట్టి పెరుగుతోగూడిన అన్నాన్ని గురువుదోసిట్లో పెట్టి తినిపించాడు. శ్రీ లింగమూర్తి ఆ బిక్షను ఆరగించి ఏ తల్లి పెట్టినదోగదరా! ఆ తల్లి కడుపు చల్లనగుగాక!' అన్నాడు. అపుడు భోజనానంతరము పుత్రశోకము చెందుచున్న ఆ తల్లినిగురించి ఆరాటమునందు దాసావ ధూత గురుపుపాధాలు పట్టుకొని "స్వామీ! శిష్యుని అనుగ్ర

హించండి. తెలియక పొరబాటు చేసినాడు. పుత్రశోకముచే దుర పిల్లుచున్న నాక మాతృదేవి పెట్టిన ప్రసాదము తీసుకొనివచ్చినాడు. తా మా తల్లికడుపు చల్లనగునని యంటిరి. ఇపుడు మాతృమూర్తి శోకమూర్తియై కడుపులో చిచ్చుబెట్టినట్లు దుఃఖిస్తున్నది. మీరు సెలవిచ్చినటుల ఆ తల్లికడుపు చల్లగాకావాలి. దానికి తామే సమర్థులు. ఎట్లైనాసరే ఆ యువకుని బ్రతికించి యీ తల్లి శోకము నుపశమింపచేయవలెను. దీనికై మిమ్మీదాసుడు ప్రార్థించుచున్నాడు" అని వేడెనట.

అపుడు శ్రీ లింగమూర్తి శిష్యుని 'జూచి 'సరే నాయనా! లే! లే! వారికి మనయందు నమ్మకమున్నపక్షమున అట్లే పిలుకొంచునిరమ్ము. బ్రతికిస్తాను' అన్నారట. అపుడాశిష్యుని సంతోషమంతా యింతా కాదు. వెంటనే లేచి కదలినాడు.

కదలి వైశ్యుని యింటికి వచ్చినాడు. వైశ్యుని భార్యతో అమ్మా! దుఃఖింపకుము. నీ కడుపు పండినది. మా గురుస్వామి నీ కుమారుని బ్రతికిస్తానన్నారు. తప్పక ముమ్మాటికి బ్రతికిస్తారు. కాని మీరు గమనించవలసిన విషయ మొకటి ఉంది.' అని అన్నాడట మన దాసావధూత.

'ఏమిటినాయనా? నిజమా? నా తండ్రిని, నా ముద్దులయ్యను బ్రతికిస్తానన్నారా? ఆ! నిజమా నాయనా! సరి. మేమేంచేయాలో చెప్పు' అన్నది వైశ్యునిభార్య.

అప్పు డా దాసావధూత 'మీరు మా గురువుగారు చెప్పినటుల నడుచుకోవాలి. సంశయింపకూడదు. నమ్మకముంచాలి. తెలిసిందా?' అన వారు సరేనన్నారు.

అందరుకలసి శ్రీలింగమూర్తిని చేరవచ్చినారట. శ్రీలింగమూర్తి వద్దకుశిష్యుడువెళ్ళి శవమును తీసుకువచ్చిన సమాచారాన్ని చెప్పినాడు. లింగమూర్తి వారి నందరిని ప్రక్కకు పొమ్మని శవముదగ్గరి కావైశ్యుని కోడలను రమ్మన్నారు. ఆమెను శవముమీద పడుకోమన్నారు.

దాసావధూతతో ఒక త్రాడు తెప్పించారు. ఆ త్రాడుతో ఆమెను శవానికే బంధించినారు. దగ్గరనుండు బావిలోని కా శవాన్ని త్రోయించారు. ప్రజలంతా గగ్గోలుపడినారు.

కానీ ఆశ్చర్యము ? మహాసంభ్రమజనకము. బావిలోనుండి దంపతు లిరువురు పసుపు గుడ్డలతో తిరిగి వచ్చారు. స్వామి శ్రీ లింగ మూర్తి వారి నాశీర్వదించారు. అట్టి అమృతశక్తి శ్రీవారిది.

ప్రపంచములో అద్భుతశక్తులు, అమానుషశక్తులు లేకపోలేదు. అవి మానవుడు సాధించవచ్చు. దీనికి నిదర్శనముగా మనకు మెన్నో వింతవస్తువు లీనాడు కన్పడుతున్నాయి. కాని, వానిని ప్రపంచమునకు ఉపయోగకరములుగా వినియోగిస్తే ఆ మానవుడు దివ్యుడే. వానిని మారణసాధనల కుపయోగిస్తే వాడు నిజంగా రాక్షసుడే. శ్రీకృష్ణ భగవానుడుంగూడ మానవులలోనే రాక్షసులు, దేవతలు గలరని దైవాసుర సంపద్విభాగయోగంలో చెప్పారు.

శ్రీవారు కానాల మఠమునందే యుండి శిష్యుల కెందరికో జ్ఞానామృతమును ప్రసాదించేవారు.

శ్రీవారు కానాలలో నుండు రోజులలో ప్రతిదినము కాశీకి వెళ్ళి స్నానముచేసి వస్తూండేవారట.

దీనిని కురవరంగప్ప యనునతడు చూచాడట. అతడు కాశీకి యాత్రార్థమైపోయినపుడు శ్రీలింగమూర్తిగారినక్కడచూచి మాట్లాడినాడట. మరల కానాలకువచ్చి విచారించగా శ్రీవారా రోజుల్లో అనగా తాను యాత్రకువెళ్ళి కాశీలో శ్రీవారిని చూచినరోజుల్లో శ్రీవారు కానాలలోనే ఉన్నట్లు తెలిసిందట.

ఇట్టి వా మహనీయుని చిన్మయలీలలు. వాని నన్నింటిని వినుట చేతనే జన్మము ధన్యము కాదా ? మనము బ్రహ్మీభూతులము కాలేమా ?

శ్రీవారి జీవితచరిత్రమును కథనముచేయు భక్తులు శ్రీవారిని పరమశివుని యపరావతారముగా గ్రహింతురు. ఆచార్య శంకర

లా కాలమున బౌద్ధమతమును రూపుమాపి వైదికమగు నద్వైతమును స్థాపించుట కవతరించుట జగద్విదితము. ఆచార్యులబోధలు, మత సిద్ధాంతములు, భాష్యగ్రంథములు, ప్రకరణగ్రంథములు గీర్వాణవాణి యందుండి సామాన్యప్రజల కానా డుపకరింపకపోయినవి. సంస్కృత భాషయందేమున్నదో సంస్కృత భాషాజ్ఞానములేని యానాటి సామాన్య ప్రజల కెట్లు తెలియగలదు ? దీని నాధారముగా నెందరో దొంగగురువులు బయలుదేరి దీక్షలు, మాంసాశనము గరపుచు వేదాంతమనుపేర కపటనాటకమాడినారు. బోధగురువులదూషించుచు ప్రజాళికి దుర్బోధలొనరించు నాటి బోధగురువుల మతసారాంశ మిది:-

'ఆత్మ నిర్వికారము, నిరామయము గాన దేహముచే నొనర్చు కృత్యము లాత్మ నంటజాలవు. ఆత్మజ్ఞానికి కాయికములగు నియమము లనవసరము. వ్యభిచారము, జూదము, త్రాగుడు దేహకృత్యములు గాన నాత్మకు వానితో సంబంధములేదు. ఈ వ్యభిచారాదులు నిషిద్ధ కర్మములుగావు. స్త్రీ పురుషులు ప్రాకృతికవ్యాపారము లొనర్చుట సహజము. అవి యొనర్చినను, ఆత్మజ్ఞానము కలిగియున్నవాని నేపాప మంటజాలదు. వా జేపనియు చేయవలయునను నియమములేదు. కొన్ని కర్మముల విధిగాచేయవలసియున్నదని శాస్త్రము లుద్ఘోషించు చున్నవి. అవి కల్పితములు. తమ యధికారమును స్థిరముగా ప్రజలలో పాదుకొనజేయవలయునని యాశించిన శాస్త్రకర్తలు ప్రదర్శించిన కపటనాటకము. శాస్త్రకారుల స్వాభిమానపు చదరంగపు యెత్తు.

'పురుషుడు, స్త్రీ యను వీరలిరువురు ఒకే యంగమునుండి జనించుచున్నారుకదా ? అట్టి సమయమున స్త్రీ పురుషుల ప్రాకృతిక సంయోగ మెట్లు నిషిద్ధము ? ఈ ప్రాకృతికసంయోగము నాటంక పఱచుటకు వర్ణాశ్రమ ధర్మము లేర్పరుపబడు టెందులకు ? వీని నన్నింటిని జూడ ప్రజలను ఒక హద్దులోనుంచి తాము సాధించిన ధర్మప్రచారముద్వారా పొట్టబోసికొనుట కెత్తిన మొదటి యుపాయ మిది కాదా ?

'బ్రహ్మ యొక్కడే మీ మీ దేహాభిమానముల విడుడు. పరస్పరము స్త్రీ పురుషులను భ్రాంతి విడుడు. ధర్మభ్రాంతి విడుడు. ప్రాకృతిక సంయోగము స్త్రీ పురుషుల కధర్మమూలక మను భ్రాంతి విడుడు. భ్రాంతి విడచిన బ్రహ్మంబు బట్టబయలు' అంటున్నారు శాస్త్రజ్ఞులు. కావున మీ రీ భ్రాంతి విడచి దేహ ముండువరకు సుఖించి మరణానంతర మాత్మజ్ఞానమునంది యాత్మతో ఒకరై సుఖము ననుభవించుడు".

"ఛీ! ఛీ! ఎంతటి యవమానపమో చూచితిరా? స్త్రీ పురుషుల సంయోగము ప్రాకృతికమట! ధర్మము భ్రాంతిమాత్రమట! శాస్త్రకర్తలగు ఋషులు పొట్టకు జరగని మిట్టసన్యాసులట. ప్రజలలో ఎట్టి యల్లకల్లోలము గావించినారు? వా రెరుగరు కాబోలు—

సజ్జనుల దూషించువారు దాని కనువైన ఫలము ననుభవించ వలసియుండును. ఆనాటి బౌద్ధమతముకూడ నింత పాషండముకాదు. ఆనాటి బౌద్ధమతమునందు సజ్జనులదూషణ లేదు. వైదికసిద్ధాంతాలకు ప్రాతికూల్యత యుండుటచేతనే ఆనాడు బౌద్ధమత మాచార్యులవారిచే ఖండింపబడినది. కాని బౌద్ధమతమునందు గూడ ధర్మసౌందర్యము కలదు. ధర్మవిపత్తిని ఆనాడు బౌద్ధులు తప్పించారు. ఈ మతములోనిది గ్రహణయోగ్యమగు విషయము. ఏదైనా - ధర్మమునకుహాని, సత్యమునకు స్థానభ్రష్టత, భక్తికి పలాయనము - ఈ మతమువలన కుదిరినది. శంకరుల యవతారము బౌద్ధమత ఖండనముతో బాటు అద్వైతస్థాపన మాశయముగా గలది. అవధూతస్వాముల యవతార మీ పాషండ మత సంస్కారముతో బాటు సర్వదర్శన సామరశ్యమును కలిగించు యాశయముగా గలది.

పై పాషండమతసంస్కారమునకు లింగమూర్తి బోధలెంతగనో ఉపకరించినవి. పాషండమతము, ధర్మమువలె, మానవుని కట్టుదిట్టాలలో నియమ, నిష్ఠలలో నుంచదు గాబట్టి దాని కనేకమంది దాసులైనారు. పాషండ మతమొక దుర్జనశక్తి. మొదట తియ్యగనే ఉంటుంది. ఆచరణకు కడు సులభముకాని కాలక్రమాన దానిలోని లోపాలు

కష్టాలు తెలియకమానవు. మనసమాజంలో సనాతనఋషులుస్థాపించిన సాధించిన ధర్మవిజయ మసామాన్యమైనది. పాషండమతమే వ్యాపించిన శ్రేష్టమనుకొన్న ప్రాకృతిక సంయోగము స్త్రీ పురుషులకు సహజ మనటంలో పశుప్రేమ వ్యక్తమవుతుంది. కాని పవిత్రమైన మాతృ ప్రేమ, భ్రాతృప్రేమ వ్యక్తముకాదు కాకపోగా తను కన్నతల్లినే పశువులవలె పుత్రుడు సంగమించాల్సి వస్తుంది. ఛీ! ఎంతటి అవివేకము. అట్టి దానిని మానవులలో కనపడకుండా చేసినశక్తి పేరు, ప్రతిష్ఠ సనాతన ఆర్షవాణికే అబ్బింది. ఆవాణీనినాదమే మన మహాత్ములు శంకర, లింగమూర్తులవంటి వారిలో ధ్వనించింది. ఆ సహజ ధ్వనియే నేడు మనకు ఉన్నతిని ప్రసాదించి మనకు, పశువులకుగల అంతరాన్ని చూపిస్తూ పశువులపై మనం అధికారం చలాయించగలశక్తి నొసగింది. అట్టి సనాతనఋషులకృపాఋణాన్ని తీర్చుకోటానికి మన ఈ కృతజ్ఞతా ధన్యవాదాలు చాలవు.

అదియునుగాక ఆచార్య శంకరులకును, శ్రీ అవధూత లింగ మూర్తికిని, అనుభూతివిషయమున నొక సామ్యమున్నది విద్యారణ్యుల శంకరవిజయమున శంకరులగూర్చి 'భాసయంతీ దిశోదశాన్' అను మాటవలన శంకరుడు పది దిక్కుల ప్రకాశించెడి వాడనుట స్పష్టము. అట్లే లింగమూర్తిగారిని నీడ లేనివాడని భక్తులంటారు. నీడ లేనివాడనగా పది దిక్కుల ప్రకాశించెడు వాడనియేగదా! ఈ విషయము చెపుతూ, దీని కనుబంధముగా క్రింది కథ నొకటి చెపుతారు.

ఒకసారి జగద్గురు శంకరాచార్య పీఠాధిపతి శృంగగిరిస్వాముల వారు సపరివారముగా పర్యటనకై నంద్యాలకు విజయముచేసినారట. నంద్యాలకు సమీపముననుండు పెద్దకానాల యందుండు శ్రీ లింగ మూర్తిగారిని గూర్చి విని వారిని చూడవలయునను నుత్సాహమున శ్రీ వారిని రమ్మని యొక శిష్యునివలన కబురంపించిరట. కాని శ్రీ యవధూతమూర్తి యతని సందేశమును విని "ఒక్కడుగా రాగలిగిన వచ్చి నన్నే కలియుమను" మని ప్రతిసందేశమును చెప్పి పంపినారు. "అందరు నాసన్నిధికి వచ్చి దర్శించి పోతున్నారే ఛత్ర జడధారి నే

నాహ్వానించినను రాక నన్నే ఒక్కడుగా రమ్మన్నాడు. కారణమేమి? అయినను మహాత్ముల హృదయము సముద్రమువలె గంభీరమైనది వారి మాటలభావము తెలిసికొనుటయే యతికష్టము" అని విచారించి యెట్టకేలకే కాకిగా శ్రీ లింగస్వామిని దర్శింప సముద్యుక్తుడాయెనట.

శిష్యులెవరును లేక ఏకాకిగాపోయిన యా జగద్గురువునుచూచి, "ఒక్కడవుగా రమ్మన నిరువురతో వచ్చితేమి? అన్నాడట. అపుడు జగద్గురువు విస్మయమంది 'ఆర్యా! నేను గృహస్థుం కూడ కాను. యతిని. నేనొకడనిగాక యిరువురిగా నెట్లవుతాను?" అని ప్రతి ప్రశ్నము సేసినాడట. అపుడు శ్రీ లింగమూర్తి జగద్గురువునుగాంచి నీ నీడ నీకు సఖ చూడుము ఈ నీడ (భ్రాంతి) నిన్ను విడువనంతవరకు నీ వెన్ని వేషములు వేసినను, యే యోగముల నాశ్రయించినను వ్యర్థమే యని తన సహజ విభూతియగు స్వయంప్రకాశ చిన్మయ దేహమును జూపించిరట. అపుడా జగద్గురువు శ్రీ లింగావధూత స్వాములను తేరిజూడ లేక నిలచియున్నాడట.

శ్రీ లింగావధూతగారికి దివ్యదృష్టి యుండెడిదట. వారి దివ్య దృష్టి లీలలు ప్రజానీకానికి ఒక మహత్తర దివ్యశక్తిని ప్రసాదించాయి. వారి దివ్యజ్ఞానము ప్రజానీకమునందు ఆధ్యాత్మిక పిపాసను ప్రబుద్ధంగా చేసింది. వారి దివ్యదృష్టికి ఉదాహరణముగా నీ క్రింది కథ చెబుతాను.

ఒకపరి కానాలయందు శ్రీ స్వాములవారు శిష్యులతో ప్రసం గించుచుండిరట. శిష్యులడుగు ప్రశ్నలకు సమాధానము లిచ్చుచు శ్రీ వారు దివ్యజ్ఞానోపన్యాసము గావించుచుండిరట. ఈ ప్రసంగము లతో సగము రేయి గడిచినది. అపుడు శ్రీ స్వామివారు నవ్వుచు రెండుచేతులతో దేనినో నలిపినట్లు చేతులు రుద్దికొనినారట. అపుడు అటనుండు శిష్యులలో నొకడు 'స్వామీ! దేనిని నలుపుచున్నా'రని అడిగాడట. అపుడు స్వామి 'ఏమియు లేదు, బనగానిపల్లెలో నొకపగటి భాగవతుల నాటకమును చూచుచుంటిని. ఇంతలో సత్యభామగా నటించిన వేశ్యయొక్క చీరచెరగు పొరపాటున కాంతికొరకుంచిన

కాగడాలమంటకు అంటుకొంది. అంటుకొనుట నా వేశ్య గమనించనే లేను. నేను దానినిచూచి వెంటనే నలిపివేసితి" నన్నారట.

ఈ మాట వినునరికి శిష్యునిగుండెలో రాయిపడిందట. ఇంత వరకు సత్యస్వరూపునిగ తానెంచిన తన గురు డసత్యమును చెప్పినా డనుకొన్నాడట. ఆ శిష్యునికి గురువునం దినాళ్ళుగల నమ్మకము తొలగిపోయిందట. కాని యిన్నినాళ్ళుగా నుండిన గాఢనమ్మకపు ఛాయలు తొలగిపోలేదింకా. తన శాయశక్తులా నమ్మకము కూడ గట్టుకొని మరల గురువునిజూచి "స్వామీ! తాము పొరబడుచుంటిరా? లేక నేను వినుట పొరబాటా? లేకున్న యిక్కడికి 6 క్రోసు లుండిన బనగానిపల్లెయేమి వీధి నాటకము జరుగు టేమి? జరిగెనుపో ఇటకూర్చున్న తాము చూచు టేమి? చూచితిరిపో - సత్యభామా పాత్రధారిణి కట్టుకొనిన చీరచెరగంటుకొనుట ఏమి? అంటుకొనెపో- ఆపాత్రధారిణి గుర్తించకముందే మీరు నలుపు టేమి? నమ్మదగినదిగా నున్నదా ?" అని ప్రశ్నించినాడట. అపుడు అవధూత వానినిజూచి 'శిష్యా! నిజమే. మున్మాటకీ నిజమే. నమ్ముము. సంశయింపకు' మన్నారట.

శిష్యునికి సందేహము పీడిస్తూనేవుంది. అయినా గురువుయొక్క దివ్యదృష్టిని పరీక్షించుటకు నడుకట్టినాడట. ఆశిష్యుడు వెంటనే వేగ ముగాపోవు వారువము నధిరోహించి బనగానిపల్లె చేరినాడు. నాటక మాడిరా యని విచారించాడు. ఆడినారని యాఊరివారు చెప్పగనే నమ్మక మతనికి తిరిగి చేకూరింది. గురువును విశ్వసించలేక పోయి నందుకు దురపిల్లాడు. పశ్చాత్తాపమును చెందినాడు.

ముందుకు సాగాడు. భాగవతు లపుడే తమ వస్త్రముల విడచి పెట్టెలలో సర్దుకొనుచుండిరట. వారిని చేరి వస్త్రముల పరీక్షించి నాడు. సత్య పాత్రధారిణి ధరించిన యుడుపునకు చెరగున చేతి నెడ ల్పుగా కాలిన గుర్తొకటుండినది. ఆశ్చర్యము చెందినాడు. ఎవరిని పులకితగాత్రులుగా చేయ దా ఘట్టము ?

ఇట్టి వనేకము లాయన లీలలయందు గలవు. వాని సన్నిటిని ఈ సంగ్రహ పరిచయమున ప్రదర్శించు టెట్లు ?

ఈ జీవన విశేషము లెట్లున్నను వారి కా దివ్యశక్తులు గలవని దివ్యజ్ఞానోద్భూతములగువారి తత్త్వములే చెప్పక చెప్పుచున్నవి.

శ్రీవారు కానాలలోనే తనయవతారమును చాలభాగము గడిపినారు. మహాతపస్సుచే ఈ గ్రంథములు లోకమున కందించుటే యొక గొప్ప తపస్సగునపుడు యిక వారి తపమునుగూర్చి చర్చించు టేల?

అంత్యమున శిష్యులగు దాసావధూత, చెంచుభట్టు, సుబ్బావధూత మొదలగు శిష్యులు వెంటరాగా సంగమేశ్వరమునకు తమ పయనమును సాగించారు. శ్రీ వారికి కానాలవద్ద నెందరో వీడ్కోలుపు చెప్పినారు. శ్రీవారు జ్యేష్ఠ బహుళ ౧౨ పుణ్యదినమున తమ భౌతిక దేహమును జలసమాధి చేతుమని యిక్కడ కానాలలోనుండు భక్తగణమునకు చెప్పివెళ్ళినారట.

ఏకాదశి దివసమునకు సంగమేశ్వరము చేరుకొన్నారు. ఆరాత్రి శిష్యులందరికి చెప్పవలసిన ధర్మాలు, తన తదనంతరము చేయదగు విధి విధానాలు, జరుపదగు కృత్యములు ఉపదేశించినారు.

మరునాడు ద్వాదశి ఆంధ్రదేశమున తన గీతాలద్వారా ఆధ్యాత్మికతా వ్యాప్తికి పాటుబడ్డ ఒక మహర్షి; ప్రేమమూర్తి; శిష్యవాత్సల్యముగల నొక యనురాగమూర్తి నిర్గమించుదినము, పాంచభౌతిక జగము వీడి ఆధ్యాత్మిక జగమున వ్యాపించు నొకశుభదినము.

మధ్యాహ్నకాల మాసన్నమైంది. శిష్యులగు దాసావధూతకు పాదుకలు, ఆశ్రమాధికారము ప్రసాదించి కడసారిగా శిష్యుల నుద్దేశించి యిట్లు సందేశించారు :—

సుజన సంగతి తా శోధించి తత్త్వముల
నిజగురుని మార్గమున నిలిచి వేడుకను
అజహరి రుద్రాదు లరసి చూడగరాని
నిజ్జ సత్పదంబునై నే వెలుంగుచున్న

ప॥ భ్రమర కీటకము గతి పరమాత్మధ్యానించి
అమితమగు నిజశూన్యమై యుందు నెపుడు ॥భ్ర॥

జలమధ్యమున హృదయ జలజాంతరంగమున
కలిత నాదము బిందుకళ లాక్రమించి
మొలకనగవుల దివ్యమోహనాంగుని మీరి
తలపోయ శుద్ధచైతన్యమైయుండు ॥భ్ర॥

ఎఱుక గురునితోఁగూర్చి యెఱుకలన్నియు మరచి
ఎఱుకలకు మొదలైన ఎఱుకలన్నియు మీరి
ఎఱుకలకు మొదలైన ఎఱుక తానగుచు
పరికించ పూదోటపై నిరాలంబమై
అరయ వెలిలోనిండి మెరయుచుండుదును ॥భ్ర॥

పైన శిష్యులు తనబోలి తత్పదము నెఱిగి తనకు దీటుగా నుండాలని సందేశించారు. అది అక్కడగల కొద్దిమంది శిష్యులకు కాదు. ఆ వాణి మనందరికి గూడ.

సందేశానంతరము సాగారు, నదీతీరానికి వచ్చి నిలిచారు. ఆధ్యాత్మిక జగత్తుకు ప్రత్యక్షంగా పయనం చేసే మహాపురుషుని పాదచ్ఛాయల అనంతానందాన్ని పొందుతున్నారు. అట్టి యథార్థ క్షణములు జీవితమున మరపురానివి కదా! మాదృశుల కట్టి వెప్పు డబ్బునో!

గురునాజ్ఞానుసారముగా కృష్ణాజినము నీటిపైన పరుప బడింది. వెంటనే అవధూతమూర్తి యందాసీనుడై స్వప్రకాశ చిన్మయదేహ విరాడ్ మూర్తియైనాడు.

శిష్యులంతా కట్టుగానిలబడినారు. ఓంకారనినాదములో సంగమేశ్వరతీరము ప్రతిధ్వనించింది. భక్తావళి కనుల నస్రువులు రాలుచున్నవి.

దుఃఖాశ్రువులో ఆనందాశ్రువులో అంతుబట్ట లేదు ! కాని వాని అనుభూతి అమరము. అమరము. ఓం. ఓం. ఓం.

శమ దమాదులబూని సేర రారండు
యముబారి జిక్కదరు వేగరాకున్న !

అని ఆప్యాయముంగా మనలపిలుస్తున్నాడు. దివ్య తేజోమూర్తియైన శ్రీ లింగావధూతస్వామి అడుగో! వెళ్ళుదము పదండి! లెండు! మీ దృష్టి నాజ్యోతి వైపు సాగనిండు. ఆనందమయులు కండు.

ఓం తత్సత్





శ్రీ శ్రీ శ్రీ పూదోట గురుస్వాముల పవిత్ర పాదుకా పీఠం

కా నా ల



శ్రీ శ్రీ శ్రీ లింగావధూతస్వాములవారి

కానాల మఠ ముఖద్వారము

# శ్రీ పూదోట తత్త్వ గీతామృతము

## ప్రార్థన

### మంగళహారతి

1. మంగళము ఓంకార మందిర నివాసునకు
మంగళము దివ్యాంతరంగునకును
మంగళము పూదోటపై సర్వసాక్షికిని
మంగళము లింగావధూత కిపుడూ
జయా జయ మంగళం శుభోదయ మంగళం ॥జయా॥

2. కాశి మొదలుగ ఎల్లదేశమాతయు దిరిగి
ఘనుడు లింగావధూత కరుణ బడసీ
కాశి పూదోటపై ఘన నిరంజనస్వామి
కాశిలో వెలుగు దాసావధూతకునూ ॥జయా॥

3. ఆటకూటములోన తేటవెన్నెలబయట
మేటి శిఖరముమీద మెలత కవ్వలనూ
రుద్రగుండములోన రూఢి యమృతముగోలి
సముద్రుడగు భద్రావధూత కిపుడూ ॥జయా॥

4. ఆగమార్థముదెలిసి అంబరంబుననిల్చి
యోగ సమాధిలో వెలుగు కవ్వలను
ఆదికన్యనుమించి అతిసూక్ష్మ పదముున
భోగైన నాగావధూత కిపుడూ ॥జయా॥

5. శంకలన్నియు మాని గురుపాదములు నమ్మి
పంక జాక్షినిగూడి పగలు రే యొకపై
శంఖ భేరీధ్వనులు సంభ్రమంబుగ వినెడు
గుహుడు వెంకటరామ అవధూతకిపుడు ॥జయా॥

6. ఈడపింగళగూడి జోడు హంసలనడుమ
ఆడె కన్యనుగూడి ఆడి పాడుచును
కోడె పామును లేచి కోటిరవి తేజమున
జోడుబాయని బోడవ ధూతకిపుడూ ॥జయా॥

7. ఎండ వెన్నెల అగ్ని ఎగసి పైగానిలిచి
మండలంబులు మీరి అఖండ తేజముతో
పండువెన్నెల బయట బాలికా శిరముపై
పండు రామావధూత పరమాత్మకూ ॥జయా॥

8. పొంగుచును ప్రణవంబు వరుసతో మోయగను
అరసిభేరీధ్వనులు అంబరము నిండగన్
సరసముక్తి కాంత సంగీతములు విన్న
చిన్నరామావధూత చిజ్జ్యోతికీ ॥జయా॥

9. గంగ యమునలనడుమ శృంగారవతిగూడి
బంగారుమేడలో పవళించగా !
అంగనలు నవరత్న హారతులు బాడగను
గురుడు శ్రీ సుబ్బావధూత కిపుడూ ॥జయా॥

10. అవధూత లింగగురు అమృతపదములునమ్మి
అకళంకమగు నాది ప్రణవపీఠమునన్
ఆనందసాంద్రమై అమృతబోధలుసేయు
అవధూత ఆనందనాదులకూనూ ॥జయా॥

11. నంద్యాల పట్టణము నాగయ్యభక్తితో
మంగళారతిబలికె మహాప్రకాశముగా
అర్థమెరిగి చదువ ఆనందముగవిన్న
పూదోట గురుడిచ్చు భుక్తి ముక్తులును ॥జయా॥



## శ్రీశ్రీశ్రీ పూదోట సద్గురు పరంపర-మహాద్వైత తత్త్వజ్ఞానపీఠం



శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

శ్రీశ్రీశ్రీ పూదోట రామస్వామి (పరబ్రహ్మము)
శ్రీశ్రీశ్రీ పూదోట శివరామ బ్రహ్మము (మూలపురుషుడు)

1. శ్రీశ్రీశ్రీ లింగావధూతస్వామి (మహాద్వైత తత్త్వజ్ఞాన పీఠ స్థాపనాచార్యులు)
2. శ్రీశ్రీశ్రీ దాసావధూతస్వామి
3. శ్రీశ్రీశ్రీ భద్రావధూతస్వామి
4. శ్రీశ్రీశ్రీ వెంకట రామావధూతస్వామి
5. శ్రీశ్రీశ్రీ నాగావధూతస్వామి
6. శ్రీశ్రీశ్రీ బోడి యవధూతస్వామి
7. శ్రీశ్రీశ్రీ పెద్ద రామావధూతస్వామి
8. శ్రీశ్రీశ్రీ చిన్న రామావధూతస్వామి
9. శ్రీశ్రీశ్రీ సుబ్బావధూతస్వామి
10. శ్రీశ్రీశ్రీ ఆనంద నాదావధూతస్వామి

పూదోట గాయత్రి } పూదోట రామాయ విద్మహే శివరామాయధీమహీ
తన్నో అవధూత లింగ ప్రచోదయాత్॥



## శ్రీ పూదోట తత్త్వ దర్శన సూత్రావళి

1. సమత
2. నిర్మమత
3. సర్వదర్శన సామరశ్యత
4. తత్త్వజ్ఞాన, పరిపూర్ణత
5. సగుణ నిర్గుణ సమైక్యత
6. చిన్మయ దేహ ప్రకాశ్యత
7. సేవా సర్వాత్మ మయత

అను సూత్రావళితో గూడిన మహాద్వైతమను విశ్వమత జీవనమును జీవులకు ప్రసాదింప 500 సంవత్సరముల క్రింద శ్రీ భగవానుడు కర్నూలు జిల్లా అవుకు లో పూదోట లింగావధూతస్వామిగా అవతారమును దాల్చిరి.



## శ్రీశ్రీశ్రీ పూదోట రామస్వాముల అష్టోత్తర శతనామావళి

ఓం పూదోట రామాయనమః
,, భక్త వత్సలాయనమః
,, శాశ్వతాయనమః
,, నిర్వికారాయనమః
,, నిశ్చలాయనమః
,, సింధుగుణ గంభీరాయనమః
,, నిష్క్రియాయనమః
,, అద్వయాయనమః
,, సద్గురు శేఖరాయనమః
,, ఘన నిరంజనాయనమః
,, యోగినేనమః
,, శ్రీగురు రామాయనమః
,, నిర్గుణ మూర్తయేనమః
,, నిర్వాణ సతీలోలాయనమః
,, చిద్రూపాయనమః
,, సదానందాయనమః
,, భక్త కల్ప తరువేన్నమః
,, జితయోగి పుంగవాయనమః
,, విమలాత్మనేనమః
,, ఆత్మా రామాయనమః
,, సచ్చిదానం దాయనమః
,, పరమాత్మాయనమః
,, పరమ యోగినేనమః
,, పుండరీ కాక్షాయనమః
,, పూదోట ప్రభువేన్నమః
,, నిజధామ యోగినేనమః
,, పరమ గురవేన్నమః

ఓం శ్రీరామాయనమః
,, రఘు రామాయనమః
,, నిజశాంత రూపాయనమః
,, మార్తాండ తేజో
రూపాయనమః
,, అనంతాయనమః
,, గురుమూర్తయేన్నమః
,, పూదోట బ్రహ్మణేనమః
,, పూదోట మర్మజ్ఞాయనమః
,, జగదీశాయనమః
,, పూదోట సద్గురవేన్నమః
,, అరుణాయనమః
,, చిన్మయాయనమః
,, విజ్ఞాన పురుషాయనమః
,, శివ రామాయనమః
,, దీన రక్షకాయనమః
,, పూదోట ఘనాయనమః
,, నిజగురవేన్నమః
,, సుజన పోషకాయనమః
,, ఆనందాయనమః
,, పూదోట అభవాయనమః
,, నళిన నేత్రాయనమః
,, పరమ హంసాయనమః
,, పరమ తారకాయనమః
,, పూదోట గురవేన్నమః
,, పరమ సద్గురవేన్నమః
,, సకలాత్మ నేనమః

ఓం సద్గురవేన్నమః
,, గురుస్వామినేన్నమః
,, వసధిగుణ గంభీరాయనమః
,, ముక్తిసతీలోలాయనమః
,, సుగుణ పాలాయనమః
,, చిదానందాయనమః
,, రామచంద్రాయనమః
,, జలజాక్షాయనమః
,, శ్రీహరేన్నమః
,, నిగమాంతాయనమః
,, నిజయోగి పుంగవాయనమః
,, సర్వాంగాయనమః
,, నిజనిర్మలాంగాయనమః
,, సర్వసాక్షినేనమః
,, రామాయనమః
,, శివయోగినేనమః
,, తారక రామాయనమః
,, దేవాయనమః
,, యోగినాయకాయనమః
,, మూర్తినేన్నమః
,, భక్త సేవితాయనమః
,, త్రిపురహరేన్నమః
,, గురు దేవాయనమః
,, మోక్ష సంచారాయనమః
,, పూదోట అయ్యానమః
,, ఈశాయనమః
,, అవధూత హృదయాబ్జ
భృంగాయనమః
,,పూదోటనిజరామలింగాయనమః

ఓం పరమతారక యోగినేనమః
,, స్వామి నేన్నమః
,, చిద్రూపాయనమః
,, సరసిజనేత్రాయనమః
,, గురుపతయేన్నమః
,, వీరయోగి నేనమః
,, నిరంజ నాయనమః
,, పరమ తత్త్వాయనమః
,, నిర్గుణ బ్రహ్మయనమః
,, సుగుణాయనమః
,, ఏకాక్షరాయనమః
,, వరయోగి పుంగవాయనమః
,, భోగినేనమః
,, యోగినేనమః
,, గుణ రహితాయనమః
,, పూదోట ధర్మాత్మాయ
నమః
,, పరమేశ్వరాయనమః
,, ఘనయోగి నేనమః
,, పూదోట జితయోగినేనమః
,, నిటలలోచనాయనమః
,, పూదోట నిఖిలాత్మాయనమః
,, నిర్వాణసతీలోలాయనమః
,, నిష్కళంకాయనమః
,, నిర్వికారాయనమః
,, శ్రీగురు శేఖరాయనమః
,, పరమ నిర్మలాయనమః
,, శ్రీ పూదోట మహాద్వైతా
యనమః

ఓం శ్రీ పూదోట పరమగురుభ్యోన్నమః



శ్రీ ముక్తి గణపతి

# ప్రార్థన

సతతమును రవిచంద్రపావక సదనమున తా వెలుగుచున్
ఇతరగుణములు జెరచి నిర్గుణమేకపథమై మెరయుచున్
చతుర్వేదములంటి స్వర్ణపు చక్రమధ్యను వెలుగుచున్
ప్రతిదినము నామనములోపల ప్రజ్వరిల్లువినాయకా

ప॥ శరణుశరణుహా! శరణునిర్మల గుజ్జరూపా! శరణునిజఫలదాయకా!
శరణు సుజనహృదయదీపక శరణు సుగుణ వినాయకా ॥శ॥
కదసిపదముల పసిడియందెలు ఘల్లు ఘల్లున మ్రోయగా
పొదలుచును నీమేన దివ్యవిభూషణంబులు వెలుగగా
అధికమగు సుజ్యోతిముఖమున నమృత దృష్టులు నిండగా
మధురమగు నీ పలుకులకు సేమసలుకొంటి వినాయకా ॥శ॥

తలచి చూడముత్యాల చవికెలో తరచు రత్నపు పీఠనూ
నిలిచి పార్వతి సుతుడవగుచును నిశ్చలానందంబునన్
చెలగి పసిడిపూలు నీపై చేడియలు వెదచల్లగా
యెలమి కన్నులపండువై మది వెలుగుచున్న వినాయకా ॥శ॥

అజహరీ రుద్రాది సురలును అంటిమిము పూజింపగా
పరమ పావన దివ్యఫలములు ప్రకటముగ భక్షింపగా
మురిపెముగు ముత్యాలహారతి ముదముతో సతులియ్యగా
నిరతమును కైవల్యపురమున నిలిచివెలుగు వినాయకా ॥శ॥

గట్టిగా సహస్ర రేకుల కమలమధ్యను చెదరకన్
గుట్టు దివ్యజ్యోతిరూపై కుదురుకొని దివి వెలుగగా
చుట్టు భక్తులు గొలచినిన్నును చూచి వినుతులుసేయగా
బట్ట బయట పూదోట పరశివపట్టమైన వినాయకా ॥శ॥—1





నిర్వాణేశ్వరి

తప్పులెంచకుము నన్ను నీసుతుని దయదృష్టి ననుజూడవే
అప్పటప్పటికి తనకు కడుపునిండ అమృతధారలు బోయవే
కప్పియున్నమాయ కడకుజిమ్మితుద నిప్పువంటిగురుని నెలత
జూపవె తనకు

ప॥ నిన్ను నే నమ్మినాడ ! హేనిర్వాణి ననునీవు రక్షించవె
నిర్గుణరాముని నన్ను నొక్కటిజేయు నాదావినోది ॥నిన్ను॥

దిక్కు నీవని నమ్మితీ ! నీ కన్న దిక్కు నావల యెవ్వరే !
చక్కగా దయసేయవె నామదిలోను గ్రక్కున వెల్గించవె
అక్కరతో నిన్ను అర్థించితిని నొకటి
చుక్కవంటి గురుని సుదతీ జూపవె తనకు ॥నిన్ను॥

గట్టిగ నిను గొల్చెద కమలనయన యిట్టట్టు జునుగబోకే
పట్టియున నామదిని చెదరకే ! అట్టి నీవునునిల్చి గట్టిగ మెలగవె

పట్టనలవిగాదు గట్టిగమగురైన అట్టి పరమగురుని
పట్టిచూపవె తనకు ॥నిన్ను॥

నన్నెడ సేయకువె ధన్యునిగా ననునీవు బ్రోవగదవె
వన్నె మీరుచు నాదు హృద్వీథిని కన్యనిలిచి వెలుగ గదవె
పున్నమ శశిమధ్య పొదలుచున్న నన్ను
కన్నతండ్రికి ముక్తికన్యకా జూపవే ॥నిన్ను॥

కుండలి నెగయించినే చివ్వున త్రివిధమండలములు మీరుచు
పండువెన్నెల బయటనే నిలిచిచూడ దండి తేజము మధ్యనూ
మండుచు పూదోట మాతండ్రి పత్నివై
నిండి యనంతమై యుందువే నాతల్లీ! ॥నిన్ను॥—2

నిన్ను నే వేడినాను శీఘ్రముగ నన్ను నీవు కరుణించవె
మన్నించి దయజూడుమీ నీకు నే చిన్నిముద్దులపట్టినే
అన్న రమ్మనిపిలిచి అతిమోదమున నీవు
నన్ను కౌగిటజేర్చు నవమోహనాంగీ.

ప॥ విన్నపము సేతునీకు నామనవి వినవధరించవమ్మా
కన్నతల్లీ గురుని ఘనదివ్యపథమున నన్నుసమకూర్చవే
నళిన దళనేత్రీ ॥వి॥

చల్లనీ నీ చూపుల నన్నిపుడు చక్కగా జూడగదవె
మెల్లనే నీయురముపై తల్లీ! మేలిమితో నన్నుంచవే
సలలితముగనీదు స్తన్యపానమునిచ్చి అల్లరామిని గూర్చి
ఆడించు తల్లీ ॥వి॥

పంచవింశతి తత్త్వముల్ నీ నిజాప్రభలచే బుట్టింతువే
పంచాక్షరములపై ప్రణవ స్వరూపమై మించికై వల్యమున
మెరతువె తల్లీ. ॥వి॥

ముగురు మూర్తులు మొదలుగా జగములకు మూలమైన తల్లి వే
పగలు రేలును మీరుచు నా హృదయ పద్మమున చరియింతు వే
సగుణ నిర్గుణ మగుచు సర్వసాక్షిగ నీవు పగడ
వర్ణంబైన బంగారు బొమ్మా. ॥వి॥

సురశైల శృంగమునను శతకోటి సూర్యదీప్తుల ప్రబలుచున్
పరిపూర్ణమై వెలుగుచూ నిగమాంత భవనమున క్రీడింతు వే
సిరిమించు నవరత్న సింహాసనముపైని పరమసుందరివైన
పరంజ్యోతి వమ్మా ॥వి॥

మెలగి తుంబుర నారదులు నీ ఎదుట మెరసిగానముసేతు రే
బలువిడిగి భక్తకోట్లు నినుగొలువ పడతికొలువై యుందు వే
తళుకు తళుకునమేన తరుచుసొమ్ములు వెలుగ మొలకనవ్వుల
ముద్దుచిలుక వే తల్లీ ॥వి॥

అమితమై నణుముఖమున నంటి నీ వకళంకవైయుందు వే
అమరగా వెలిలోపలన్ నామదిని ఆనందమై యుందు వే
రమణ పూదోట నిజ రామయోగి వీర విమలపదమై
నీవు వెలుగుదు వె కొమ్మా ॥వి॥—3






శ్రీకరంబుగ మీపదంబుల సేవగోరుచు నెమ్మదిన్
ప్రాకటంబుగ వచ్చినాడను భక్తవత్సల శాశ్వతా!
నీకు భృత్యుడ నిర్వికాముడ నీవునను కృప జూడుమీ
చేకొనుము నామనవి నిశ్చల సింధుగుణ గంభీరహే!

ప॥ శరణు నిష్క్రియ శరణు అద్వయ శరణు సుజనుల పెన్నిధి
శరణు యోగకలాబ్ధి సితికర శరణు సద్గురు శేఖరా ॥శర॥

భరితమగు సాహస్ర రేకుల పద్మకర్ణిక మధ్యనూ
స్థిరముగా బహుకోటి దినకర దీప్తులను శోభిల్లెడి
గురుతు నంతర్లక్ష్య మునిమెడి గోపథంబున వెలుగుచూ
సిరులు మీరుచు నాత్మ పీఠిని చెలగి మెలగెడి స్వామికీ ॥శర॥

తెలియ తుంబురు నారదాదులు దివ్యవీణలు మీటగా
మెలకువతో గంధర్వ జనములు మెరసిగానము సేయగా
అలరిడక్క మృదంగతాళము లజుడు హరిహరు లేయగా
మొలక నగవుల పరమ సుందరి ముదముతో నటియించగా ॥శర॥

పరమభక్తులు చుట్టుగొల్వగ ప్రణవధ్వని దివినిండగా
గరిమెతో కైవల్య ప్రజలును గ్రమ్ముకొని వీక్షింపగా

సరసముగ నిగమాంత కన్యలు స్వర్ణసుమములు నించగా
నిరతమును పేరోలగంబున నిలిచి ప్రబలెడి తండ్రికీ ॥శర॥

మొనసిశ్రుతి బృందములు నిరుగడ మ్రొక్కి నుతులును సేయగా
నొనర నుపనిషదర్థ నికరం బోలితో కీర్తింపగా
అనయమును వరముక్తిలలనలు నలరిపూజలు సేయగా
కనుగొనగ పూదోట కవ్వాల ఘననిరంజన యోగికీ ॥శర॥—4

ఆత్మారామా ఆత్మారామా ఆత్మారామా ఆత్మారామ
ప॥ మన్నించరావ ? మర్మజ్ఞనీవు నన్నిదో బ్రోవు నాస్వామినీవు
నిర్వికార నిరింద్రియ సర్వాంతసార సద్గురుధీర ॥ఆ॥
వేదాంతాతీత విమలాద్వైతా ! మోదాచరిత ! మునులనేతా ॥ఆ॥
అజపాస్తోత్ర ! ఆనందపాత్ర ! సుజనమిత్ర జోత్యంతనేత్ర ॥ఆ॥
సుధాబ్ధిసోమా ! సుజ్ఞానసీమా ! సాధుప్రేమా ! సజ్జనస్తోమ ॥ఆ॥
మాధవనామ! మాయాభీమ బోదాంతసీమ పూదోటరామా॥ఆ॥-5

పరికించి మీ పాదపద్మములు భక్తితో
నిరతమును నర్చించు శరణ జనములకు
సురభూజమునురీతి సొంపుతో వారలకు
వరద కోరిన కోర్కె లొసగుదువు దేవా !

ప॥ శరణు సద్గురుమూర్తి, సజ్జనులహృద్దీప
నిరవయ నిరాకార నిగమాంత వేద్యా ॥శర॥

నీవె నా తలిదండ్రి నీవె నాదైవమును
నీవె నాబాంధవుడ వీవె నాచెలివి
నీవె నాబోధవును నీవె నా పుణ్యమును
నీవెనా ప్రియుడవును నీవె నాధనము ॥శర॥

సర్వ పరిపూర్ణాత్మ సచ్చిదానందమయ
సర్వ యోగవిచార సత్పద నిధాన

సర్వమగు పూదోట సరిమించి యిల
సర్వసాక్షిగ నున్న స్వామిన్ర్రమొక్కెదను ॥శర॥—6

మించు సుజ్ఞాన ఖడ్గము మెరసిపట్టరా రామ
మెంచి దుర్గుణములన్ని త్రుంచివేయరా
అంచితముగ ఆత్మబోధ స్వామియొసగరా
సంచితములనెల్ల బాపి కరుణజూడరా

ప॥ అన్నా రారా ముద్దుల చిన్నా రారా
నిన్ను జూడక క్షణమునే నిల్వలేనురా ॥అన్న॥
చెంగున నాయంతరంగ స్థలిని నిలువరా
బంగరు పువ్వులశాలువ పైని గప్పెద రారా ॥అన్న॥
చల్లని చూపులనన్ను సరగచూడరా రామ
ఘల్లు ఘల్లున నెదుట గంతులేయరా ॥అన్న॥
అక్కరతో నీవు నన్నే యాదరించరా
గ్రక్కున నీదివ్య పదము కదిసిపట్టెదరా ॥అన్న॥
ఆలింగనము చేసి నన్నాదరించరా రామ
పాలించు పూదోట రామభద్ర మ్రొక్కెదరా ॥అన్న॥—5

ప॥ గురువుకువందనం..................
వందనము కైవల్యపతికిని వందనం బోంకార విభునికి
వందనము ననునేలు నిర్గుణ పరమయోగికిని ॥గురు॥
నిక్కి తనపైభూతి రేఖలు మెరసి భూతలమెల్లనిండగ
చొక్కమగు రుద్రాక్షపేరులు సొంపు మెరయగను
చిక్కవీడు సువర్ణజటలును శిరముమీదను తూలియుండగ
చుక్కగతి వెలుగొందు రాముని సొబగుపదములకు ॥గురు॥
బంగరపు పావాలు మెట్టియు ప్రబలిమించిన యోగపట్టెయు
రంగుమీరిన కావిశాటియు లలితముగ వెలుగ

సంగతిగసనకాదిమహానులు సత్పదంబులు పూజసేయగ
పొంగుచును పూదోట కవ్వలి పురుషవర్యునకును ॥గురు॥—6

శరణు సుగుణకలాప ! శరణు సర్వాత్మక !
శరణు నిర్గుణరూప ! శరణు శరణు
శరణు నిత్యానంద ! శరణు చిన్మయరూప !
శరణు నిష్క్రియా ! స్వామి శరణు శరణు

ప॥ శరణు సద్గురుమూర్తి సచ్చిదానందమయ
పరమాత్మ అమనస్క పద మొసంగితివి ॥శర॥

శరణు సురపూజిత శరణు సుజనస్తోత్ర
శరణు భక్తుల పెన్నిధే, శరణు శరణు
శరణు నిర్మలచరిత శరణు అనుపమరూప
శరణు చిన్మయగాత్ర శరణు శరణు ॥శర॥

శరణు చిదాభాస శరణు అమృతాంకుర
శరణు అగణితమూర్తి శరణు శరణు
శరణు జ్యోత్యంతరా ! శరణు చిన్మయనేత్ర
శరణు పూదోట శ్రీ గురుమూర్తి శరణు ॥శర॥—7

కావవా గజపతిని కావవా జలజభవు
కావవా ఖేచరుల రామా
కావవా భూదేవి కావవా డింభకుని
కావవా శతమఖుని రామా
కావవా రక్కసుని కావవా వ్యాససుతు
కావవా బుధవరుల రామా
కావవా కలికినై క్రమముతో నిలజనుల
కరుణాపయోరాసి రామా
ప॥ నీకు వందనమిదిగో నిరవయ నిరాకార
నిగమాంత వేద్యహేరామా

చే కొనుము నామనవి శీఘ్రముగ నాతండ్రి
చేపట్టి కృపజూడు రామా ॥నీకు॥

కావవా తలిదండ్రి కావవా వృక్షముల
కావవా గొల్లలను రామా
కావవా సర్వమును కావవా వాక్పతిని
కావవా యుద్ధవుని రామా
కావవా యక్రూరు కావవా మాలికుని
కావవా కుబ్జమహి రామా
కావవా ముదితాత కావవా గురుసుతుల
కావవా ముచికుందు రామా ॥నీకు॥

కావవా యాదవుల కావవా పాండవుల
కావవా ద్రౌపదిని రామా
కావవా ఋషివరుల కావవా మునివరుల
కావవా మనువరుల రామా
కావవా విశ్వమును కావవా మునుధృవుని
కావవా భక్తులను రామా
కావవా ముక్తిసతి కావవా శుద్ధాత్మ
కావుమను - పూదోట రామా ॥నీకు॥—8

విశ్వరూపధర విశ్వవ్యాపక విశ్వనామ యభవా
విశ్వక్రీడిత విశ్వమోహితా విశ్వమయుడ వీవూ
విశ్వచ్ఛేదిత విశ్వరహితవో విశ్వజనక సుగుణి
విశ్వగర్భహే విశ్వకారిణే విశ్వసాక్షి గురవే !

ప॥ శరణు శరణు యిదో శాశ్వత భోగీ శరణు నిష్కళంకా
శరణు నిరంజన శరణు నిరామయ శరణు భక్తవరదా
మునిజనసేవిత మునిజన వందిత మునిజన నుతప్రేమా
మునిజన బాంధవ మునిజన పూజిత మునిజన భవహరణా



శ్రీ శ్రీ శ్రీ లింగావధూత స్వాములవారి
బనగానిపల్లె కొండపేటమఠం గురుపీఠం



శ్రీ అవధూత ఆనందనాదస్వామి



శ్రీ నాగావధూతస్వామి

మునిజన పోషిత మునిజన వత్సల మునిజన సిక్షేపా
మునిజనమోదిత మునిజనదాయక మునిజన హృద్దీపా ॥శరణు॥

నిరుపమ నిర్గుణ నిరుపమ నిరవయ నిరుపమ నిర్ద్వంద్వా
నిరుపమ నిశ్చల నిరుపమ నిష్క్రియ నిరుపమ నిరవేద్యా
నిరుపమ యద్వయ నిరుపమ శుచిహే నిరుపమ నిర్ద్వంద్వా
నిరుపమ నిశ్చల నిరుపమ చారిత్ర నిరుపమ తత్వార్థ
నిరుపమ పూదోటో గురుశేఖర నిరుపమమృత శంభే ॥శరణు॥—9

చలనుడను మలినుడను శమదమాదులులేని
కులహీనుడను చాల కలుష చిత్తుడను
బలువిషయవ్యాపకుడ పశుజీవకుని నీవు
తెలిసి నాసుతుడనుచు భళిరె కాచితివి

ప॥ గురుమూర్తి మీ మహిమ కొనియాడనాకలవె
నిరుపమ నిరాకార నిజరామయోగీ ॥గురు॥

పరపైన యజ్ఞాన శరధిలోపల మునిగి
దరిదాపుగానకను తల్లడింపుచును
కరుకు భవపాశముల కట్టుబడి వరలగను
సరసి నామొర నీవు నాలకించితివె ॥గురు॥

జననీ జనకులాది సతిసుత సహోదరులు
ధనధాన్య గృహక్షేత్రములు మిత్రులనుచు
కనుగానుచు నివి నీవు ఖండించి ముదముతో
పనిబూని నను బాల్యమున గాచినావు ॥గురు॥

పరిశుద్ధునిగజేసి భక్తి మార్గము దెలిపి
సరిలేని తీర్థప్రసాదములు నొసగి
సిరవలంబంబనెడి నిర్లక్ష్యమును జూపి
పరమయోగముకీలు బయలుజేసితివె ॥గురు॥

ప్రతిలేని నీదు సత్పథము స్థిరమోక్షమని
హితవుతో జూపనే జితయోగినగుచు
అతివేడ్క మీ స్వస్వరూపమై యమృతునై
మితిలేని పూదోటమించి ప్రబలుదునే ॥గురు॥—10

దురితహా కలిమాయచే దోగి క్రూరులు రామచంద్రా
విరివిగా దుర్జనులు ధరనేపు మీరుచు ॥రామ॥
పరమా భక్తులనెపుడు బాధించగానీవు ॥రామ॥
కరుణ జూడక తేరకానివలెనున్నావు ॥రామ॥

ప॥ కన్నతండ్రి! నా పలుకు వినవె వో రామచంద్రా!
విన్నంతలో నీవు వేడ్కతో ననుగావు ॥రామ॥
దాత ఎవ్వడులేక తన్నీరసమై ॥రామ॥
భూతకోట్లు కర్మ పుంజాగ్నిచే పొగలు ॥రామ॥
రాతినాతిగ జేసి రక్షించవామున్న ॥రామ॥
ఏతెంచి సుజనూల ఇలమీద గావవా! ॥రామ॥
అలనాడు కరిపలుకు లాలించి కావవా ॥రామ॥
తలపోసి ప్రహ్లాదు దయచేసి ఏలవా ॥రామ॥
చెలగి విభీషణుని చేపట్టి బ్రోవవా! ॥రామ॥
వెలసి జలధిలోపల జొచ్చి శతృవును ద్రుంచవా ॥రామ॥
విరివైన వసుధ నీ వీపుపై నుంచవా ॥రామ॥
సరస ద్రౌపతి కక్షయ వస్త్రము లొసగవె ॥రామ॥
ధరలోన కల్కివై ధర్మము నిల్పవా ॥రామ॥
అరసి ఇప్పుడు నీవు ఆర్తులరక్షించు ॥రామ॥
అడుగు క్రింద సర్వ మాక్రమించెదవె నీవు ॥రామ॥
పడచుల వ్రతములు భగ్నము జేయవా ॥రామ॥
పుడమిని కొమ్ముచే పొందుగా నుంచవా ॥రామ॥
హడలుగ రాజుల నవనిపై ద్రుంచవా ॥రామ॥
వసర అంబరీషు వ్రతము నిల్పెవెమున్న ॥రామ॥

తనర నజామిాళు దయసేయవేమున్న ॥రామ॥
కనురెప్పరీతిని కావవే భక్తుల ॥రామ॥
నిన్ను నమ్మినవారికి నీరూపమిత్తువు ॥రామ॥
దిట్టవనుచు నిన్ను దివ్యశ్రుతులు చాలా ॥రామ॥
బెట్టుగా నీ బిరుదు పేర్కొని పొగడూనె ॥రామ॥
పట్టి యిప్పుడు భక్తవరుల శీఘ్రముగాను ॥రామ॥
గట్టిగ పూదోట ఘనుడ కాచితి వౌర ॥రామ॥—11

పరమ పురుషుడవీవు విశ్వము
చాలప్రబల జేయుదు వీవు
పరువులెత్తుచు స్థావర జంగమాదుల
సొరిది దాగినను చొచ్చి - భేదించకను

ప॥ నిన్ను నేపోనియ్యరా ! భక్తవరద
నీ మహిమ నే గంటిరా ॥నిన్ను॥

కలిత విజ్ఞాన దీపా ! మ్రొక్కెద నీకు
ఘనమైన స్వామి చిద్రూపా
బలిమి భక్తులు గదసి పరిపూర్ణ శాంతిచే
చెలగి పట్టిన చిక్కి చిక్కకుండెడిస్వామి ॥నిన్ను॥

పగలు రేలును మీారుచు నామదిలోను
ప్రకటమై వెలుగొందుచు
నిగమాంత వేద్యమై నిలిచి పూదోటపై
వగలు మీారుచునున్న వరయోగి పుంగవా ॥నిన్ను॥

నిన్ను నే పోనియ్య నిర్వాణ సతిలోల
నన్ను రక్షించు మీా నా ప్రాణవల్లబా ॥నిన్ను॥—12

నీ పాదపద్మములు నిర్భీతులైనట్టి రామయోగీ
నీ పాదపద్మములు నిర్లేపులెరుగరు రామయోగీ

నీ పాదపద్మములు నిస్సంగులైనట్టి రామయోగీ
నీ పాదములు బ్రహ్మనిష్ఠులు గనలేరు రామయోగీ

ప॥ నిన్నువర్ణనజేయ నేనెంతవాడనే రామయోగీ
నన్ను రక్షించు మీ నాతండ్రి మ్రొక్కెదను రామయోగీ ॥నిన్ను॥

మీ పాదపద్మములు మేదినిపై జనులురామయోగీ
మీ పాదపద్మముల మేలుదెలియలేరు రామయోగీ
మీ పాదపద్మములు మితిలేని భక్తితో రామయోగీ
మీ పాదపద్మములు సురలు కానలేరు రామయోగీ ॥నిన్ను॥

నీ పాదపద్మములు నిలిచి దివ్యశ్రుతులు రామయోగీ
నీ పాదపద్మములు నెరయ కానగలేవు రామయోగీ
నీ పాదపద్మముల నంటి నే బాసచేసెదను రామయోగీ
నీ పాదపద్మములు నెరనమ్మితి స్వామి రామయోగీ ॥నిన్ను॥

మీ పాదపద్మములు మెరసి సనకాదులు రామయోగీ
మీ పాదపద్మముల మేలుదెలియలేరు రామయోగీ
మీ పాదపద్మములు మిగులమూర్తి త్రయము రామయోగీ
మీ పాదపద్మములు మెచ్చి పొగడలేరు రామయోగీ ॥నిన్ను॥

నీ పాదపద్మములు నిర్వాణసతి చాల రామయోగీ
నీ పాదపద్మములు నెరయకానగలేదు రామయోగీ
నీ పాదపద్మములు నిర్గుణ పురుషుడును రామయోగీ
నీ పాదములు గొలువ నేరడు పూదోట రామయోగీ ॥నిను॥-13

పిలచిన పలుకవదె యిపుడు
నాపై ప్రీతిలేకున్నవదె
తలపోయ నాహృదయ జలజాంతరంగమున
నిలిచిప్రకాసించు నిర్వాణసతిలోల

ప॥ తడవాయను రారా చక్కనితండ్రి
తడవాయను రారా

తడవాయ రారా నీ దాసాను దాసుని
కడువేడ్కతో నన్ను కాచి రక్షింపగా ॥తడ॥

నామనవి చేకోనుమీ నన్ను నీవు
నావాడవని జూడుమీ
నీమహిమ వర్ణింప నేనెంతవాడను
స్వామీ నీపదములు చాలనమ్మితి మ్రొక్కెద ॥తడ॥

అక్కడిక్కడ వెదకితి నిష్కళంక
దిక్కునీవని నమ్మితి
చిక్కులు బెట్టకు జితయోగిపుంగవ
అక్కరతో నన్నాదరింపుము దేవ ॥తడ॥

ఎంతనిర్ణయ బుద్ధిరా! నిర్వికారా!
యింతతడవు జేతువురా!
పంతముతో మున్ను భక్తకోటులమీది
చింతలెడబాపిన శ్రీ గురు శేఖరా ॥తడ॥

పరమ నిర్మల చిద్దీపా నిరాకార
పరిపూర్ణ స్వస్వరూపా!
మెరసి ఎపుడు పూదోట కవ్వలిబయట
నిరుపమానందమున నిల్చి వెలిగెడిదొంగ ॥తడ॥—14

మెరసి అహిముఖజ్వాల మింటికెగసెడి వేళ
తరుచు భూతేంద్రియములు దగ్ధమౌ వేళన్
మరి అంగదేవతలు మదిని గూడెడి వేళ
అరయ జీవుండూర్ధ్వమై వెడలు వేళన్

ప॥ అపుడు నా మొర నీవాలకించుము తండ్రీ
యిపుడె వేడెదనిన్ను ఈశపరమేశా! ॥అపు॥

అలబ్రహ్మ రంధ్రమున ననిలుదురికెడి వేళ
గళగళను నినదంబు గర్జించు వేళన్

తెలియలోబైట సత్ కళలు వెలిగెడి వేళ
నిలచి చిక్కారణముపై నిను వెదకు వేళన్ ||అపు||

సకల జీవుల ప్రాణసమర సంబగు వేళ
సుకరమగు పరంజ్యోతి జొచ్చిచను వేళ
ప్రకటమగు పూదోట ప్రభువు సంటిన వేళ
అకళంకమగుచునే సమితమగు వేళ ||అపు||—15

తప్పులెంచకు నీచునీ శ్రీ గురురాయ
దయసేయుమీ భృత్యునీ
చెప్ప జూపరాని, స్థిరమౌ నిర్గుణమూర్తి!
అప్పా రమ్మనినన్ను ఆదరించుమి స్వామి

ప॥ నీకూ నే మ్రొక్కెదనురా మహానుభావ
నీ పాదములు జూపరా
నీకూ నే మ్రొక్కెదను నిర్వాణ సతిలోల
చేకొనియు నన్నిపుడు చిద్రూపరక్షించు ||నీకూ||

భావించినను జూడుమీ సదానంద
పరికించి నను నేలుమీ
కావవె వరభక్త కల్పతరువా! నన్ను
యీ వేళ మీకన్న నధికు లెవ్వరు లేరు ||నీకూ||

ఎంత లేదనబోకురా యిప్పుడు నాతో
పంతంబు లేమిటికిరా
సంతతమును నీదు చరణాబ్జములు మదిని
చింతజేయుచునుందు జితయోగి పుంగవ ||నీకూ||

ఇటునటు జనుగాకుమీ చక్కని తండ్రి
ఇటు నిలువుమటు బోకుమీ
కటకట నావంటి కడుదీనులను నీవు
ఘటుకూన చేపట్టి దయసేయవా దేవ ||నీకూ||

జాడలన్నిటి గంటినీ నీవుండేటి
జాగాకు మెట్టితిని
వేడూక పూదోట విమలాత్మ నినుగూడి
నేడూ నాడనకనే నిల్చి వెలుగుదు తండ్రి ॥నీకు॥—16

సన్నిధి నిలచిమీ చరణములు బట్టినే
విన్నవించెద పరమయోగీ! పరాకు
సచ్చిదానందహే సర్వేశనను బ్రోచి
శరణ మివ్వవె స్వామి రామ పరాకు
ప॥ దండమిదిగో నీకు పుండరీకాక్ష నీ
అండ జేరితి పరమాత్మ పరాకు ॥దండ॥
కర్మమును ఖండించి ధర్మమార్గము నూని
నిర్మలపదమున నిల్పు పరాకు ॥దండ॥
బొజ్జలోపల నిఖిల భువనముంచి దివ్య
సజ్జనాళిలో వెలుగు స్వామిపరాకు ॥దండ॥
మండలత్రయముపై పండువెన్నెలబయట
నిండి వెలిగెడిరామ నీకు పరాకు ॥దండ॥
గట్టిగ నీ పదము బట్టి ఛిద్రూపినైతి
పట్టైన పూదోట ప్రభుడ పరాకు ॥దండ॥—17

పక్కటిల్లుచు కలిపురుషుని పెనుమాయ దిక్కులాక్రమించె రారా!
చిక్కిజనులు కన్నుగానక మత్తులై ధిక్కరించిరి సుతుల
(రామా) ॥రారా॥
ఎక్కడజూచినను ససుర కర్మములే ఎక్కువైనవి రారా
గ్రక్కున నీదివ్య దృష్టుల కలిమాయ ఖండించవలెతండ్రి రారా
ప. రారా! ఓ తండ్రిరారా గురుయోగిరారా నిర్గుణరూప రారా
పరిపూర్ణదయతో సన్నేలిన నిర్లేప పరమ తారకయోగి॥రారా॥

పట్టైన నీభక్తులాడిన వాక్యములు ప్రజ్వరిల్లనిపుడు రారా
గట్టిగా శంఖువర్ణము తేజిపై నెక్కి కనక వసంతుడా రారా
గట్టించినడ తేజి గట్టెల్లి రవధూళి గగన వీధిన నెగయ ||రారా||
చుట్టుపరమ భాగవతులుగొలువగ సొంపుమీరగ
నీవురారా ||రారా||

మండలమున ప్రణవభేరి మ్రోయగ జడుల గుండెలు
బగులగ రారా
నిండుకళల తెల్లని గొడుగు శిరసుపైనిలచి వెలగ నీవురారా
చండభాస్కరు రీతి మేసుఖడ్గము చేత మండుచుండగ నీవురారా
అండజేరీ నెరయోధులు బొగడగ నానందమున
యోగి రారా ||రారా||

కత్తిఝుళిపించి దుర్మార్గుల దూలించి ఘనుల రక్షింతువు రారా
హత్తి పరమభక్తులతోడ రాజ్యమ్ము సమరసేతువు నీవురారా
మొత్తమైన పదునాలుగు జగములును మొనసి పాలింతువు రారా
సత్తు చిత్తు తుద సూర్యనందిన నీవు సమకూడి
మెరతువు రారా ||రారా||

జల్లునసీపై పువ్వులవాన గురిపించి జ్ఞానులు పొగడెదరురారా
అల్లి బిల్లిగ జనులు ఆనందముగనిన్నె అరసి పూజించెదరు రారా
చల్లనీ పూదోట జగదీశ జనులకు సంతోషమిచ్చెదవు రారా
కల్ల గాదవధూత చంద్రునీ పలుకు కల్కిరామా
యిపుడు రారా ||రారా||—18

పలువలై గురువంచనలు జేయు క్రూరులను యిలపైని నిలబెట్టిరామా
చిలుకు టంబులు వేసి చించిమేనులుచాల చీకాకు చేతువోరామా
చిలుక్రొవ్వి గురుసుతుల పరియాచకముసేయు భ్రష్టులను
మహిలోనురామా
ఛలముచే భేదించి సెలవేటి చరులలో ఛావుడస దోతువోరామా

ప॥ నీ పదాబ్జములుమది నెరనమ్మియున్నట్టి నిజభక్తులందరునురామా
ఆపదలులేకను చిదానందులై ఎప్పుడును అమృతులై
యుందురో రామా

స్వామి ద్రోహులబట్టి జర్జరీ భూతమున జముభటులు
ద్రొమ్మి మరిరామా
సామ జంబులచేత చదియ ద్రొక్కించినను చచ్చి చావరు
జడులు రామా
తామసంబునయించి తరచు యాతనలందు దయలేక
ద్రోయుదురురామా
ఏమిచెప్పుదునయ్య యిట్టి జీవులదుఃఖమీశ ! పరమేశ
యో రామా ॥సీ॥

అరసి సద్గురునిపై హంకరించిన జనుల అంగముల
మాంసమునురామా
మొరలు పెట్టగకోసి మరికి భక్షించుమని ముసలముల
మొత్తుదురు రామా
కెరలిముక్కును చెవులు గీచి పారగకోసి కిలకిలను
నగుచునుచు రామా
కరుణలేకను నగ్గి కొరవులను దేహములు గాల్చి
భేదింతురో రామా ॥సీ॥

కులగర్వులై దేశికుని మీద కోపించి గుడ్లెర్ర జేసినను రామా
పలువరింపగ నేత్రములు ఘోరగండ్లచే పట్టిపెకలింతువో రామా
తులువలై పెద్దలను దూషించు జనుల జిహ్వలు యముడు
గోయించురామా
ప్రళయమునకైన యీ పాపాత్ములకు సుఖము
ప్రాప్తించదయ్య యో రామా ॥సీ॥

పరికించ శిశుహత్య స్త్రీ హత్య గోహత్య బ్రహ్మహత్యలకైన
రామా

ధరపైన ప్రాయశ్చిత్త మరయఁగలదని శృతులు మెరసి
చాటించునో రామా
గురుడు నరుడనిచూచి గురునిపై ద్వేషించు శరణులకు
మీరెగతి రామా
అరయ ప్రాయశ్చిత్త మవనిపై లేదయ్య స్థిర మైన పూదోట
రామా ॥సీ॥—19

దిట్టమగు కలిమాయచేజిక్కి జనులు నీదాసులను దోలెదరురామా
దిట్టలగు నీభక్తవరులు మొరపెట్టగా తీవ్రముగ రావదేరామా
పట్టదగని వస్తువులు భక్షించుజనులనూ పారద్రోలవె వీరరామా
గట్టిగానీపాద పద్మములు నమ్మితిని కరుణజూడవె యాత్మరామా

ప॥ చక్కగా నాహృదయ కమలమధ్యను వెల్గు సచ్చిదానంద
హేరామా !
ఒక్కడై నట్టి మీవర దివ్య వాక్యముల వరద ననుగావవేరామా !
వీరక్షేత్రమున నీవిచ్చినా అభయములు వేగసమకూడెనే రామా!
పరమాత్మ యుభయ పక్షముల తుద కనుదెరచి ప్రజ్వరిల్లవె
కలికిరామా !
పరమామృతమగు దివ్యదృష్టులనుజూచినాపలుకాలాలించవేరామా
విరినైన సుజ్ఞాన జ్యోత్యంతరంగమున విస్తరించుము స్వామి
రామా ॥చక్క॥

అగ్నివర్ణ నేకమగు ముఖములను నీ హస్తమున మండగా రామా !
ప్రజ్ఞమెరయుచు ముత్తియముల జంపుల గొడుగు పరిపూర్ణమై
ప్రబలరామా !
విజ్ఞానులగు త్రివిధసతులు నీ ఇరుగడల వింజామరలు వీవరామా !
సంజ్ఞతోడుత నీవు చారు హంసము నెక్కి చాలప్రకాశించురామా!
రెండొకటలోకములుఎంచనాముందటను ప్రేమతోనిలువవేరామా
మెండుగా సురలు పువ్వులవాన గురియించి మెరసి స్తోత్రముసేయ
రామా ॥చక్క॥

దండిగా నీకీర్తి దశదిశలు నిండగా ధర్మంబునిలుపవే రామా
నిండి వెలుగుచునీవు నిజభక్తజనులకడ నిలిచి తనరవె తండ్రి రామా
సంగతిగ పరమభక్తులతోడ గుసుడ భూచక్రమున క్రీడించు రామా
రంగుమీరిన స్వర్ణ చవికెలోపలనీవు రత్నపీఠిన నిలువు రామా!
చెంగలింపుచుపువ్వుదోట కడపట వెలుగు శ్రీగుసుడనినుగూడి రామా
నింగిగతి వెలిలోను నిండిప్రకాశించి నిలిచి మెరయుము నేను
రామా ! ॥చక్క॥ —20

అన్నా అన్యుడగాను రామా ! నీకు చిన్నసుతుడనె శ్రీరామ !
ఎన్ని దెలుపనేల రామా। ఘనుని నన్ను జేయవె రఘురామా।
అన్న నాయవగుణము లెన్న నేటికి నేడు
నన్ను ధన్యునిజేయు మన్న శ్రీరామా !

ప॥ నిన్ను నమ్మితిహేరామా ! నీవు
నన్ను దయజూడు శ్రీరామా
కన్నతండ్రి నన్ను కరుణించి నీదివ్య
చిన్మయ పదమునందు జేర్చుకో శ్రీరామా ॥నిన్ను॥
గుట్టయిన నామదిని రామా నీవు
అట్టె వెలుగు శ్రీరామా
పట్టితి నీపదము రామా నన్ను
గట్టిగ బట్టు శ్రీరామా
పట్టి నన్నొడచి బెట్టినా సుజ్ఞాన
దిట్టలు నిన్ను చేపట్టరు శ్రీరామా ॥నిన్ను॥
ఎంచ లేదనకు హేరామా
నాదు చింత లెడలించు శ్రీరామా
పంతముతో నన్ను రామా !
పట్టి రక్షించుమయ్య శ్రీరామా
సంతతము నా హృదయమ

జలజాంతమున నిజ శాంతరూపై
వెలుగు స్వామి శ్రీరామా ॥నిన్ను॥

చల్లనీ నీదృష్టుల రామా ।
దయను చాల జూడవే శ్రీరామా
ఎల్లవారును జూడ రామా నన్ను
ఏలుకోవయ్య శ్రీరామా !
అల్లి బిల్లిగనన్ను ఆలింగనముజేసి
కొల్లలుగ ముక్తినీ కూర్చవె శ్రీరామా
చండదానవ కోట్ల రామా !
మదఖండితాపహానినుత రామా !
పుండరీకాక్ష హే రామా !
మార్తాండ తేజోరూప రామా
నిండు పూదోటపై నిజమైన సత్పదము
దండ జేరీనిన్ను అంటితి శ్రీరామా ॥నిన్ను॥—21

కావవా నాగమును ఖండించి మకరమును కావవా
దైత్యసుతు రామా
కావవా యజ్ఞమును కావవా మునిసతిని కావవా
వాయసము రామా
కావవా పక్షిధర కావవా శబరిమహి కావవా అర్కసుతు రామా
కావవా దనుజవిభు కావవా వైదేహి కావవా తమ్ములను రామా

ప॥ యిట్టి భక్తులనీవు ఇలమీద గాచుటట ఈశపరమేశ హేరామా
గట్టిగా నన్నిపుడు కావవే మొక్కెదను కరుణాపయోరాసి
రామా ॥ఇట్టి॥

కావవా తలిదండ్రి కావవా మద్దులను కావవా గోపికల రామా
కావవా గోసతిని కావవా గొల్లలను కావవా ఫణిసతుల రామా
కావవా క్రూరునిల కావవా మాలికుని కావవా అలకుబ్జ రామా

కావవా వరతాత కావవా నాపురము కావవా గురు
సుతుని రామా! ॥ఇట్టి॥
కావవా ఒకనెలుగు కావవా ద్వారకను కావవా అబ్ధిసుత రామా
కావవా బహుసతుల కావవా బహుసుతుల కావవా
గాండీవి రామా
కావవా ద్రౌపదిని కావవా వాయుసుతు కావవా
భగదత్తు రామా
కావవా రాజులను కావవా బాణునిల కావవా పరిక్షితుని
రామా ॥ఇట్టి॥
కావవా యుద్ధవుని కావవామైత్రేయు కావవా యినసుతుని రామా
కావవా పాండవుల కావవా యోగీంద్ర కావవా దివిచరులరామా
కావవా మును ఎరుకు కావవావినతసుతుకావవా
రుద్రసుతు రామా
కావవా వాక్పతిని కావవా శంకరుని కావవా మును
ధృవుని రామా ॥ఇట్టి॥
కావవాదిక్పతుల కావవా ఋషివరుల
కావవా మునివరుల రామా
కావవా రవిచంద్ర ఘనతేజములు నీవు
కావవా తారలను రామా
కావవా వేదముల కావవా ముగ్గురిని
కావవా జీవులను రామా
కావవా విద్యుతుద కావవా చిన్మయుని
కావవా పూనోట రామా ॥ఇట్టి॥—22

కరిమకరిచేజిక్కి గాసిపడి వెయ్యేండ్లు కడుడస్సి
మిమువేడ వరదా!
కరుణతో వేంచేసి ఖండించి జలచరుని గజము
రక్షించితివి వరదా!

హిరణ్యుడు జూపుమని అవనిపై డింభకుని యమిత
బాధలు వెట్ట వరదా!
నరమృగాకృతితోడ నక్తంచరుని దునిమి
వర పుత్రుగాచితివి వరదా!

ప॥ శరణాగత త్రాణ బిరుదు జెల్లును మీకు
సచ్చిదానంద హే వరదా!
గురుతుగా ననుగావకున్న ఈ
బిరుదెట్లు మీకిపుడు జెల్లునో వరదా! ॥శర॥

జీవనము లేనట్టి చిరమైన చత్రాతి
స్త్రీ రూపు జేసితివి వరదా
సేవజేసినయట్టి క్షితిపై జటాయువుకు
చిరమోక్ష మొసగితివి వరదా ॥శర॥

కావుమని నంతలో కనుగొని విభీషణుని
క్రమముతో నేలితివి వరదా! ॥శర॥

నీవు నాతండ్రివని నెరనమ్మితిని దేవ
నిగమగోచర భక్త వరదా!
కనుగొనగ కైవల్యమువనుండి దేవకికి
గారాబుపట్టివై వరదా!
తనరిభక్తుల చాలదయచేసి దుర్జనుల
ధరణిపై గూల్చితివి వరదా!
వసర పదునారువేలును నూట ఎనమండ్రు
వారిజాక్షులగూడి వరదా
అనుదినము అందరికి అన్నిరూపంబులై
యస్ఖలితమై వెలుగు వరదా ॥శర॥

అలరు యాదవకులంబను నడవి
కీఫటమున అవనిపై పాలియించి వరదా!

వలసి ద్వారకపురము వసధిలోముంచితివి
వసర నిర్మోహమున వరదా
ఇల క్రీడ జాలించి యల ఎరుకుశరముచే
తెలిసి గాత్రమువిడచి వరదా
తెలియ బహు కోట్యర్క దివ్య దేహముదాల్చి
తేజరిల్లినవయ్యా వరదా ॥శర॥
కనక పుష్పకముపై కడువేడ్కతోనిలిచి
గమనించగా దివిని వరదా!
మునిబృందమును చుట్టు ముదముతో కీర్తించ
ముక్తిధామముజేరి వరదా!
మనమలర చిద్వ్యోమ మసెడి
సింహాసనాసీనుడై నీ వెపుడు వరదా!
పనిబూని పూదోటపై సిరాకారమై
ప్రబలుదువు నిజభక్తవరదా! ॥శర॥—23

## వర్షాభావమున జేసిన ప్రార్థన

కలియుగములో జనుల క్రమ్ముకొని యజ్ఞాన కలిత
బహు విధములను రామా!
చెలగి ఇందరికిని సంశయములను బుట్టించు
చలనాత్ములనుజేయు రామా!
బలిసినది పాపపుంజముల ప్రతిబింబమై
బలుమృత్యువై తిరుగు రామా!
బలిమైన నీనేత్ర ప్రళయాగ్ని జ్వాలలను
పొలియించు చెనటిని రామా!
ప॥ విన్నకన్న వారిలో అన్నానా మాటవిని
విఫలమొనరించకో రామా!

నిన్ను నమ్మినయట్టి నీ సుతుని వాక్యములు
నిజముగా నిలుపవె రామా ! ॥విన్న॥

కరుణలేనట్టి కలిపురుషుడీ సృష్టిలో
కదసిరాజ్యముసేయ రామా !
వర్షములు పిదపగును వసుధ నదులును నిముకు
వరుస క్షామంబులుకు రామా !
నరమృగ పక్షి పశువులును నభముగని
వసరగ మొఱలిడునె రామా !
పరమ పావనవేగ భక్తవత్సల నీవు
పాలించుజీవులను రామా ! ॥విన్న॥

అన్న మోయనిజనము అవనిపై దుఃఖించి
యాయాసపడగనే రామా !
కన్నతండ్రి వారి దెసజూచి నా మనసు
కరుగుచున్నది ఓ రామా !
విన్నపము జేసెదను వినవయ్య నామనవి
విశ్వతో ముఖుడవు రామా !
కన్నడిగ సేయకను గ్రక్కున ఇల ప్రజల
కాచిరక్షించవె రామా ! ॥విన్న॥

తళుకు తళుకున తీగె మెరపులాకాశమున
దట్టముగనిండి నవి రామా !
ఫెళఫెళ ఉరుములును బెగసి దివిభువి
దిశలు బెట్టున మోదవలె రామా !
ఫెళఫెళను వర్షంబు ముంతె ఓసిన రీతి
వరువడిగ కురువవలె రామా !
గళగళ ధ్వనులచే కలసి నది బృందములు
క్రమముతో పారవలె రామా ! ॥విన్న॥

గురుతుగా భూదేవి సర్వఫలముల నెపుడు
    కొల్లలుగ పండవలె రామా!
సిరులు మీరుచు సఖిల జీవకోటులు మహిని
    చెలగి మెలగవలెను రామా!
దొరసి ఎప్పుడును పూదోటలో ప్రబలెడి
    గురుమూర్తి మ్రొక్కెదను రామా!
పరమ హంసయైన లింగావధూత
    పలుకువిని పాలించితివె రామా! ॥విన్న॥—24

## మేలుకొలుపులు

అష్టపురములందు ఆత్మారాముండవై
    ఆటలాడవలె మేలుకో
దుష్టులను ఖండించి శిష్టులను రక్షించ
    తోయజాక్ష! నీవు మేలుకో
రామా మేలుకో మేలుకో తండ్రి మేలుకో
    మేలుకో నిర్లేప మేలుకో
చెలగి నామదిలోన నిలిచి ప్రకాశించు
    జితయోగి పుంగవ మేలుకో స్వామీ మేలుకో
నేర్పున నాసాగ్రమధ్య కుండలికంట
    నెరమంట లెగసెను మేలుకో
ఒప్పుతోడ నిన్నుపనిషద్ వాక్యములు
    నుచితముగ కీర్తించు మేలుకో
సర్పరాజు రెండువేల జిహ్వాల పొగడు
    సగుణ నిర్గుణరూప మేలుకో
కర్పూర జ్యోతిగతి కడువేడ్కతో ముక్తి
    కన్య గొలువవచ్చె మేలుకో స్వామి మేలుకో

ధర్మవీధి బయట తరచుచుక్కల మధ్య
పేర్మి చంద్రుడు వెలిగె మేలుకో
నిర్మితమగు మేరు శిఖర పీఠమునందు
నిలచి భానుడు ప్రబలె మేలుకో
మర్మము దెలుపుచు మధుర వాక్యములను
మదిని వెలగెడి దేవ మేలుకో
కర్మము ఖండించి కదిసి నెరయోధులు
కలియ వచ్చినారు మేలుకో! స్వామి
విజ్ఞానులై తుంబురు నారదాదులూ
వీణలు మీటెదరు మేలుకో
ప్రజ్ఞ మెరసి ప్రణవ భేరి మ్రోయగబయట
పరమ గురుడ నీవు మేలుకో
సుజ్ఞానులైనట్టి శుకశౌనకాదులు
సొంపుతో మ్రొక్కెదరు మేలుకో ॥మేలు॥
అజ్ఞానరహితుడై యలరి మీపాదముల
అనిలసుతుడే యెత్తె మేలుకో స్వామీ మేలుకో
అరసిభక్తులు నిన్ను అతితుర్యశాంతులై
అర్చించవచ్చిరి మేలుకో
సిరిమించి కపిలాది సిద్ధులు మిమ్మిపుడు
సేవించవచ్చిరి మేలుకో
గురువైన పూదోట గురుడ! యోగనిద్ర
గొబ్బున యిప్పుడు మేలుకో
శరణు జేసెదనీకు సజ్జనుల హృద్దీప
చాలవేడెద మిమ్ము మేలుకో ॥స్వామి॥—25

తెల్లగా దివి తెలుపు దోచెను తేటచుక్కలు తెలివి దప్పెను
కల్లనీ మృగమంతలోగా నాశమగు వినరా!

మెల్ల మెల్లన నంబరంబున మిసిమికాంతులు దోచెనిప్పుడు
నుల్ల మలరగ పక్షిజాతులు నుచితముగ బలుకు

ప॥ జీవా ! మేలుకొనరా !
మేలుకొని నిను నీవు జూడగ మించిచిద్రూపై చెలంగుచు
మేలిమితో సుజ్యోతి బయటను మెలగుచుండెదవు ॥జీ॥

చలువగాలియు విసరసాగెను జారచోరుల కలుకు బుట్టెను
కవితకుండలి చయము వల్మీకములు వెడలుచును
అలరి పడగల నెత్తియాడెను పొలయుకల్వల సొంపు దీరెను
ఇలను మృగముల భయము దీరెను నెలమినిప్పుడును ॥జీ॥

చుక్క బొడిచెను పూర్వముఖమున కుక్కుటంబులు ఘోషచేసెను
చక్కనంబుధిదీసె పంకజ తతులు వికసించన్
గ్రక్కునను నుదయాద్రిమీదను కదిసిభానుడు నిలిచిప్రబలెను
చొక్కమగు సాహస్రదీప్తులు పిక్కటిల్లగను ॥జీ॥

చెన్ను మెరయుచుషట్పదంబులు చెలగి ఘుమ్మున నెగసి తీవ్రత
చెన్నువతో పూదేనెగోలుచు నతిముదంబుననూ
వన్నెమీరుచు హంస కదుపులు వలసికొలనులు జొచ్చివేడుక
నన్నుగావర జలజనాళము పరగ మెసగునురా ! ॥జీ॥

సంగతిగ నిర్బైటనెప్పుడు చూచుచిత్కిరణముల తోడను
పొంగి దివి భువి దిశలు నాముక భూరి తేజమునై
రంగు మీరిన పువ్వు దోటలో రామయోగినిగూడి శుద్ధహా
నింగిరీతిని కదల కెప్పుడు నీవు - వెలుగుదువూ ॥జీ॥—26

నిరవాయమైనట్టి నీ శూన్యజఠరమున నఖిలముంచిన తంత్ర మేలుకో
సరిలేనిసుజ్యోతి చవికెలోవలదనరి శయనించిన ప్రోఢ మేలుకో
తరుచుగను పనిషద్ వాక్యములు మీ కీర్తి తథ్యముగ పొగడును
మేలుకో

సరసముగ మహదాది జగములును నిర్మించి సర్వమాడింతువు
మేలుకో

ప॥ రామ మేలుకో మేలుకోభోగి మేలుకొగురుమూర్తి మేలుకో
ఆలసించక నీదు అమృత చక్షువ్రుదెరచి ఆనందమునయోగి మేలుకో
తెలిసిపుంజుగూసె దివినిచుక్కబొడిచె దిశలతెలివిగదిసె మేలుకో
అలర హేమాద్రిపై సకలంక దీప్తుల నర్కుడు నుదయించె మేలుకో
జలజములు వికసించె చక్రవాకములెగసె శరధులును నుప్పొంగి
మేలుకో
తెలివైనపూదేనె తేటిగుంపులు గ్రోలి దివిక్షుమ్మ్న ఎగసె
మేలుకో
సురలు గంధర్వులు శుకశౌనకాదిముని సుగుణులు మ్రొక్కేరు
మేలుకో
సిరిమించు మీ పదము చెలగి త్రైమూర్తులు సేవింప వచ్చేరు
మేలుకో
పరమసుందరి మీదుపనులునడపనిపుడు భక్తితో వేడెదను మేలుకో
అరుదైన పూదోట అయ్యా నీ సుతులను అమనస్కమునగూర్చ
మేలుకో ॥రామ॥—27

కళలు తుదపడి హేచు గూడగ గగనమున నుదయించెచంద్రుడు
చలనమున చకోరములు నెగసెన్ కలువలును దనరున్
కలికినగుముఖ కాంతినిండెను కనకగిరిపై చుక్క బొడిచెను
చెలగి పురుషుని రాకలకు చేడెలును మేల్కొనిరి

ప॥ గురుపతీ! మేలుకొనవే!
మేలుకొనవే వీరయోగి మేలుకొను నిష్క్రియ నిరంజన
మేలుకొను నా తెలివి మధ్యను మేలుకొనవయ్యా ॥గురు॥
మేటిగూటిలో దివ్యపుంజును మేడపై కో యనుచు కూసెను
తేట తెలివను మృగము మాయను తెలిసి హరియించెన్

మూటివేగమై పాము లేవగ పుట్టపై నెరమంటలెగసెను
మేటిసర్పము నూర్ధ్వముఖమై మెరసియాడగను ॥గురు॥

చలువగాలియు విసరసాగెను జలచరాదులు చొకళించెను
జలజములపై హంసకదుపులు చెలగినటియించు
కలువలును ముకుళించె కాంతియు కదిసి భువనాంతరము నిండెను
తెలిసి చక్రవాక పక్షులు దివికి నెగసెనురా ॥గురు॥

స్వర్ణ రేఖలు దీరె తూర్పున సుందరులు గానములు చేసిరి
ధవళశంఖధ్వనులు దశమ ద్వారమున నిండెన్
జవము తోడుత నాత్మజ్యోతియు చాల త్రైకూటమున మెలగెను
ప్రణవముతో నిర్భయులుకును చిదా భాస్కరుడు ప్రబలెన్ ॥గురు॥

కుసుమ స్వాదుకు నెగసి తుమ్మెద గుంపులును పూదేనె గ్రోలెను
పసిడి ఈకెల చిలుకలును పక్వఫలములకు యెగసెన్
మెసలుచును మరి అష్టగజములు మేసెల తుదగిరికి నురికెను
పొసగ సోగలువిచ్చి నెమళులు పొదలియాడగను ॥గురు॥

కలయకాలం బెరగి విప్రులు కాశిలో స్నానములు చేయుచు
తెలివి భూతియునిండ మెరపుల దివ్యచేలములన్
నిలపిహృత్కమలాంతరంబున నీను దివ్యపదంబు లిప్పుడు
చలన మొందక నాత్మపూజలు సేయవచ్చిరినీ ॥గురు॥

అరసి చిత్కళలంటగూర్చి అనంతముఖముల జ్యోతిబైటను
భరితమగు పూదోట రాముని పదము నంటియుచు
పరమతత్త్వంబగుచు నెప్పుడు బయట లోపలనిండి వెల్గుచు
అరయ నిర్గుణబ్రహ్మమై తుద నమితమైయుండు ॥గురు॥—28

సంజ్ఞతో గురుకృపను వీక్షించినిరైబట సంధ్యచుక్కబొడిచె లేరా
సుజ్ఞానమను చిన్మయ నేత్రముదెరచి అజ్ఞానమణతువులేరా
విజ్ఞాన దీప్తిచే విశ్వజాలములన్ని వెలగజేయగవలె లేరా

ప. రామ లేరా! లేరా నాతండ్రి లేరా
శివయోగి లేరా తారక రామ లేరా
కారుణ్యమున సంతరంగమున
నీ దివ్య కళల ముఖము జూపలేరా ॥రామ॥

తిరిగి యగ్నివాయు దివ్యనాళమునందు
తీవ్రముగ జొచ్చేను లేరా!
మెరువడిగ పద్మపీఠమధ్యను
హంస మెరసినాట్యము ద్రొక్కె లేరా
పరిపూర్ణ కిరణముల నగ్నిమండలముపై
భానుడుదయించేను లేరా
అరయనాతనిమధ్య నజ్ఞారి ప్రబలును
అచట మెలగవలెను లేరా ॥రామ॥

నెరనైన హంసతూలిక తల్పమున
యోగ నిద్ర జాలించగ లేరా!
వరముక్తి కన్య మీ దివ్యపాదపూజ
వసరసేయగవచ్చె లేరా
పరమ భక్తితో పాలాక్షుని సుతుడునీ
పాదపూజకు వచ్చె లేరా
సురలు మునులు రుషులు కైవల్య
ద్వారమున చొచ్చినిలిచినారు లేరా ॥రామ॥

ఘల్లు ఘల్లున నీ పాదముల అందెలు
కడువేడ్కతో మ్రోయ లేరా!
తళుకు చూపులతండ్రి తనర భూషణతతులు
మొలకనవ్వులస్వామి లేరా
పలుకుల నమృత బిందులొలుక నాతో
భాషించవలె నీవు లేరా
అలుకదీర్చి నన్ను ఆలింగనముచేసి
ఆదరింతువు దేవ లేరా ॥రామ॥

పంచకన్యలు నిరుగడల నిలిచి మీ
పనులకు వచ్చిరి లేరా
పొంచి తుంబురు నారదులు వీణలుమీటి
పొంగుచూ పాడేరు లేరా
అంచలంచల భక్తులాత్మ సొమ్ములుమీకు
అందియ్య వచ్చిరి లేరా !
మించి పూదోటలో మెలగు గురుడనీకు
మ్రొక్కెద యిదుగో లేరా ॥రామ॥—29

నెరయు జీవకోట్లను నించి బొజ్జను
యోగనిద్రబోయెడి ప్రోడలేరా
పరిపూర్ణమగు జ్యోతిభవనమున క్రీడించు
పరమ తారకయోగి లేరా
మురిసి దివ్యశృతులు మ్రొక్కినిలిచి నిన్ను
మొనసి కీర్తించేను లేరా
అరయ చిచ్ఛక్తిచే నఖిలమును నిర్మించి
ఆడించ ఇదివేళ లేరా

ప॥ స్వామిలేరా ! లేరా చిద్రూప లేరా
పరమాత్మలేరా సర్వసాక్షిలేరా
ధీరసమున నీదు దివ్యనేత్రము దెరచి
దీనరక్షక నీవు లేరా ॥స్వామి॥
పగలు రేలును మించి పసిడి గిరిపై
చిద్భానుండు నుదయించె లేరా
సగుణమౌ మహదాది జగమున లో వెలి
స్వర్ణదీప్తులునిండె లేరా ॥స్వామి॥
గగనాంత రాబ్ధిపై కదిసివేయు రేకుల
కమలము వికసించె లేరా

తెగి ఏబదికోట్ల తేటికదుపులెగసి
దివ్యసుమమున వ్రాలె లేరా ॥స్వామి॥

పది వర్ణములతోడ ప్రణవభేరీబయట
ప్రళయముగ మ్రోయును లేరా
కదిసి గంధర్వులు కైవల్య ద్వారమున
గానముచేసేరు లేరా ॥స్వామి॥

పొదలి నిర్వాణులు భోరున నీ యంఘ్రులు
పూజింప వచ్చిరి లేరా
కొదువ లెంచక భక్తకోట్లను పూదోట
గురుడ ముక్తులసేయ లేరా ॥స్వామి॥—30

## జో జో గీ త ము లు

బంగారు చేలముల్ చుంగుగాగట్టి
సంగతిగ రత్నభూషణములును బెట్టి
రంగుపాపటబొట్టు రమణులును బెట్టి
అంగనామణులు శ్రీహరితొట్ల పట్టి

ప॥ లాలిలాలంచు నూచెదరు మేలుచే గురునీ
బాలలిరుగడ నిలిచి పాటపాడుచును ॥లా॥

పరమ దివ్యపుతొట్ల భావముననుంచి
విరివితాళ్లుగ చతుర్వేదములు బెంచీ
సిరులు మించిన పాన్పు చెలులు మోదించి
పరమ కన్యలు వేడ్క బ్రహ్మాంబునుంచీ ॥లా॥

దట్టమగు కైవల్య పట్టణము నిండా
చుట్టు బహు జ్యోతులును శోభిల్లుచుండ
పట్టపగలుగ కళలు బలసి దివినిండ
అష్టనాదము వింట అష్టాత్ములుండ ॥లా॥

సకల సురనికరములు సన్నుతింపగను
శుకశౌనకాదులును చూచిపొగడగను
ప్రకటముగ ముగ్గురును ప్రబలి కొలువగను
అకళంకమగు శృతులు అలరి మ్రొక్కగను ॥లా॥
నిదురబో నిగమాంత నిజయోగి పుంగవా!
నిదురబో సర్వాంగ నిజనిర్మలాంగా!
నిదురబో అవధూత హృదయాబ్జభృంగా!
నిదురబో పూదోట నిజరామలింగా ॥లా॥—31

బుసబుసను నూర్పులిడి భుజగి లేవగను
బిసరుహంబున కెగయ బెగడె జగములును
సుషిరమధ్యను హంస చొచ్చిచూడగను
పసిడిచూపుల హృదయ పద్మాంతమునను

ప॥ జో, జో, జో ముక్తిసతిలోల జో సుగుణపాల
జో జో చిదానంద జో రామచంద్రా ॥జో॥

నిజస్థానమున నీవు నిలిచి నటియించ
విజయమని శృతులు నిను వెలయ కీర్తించ
అజహరీ రుద్రులును అరసి సేవింప
భజనచే ముక్తిపాపడు సొంపుమించ ॥జో॥

పలుకుల సుధారసము ప్రభవించగాను
మొలకనగవుల దివ్యముఖము వెలుగగను
జలజాక్ష నీవు తుద చెలగి వేడుకనూ
పలసె యమృతాబ్ధిలో నోలలాడగను ॥జో॥

పొంకమగు కైవల్య పురములోపలను
శంక లేకను ముక్తిసతులు గొలువగను
జంకు లేకను విరుల సెజ్జపై తగను
పంకజాక్షిణులూచి పాట బాడగను ॥జో॥

సర్వమును బొజ్జలో సరగ నుంచెదవు
నిర్వికారుడవగుచు నిలిచి ప్రబలెదవు
పర్వడిగ పూదోట బ్రహ్మాంబ నీవు
గర్వులకు దూరమై కడు వెలుంగుదువు ॥జో॥—32

అకుదుగా వైకుంఠ పురము లోపలనూ
సరిలేని ముత్యాలచవికెలో తగనూ
దొరసియున్న, హంసతూలికాతల్పమున
పరమాత్ముడగు రామప్రభుడునీ వేళ

ప॥ శయనించుచున్నాడే! వెన్నెల బయట గుకుడు
శయనించుచున్నాడే! రామస్వామి శయనించుచున్నాడే ॥శయ॥

మఘువ జంటజ్యోతి మండుచుండగను
నిగనిగను దివ్యకళ దివి నిండగాను
భగవంతుడని శృతులు భజనసేయగాను
వగలమారి కుంచె వనిత వేయగనూ ॥శయ॥

తిరుమణియునుగొనల దీప్తించగాను
మేర లేని యాభరణములు ప్రబలగాను
మెరుగు పచ్చని వలువ మేనమెరయగను
నురమున శాళిదేవి యొప్పుచుండగను ॥శయ॥

మలయ మారుతము కమ్మగ విసరగాను
చెలగి పంచవర్ణ శుకములు పలుకగను
సొంసిపదములు వాయు సుతుడు బట్టగను
తళుకుమోమున చల్వతళుకు చూపుల తండ్రి ॥శయ॥

సరసనారదాదు లొరసి పాడగను
మెరసి దివ్యకన్య మించి యాడగను

సురలు మునులు రుషులు చూచిచొక్కగను
పరికించి పూదోట ప్రభువు పన్నగముపై ॥జయ॥—33

పుండరీకాక్షునకు భువనాంతరంగునకు
చండ దానవమత్త ఖండితునకూ
కుండలీ శయనునకు ఘోషస్వరూపునకు
నిండి వెలుగుచునున్న నిర్గుణునకూ

ప. జయమంగళం శుభోదయ మంగళం ॥జయ॥
మంగళము భక్తజన మందిరనివాసునకు
మంగళము సుజ్ఞాన మహితునకును
మంగళము శతకోటి మార్తాండ తేజునకు

మంగళము కేవల నిరాంగునకును ॥జయ॥
సంగీతలోలునకు సర్వసాత్త్వికునకు
పొంగి వెలిగెడి దివ్యపుంగవునకు
అంగనాస్తోత్రునకు సమిత గుణశీలునకు
రంగైన నిగమాంత రంగునకును ॥జయ॥

ఓం కారపురుషునకు నుదధి సంచారునకు
శంక లేకను వెల్గు సన్మౌనికీ
శంకరస్వరూపునకు సర్వ పరిపూర్ణునకు
పొంకమగు చిద్వ్యోమ పురుషునకును ॥జయ॥

పంచ భూతాత్మునకు పరిపూర్ణ చంద్రునకు
పంచముఖునకు జగద్భరితునకును
పంచాగ్ని నేత్రునకు పరమ దయాళునకు
పంచాంగమైన సత్ప్రభువునకునూ ॥జయ॥

అక్షరాతీతునకు నమృతస్వరూపునకు
లక్షణంబగు జ్యోతి లక్షణునకూ

అక్షరాతీతునకు నతిసూక్ష్మరూపునకు
రక్షించు పూదోట రామునకును ||జయ|| — 34

గాలినయనాగ్రమున ఘనముగా విసరగను
మేలుకొని భుజగితామింటి కెగయన్
చాలచిత్కిరణములు చంద్రగిరిపై తనర
నీలతోయదమధ్య నిర్గుణునకు

ప॥ జయ మంగళం శుభోదయ మంగళం ||జ||

మంగళము సుజనహృన్మందిర నివేశునకు
మంగళము కేవల నిరాంగునకును
మంగళాస్పదమైన మహనీయ చరితునకు
మంగళము ప్రణవాంత రంగునకును ||జ||

భరత సాహస్రార పద్మాంతరంగమున
గరిమె శతకోట్యర్క ప్రభలతోనిండి
సిరిమించు సుజ్యోతి సింహాసనముపైని
పరిపూర్ణమైనట్టి పరబ్రహ్మమునకు ||జ||

తనరుచును రాజదంత ద్వారమున జొచ్చి
వనజాక్షులును చాల వన్నెమెరసి
అనుదినము కర్పూర హారతుల నిచ్చెదరు
వనిబూని నిర్గుణ బ్రహ్మమునకు ||జ||

సురలు పూజింప శశి సూర్య జ్యోతులు వెలుగ
పరువడి త్రిమూర్తులును పనులు సేయ
అరుదుగా సురటీలు అంగనలు వీవగను
నిరుపమంబైనట్టి నిజగురునకూ ||జ||

చెకితమగు వేదాంత చేడె చెంతను మెలగ
సకలమునిని కరమ్మును సన్నుతింప

అకళంకుడై యపుడు ఆనందమయముచే
ప్రకటమగు పూదోట బ్రహ్మమునకు ||జ||—35

గంగయమునలుమించు గగనాంతరంగమున
శృంగారముగ గురుని అంగమునను
పొంగిమెరయుచు దివ్య భూషణంబులువెల్గ
రంగైన పూదోట రామునకును

ప॥ జయమంగళం శుభోదయ మంగళం ||జ||

మంగళము హృత్కమల మందెపుడు తావెల్గు
మంగళము దివ్య సన్మందిరునకూ
మంగళము చిద్వ్యోమ మహిమాస్వరూపునకు
మంగళము పూదోట మహితునకునూ ||జ||

పట్టైన కైవల్య పట్టణంబున నిల్చి
చుట్టి స్వయంజ్యోతి సొంపుమెరయన్
బట్టబయటను వెలుగు పరమ సుందరి మించి
దిట్టడై మెరయు సద్ గురుదేవులకనూ ||జ||

శృంగార వతులెల్ల బంగారు నేడలను
సంగతిగ నిల్చి సేసలు చల్లగా
అంగనలు ముత్యాల హారతుల నిచ్చెదరు
మంగళాస్పదుడైన మహితునకును ||జ||

తొలుత తుంబురు నారదులు వీణలు మీటగ
కలితహా గంధర్వ గానము లలరగ
పొలుపు మీరగ వేదములును కీర్తింపగా
చెలగుచును వెలగు శ్రీ గురు శేఖరునకు ||జ||

మసలుచును రంభాది మగువలును నటియింప
కుసుమగంధులు చాల కూడివెలుగన్

అసమానుడై వెలగి ఆనందమయుడునై
పొసగు పూదోట చిరభోగికిపుడూ ॥జ॥—36

సతులు బంగారంపు సరిగ చీరలుగట్టి
ప్రతిలేని సొమ్ములును ప్రబలగాను
అతివలును కర్పూరహారతులు నిచ్చెదరు
సతతమును అవధూత చంద్రునకునూ

ప. జయమంగళం శుభోదయ మంగళం ॥జయ॥

మంగళం గోల్లాస మందిర నివాసునకు
మంగళము దివ్యాంతరంగునకునూ
మంగళము కేవల సమహితానందునకు
మంగళం బవధూత లింగమునకూ ॥జయ॥

నడివీధిలో జొచ్చి నయనాగ్రమున జూడ
పుడమిపై చిత్కళలు పొంగి వెలుగన్
ఉడురాజ రవి యగ్నిహోత్ర చక్రముల తుద
చెడని పదమైయుండు శాశ్వతునకున్ ॥జయ॥

త్రివిధ వర్ణములంటి త్రివిదాక్షరము లమర
త్రివిధ శక్తులు మహాదేవు గొలువన్
త్రివిధనేత్రములకడ దినకరునిగతి ప్రబలు
త్రివిధమూర్తుల కవలి ధీరునకును ॥జయ॥

పంచవర్ణములకడ పంచబీజములమర
పంచబ్రహ్మలుగురుని పనులు సేయ
పంచవర్ణములపై ప్రణవస్వరూపమై
పంచముఖుడైనట్టి పరమాత్మకూ ॥జయ॥

అష్టాక్షరములవల నష్టమాత్రలు మెరయ
అష్ట దిక్పాలకుల్లు అంటి వెలుగ

అష్టదళ పీఠమున నమృతస్వరూపమై
స్రష్టాదినుతుడగు నిరంజనునకూ ॥జయ॥

విజయమని శృతులునిను వినుతించి యిరుగడల
సుజనులును వీక్షించి సొంపలరగా !
అజపద ప్రైతుదను నాను కొని సర్వమును
విజయుడై వెలుగు శ్రీ విశ్వపతికి ॥జయ॥

గురుతు సాహస్రదళ కమల మధ్యమున
పరిపూర్ణమగు జ్యోతి ప్రబల తుడనూ
అసమైన పూదోట కవల స్వక్రియుడగుచు
సిరిమించు శివలింగ వరున కిపుడూ ॥జయ॥—37



## రెండవ దళము

# పరబ్రహ్మము




పరికించ నాయందు పరమ పురుషుడు వెడలి
సరిలేని విజ్ఞాన సతిని గూడిననూ
పరమ సుందరియందు వరుసతో నుదయమై
అరయ పిండాండ బ్రహ్మాండములు ప్రబలున్

ప॥ నెరయ యన్నిటిపై మించినే నిరామయుడనై
తెరలకుండును భక్త తతులార వినుడీ! ॥నెరయ॥

చలనమొందని యట్టి చిన్మయుని ముఖదీప్తి
వలన జననమునొంది చలన జీవుడును
అలరి సచరాచరము లన్నిటిలో జొచ్చి
కలసి తెరిపియు లేక నిలిచి దీపించు ॥నెరయ॥

నిండికదలక నెపుడు నిజ యమృతరాశినై
యొండెరుంగక యేను యుందు నిర్భీతిన్
అండగాని పూదోట కవల నిర్భయులునై
ఖండము నఖండమై కడవెలుంగుననూ ॥నెరయ॥—1

వరనిరాలంబమై మరిప్రత్యగాత్మాఖ్య
మెరసి సర్వము నేను వరుస నిర్మించి
సొరిది యన్నిటిలోను జొచ్చి ప్రకాశించి
నెరయ యేమియుగాక నిర్లక్ష్యమగుచు

ప॥ అలనిర్గుణ బ్రహ్మమగుచునే సత్యమని
పలికితి నహంకార భావమిదిగాదు ॥అల॥

అలరు భక్తులస్వాంతమనెడి జలరాసికడ
మలినమునులేని చిన్మయహంసనగుచు
నిలిచి సత్కళలతో నిర్వాత దీపగతి
తెలియ వెలిలోనిండి తేజరిల్లుదును ॥అల॥

గణుతింపరానట్టి కైవల్య పట్టణం
బునకు నేరాజునై మొనసి ప్రబలుచును
వనర పూదోట కవ్వల నిరాటంకమై
తనరిసహ జానంద వసథినై యుందు ॥అల॥—2

## అనంత విశ్వమూర్తి

సృష్టి త్రైవర్ణములు చెలగినిర్మించియును
షష్ట స్థలములందు షడ్బ్రహ్మలగుచున్
అష్టతనువుల జీవహంసయై క్రీడించి
నిష్టతో నిర్బైట నిలిచి వెలుగుదువె

ప॥ అఖిల తత్త్వములపై నమృతస్వరూపమై
నిఖిలాత్మ వెలిలోను నిండి ప్రబలుదువె ॥అఖిల॥

జిహ్వాంఘ్రులును గాత్ర బహుపాణిముఖములును
బహువదన జిహ్వలును బహు ఘ్రాణవీనుల్
బహు శిరో నేత్రములు బహునామ వర్ణములు
బహు చిత్రితములై ప్రబలుదువె తండ్రీ ॥అఖిల॥

హరిహర బ్రహ్మలకు నవల గుణశూన్యమున
పరిపూర్ణ హేమమయ పద్మాంతరమునన్
మెరయ నద్భుత జ్యోతి మించి పరమాత్మపై
సరిలేని పూదోట స్వామి వెలుగుదువె ॥అఖిల॥—3

సృష్టిలోపలజొచ్చి జీవస్వరూపమై చెలగుచుండెడిసుద్ది జెప్పెదునో
దృష్టిలోపల నిలిచి దివిభువినడుమను తేజరిల్లెడు సుద్ది జెప్పెదునో
అష్టదళ పీఠమున అమృతస్వరూపమై ఆటలాడెడిసుద్ది జెప్పెదునో!
నిష్ఠతో జలమధ్య నిశ్చలానందమున నిలిచి మెలిగెడి సుద్ది
జెప్పెదునో !

ప॥ గురుడా ! హే గురుడ నాకేమి లంచమిచ్చెదవు నీ
గుట్టుమాటలన్ని జెప్పెదునో !
పరికించి నీభక్తకోటికెల్లను నీపరమగోప్యమెల్ల జెప్పెదునో! ।గురు।

నిలిచి నామదిలోను నిర్వాతదీపమై నిండివెలిగెడిసుద్ది జెప్పెదునో!
నళిననేత్రానీవు నాల్గు వీధులలోన నాట్యమాడెడిసుద్ది జెప్పెదునో !
తెలిసి సుజ్ఞానుల దివ్యాంతరంగమున దీపించు నీసుద్ది జెప్పెదునో !
బలిసిచిత్కళలపైపరమహంసైనీవుప్రజ్వరిల్లెడిసుద్దిజెప్పెదునో! ॥గురు॥

సరసుడవై నీవు చారుమాణిక్యపు చవికెనున్నసుద్ది జెప్పెదునో !
సిరిమించుసుజ్యోతి సింహాసనముపైన జితయోగి నీసుద్ది జెప్పెదునో!
పరమ తారకమై పరులుగానకుండ బయటయుండినసుద్దిజెప్పెదునో!
గురుతైన పూదోట గురుడ నీపదమునే కూడియుండిన
సుద్ది జెప్పెదునో ! ॥గురు॥—4

## ఈశ్వరుని ఘనత

అరయ చిన్మయుడాది యఖిలజీవులు నష్టమైపోయినపుడు నీవు
నిరుపమానందమున నిలిచి యఖండమై నిర్లక్ష్యమగు వేళను
నిరవలంబమైన నీ శూన్య జఠరమున నేను జననమొందుచూ
మెరసి యద్వితీయ పరమ తారకమునై మించిప్రకాశింతునే

ప॥ తల్లి దండ్రివి గురువు దాతదైవము నీవు తలపోసి చూచినను
కల్లగాదు మీ ఘనత సత్పదమాన కరుణించు మీభృత్యుని॥తల్లి॥

బలిమీగ మీకు నే ప్రథమ పుత్రుడనునై బలుయోగవిద్యచేత
నలరారు పిండబ్రహ్మాండములు నిర్మించి యన్నిటిలోవలను
మెలకువతో జొచ్చి చెలగి పూర్ణాత్మనై మెలగి లీలావిభూతిని
వలసిక్రీడింపుచు వరయోగి మీకృపనుకలసి కలయకనుందు నే॥తల్లి॥

సర్వరూపకుడనై సర్వవ్యాపకుడనై సర్వమునకు దూరమై
సర్వము నావ్యోమ జఠరములోనుంచి స్వచ్ఛమై వెలుగొందుచు
సర్వశూన్యమగుచు సగుణ నిర్గుణుడనై చారు పూదోటపైని
సర్వసాక్షినైన సద్గురుడ మీనిజస్వస్వరూపమైయుందు నే॥తల్లి॥—5

అఖిల రూపకుడునై యఖిలాంతరాత్ముడై
యఖిలమున కతిదూరమై సద్గురుండు
నఖిలగర్భుండునై యఖిల బీజంబునై
యఖిలసాక్షిగ నతడు నమృతుడై యెపుడు

ప॥ బ్రహ్మంబు సర్వమై ప్రబ్బికొని ప్రబలగను
బ్రహ్మంబు నేననెడి పలుకెచటనుండు ॥బ్రహ్మ॥
వేదనికరంబునై వేదాంత సారమై
వేదమయుడై చాల వేదస్తోత్రుడునై
వేదముల బీజమై వేదాంత వేద్యుడై
వేదజనకుండునై వెలుగు విసరయ్యా ॥బ్రహ్మ॥
క్షరము సక్షరమునై సంపూర్ణ తేజమై
నిరవయ నిరాకార నిర్లక్ష్య నుగుచు
నెరనిరక్షరమునై నిలిచి పూదోట కడ
నిరతిశయ నిర్గుణము నిరవలంబమునై ॥బ్రహ్మ॥—6

పొసగ చీరలు వేరు పోలించ నూల్యొకటె
వసుధ జాతులవేరు వసర తనువొకటె

పసుల వన్నెలు వేరు భావించ పాలొకటె
పసిడి సొమ్ములు వేరు బంగార మొకటె
ప. సర్వరూపులు వేరు సచ్చిదాత్మునికిటుద
నిర్వికారుండొకడె నిస్సంగుఁడారా ! ॥సర్వ॥
ధరనదులు వేర్వేరు స్నానంబునొకటె
తరచు క్షేత్రము వేరు దానంబునొకటె
అరయ సుమములు వేరు అర్చనంబొక్కటే
నెరమంత్రములు వేరు నిజప్రణవమొకటె ॥సర్వ॥
వేషములు వేర్వేరు విమల పురుషుండొకడె
భాషలును వేర్వేరు పరతత్త్వమొకటె
దోషరహితుడును పూదోట స్వాములు నొకడె
భూషణమునై ప్రబలు భువిశరణులకును ॥సర్వ॥—7

ఇష్ట మెరిగించెద నిదిగో సజ్జనులార
సృష్టిపై సద్గురుని శ్రీ పాదములనూ
అష్టసుమముల ప్రీతి నర్చించ మీభక్తి
నిష్టకతడును మెచ్చి నిజమోక్ష మొసగు
ప॥ అట్టి దేవుని నిరతమతి తుర్య శాంతులై
గట్టిగా ధ్యానించి కడతేరరయ్యా ! ॥అట్టి॥
పరమయోగము కీలు గురు తెరిగి కుండలిని
నెరయూర్ధ్వ ముఖసేసి నిర్ద్వంద్వులగుచు
గరిమెతో నాధారకమలంబు నాదిగా
వరుస నవచక్రంబు లరసి మీరుచును ॥అట్టి॥
పగలు రేలుఁనుమించి ప్రళయాగ్నిలో జొచ్చి
సగుణ మోక్షములుఁ మరియు సరకు సేయఁకను
నిగమాంతరంగమున నిలిచి వెలుగుచు నెపుడు
వగలు మీరిన ముక్తి వనజాక్షి కడను ॥అట్టి॥

వినుడి నా వాక్యంబు విమలాత్ములై చాల
వనజభవ విష్ణు వరమునీంద్రులును
గణుతింప యోగమార్గములచే వెదకి తుద
కనుగొనగ లేరతని ఘనస్వస్వరూపం ||అట్టి||

అతడు చిద్వ్యోమమున కవల నిర్భయులునై
యతడె నిర్గుణ బ్రహ్మ మతడె నిష్క్రియుడూ
అతడు పూదోట తుద నానంద మయుడునై
సతతమును విజ్ఞాన జనుల మదివెలుగు ||అట్టి||—8

అదిగో వేదాంతమున నమృతపదమైయుండు
అదె యజుడు అదె విష్ణు వదె రుద్రుడగును
అదియింద్రు డక్షరం బదె విద్యయైతనరు
అదెస్వరాట్టను నామ మలరి వెలుగొందు

ప॥ అది చూచి కలయుతా నానందమయుడగును
అది య తానై ప్రబలు నఖిలసాక్షియగును ॥అది॥

ఆదిత్యాగ్నులును మీరి యాకాశముద్రలో
నది ప్రణవ లింగమైయది గోచరించు
అదిలోను వెలినిండి యాముకొని సర్వమును
అదియు నంతర్జ్యోతి కవలశోభిల్లు ।అది॥

అది శిరమునకు ద్వాదశాంగుళముపైనుండు
అదినాద బిందుకళ లాక్రమించుచును
అదినిరాలంబమై యలరిపూదోటకడ
అది నిర్గుణ బ్రహ్మమై ప్రకాశించు ॥అది॥—9

పుండరీకము మధ్యనే గురుడు
నిలిచి పొంగి వెలుగూ చుండునే !
నిండుముఖము జూపునే గురుడు
నిలిచి నీటిమధ్య మెరయునే !

పండువెన్నెల బయట పరిపూర్ణకళలపై
నిండి ప్రబలుచు నుండునే! ఓ సఖియ

ప॥ సఖియలారా చూడరే!
సర్వాత్ముడగు రాముని
ఒకట రెంటామాట ఓంకార గురుమూర్తి
యొద్దక్రీడింతామంటె నోసఖియ ॥సఖి॥

ఏపుమీరీ మెలగునే గురుడునిలచి ఏకాక్షరుడైయుండునే
చూపులవలపించునే సర్వ శూన్యమున నటియించునే
చూపులలోగూర్చి చొక్క భక్తకోట్లు
చూపులోసుఖ మంటరే ఓసఖియ ॥సఖి॥

పొదరింట నటియించునే గురుడుమించి బొడ్డుచవికెలో మెరయునే
కలసిబంతులు మీటునేగురుడు కనకసౌధముపై మెలగునే
కుదురైన యా యమృత కొండమీద నెపుడు
గురుడు ప్రకాశించునే ఓ సఖియ ॥సఖి॥

ఆగమాంతరమునే యెప్పు డచలాత్ముడై వర్తించునే
యోగకన్యలు జూడగాగురుడు వారికడనే మెలగుచుండునే
బాగుగ నపవర్గపదతి నధిగమించి
బట్టబయలై తనరునే సఖియా ॥సఖి॥

గట్టిగ వర్తించునే గురుడుమదిని గుట్టుతో వెలుగొందునే
పట్టనేర్చిన జిక్కనేవారి పట్టుకొమ్మైయుండునే
అంటె పూదోటపై నద్వితీయునిగూడి
యమృత పదమై యుండునే ఓ సఖియ ॥సఖి॥—10

విరిపైన బ్రహ్మాండపటము నడివీధి నావేసించునే
అరుదుగా జంట జ్యోతులు దివినంటి మండునే
గరిగొని ఓంకారపెట్టె కప్పు దీయునే
ఉరుపడిలో తెరన బొమ్మలుంచ నేర్చునే!

ప॥ సొలసిః కనుబొమ్మలాట చూతమురారే మనము-చూతమురారే
పొలతీ పూదోట రాముడు నేర్పిన నాడించునే ॥సొ॥

నిజమాయచే ముల్లోకములు మెరయజేయునే
అజహరి రుద్రుల జగతి కధిపుల జేయునే
భుజియించ పుణ్యపాపములు పొసగ జేయునే
భుజబలముతో విశ్వము తనచూపుల నాడించునే ॥సొ॥

చుట్టు ముక్తివరుల నాటచూచి మెత్తురే
గట్టిగ మృదంగమెపుడు కదసిమ్రోదునే
పట్టుగ సామగానము ప్రణవమెసరగ జేయునే
నట్టనడుమ దివ్యసుందరి నాట్యమాడునే ॥సొ॥

పసిడి వసంతము బొమ్మలపైని జిమ్మునే
కుసుమ పువ్వులు సభపైతా కుప్పళించునే
మిసిమైన బ్రహ్మాగ్ని సద్యోరసము జల్లునే
పొసగ సుజ్యోతిపైని నిలిచిపొంగి వెలుగునే ॥సొ॥

ఆటచాలించి బొమ్మల సతితుర్యమనెడి
నీటైన పెట్టెలోపల నించనేర్చునే
పాటించ పూదోట గురుడు బయట ప్రబలునే
చాటించి చెప్పెదను సర్వసాక్షియై యుండునే ॥సొ॥—11

ఒంటి స్వరమున నూదగ సర్పము
మింట మోదుచును కంటి జ్యోతులొక
యింటను చిత్కళ లంటి వెల్గగను
జంటగిపుల తుద జలజ పీఠమున

ప॥ తాండవ మాడేనే! రాముడు తాండవమాడేనే!
తాండవమాడిన ధర్మాత్ముడు పై కొండమీద
క్షోక్షోయని కేకుచు ॥తాం॥

ఒకల భూతియును జడలు వీవగా
పొడవగు దుప్పటి పువ్వులపేరులు
ఉడురాజార్కులు నొప్పగ వెలుగగ
నిడుపు నేత్రముల నెలతను గూడుక ||తాం||

మెట్లకిన్నెరకు మెట్లును తొమ్మిది
గట్టిగ తంత్రులు కదసి మీటుచును
పట్టున దశవిధ పదముల బాడుచు
దిట్టడగుచు జగతిని దిరుగాడుచు ||తాం||

ఎక్కడ జూచిన నేక రూపమై
చక్కగ వెలిలో మిక్కిలి ప్రబలుచు
మక్కువ సద్గురు దక్కడ జోగై
గ్రక్కున చిద్వ్యోమమునను మెలగుచు ||తాం||

గుట్టుతోను నిర్గుణబ్రహ్మంబును
పట్టగు పూదోటను పరమాత్ముడు ||తాం||—12

రామాయణం

పరవాసుదేవ! యిలభక్తులును ప్రార్థించ
మెరసి కౌసల్యకును రామా
వర ముద్దు పట్టివై వెదేహి పెండ్లాడి
వచ్చి యయోధ్యకును రామా
కరుణయించుకలేని కైకపనుపున నీవు
కారడవిలో జొచ్చి రామా
తరిమి యచ్చట నున్న దైత్యులను ఖండించి
దాసులను గాచితివి రామా

ప॥ నీ మహిమ వర్ణించ నేనెంతవాడను
నిగమాంతవేద్య శ్రీరామా

నామనవి చేకొనుము నామనో వల్లభా!
 నను దయ జూడుమో రామా ||నీమహి||

అవనిసుత నెడబాసి అలపులుగు రక్షించి
 అనిలసుతు కరుణించి రామా
సవిశేషమున జలజసఖు సూనుచే పట్టి
 సమయించి యింద్రసుతు రామా
కవగూడి కిష్కింద కపిరాజ్యపట్టమును
 గట్టి యినసుతునికిని రామా
వివరించి జానకిని వేశ్యతో గిరిచరుల
 వేగమే గూర్చితివి రామా ||నీమహి||

వనధి బంధన జేసి నైరులను ధరగూల్చి
 వసర లంకాపురము రామా
మొనసి దశకంఠు తమ్మునికి పట్టముగట్టి
 వనజాక్షితో గూడి రామా
తనరి సాకేతపురమును జొచ్చి ఇరుగడల
 తమ్ములును సేవించ రామా
పనిబూని నాపురంబును పట్టమునుగట్టి
 భక్తకోటులు గొలువ రామా ||నీమహి||

కొరత లేకను పదునొకండు వేలేండ్లు
 పరిపాలనముజేసి రామా
కరుణతో పుత్రులకు ఘనరాజ్య మొసగితుద
 కైవల్యమునకు చనరామా
పురజనులు నడవగను పొసగ తమ్ములుగొలువ
 భూమి సుత గమనించ రామా
వరద, సరయూనది జొచ్చి వనజాక్షునదిమించి
 పరమ పావనమూర్తి రామా ||నీమ||

11

వలసి నరమృగపక్షి వసుద తరువులకు
నిజవైకుంఠ మొసగుచును రామా
చెలగి సనకాదిముని శేఖరులు నుతియించ
జేసె యపవర్గమును రామా
తలపోయగా నచట తారకబ్రహ్మమై
తగిలి భక్తులమదిని రామా
నిలిచి నిర్గుణుడవై నీ వాత్మజ్యోతిగతి
వెలుగుదువు పూదోట రామా ॥నీమహి॥—13

తల్లి తనసుతునిపై దయగలిగి యున్నట్లు
ఇల్లువెళ్ళనిసతి అధీశుగనినట్లున్
తల్లి వెంటనులేగ తవిలి తిరిగినయట్లు
గొల్లడావులగనుంగొను విధంబునను
ప॥ చెలగి తనమదిలోను చరియింపుచునుగురుడు
తలచి నావెనువెంట తథ్యముగ దిరుగు ॥చెల॥
దారకొన్న త్రోవలో దొంగ గాచినయట్లు
మెరసి మిత్రుడు మింట మరికాచినట్లున్
పరికించ దొరను ఇల భటుడు గాచినయట్లు
గురుపదంబెపుడు భక్తుడు గాచినట్లున్ ॥చెల॥
ఉన్నతంబగు పులియు నూడగాచిన యట్లు
కన్నులును సర్వంబు గాంచుచున్నట్లున్
పన్నగా జనులవెంబడి చంద్రుడురుకుగతి
నన్నియును పూదోట సభవుండుగాచున్ ॥చెల॥—14

## రా మా య ణ ము

పరమ పథమునునుండి పర తెంచి కౌసల్య
పట్టివై జన్మించి రామా!
అరుదుగా దశరథుని వరముద్దు సుతుడవై
అయోధ్యలో బెరిగి రామా!

మెరసి ముని వెనువెంట గురుని పనుపున నీవు
మెట్టి సంతోషమున రామా!
సిరుబాలుక కౌశికునిచేత విలువిద్యయును
శీఘ్రముగ నేర్చితివె రామా!

ప॥ పరమ చిత్పురుష మిహ బహుసద్గుణంబులును
భావింప నాకలవె రామా!
పరమ తారకమగుచు పరిపూర్ణజ్యోతిపై
ప్రజ్వరిల్లుదువె యోరామా ॥పర॥

ఋషియ లోపలనీవు కౌశికుని యజ్ఞంబు
కాచిరక్షించి యో రామా
పడియున్న రాతినొక పడతిగా గావించి
భార్గవుని విలుద్రుంచి రామా ॥పర॥

విఘువకను జనకసుత పెండ్లాడి జెలగుచును
విజయమును బొందియో రామా
వెడలి బ్రాహ్మణగర్వ మడచి యయోధ్యలో
వెలగుచును నిలిచియో రామా ॥పర॥

పరమ ముత్సాహమగు పట్టాభిషేకమున
పడతి సెలవున నీవు రామా
స్థిరముగా తండ్రి వాక్సిద్ధి శిరముననుంచి
చెలగి తమ్ముడు గొలువ రామా
శ్రీదేవితో నీవు చిత్రకూటము జేరి
చరియించి కొన్నాళ్ళు రామా
భరతునికి పాదుకలు పాలించి పంచవటి
భాగమున చరియించి రామా ॥పర॥
ప్రకటమగు నసురచే పడతిగోల్పడి నీవు
పక్షి సంరక్షించి రామా

అకలంక శబరికిని అమితమోక్ష మొసంగి
హనుమంతు మనవిపై రామా
ఒక శరంబున వాలి వధియించి సుగ్రీవు
కొసరపట్టముగట్టె రామా
సకలాత్మ సీతపోలిక దెలిసి సేసతో
జలరాసి దాటుచును రామా ॥పర॥

తల్లడించగ భూమి దశకంఠు మొదలైన
దానవుల ఖండించి రామా
ఎల్లవారెరుగ లంకలో విభీషణుని
ఏలించితివి తండ్రి రామా
చెలగి శ్రీసతితోడ స్యందనముపై నెక్కి
పాలించ భక్తులను రామా
ఝల్లునను సురలు పుష్పములు వర్షించగా
చనుదెంచి తీవ్రమున రామా ॥పర॥

రవి చంద్రులను మీరి రాజవీధిని జొచ్చి
లలితమై యెప్పుడును రామా
దివియు భువియు మధ్య తేజరిల్లు
నయోధ్యలో దివ్యప్రకాశమై రామా
దివిజు లెన్నగ దివ్య తేజోపురముగడచి
దిగ్విజయ మొందితివో రామా
నవరత్న ఖచిత స్వర్ణ జ్యోతి పీఠమున
నయముతో ప్రబలుదువె రామా ॥పర॥

అరయ ప్రణవంబనెడి అకళంకమగు భేరి
యమితముగ మ్రోయగను రామా
పరమసుందరి నీదు పదములర్చించగను
భాసిల్లుచుందువే రామా

నిరుపమానందమున నిలిచి పూదోటకడ
నిజగురుడ నినుగలసి రామా
పరమ పావనమైన బ్రహ్మస్వరూపమై
బయట వెలగుచునుండు రామా ||పర|| —15

అరసిదాసుల కొరకు నవనికిని వేంచేసి
అజ్ఞానులను దునిమి రామా
నెరనిరంజనుడవై నిలిచి కైవల్యమున
నిరతమును వెలుగుదువు రామా ||అరసి||
మునుల శాపముచేత మొదటి తనువునువిడిచి
చనుదెంచి ఇలపైని రామా
కనుగొన నిశాచరుల గర్భమున నుదయించి
దశకంఠుడనుపేర రామా
మొనసి ముల్లోకములకును కంటకుడునగుచు
కినిసి కామాంధుడై రామా
వనర దేవాంగనల వరుసతో చెరబట్టి
వారలను బాధించ రామా ||అర||
సురల మొరలాలించి సొంపుతోడుత నీవు
మెరసి త్రేతను వచ్చి రామా
ధరణిభారము నుడుప దశరథుని పట్టివై
తపసి జన్మము గాచి రామా
హరుని విల్లునువిరచి అవనిజను పెండ్లాడి
యమరగణములు మెచ్చ రామా
పరశు రాముని భంగపరచి సాకేతపురి
పట్టమును గట్టు నెడ రామా ||అర||
జనకుపనుపున నీవు జానకి సహితుడవై
సౌమిత్రిగొల్వగను రామా

మునివేషమున నరణ్యమునుండి పాదుకలు
తనర భరతున కొసగిరామా
మనుజభక్షకు ద్రుంచి మరిపంచవటి
తీరమునకు ప్రవేశించి రామా
దనుజవిభు చెల్లెలిని తరిగి ముక్కును చెవులు
తరచు దైత్యుల గెడపిరామా ॥అర॥

సతిని కోల్పోయి మృగహాతము జేయుచు
పక్షికటు మోక్ష మొసగుచును రామా
అతిభీకరుండైన అలకబంధుని గూల్చి
యవలశబరినిగాంచి రామా
అతివకును మోక్షంబు నటనిచ్చి యటుమీద
హనుమంతు మనవి విని రామా
అతిముదముతో నర్కసుతుని చేపట్టి
శతక్రతుపుత్రు వధియించి రామా ॥అర॥

కరుణతో తార దుఃఖమునుడిపి యంగదుని
గట్టిగా దయచేసి రామా
గిరిచరులు గొలువ సుగ్రీవునకు కిష్కింద
పురము పట్టముగట్టి రామా
వర్ష కాలము మాల్యవంతమున చరియించి
వాయు పుత్రునిచేత రామా
స్థిరముగా సీతయుండిన జాడ మదిలోను
దెలసి కపులనుగూర్చి రామా ॥అర॥

అనిలసుత సుగ్రీవు డాదిసేనలు నడుప
నబ్ధి బంధన జేసిరామా
పనిబూని పురముచుట్టును ముట్టడేసి బహు
భాణతతిజ్వాలలను రామా

దనుజకులమున నడవి దగ్ధమునుజేసి తుద
దశకంధరుని ద్రుంచి రామా
వనరమండోదరి వగపుమాన్చి విభీషణునికి
లంకయొసగి రామా ॥అర॥

వలసి సీతనుగూడి వనచరులు గొల్వగను
వర అయోధ్యను జొచ్చిరామా
తలపోసి తల్లులకు దండమును బెట్టి
తమ్ములు సేవజేయగను రామా
అలరుచును మునులు పట్టాభిషిక్తునిచేసి
నిలిచి వినుతులు సేయరామా
వలసిచుట్టును సర్వబలములును సేవించ
ప్రబలుదువు పూదోట రామా ॥అరసి॥—16

## పెద్ద అమ్మవారి జాతర ఆధ్యాత్మ నృత్యము

ఏండ నీడల క్రింది కండలిని నెగయించి
నిండియున్న మాయను నిగ్గుడింపుచును
చెండి యింద్రియాల చే కత్తి మెరయగ
ఖండించి విజయమై కడను ప్రకాశింతు

ప॥ తాలెల్లే లెల్లెల్లో యకతా లెల్లే లెల్లెల్లో
మేలైన కుధరతుద మెరసి వెన్నెలబయట
తూలియాడుచుచిందు దొక్కెర నెరజాణ ॥తా॥

పట్టుబడని పశువు పట్టివిధుల ద్రిప్పి
గుట్టుమధ్యముచేత కుదియ బట్టి
పట్టైసమున దున్నను భావవీధిసద్రుంచి
చుట్టుజనులు గుయ్యు చుక్కపొడుపు వేళను ॥తా॥

పట్టణంబుల వారు పరగ కుంభమును నించ
నట్టిదుర్గుణ పుగ్గముల నపుడు సరికివేసియు

పట్టైన ఓంకారమనెడి తప్పెటయు మ్రోద
గట్టిగ తప్పెటలు కదసి ముమ్మరును గొట్ట ॥తా॥

మించి చంద్రుడు వెలుగ మింట తారలునిగుడ
పంచవర్ణశాటి పై దనరగ
పంచశక్తులుచాల పసిడిపూవులు నించ
పంచబ్రహ్మల కడను పసవడి ద్రొక్కెరా ॥తా॥

గట్టిగను శిరముపైన కడుచిత్రితముగాను
ఆట్టిబ్రహ్మశిఖయు వెల్గుచు నలరగను
పట్టైన అందెలు పదముల మ్రోయగ
చుట్టు బక్తులు జూడ సొంపుతో నటియించు ॥తా॥

మిక్కిలిధరపైన తా మెరసి నటియించగా
ఎక్కువగను పదరజ మెగయ గాను
చొక్కంపు మేనిపైని సొమ్ములును వెలుగగ
నుక్కుమిగిలి కొమ్మాడెరా!...వరయోగి ॥తా॥

కన్నుగొనల కెంపువంటి దృష్టిజ్వాలతో
చెన్నుమీరు చును చాల సిరిమించగా
వన్నె మెరసి త్రిగుణ వస్తువులు భక్షించి
తన్నుతాను మరచియు తాండవమాడెరా ॥తా॥

అట్టిమందబయటనయిదు ముగ్గులును మించి
పట్టైన సుజ్యోతి ప్రబలగానూ
అట్టి జ్యోతి తుద నాత్మరాముని జూచి
నెట్టుకొని చెందు నెరజాణదొక్కెరా ॥తా॥

దండిమేని చెమట ధరణిపై పొలిజల్లి
పండువెన్నెలబయట ప్రబలుచును
అంకజేరి ముక్తి కన్యను అందముగ చేపట్టి
ఖండవేదకతోను నిలిచి గురుడు మెచ్చ ॥తా॥



బనగానిపల్లె రవలకొండపైని దివ్యమఠంలో పూదోట గురుపీఠం



శ్రీ శ్రీ శ్రీ లింగావధూతస్వామివారి రవలకొండమీది మఠం ముఖద్వారం, బనగానిపల్లె



శ్రీ గురు పాదుకాపూజలో టి. సి. పుల్లారెడ్డి దంపతులు, మోరగుడి



శ్రీ గు రు పా దు కా పూ జ లో

చౌడం మునెయ్య దంపతులు, చౌడం వెంకటసుబ్బయ్య దంపతులు, మోరగుడి

పచ్చని మెరుగుల పసిడి చవికెలోను
మచ్చెకంటులు పూజ మరిమరి సేయగా
వచ్చి భక్తులకు తానిచ్చును మోక్షమూ
ముచ్చటతో గురుడు మొనసిచూడగ పచట ॥తా॥

దండి తేజము మించి తారక మగుచూ
చిన్మండలమునుమీరి మాయలన్నీ
ఖండించి పూదోట ఘనుని స్వస్వరూపమై
ఖండ మఖండమై కదలక నెయుండు ॥తా॥—17

## విరాట్ చతుర్వర్ణములు

తనరు వర్ణాశ్రమములును మేలగు లక్షణము
వినుడి చెప్పెదనేను విమలాత్ములారా!
ఒనరు బ్రహ్మక్షత్ర వైశ్య శూద్రులు బాహ్య
మున నాల్గు వర్ణంబులును సిద్ధముగను

ప. ఇన్ని వగలనుమీరి యేని రామయుడనై
యన్నిటికిపై సాక్షినై ప్రకాశింతు ॥ఇన్ని॥

అల స్వరాట్టును విష్ణు బ్రహ్మ శతముఖులు మది
తలపోయ వీరియంతరములందునను
తెలియగ నాలుగువర్ణములు ననుచు శృతిపలుకు
అలర నీ రూపముల కవల వెలుగుదును ॥ఇన్ని॥

మెరయ వర్ణాశ్రమాదుల చిక్కు ఖండించి
పరశుద్ధులను జేసి శరణ జనములను
నిరవలంబమ్మునైన నిజగాత్రులను జేయు
గురుని నరుడని జూచు గురుసుతులు సెడరె ॥ఇన్ని॥

నిష్ఠతో శ్రీగురిని నిర్గుణ బ్రహ్మమని
యిష్టముగ మదిలోను నెరిగియటమీద
భ్రష్టులై దేశకునిపై నాగ్రహపడు జడులు
సృష్టిపై కూలుదురు చెడు పిశాచములై ॥ఇన్ని॥

ధరమీద సద్గురుని చరణాబ్జములునమ్మి
యరలేని భక్తితో నతితుర్యులగుచు
అరసిపూదోటకడ నద్వితీయునిసన్ను
పరమ శాంతులుగూడి ప్రబలుచుండెదరు ॥ఇన్ని॥—18

అనంత విశ్వమూర్తి

అరయస్థావర జంగమాది రూపంబులై
పరికించగా జీవ భావమున నీవు ॥భా॥

సౌరదంత రాశముల చొచ్చిదీపించి తుద
కరుణలర ఖద్యోత గతిని వెలుగుదువె

ప॥ నిగమాంతమున దెలియ నీకన్న మరిలేరు
త్రిగుణ రహితంబైన దివ్యాంత రూపా! ॥నిగ॥

షట్చక్రములపై స్వర్ణ కిరణములతో
అష్ట రేకుల తనరు సజ్జకర్ణికను
దృష్టాంతమగు విమలి దివ్య ప్రకాశమై
నిష్టతో నామదని నిలిచి వెలుగుదువె ॥నిగ॥

దొరయ మాణిక్యదీప్తుల గృహములో నెపుడూ
సిరిమించి ఘనుల సిక్షేపమైనట్టి
గురువైన పూదోట గురుయోగి మిముగూడి
స్థిరముగా నిలిచి నే తేజరిల్లుదును ॥నిగు॥—19

విశ్వరూపదర్శనము

పంచాంగములు నీవె పంచవాయువులు నీవె
పంచబ్రహ్మలు శక్తి పంచకను నీవె
పంచకోశంబులును పంచవర్ణంబులును
పంచాక్షరముల తుద ప్రణవమును నీవె

ప॥ పరమ గురుమూర్తి నిను భావింపగా నలవె
నిరుపమానందమున నిల్చి వెలుగుదువే ॥పర॥

అష్టతనువులు నీవె అగ్ని వాయువునీవు
అష్టదిశలును పృథివి అంబరము నీవె
అష్టబీజంబులును ఆద్యంతములు నీవె
దృష్టిలో నిర్వాత దీపమును నీవె ॥పర॥

సప్తధాతువులు ఘన సచారాచరంబులును
సప్తవ్యసనంబులును సప్తకుధరములు
సప్త వార్థులు నీవె సప్తస్వరులును
జంట సప్తలోకములపై సాక్షివి నీవె ॥పర॥

నవగ్రహములును నీవె నవనిధానము నీవె
రవి చంద్రులును శృతులు రాగమును నీవె
త్రివిధకాలము నీవె త్రిపురంబులును నీవె
త్రివిధవేల్పుల తుదను తేజమును నీవె ॥పర॥

అంగమున నీవె సర్వాంగరూపులు నీవె
పొంగి వెలిగెడి దివ్య పుంజమును నీవె
రంగైన పూదోట రామయోగివి నీవె
సంగరహితంబైన సత్పదము నీవె ॥పర॥—20

## అనంత విశ్వమూర్తి

సర్వ భూతంబులును సర్వేంద్రియంబులును
సర్వ మాయతములును సర్వగుణములును
సర్వ చక్రంబులును సర్వదళ వర్ణములు
సర్వ మాతృకతతులు సర్వజీవములు

ప॥ అలరి సద్గురుని చరణాంగుష్టముల యందు
తలపోయ యిన్ని విధముల ప్రకాశించున్ ॥అలరి॥

సర్వశక్తులువసన సర్వధాత్రులు పెక్కు
సర్వలోకంబులును సర్వవేల్పులును
సర్వరూపంబులును సర్వనామంబులును
సర్వక్రియలు వినుడి సచరాచరములు

సర్వక్షేత్రంబులు సర్వనిధి నదులచట
సర్వముని బృందమును సర్వాశ్రమములు
సర్వఫల వనములును సర్వమృగ పక్షులును
సర్వ చిత్రములును సర్వ తేజములు ॥అలరి॥

సర్వశృతి శాస్త్రములు సర్వసుస్నానములు
సర్వ మంత్రంబులును సర్వమఖములును
సర్వ జపతపములును సర్వార్చనాదులును
సర్వ దానంబులును సర్వ మోక్షములూ ॥అలరి॥

సర్వధారణలు మది సర్వ యోగంబులును
సర్వ లక్ష్యంబులును సర్వ ధ్యానములు
సర్వమగు పూదోట సజ్జనుల వరదుడును
సర్వసాక్షిగ నెపుడు చాల వెలుగొందు ॥అలరి॥—21

ధరణి జల మగ్ని వాతము నంబరము మాయ
తరచు ముప్పదియారు తత్త్వముల గుంపు
వరుస నాధ్యాత్మికము వసరనధి భౌతికము
సరస నధిదైవతం బనుచుగా యున్ని

ప॥ అరయగ విరాట్పురుషుడ నెడి గాత్రముదాల్చి
పరమ స్వరాట్టుకడ బయట వెలుగుదువె ॥అరయ॥

పదము లాదిగసప్త పాతాళ లోకములు
అదిగో నాభికిపైన నమరి ప్రబలుచును
కదలకుండెకిసప్త ఘనమైన లోకములు
మ్రుదమెుదు నష్టపురములు జగత్రయమును ॥అ॥

పగలు రేలును మేటిబలమైన తేజములు
నగణితంబగు తారలక్షరంబులును
ముగురు మూర్తులకాది మూలమగు విశ్వయును
సగుణమై శోభిల్లు సచరాచరములు ॥అ॥
సర్వజలచర భూచర ఖేచరాదులును
సర్వచక్రంబులును సర్వ ధాతువులు
సర్వరూపంబులును సర్వనామ క్రియలు
సర్వశక్తులు సమిత సర్వశబ్దములు ॥అ॥
వేదబృందము విమల వేదాంత శాస్త్రముల
కాధారమైయెపుడు నద్వితీయుడనై
మోదమున పూదోట మూలనిష్క్రియుడనై
ఆదిమధ్యాంత శూన్య ప్రకాశుడనె ॥అ॥ —22

## పరమేశ్వరుడు

మేటి తరువునునంటి మెలగు ఫలములలోను
వాడకను పురువులు వర్తించు విధము
జోడైన పిండాండముల సారది బ్రహ్మాండముల
పోడిమిగ జీవులై పొసగ మెలగుచును
ప॥ భరితమై నిర్గుణ బ్రహ్మంబునీరీతి
సదయ సచరాచరములై ప్రకాశించు ॥భరి॥
నిఖిల రూపంబులై నిఖిలాంత రాత్ముడై
నిఖిల రహితమునగుచు నిలిచి నెలుగుచును
నిఖిల జనకుండునై నిఖిల జనకంతునై
నిఖిల మయుడై తుదను నిజసాక్షియగునూ ॥భరి॥
శాంత తేజంబునై శాశ్వతానందమున
చింతించగా బయట చిద్రూపుడగుచూ
సంతతము పూదోట సరిమించి తెలియగను
సంత తానైగాక యమృతుడైయుండు ॥భరి॥—23

## విరాట్ చతుర్వర్ణములు

కదలి కదలనియట్టి ఘనమైన నిష్కళను
నుదయించి సుజ్యోతి యోంకరించగను
సదయుడై శబ్దమున చంద్రుండు పరతెంచి
ఆది త్రివర్ణములతో సన్ని నిర్మించు
ప॥ సొలయ విశ్వము జీవసూత్రమున నాడించి
నిలచి చిన్నభముపై నిజగురుడు వెలుగున్ ॥సొ॥
అరయు తామసగుణము నాధ్యాత్మికములగుచు
పరగరజోగుణమాది భౌతికములగుచు
గురుతు శమదము సత్త్వగుణాదైవతములగును
విరవిగా బంధుముఖ విరచితంబైనన్ ॥సొ॥
అవని తలక్రిందైన సహిసప్తమెలికలను
జవముతో మహదాది జగములును ప్రబలన్
సవికల్పములమీరి సచ్చిదానందమున
నవకంజములపైని శివయోగి యగుచూ ॥సొ॥
మొదలనిర్గుణమందు మొత్తముగ జననమై
కదిసి శృతులను క్రమక్రమముతో మెలగున్
మదితెలియ శూద్రుడౌ మరిపాక శాసనుడు
అదిగో నిజవైశ్యుడౌ నబ్జగర్భుడునూ ॥సొ॥
ఉర్విపై క్షత్రియుండుగను నారాయణుడు
నిర్వికల్ప జ్యోతి నిజ బ్రాహ్మణుండు
సర్వమగు పూదోట సద్గురు స్వామియును
సర్వవర్ణములతుద సాక్షియై యుండూ ॥సొల॥—24

గురుమూర్తి నీసుతులు ధరపై గృహస్థులై
విరివైన సంపదల విఱ్ఱవీగుచును
ఎరిగి ఎరిగకనున్న నియతులగు నీసుతుల
ఫరికించి ధారిమది పలుకుదు వె తండ్రీ!

ప. లేడి వెంటనుదిరుగు లేగకైవడి నీవు
వేడుకతో నీసుతులవెంట దిరుగుదువె ॥ లేడి॥

ఎల్లవారునుజూడ యిలలోను నీసుతులు
తల్లి దండ్రులభ్రమను ధాత్రినినుమరచి
తల్లడించెడిసుతుల యుల్లమున నిలిచినీ
వెల్లపుడు నీసుతుల ఎదుట వెలుగుదువె! ॥ లేడి॥

సతిసుతుల మోహమున జగతిపై నీసుతులు
మదిలోపలను నిన్ను మరచియుండినను
ప్రతిలేని పూదోట బ్రహ్మాంబ వారలకు
హితవుతో మీ రూప మిత్తువే తండ్రీ! ॥లేడి॥—25

## విశ్వవిభూతి

అంగనా మణులందు నధికమగు
నిగమాంత రంగమున వెలుగొందు రాజీవనేత్రీ!
సంగ జనులకుందు మహిమాల తెలియగను
నిస్సంగుడగు నవభూత సర్వపూజ్యుడును

ప॥ పగలు మీరుచు నెపుడు వర నిరామయుడునై
సగుణ నిర్గుణములకు సాక్షియై యుండూ ॥పగ॥

అట్టిపురుషుండెప్పు డానందమయుడునై
పట్టగు పరంజ్యోతిపై రత్నద్యుతులన్
గట్టిగ ప్రకాశించు ఘనత సింహాసనము
నట్టనడుమను నిల్చి నయముతో మెరయు ॥పగ॥

అతడు చిన్మయుడునై యరసిచూచినయపుడె
హితవుతో చిరజ్ఞానయువతి ముఖకళనూ
ప్రతిమాయను దయించి బహు విచిత్రములై
మతిదెలియ రూపనామక్రియల ప్రబలూ ॥పగ॥

విశ్వమును జొచ్చిమరి వెలిలోను దీపించు
విశ్వమును తనలోను వెలుగగా నెపుడూ
విశ్వగర్భుండగుచు విశ్వదూరుండునై
విశ్వ జనకుండునై విలసిల్లు వినుడీ ॥పగ॥

నెర నిరాపేక్షుడై నిర్వికారుండగుచు
పరమ పావనమైన నిరవలంబమునై
సరిలేని పూదోట సద్గురు స్వాములై
ధరమీద చరియించు పరమశాంతులునై ॥పగ॥—26

తరచు మణులందు చింతామణియు నధికమగు
సురభులందును దేవసురభి యధికంబు
ధర తరువులందు సురతరువె యధికంబగు
గిరుల యందును మేరుగిరి ఎక్కువగును

ప. గురుకృపను జెప్పెదను కోవిదులు వినరయ్య
వరుస నెక్కువ తక్కువలు మీకు నిపుడూ ॥గురు॥

పలుకులందును ప్రణవంపు పలుకెక్కువగును
అలుపులందును ముక్తి తలపెక్కువగును
తెలివియందును జ్ఞాన తెలివి యెక్కువయగును
కళలయందును బ్రహ్మకళ యధికమగును ॥గురు॥

శరధులందును అమృత శరధి యధికంబగును
గరిమె నదులందు గంగయు నెక్కువగును
సరస కుసుమములందు జాజిసుమ మెక్కువగు
పురుషులందును పరమపురుషుడధికంబు ॥గురు॥

వనజాక్షులందు నపవర్గసతి యెక్కువగు
జనములందును యోగ జనమెక్కువగును
మొనసి క్షేత్రములందు మోక్షభూమధికమగు
తనువులందతి తుర్య తనువధికమగునూ ॥గురు॥

చెలుగు మునివరులలో శ్రీ శుకుడెక్కువగు
కలితపదవులయందు కైవల్యమధికం
లలితమగు పూదోట రామయోగి యందరికి
తలపగా నెక్కువగు తత్త్వజ్ఞులారా ! ||గురు||—27

బయలగు నిరాకార బ్రహ్మంబులో రెండవ
బయలునై చిన్మయుడు పరగ నెసలును నా
బయలందు జీవుడను బయలు నుదయించు నా
బయలుననుబుట్టు ప్రాపంచజాలములును

ప॥ శరణ జనులార యీ జాడ దెలిసినయోగి
నెర నిరంజనమైన నిజగురుడుసుమ్మి ॥శర॥

తరుచు ముత్యములలో దారమును జొచ్చు క్రియ
సరయ సర్వోపాదులందు నాత్ముడును
నెరసి యన్నిటజొచ్చి నిండి ప్రబలుచు నెపుడు
తరలకను శుద్ధ చైతన్యుడై మెలగున్ ॥శర॥

అతడును విరాట్టగు అమల స్వరాట్టునగు
నతడును పరాట్టగు నవల నిష్క్రియుడై
యతడె పూదోట తుద నమలస్వరూపుడై
యతడును నిరాలంబమై ప్రకాశించు ॥శరణు॥—28



మూడవ దళము

# సృష్టి



## ఓంకారము

పరమాత్మ ముఖకళను ప్రణవమ్ము నుదయించు
నరయ శబ్దమున బిందువగు హరిహరుల్
గురుతుగా జననమై కూడి రవిచంద్రులను
గరిమ మర జగములకు కర్తలను జేసి

ప॥ విదితముగ మదిలోను విమలజ్యోతికినవల
సదమ లానందమున సాక్షినై యుందూ ॥విది॥

ధరయు సలిలం బగ్ని దశమారుతము దివియు
నరుదు సచరాచరములై ప్రకాశించూ
అరయ సత్త్వంశాన సంగదేవతలునై
పరికించ సర్వమును ప్రబ్బికొని తనరు ॥విది॥

సర్వతోముఖుడనై జలమధ్యముననిలిచి
సర్వకారణమునై చాలప్రబలుచును

సర్వమగు పూదోట సద్గురుని సంటెనే
నిర్వాణ పదమగుచు నిండి మెరయుచును ॥విది॥—1

## సృష్టి

పొసగ స్త్రీ పురుషుడు నపుంసకుడునైగాక
అసిపదంబునుమీరు అమృతాక్షరమునన్
పసిడి మెరుగుల విమల పాపుడునయించతని
మిసిమికాంతుల ముక్తిమెలతనుద్భవమూ

ప. నిర్లేపులార ఇది నేర్పుతో వినరయ్యా
దుర్లభం బీకీలు దొరయ జెప్పెదను ॥నిర్లే॥

ద్రష్టైనసతియందు తరచునీలద్యుతుల
నిష్టతో బహుచలననెలత జననమునై
అష్టదిక్కులు పృథివి అంబరమునాదిగా
సృష్టి బహురూపులై చెలగి విలసిల్లూ ॥నిర్లే॥

తెలియ చిద్వైట ద్వితీయాంబరము వెడలి
అలరి సచరాచరము లన్నిటను ప్రబలున్
మెలకువతో పూదోట మించి సద్గురుమూర్తి
నిలిచి ప్రకాశించు నిఖిల సాక్ష్యగుచూ ॥నిర్లే॥—2

అసుదగు, నిరక్షరమం దద్వితీయంబగు
సరయు చిద్రూపుడను నక్షరము వెడలున్
మరియతనిలో నిర్మలస్వయం జ్యోతి నెడి
నెరయ సగుణాక్షరంబరయ నుదయించు

ప॥ వలసి చెప్పెదవినుడి వరభక్తవరులార !
అలరు నక్షరసంజ్ఞలన్ని మీకిపుడూ ॥వల॥

బలువిద్య ముఖకళను ప్రణవాక్షరము బొడము
వనర దానిలో పఞ్చాక్షరత్రయము

తలపోయ వీటిలో తథ్యముగ క్షణములో
చెలగి ఏనక్షరంబులు నుదయమగును ||వల||

వనర పంచాక్షరంబులును జననమై
ఏబదిని యక్షరములు షడ్వన జారములు
తనరి వెలిగెడి యందును నమిత యక్షరము
లును వెడలి జగములందున నిండిప్రబలు ||వల||

అలనిరంజన బ్రహ్మమను నంతరిక్షమున
తెలియయిన్నియు వెడలి దీపించు మరియు
విలయమున నాఘనుని విమల జఠరముజొచ్చి
కలియకను సర్వరూపులు నిలిచి యుండున్ ||వల||

నెరసర్వ శూన్యమై నిరవలంబంబగుచు
నిరుపమానందమున నేను భయసాక్షినై
పరికించ పూదోటపై చెదర కెప్పుడును
నరుదుద్వైతాద్వైతమై వెలుగుచుందు ||వల||—3

జితయోగినైన నా స్థిరశూన్య జఠరమున
సతిపతులు నిర్లేప భావమున బుట్టి
సతిపతుల రతిలేక స్వర్ణ మెరుగుల బిడ్డ
డతితుర్యమున జననమై వెలుగు తుదను

ప|| ఇది మహా చిత్రితం బెరుగ జెప్పెదమీకు
సదయులై వినరయ్య సద్భక్తులారా! ||ఇది||

నెరనిరాకారమగు నెలత పలుకున
విశ్వమరయ రజ్జువు సర్పమను భ్రాంతివిధము
గరిమె సచరాచరాల్వయుసతో వెడలమరి
నెరసి యాత్మొండన్నిటి ప్రకాసించు ||ఇది||

ఇన్నిటికి సాక్షినై యేనద్వితీయమై
నన్నె మీరుచును చిద్వ్యవధి యనెడి

కనుగొనగ పూదోట కడ నిరంజనుడనై
చెన్ను మెరయుచు బయట వెలగివెలుగుదును ॥ఇది॥—4

ప్రళయకాలమునందు పరమాత్ముడాదిగా
బలువిశ్వజాలములు భావించినీవు
కలయనీయక నీదు ఘన జఠరమున నుంచ
నలుపుచును ఏకాకినైయుందు వయ్యా!

ప. వినుడి యుత్పత్తిస్థితి విలయముల జాడనే
మనమలర జెప్పెదను మహనీయులారా! ॥వినుడి॥

నెరనిరామయుడనెడి నిర్బైట నిదుపుకును
మెరసి స్థిరు డస్థిరుడు సరసనుదయంబగు
స్థిరునందు విద్యయు జనియించు దానందు
పరికించ శుద్ధప్రణవము జననమగును ॥వినుడి॥

త్రివిధస్థలంబులును త్రివిధమూర్తులు శ్రుతులు
త్రివిధశక్తులు వర్ణత్రివిదాక్షరములు
త్రివిధగుణములు జీవ త్రివిధావస్థలును నిన్ని
వివరించ నినదమున విరచితంబగును ॥వినుడి॥

మొనసి అంతఃకరణము మొదలుగా సర్వమును
తెనరిచిత్రితమునై తలచ నిముషమునన్
పనర వెలుగును నన్ని పరభక్తవరులార
ఘనిబూని యన్నిటను ప్రబలునాత్ముడునూ ॥వినుడి॥

అమలుడై స్వచ్ఛుడై యానందమయుడైన
విమల చిన్మయునికిని వెలి కదలకెప్పుడూ
క్రమముతో పూదోటకడ సర్వసాక్షియై
అమిత సుస్థిర సౌఖ్యమై ప్రకాశించు ॥వినుడి॥—5

(వేద) శబ్దవికాసము

పరికించి యీ యమృత వచనముల యుత్పత్తి
నెరుగ జెప్పెదమీకు మెరసి వేడుకను
అరయగ నిరాలంబమనెడి నిర్మల బయట
గరిమెతో నుదయించు కడుచిత్రితములై

ప॥ వలసి చెప్పెదవినుడీ వరభక్తవరులార
మెలగు సత్పదమను మిసిమి సారమును ॥వల॥
తలపోయ బహ్వర్కతతుల ప్రకాశించి
చెలువొందు చిద్వ్యోమ సింహాసనముపై
నిలిచి పలికెడినేని యతి వాక్యములు
అలుదగు నఖండైక్యమను రసము వెడలుచును ॥వల॥
పరమ పురుషునియందు ప్రబలి చనుదెంచి
సిరిమించుగాయత్రి చేడెముఖ కళలందు
నరుదు చిత్కళలంటి నిలిచి పలికిన యేని
సరిలేని ప్రణవమై చాల ఘోషించుచూ ॥వల॥
ఘనత దశశబ్దములు కదలియాహోజ్యోతియను
గుండమున దుంకి యతిప్రభావమున
నానర సురగిరి సరస్వతిమీరి తీవ్రమున
తనరి నా రసనాగ్రమునను ప్రభవించు ॥వల॥
నిరతమును నేనున్న నెరవు నెరిగించెదను
పరమ దహరాకాశభావమైయేను
భరితమై పూదోటపై మహోద్యోతమై
నిరుపమానంద సుధాశరధినై యుందూ ॥వల॥—6

అతితుర్యమునను దివ్యాంకురం బుదయించి
ప్రతిదినము లోబయట బలసి ప్రబలుచును
మితిలేని జ్యోతిలో మెరసి నినదము బొడమె
ప్రతిబింబమై మనసు ప్రణవమున వెడలన్

ప॥ నిర్మించి సర్వమును నిజశక్తిచే గురుడు
మర్మమగు చిద్గగన మధ్యమున వెలుగున్ ॥నిర్మిం॥

జలమధ్యమున స్వర్ణ జలజమును వికసించి
బలిమిమై రవిచంద్ర పావకుల గూడి
నలుత్రోవలకు మొదటి నాళమున క్రిందైన
అలకంజమున మొలచు నష్టసుమములును ॥నిర్మిం॥

పరికించ తామసము పంచభూతములగుచు
గురుతుగా మరి రజోగుణము నందున్
తరుచు ముప్పదియారు తత్త్వములు జన్మించు
స్థిరసత్వమున నంగదేవతలు నగును ॥నిర్మిం॥

మొదటి అక్షరమందు మూడు వర్ణములగును
అధికమై నూట యేబది అక్షరము లా
కదిసిపట్కమల రేఖల ఘనత మెరయుచును
చెదరి బీజములు మూండు జగములు నిండు ॥నిర్మిం॥

విలసిల్లు ముగ్గుర నా విశ్వకర్తల జేసి
అంయాత్మ సూత్రమున నాడించుసర్వంబు
తలచ నిగమాంతమున తారక జ్యోతిపై
నిలచి పూదోట నిర్గుణ బ్రహ్మమగుచూ ॥నిర్మిం॥—7

## సృష్టి

చిన్నభము పైని సుస్థిర నిరాకారుడై
వన్నె మెరయుచునున్న వరగురునియందు
చిన్ని బాలుడు వెడలి చెలువొంద నతనిలో
నున్నత స్వయంజ్యోతి యుదయించు వినుడీ

ప. అతిరమ్యమగు ముగ్గురైన పశుజీవులకు
పతి నిరామయుడనుచు పలుకు గాయత్రి ॥అతి॥

పరమ నిర్గుణిమైన పడతి సుఖ కళలందు
సరస నోంకారమును జనన మగునందు
హరి హర బ్రహ్మాదులపుడె యుద్భవ మొంది
పరికించి విశ్వమును పాలింతురయ్య ॥అతి॥

బలిమి తత్పదమందు ప్రభవించి యాత్మడును
సలరు త్వం పదమనెడి యాఖ్యగలిగియును
చలనుడై మహదాది జగముల ప్రవేసించి
వలసి బహువిధములను వర్తింతురెపుడు ॥అతి॥

సర్వ వాసనలన్ని సమయించి గురుకృపను
మరుపరను కైవల్యమార్గంబు తెలిసి
సర్వమును లేక నిష్కళుడై ప్రకాశించి
నిర్వికలుపుడె యగుచు నిలుచు ససిపదమై ॥అతి॥

మనమలర రూప నామక్రియల మీరియతడు
ఘనత సత్పదమునై కదలకెప్పుడును
కనుగొనగ పూదోటకడ సర్వసాక్షియై
తనరి కేవల శూన్యతత్త్వమైయుండు ॥అతి॥—8

గురుసాంప్రదాయంబు వరుసతో జెప్పెదను
నెరని రామయుడనెడి నిజగురునియందు
పరమ చిన్మయుడనెడి గురువెడలు సతనిలో
సరుదు విజ్ఞానుడను గురుడుద్భవించూ

ప॥ కరతలామలకముగ ఘనులార ! యెరిగింతు
సరసి గురువుల జనన మాద్యంతములను ॥కర॥

సరస వేదాంతమను వానియందోంకార
మనుగురుడు ప్రభవించు సతని గర్భమునన్
తనరి నారాయణుండను గురుడు జన్మించి
ఘనత సాహస్రదళ కంజమున ప్రబలూ ॥కర॥

హరినాభి జలజంబునందు ధాతనుగురుడు
గురుతుగా నుదయించు మెరసి యతనిలో
మరివహ్ని నేత్రుడను గురుడుద్భవించపుడు
మెరసి భ్రూయుగ మధ్యమున ప్రకాశించు ||కర||

ముగురు మూర్తులయందు మొనసి జననమునొంది
అగణితంబగు గురువు లతిముదంబుననూ
నొకరికన్నను నొకరు వర్ణింప శ్రేష్ఠులై
పగలు మీరుచు మహిని వర్తింతురయ్యా ||కర||

తలపోయ యిందరికి తండ్రియగు సద్గురుడు
నలరుచును నాదిమధ్యాంత శూన్యుడునై
నిలచి పూదోటకడ నెరమహా ద్వైతమై
తెలియ భక్తులమదిని వెలుగు నిష్క్రియుడై ||కర||—9

ఘననిరాలంబమున సద్వితీయమై
తనరి సాంఖ్యంబనెడి తారకము నెఱలూ
కనుగొనగ యతనియందును తారకజ్యోతి
పసిబూని యుదయించి బలుసాంఖ్యమగుచూ

ప॥ వలసి యిదివినరయ్య పరభక్త వరులారా
తెలియ జెప్పెద సద్వితీయ సారమునూ ||వలసి||

వరుస నాసతియందు సంభవించు నవిద్య
నరయ కతకరణ మాది సర్వమునూ
తరచు ముప్పదినారు తత్త్వములు ప్రభవించు
సరస బహుసాంఖ్యమై నెరసి దీపించు ||వలసి||

విలయమున పూర్ణాత్మ విమలాత్మ బ్రహ్మమం
దలరి కూడ తురీయమమనస్క మగును
నిలిచి పూదోటపై నేసర్వశూన్యమై
వెలుగుడు నఖండమై విశ్వసాక్షిగను. ||వలసి||—10

## హృదయం

స్వాంతమున నుదయించు సామాయ నిర్మాయ
స్వాంతమున నుదయించు సరగ త్రిగుణాళి
స్వాంతమున నుదయించు సర్వమాతృకలు
స్వాంతమున నుదయించు సరసత్రిశక్తులును

ప॥ విజ్ఞానులారా! ఇది వివరించి చెప్పెదను
ప్రజ్ఞతో విశ్వమును ప్రబవించు వినుడీ ॥విజ్ఞా॥

స్వాంతమున నుదయించు జలజములు తొమ్మిదియు
స్వాంతమున నుదయించు సచరాచరములు
స్వాంతమున నుదయించు సర్వ వర్ణంబులును
స్వాంతమున నుదయించు సర్వ దేవతలు ॥విజ్ఞా॥

స్వాంతమున నుదయించు సర్వనిగమాదులును
స్వాంతమున నుదయించు సర్వ శాస్త్రములూ
స్వాంతమున నుదయించు సర్వ మంత్రంబులును
స్వాంతమున నుదయించు సర్వ సిద్ధులునూ ॥విజ్ఞా॥

స్వాంతమున నుదయించు సర్వ దుష్కర్మములు
స్వాంతమున నుదయించు సర్వ పుణ్యములు
స్వాంతమున నుదయించు స్వర్గనరకములును
స్వాంతమున నుదయించు సంసార జంభం ॥విజ్ఞా॥

స్వాంతమున నుదయించు సర్వ జీవంబులును
స్వాంతమనగా విమల సచ్చిదాత్ముడు నా
స్వాంతమును పూదోట స్వామియందెసలు నా
స్వాంతమున స్వాంతమై సద్గురుడు వెలుగున్ ॥విజ్ఞా॥—1॥

అరయగను నాదిమధ్యాంత శూన్యమునగుచు
సరిలేని ఘననిరంజన లింగమునను
సిరమించి వెడలు పరశివ లింగమూర్తి
సుస్థిర సాకార చిత్పదంబగును

ప॥ నిరవలంబంబనెడి గురులింగమై యేను
తరలకెప్పుడు సర్వద్రష్టనైయుందు ॥ని॥

తనరుచును శుద్ధచైతన్య నందుదయించు
వనర పరంజ్యోతియనెడి లింగమును
కనుగొనగ ప్రణవలింగము దాని జననమగు
ఘనత త్రైలింగములు నినదమున బొడమ ॥నిరవ॥

అలజీవ లింగమును నతితుర్యమున వెడలి
కలిసి అజ్ఞాన లింగమును తనుమరచి
అలరి పిండాండ బ్రహ్మాండ లింగములలో
తలప చరలింగములు దట్టమై ప్రబలు ॥నిరవ॥

సగుణలింగములన్ని నిగమాంత వేద్యమగు
నగుణలింగమునందు నమర గూర్చియును
మిగిలి పూదోట తుదమెరయుచు నఖండమై
అగణితంబగు లింగమై ప్రకాశింతు ॥నిరవ॥—12

లలిత పంచాక్షరీ లక్షణము జెప్పెదను
చెలగి గురునందు పరశివు డుదయమంది
అలరి జ్ఞానంబనెడి హంకారశక్తి తా
కలసి నంతనే మహాఘన నినదమెడలు

ప॥ వినుడి ప్రమధ గణంబులును శాంత చిత్తులై
మనమలర మీకు యీ మహిమ జెప్పెదను ॥వి॥

గరిమె మెరయుచు ప్రణవగర్భమున జననమై
వరస నీల సుధూమ వర రక్త శ్వేతం
బరయ పీతములాది నైదక్షరములందు
మరి పంచ భూతములు మాయ జగములును ॥వి॥

మొనసి ధాతయు సర్వమును వేడ్క విరివిగా
తనరనిర్మించు హరిదయను పోషించు

పనిబూని యఖిలమును భస్మంబు జెరచితువ
కొనరరుద్రుడు శబ్దమున లీనమగును ॥వి॥

అలరు ప్రణవమునాది అమిత జీవంబులను
కలిత నిర్మలయోగ కన్యదిగ గ్రమింగున్
బలిమి గుణసామ్యమును పరశివుడు గ్రసియించు
చెలగి నిజశూన్యమున చిన్మయుడు నణగున్ ॥వి॥

నిరుపమానందమున నిశ్శబ్దమై చాల
పొరిదియు నఖండ తేజోరాశియగుచు
భరితమహా పూదోట ప్రభు నిరంజనలింగ
మరుదుగా నుభయసాక్షై ప్రకాశించు ॥వి॥—13

స్థిరమైన యావరణ దివ్యసుందరివలన
మెరసి స్వాంతమవిద్య పరగ జనియించి
గరిమె యజ్ఞానమును కలికి గర్భమునందు
నరయ పిండాండ బ్రహ్మాండములు వెడలూ

ప. వినుడి సజ్జనులారా! వివరించి చెప్పెదను
కనరయ్య నాదు నిజఘున యోగమహిమ ॥విను॥

మొనసి యతి తుర్యాత్మ ముఖదీప్తి జీవుడై
తనరియంతఃకరణ దర్పణంబునను
వనర ప్రతిబింబమై ఘనలింగకాయుడై
తన్మాత్రయంబున దిరిగి తనుదా నెమరచు ॥విను॥

అట్టిపురుషుడు మహిని నచలగురుమార్గమున
మెట్టి చిద్వ్యోమమును మించిపూదోట
పట్టైన కేవల బ్రహ్మంబునైన నను
దిట్టడైకూడి తుద బట్ట బయలగును ॥విను॥ —14

## దివ్య పరిణామ తత్త్వము

ధరనూర్ణనాభి తనతంతు జాలములచే
నరఘుడియలో వల్వ మరినేసినటులన్
సరసి సాక్షుఁడు యోగశక్తిచే నఖిలమును
నెరయనిర్మించి వెలినిలిచి వెలుగొందున్

ప॥ అతని మర్మముదెలియ నలశ్రుతులకును నలవె
అతితుర్య భక్తిగల యయ్యలకెగాక ॥అత॥

అలరుచును బహురత్న హారములలో జొచ్చి
తలచగను నందేక సూత్రమున్నటులన్
తెలియసర్వము జొచ్చి దీపించ పరమాత్మ
కలయకను నిర్దైబ్ట కదలకను వెలుగున్ ॥అత॥

మరిపద్మ బాంధవుఁడు మహదాది జగములును
తెరపి లేకనునిండి దివిప్రబలినటులన్
పరమ భక్తులమనో పంకజంబున నిల్చి
నిరతమును పూదోట నిర్వాణి వెలుగున్ ॥అత॥ —15

అతితుర్య బీజమున నకలంకమగు కిరణ
తతులతో ప్రకృతియను తరువు ప్రబలగను
హరిత భాను చంద్రులును నుదయమై త్రైవర్ణ
ప్రతికొమ్మలను జగము పరగ విరచితమూ

ప॥ వటమూలమున కేవల రాజయోగియును
ఘటములోపల దీపకళిక గతివెలుగు ॥వట॥

సరిగ యుపశాఖలై షడ్భ్రమ్మలమరుండు
తరచు పత్రములునై మెరతురు దిక్పతులున్
పరపు టూడలులతలు పంచభూతేంద్రియములు
నెల పూలపిందెలును నిండు భువనములన్ ॥వట॥

అలపుణ్యా పాపంబులను ఫలంబులుదనకు
ఫలభోక్తుడై యున్న బద్ధ జీవుడును
తెలివిలో తనదివ్య దేహంబు మరచియును
తలచకాకిగ నడ్డు తనువుల చరించున్ ॥వట॥

కలగి యాత్ముడు గురుని కరుణచే నేర్కనుచు
అనలనేత్రము దెరచి అఖిలమును గాల్చి
చనుదెంచి పురుషుండు సత్కళలపై నెపుడు
గణుతించి వెలినిర్వికల్పుని గాంచున్ ॥వట॥

పరిపూర్ణమగు జ్యోతి ప్రభలపై పూదోట
పరమాత్ముడను పండు బయట మెరయగను
పరిశుద్ధుడై జీవపక్షి చివ్వున ఏగసి
స్థిరఫలంబంటితా చిద్బ్రహ్మమగుగును ॥వట॥—16

## దశవిధనాదోదయం

అలరు నిర్బీజమున నమృతాంకురము మొలచు
సొలయ నోంకారమున జ్యోతియే పుట్టున్
బలిమి శింజిని రవము ప్రణవమున ఘోషించు
తలచ ఘంటారవము దానను దయించు

ప॥ త్రివిధ వర్ణములపై దివ్యాంత రంగమున
వివరించ నిర్గుణుడు వెలుగు నెప్పుడును ॥త్రివిధ॥

అరయ ఘంటీకరవమునందు శంఖధ్వనియు
స్థిర శంఖధ్వనియందు తింత్రిణీరవము
నెరతింత్రిణీ నాదమున తరుచు తాళధ్వనియు
నురువడిగ దాన వేణురవంబు కలుగు ॥త్రివిధ॥

ఘనవేణు నాదమున చనుమృదంగ ధ్వనియు
పైనగిదానను వెడలు భేరీరవంబు

కనుగొనగ భేరీరవమున మేఘగర్జనయు
వినగ కర్ణముల దశవిధములై పలుకు ||త్రివిధ||

పరమాత్మ ముఖకళను పరమామృతముజారి
గురుతుగానది చంద్రగుండమున దుంకి
మరి సుధారసమగుచు మర్మబిలమున బారి
సరగరస నాగ్రమున షడ్రుచులు నిచ్చున్ ||త్రివిధ||

కలసి రవి శశి వహ్నిపై సర్వశూన్యమున
బలిమి సహస్ర రేకుల పద్మమునను
నిలిచి వెలిగెడి ముక్తి నీరజాక్షికి నవల
తలచి పూదోట నిజధర్మాత్మగంటన్ ||త్రివిధ||—17

## ప్రణవోదయం

పరమ చిన్మయమునందు నెరమాయ యుదయించు
అరయగా ప్రణవంబు నచటనుద్భవమూ
మరియు నాదమున బిందు మహదాది జగములా
సొరిది యన్నిటజొచ్చి వెల్గును వెస్వామిా!

ప. సగుణ నిర్గుణమై సచ్చిదానందమున
నిగమాంతరంగమున నిలిచి వెల్గుదువె ||స||

యలరు రూపత్రయంబున నఖిలంబు నడుపుచును
సొలయు విశ్వము పురుషసూత్రంబుచేత
నళినాక్షు సర్వమును చెలగియాడించి తుద
జలరాసిపై నీవు నిలిచి వెలుగుదువె ||స||

దినమణియు బహుకోట్ల దివ్యప్రకాశమై
గుణశూన్యమున ప్రబల ఘనజ్యోతిబయట
తనరు పూదోట నిజధర్మాత్మ నినుగూడి
యనుదినము తన్మయానందమున మెరతు ||సగు||—18

## యోగమాయ

ఒక్క గడియలోను సచరాచరములన్ని
　　వాక్కున నిర్మించు పడుచూ
సాక్షించి త్రైమూర్తులాదిసర్వము తన
　　చూపుల నాడించు పడుచూ
గ్రక్కున జీవరాసుల కాలమెరిగితన గర్భములో
　　నుంచు పడచూ
నిక్క చూడగ మదిని నిర్వాత దీపగతి
　　నిండివెలుగు బైటపడుచు

ప॥ చూడరే చూడరమ్మ సద్గురు స్వాములకు
　　దివ్యసుందరైన కన్నెపడుచూ
వేడుకతో వేదాంతరంగమున వెలుగుచుండెడి
　　ముద్దు పడుచూ ॥చూడరే॥

చంద్ర తననునరుచులు క్రమమున యిచ్చుచు
　　ఘనతతా మెరసెడి కన్యపడుచు
తండ్రికి కూతురై వరుసదప్పిక సతిని
　　తండ్రిని కోరినపడుచు
తండ్రి తండ్రికి ధర్మపత్ని తానగుచు
　　మేటిదాతలు పొగడు మేటి పడుచు
తండ్రి సెలవుచేత తనయుల చేపట్టి
　　తారక పదవిచ్చు పడుచు ॥చూడరే॥

పంతుమీరుచు రత్న పీఠమధ్యను
　　పువ్వుబంతులాడుచునుండు పడుచు
పంతుమీర విమల ముఖకళల చిరుచెమట
　　పసువాడి జిగిగాలెడి పడుచూ
సంతతముచు సత్తు చిత్తు ఆనందమున
　　సాముగాసము చేయు పడుచు

వింతలుగా దశవర్ణములపాట వీణమీటుచు
పలుకు పడుచూ ||చూడ రే||

ఆజ్ఞ లేక బిందుపీఠ మధ్యను చారుహంసయై
క్రీడించు పడుచు
సుజ్ఞానులైనట్టి సుజనుల తనయమృత
చూపుల దయసేయు పడుచూ
సంజ్ఞతో నిరతము సచ్చిదానందమున
చాల ప్రబలుచు నుండు పడుచు
విజ్ఞానమగు స్వయం జ్యోతియై నిర్భైట
చాలవెలుగుచు నుండె చిన్నిపడుచూ ||చూడ రే||

మొల్లమైన రత్నసొమ్ములు పైనిండ
మొలకనవ్వుల మేటిపడుచు
కల్లవీడగ ఘంటవేసి చిన్మంత్రమున
శ్రీగురుని పూజించు పడుచు
చల్లనిచూపుల భక్తుల లాలించి
స్తన్యపాన మిచ్చుపడుచు
అల్లిబిల్లిగ పూదోట రాముని వద్ద
ఆనందముగ మెలగు పడుచూ ||చూడ రే||—19

## మాయ

పంచ నుండి కర్మిణీ ! ప్రకృతిరూపులుదాల్చి
పంచబ్రహ్మలపైని కులుకుచు మించి
లోనువెలి మెరసి తిరిగెదవే

ప. ఉండకు మాయలతొత్తా నా అండ జేరి యిక నీవు
చండి యిదుగో సుజ్ఞాన వాలుచే
ఖండించెదనిను కదకు తొలగుమీ ||ఉండ||

 

పట్టైన ముప్వరను ప్రకృతిమాయనుముంచి
గట్టిగ నీవును కడమ ద్వారంబున
దిట్టవైతివా తిమిరము జూపుచు ॥ఉండ॥

పరమజ్ఞానుల యోగ భగ్నముజేయుచును
అరుదుగబైట నవిద్యకుబింబమై
పరి పరివిధముల భయపెట్టెదవే ॥ఉండ॥

వివరించినీతావు నెవరైన గనలేరు
రవి చంద్రానల రంగస్థలమున
శ్రీ గురు సన్నిధి చిందుద్రొక్కెదవూ ॥ఉండ॥

రంపెలాడి ! పూదోట రాముసంటితినీ
సొంపున విమల జ్యోత్యంతరమున
నింపుగ బయటను నేవెలుగుదునే ॥ఉండ॥ —20

## మాయా బద్ధులు

గురుసుతులచే బిక్షగుడిచి ఆనందులై
పరగ బాలోన్మత్త పైశాచవృత్తిన్
పరమాత్మ రూపులగు పరమ హంసలజూచి
కరుణలేకనువారి గదిమి తోలుదురు

ప॥ కన్నుగానక విషయ కాపురము నేయుచును
కన్నతండ్రిని నిన్ను గలియు టేలాగు ? ॥కన్ను॥

చిత్తగుణములు జెరచి సృష్టిలో మెరయుచును
సత్తుగుణములధరను సంచరింపుచును
హత్తిసుజనులగూడి ఆటలాడగజూచి
మత్తులై యిలజనులు మత్సరించెదరు ॥కన్ను॥

దురితమగు సంసార దూరస్థులైనిలిచి
అరయచిన్మయ హంసలై మెలంగుచును

కరుణతో పూదోట ఘనుని గలియుచు నెపుడు
నిరుప మా నందమున నిలిచి ప్రబలకను ॥కన్ను॥—21



మాయతనువులుదాల్చి మహిమీద నుదయించి
మాయచే చిక్కబడి మతి చెలనులగుచు
మాయ సతిసుతులపై మమకారములు గలిగి
మాయసంసారాబ్ధి మగ్న లౌదురను

ప॥ కటకటా యిటువంటి కర్మజీవులు నిన్ను
ఎటువలెను యెరిగెదరు యీశ పరమేశా ॥కటా॥

మాయగృహముల నిలిచి మాయధన ధాన్యములు
మాయచే గూర్చుచును మాయకులజులకూ
మాయ యశములకునై మరియు రక్షింపుచును
మాయరహితులజూచి మత్సరింతురనూ ॥కటా॥

మాయకామాంధులై మహిమీద పరసతుల
మాయచే వీక్షించి మన్మథవిరాళిన్
మాయశునకములగతి మగువ వెంబడి దిరిగి
మాయచే యిలమీద మసిసి పోవుదురూ ॥కటా॥

మాయసంపదజూచి మరియిన్ని నిజమనుచు
మాయ ప్రజలనుగూడి మరి చరింపుచునూ
మాయ భోగంబులకు మదిజొనుపుచును చాల
మాయయగు భవాంబుధిని మరిమునుంగుదురూ ॥కటా॥

మాయలను ఖండించి మరిగి దేశికస్వామి
మాయరహితంబైన మార్గమును దెలుప
మాయలకు దూరమై మర్మమగు పూదోట
నాయకునిగూడి తుదసమ్మి నిలువకున్నూ ॥కట్టా॥—22

ధరచరులు గిరిచరులు ఖేచరులు
నరయగ నిశాచరులు నాదిసిద్ధులును
సరసమగు పాతాళ సప్తలోకములజడు
గొనర యూర్ధ్వ లోకముల వారునిందరును

ప॥ మలినులై దుర్మతులు మాయచే చిక్కబడి
యల జిహ్వాగుహ్యసుచులాసించి చెడిరి ॥మలి॥

ఒనర ముల్లోకములవారు దిక్పాలకులు
తనరుఋషి. బృందమును తలప మనువులును
కినిసి సంసారమను వసధిలోపల మునిగి
ఘనమైన ముక్తిమార్గము తెలియలేరు ॥మలి॥

వలసి సద్గురు పాదవనజములు సెరనమ్మి
చలన మించుక లేక సద్భక్త వరులు
నిలచి పూదోటతుద నిర్గుణబ్రహ్మమును
గలసి సుస్థిర శూన్య గాత్రులగుదురుగా ॥మలి॥—23

## యోగమాయ

వగలు జూపుచు నీలవర్ణమగు బహుకర్మి
సగుణరూపములైన సచారాచరములన్
మగువ తనమాయచే మహిజీవకోటులను
అగణిత భవాంబునిధి నందరిని ముంచున్

ప. 'ఇంత' యగు పెనుమాయ నెవరు గెలువగలేరు
పంతమున నిర్గుణ ప్రభువొకడుదక్క ! ॥ఇంత॥

ఇందరికి తల్లియై యెలమి వేదాంతమున
పొందుగా వెలుగొందు భూరితేజమునై
మందహాస ముఖారవిందమున శోభిలగ
నందరికి పై సాక్షియగు యోగమాయ ॥ఇంత॥

గురుతుగా సర్వమునకును తండ్రివై తుదను
సిరిమించు సాకారచిన్మయుని కవలన్
పరికించి పూదోటపైన సద్గురుస్వామి
నరయగ నిరాకారమై ప్రకాశించు ॥ఇంత॥—24

## మాయ

పరమ గురుని దివ్యముఖప్రభల నుదయించు
పెరుగుచు మాయల శక్తి పెంపుదీపించు
పరునియెదుట నిలువలేక పరగి యేలెంచు
తరుణి మనోబలమున నురువడిగా చరించు

ప॥ తెలియజెప్పెద వినరయ్యా ధీమంతులారా !
బలిమైన చెనటిద్రుంచి పరుని గలియరయ్యా ! ॥తె॥

నిలిచి యఖిలమును కూర్చు సిమిషమునందు
కలిగి మోక్షద్వారమున కావలియుండు
బలిమి తామసబింబమై ప్రబలుచునుండు
తెలియ భూతకోట్లలోను తిరుగుచునుండు ॥తె॥

గర్వించు ముగ్గురి చిత్తమును కలకపరచును
ఉర్విలో వేషధారుల జెరచి కేరును
గురువులు వీక్షించ మాయ పరువులెత్తును
సర్వమగు పూదోటస్వాముల జూడ వెరచును ॥తె॥—25



పంచ వింశతితత్త్వ ప్రకృతిదేహములు మాయ
యెంచనలవిగాని రూపులెన్ని యైతివే
పంచవర్ణములును మరి పంచబ్రహ్మలును
పంచశక్తులును ప్రపంచ జాలములు

ప॥ ధరణి జలమును వహ్ని తనరుమారుతము బయట
అరయుగను విశ్వరూపములన్ని యైతివె ॥ధర॥

పరిపరి విధముల బయటను లోపల
మరువక తిరిగెడి మాయల త్రొత్తా! ॥ధర॥

ముగురు మూర్తులకు నీవు మొనసి పత్నివై చండి
వగలు జూపి సంసార వార్ధిలోను ముంచితివే! ॥ధర॥

సగుణ రూపమగు సర్వజీవుల బట్టి
మగువరో నీనగు మాయదిప్పెదవో ॥ధర॥

ఎదురు లేక నీ వెపుడు నేపు మీరుచు చెసటి
కదసిముక్తి ద్వారమందు కావలందువే ॥ధర॥

తుదను పూదోట సర్వాత్ముడౌ గురునికడ
మెదలకిపుడు బలు వంచన కదలుమిక ॥ధర॥—26



వరుస జలచర భూచర ఖేచరాదులును
పరికించ నజ్ఞానబద్ధులై చెడిరి
హరి హర బ్రహ్మాదులలరి సంసారమను
శరధిలోమునిగి యొక దరి గానరైరి

ప. ఇట్టి మాయలశక్తి నెవరు గెలువగలేరు
అట్టి లండిని ద్రుంచు నచల గురుకృపను ॥ఇ॥

అలరు జంగమ స్థావరాది ప్రపంచమును
చెలువొంద బహుకోటి జీవరాసులను
మలినులగు సందరికి మాయయై శోభిల్లు
తలపమోగ మాయయను తరుణి మూలమహా ॥ఇ॥

ఘనత విద్యా విద్యలనుమించి చిన్మయుడు
చెనగి యిన్నిటికి తుద బీజమై వెలుగు
వనర పూదోటపై వరనిరంజనుడనై
తనరి సుస్థిర శూన్య తత్త్వమై యుండు ॥ఇ॥—27

## అహంకారము

హంకారమున చెడిరి అవనిపై సుజనులు
హంకారమున జెడిరి యరయ కిన్నరులూ
హంకారమున జెడిరి యలరు కింపురుషులును
హంకారమున జెడిరి యరయ గంధర్వులు

ప॥ యిట్టి హంకారరిపు నెవరు గెలువగలేరు
గట్టిగా నిర్లేప ఘనులొకరు దక్క౯ ॥యిట్టి॥

హంకారమున జెడెను అలగరుడోరగములు
హంకారమున జెడిరి అలరు గీర్వాణుల్
హంకారమున జెడిరి అలరు దైత్యులసురలు
హంకారమున జెడిరి అలపతివ్రతలు ॥యిట్టి॥

హంకారమున జెడిరి యరయ ఋషులునుమునులు
హంకారమున జెడిరి సరసిద్ధవరులు
హంకారమున చెడిరి యలరు సద్యోముక్తులును
హంకారమున చెడిరి నల శాస్త్రజ్ఞానుల్ ॥యిట్టి॥

హంకారమున చెడిరి యవని గురువులు నిగుల
హంకారమున జెడిరి యమిత భక్తులునూ
హంకారమున జెడెను సరయ మూర్తిత్రయము
హంకారమున చెడెను అల సువిద్యయును

హంకారమున జెడెను నలవిమల పురుషుడును
హంకారమును లేక అచల సుజనులును
హంకారరహితమై అలరు పూదోటను ని
రాకార గురుని గూడలరి ప్రబలుదురూ ॥యిట్టి॥—28

## మన్మథుడు

చిలుక తేజినిఎక్కి మెలగి రతివల్లభుడు
కలితహా గేదంగిరేకు బాకు మొలను
నిలిచి మెరయగ చుట్టుచెలగి పికమధుబల
మొలసి వెనువెంట కొలువగ వేటవెషలు

ప. హరి హర బ్రహ్మాదులాది జీవుల నెల్ల
పరికించ నీరీతి జెరచు మన్మధుడు ॥హరి॥
కనుగొనుచు సంసారమనెడి కారడవి తా
తనరి తీవ్రత మరుండను వేటకాడు
చనుచు చెరుకను వింట సంధించి పూదూపు
లను జనుల చిత్తంబులను చెదర వేయు ॥హరి॥
సతులనెడిపెను యుకులు చాలనిర్మించి తా
మదిలో విచారించి మహిపురుషులనెడి
మత్తులగు మృగంబులను ధరణిపై బడగెడపు
మతిమంతులార ఈ మర్మంబు దెలుఁడీ ॥హరి॥
అలరుచును జిహ్వా గుహ్యాల రుచులు ప్రేరేచి
బలిమిగా త్రైవస్తువులు గుడువబెట్టి
మలినమగు నజ్ఞాన జలరాశిలోముంచి
కలుష భవపాశముల కట్టునా తులువా ॥హరి॥
కాము వలలను బడక నిలయోగి పుంగవులు
స్వానుభవముచేత సద్గురుని పదము
పూని పూదోటకడ భోరుసను సమకూడి
మేనులైదును చాల మించి వెలుగురు ॥హరి॥—29

---

మరుని పుట్టువు మూలమర్మంబు నెరిగింతు
నరయగా మొదట పరమాత్మునందునమా
సరగ నిర్గుణ సత్రియు జననమగు దానిముఖ
మొరుగు కళలంపు హరి మెరసియుర్భవమగు.

ప॥ హితవుతో జెప్పెదను నిలమీదజనులార
రతివల్లభుని మాయ రభసంబునేను ॥హిత॥
అలరు నా పోజ్యోతి యను విమలస్వాంతమున
మరి నవిద్యయ నెడి మన్మధుడు వెడలుచును
సొలరి నారాయణుని సుతుడ నెడి నాపేరుచే
చెలగి ముల్లోకముల చరియించునయ్యా! ॥హిత॥
మునుపు రుద్రునికంటి ఘనవిజయ వహ్నిచే
నొసరదగ్ధంబునై వాలాయముగను
మొనసి కూలక బ్రష్టు ముదనుఃతో నెప్పుడును
తనరుచు ననంగుడై ధాత్రిపై మెలగు ॥హిత॥
దొగసి స్త్రీపురుష జాతుల మనంబుల నిల్చి
మొనసి రతిమోహములు నెరయ ప్రేరేచి
విరివైన సంసార శరధిలోపల ముంచి
నరకముల బడద్రోసి నగును కను తులువ ॥హిత॥
చెలపట్టి ఎంతవారల జెరుచు నీ చెడుగు
కలిత విజ్ఞానులును ఖండించ లేరు
బలిమైన పూదోట బ్రహ్మంపు గురుసుతులు
గెలిచి నిర్మోహమున నిలిచి వెలుఁగుదురు ॥హిత॥ — 30

## ఆశ

ఆశయను లతలచే నఖిలజీవులు చాల
ఆశలను కట్టుబడి అవనిలోపలను
ఆశచే సతిసుతులు సలధనంబులమీది
ఆశచే సంసార వార్ధిమునుఁగుదురూ
ప॥ ఆశలుడిగిన తండ్రు లాత్మరాముని పదము
నాశచే గొలిచి తుద నమృతులౌదురునూ ॥ఆశ॥
ఆశచే దుష్కర్మమలరి జేయుచు చాల
ఆశచే మృతులగుచు నర్కసుతుపురికి

ఆశచే నుసుకుచును అచట బహుయాతనలు
నాశకుల యమభటులు నలరి మొత్తుదురూ ॥ఆశ॥

ఆశచే బహుకాల మలపరించటు మీాద
ఆశచేయిలమీాద నలరి మానవులై
ఆశచే పుణ్యములు సమర జేయుచు నాక
నాశచే నిష్ఠులై నరుగుదురు దివికీ ॥ఆశ॥

ఆశచే స్వర్గసుఖ మనుభవించటు మీాద
ఆశచే మర్త్యమున కరగి తీవ్రమునన్
ఆశచే భవదుఃఖమను వనధిలో మునిగి
ఆశచే గురునిమహి ఆశించబోరు ॥ఆశ॥

ఆశచే విజ్ఞానమనెడి కొడవలి చేత
ఆశలని యెడితాళ్ళ నలరి ఖండించి
ఆశచే పూదోట అభవు పాదాబ్జముల
నాశచే సేవించరయ్యె! జీవులును ॥ఆశ॥—31



ఆశలుడిగిన యపుడె సజ్ఞానమును తొలగు
ఆశలుడిగిన యపుడె అఖిలమును చెడునూ
ఆశయుడిగిన యపుడె అణగుత్రిగుణములును
ఆశయుడిగిన యపుడె యకలంకడౌను

ప. పరమశాంతులునైన బ్రహ్మనిష్ఠులు వినుడి
అరసి మీాకును నేను అలరిజెప్పెదను ॥పర॥

ఆశలుడిగిన యపుడె అన్నిభ్రాంతులుదెగును
ఆశయుడిగిన త్రివిధ హంకృతులు నురుకూ
ఆశలడిగినయపుడె అచలుడై తానిలుచు
నాశయుడిగిన యపుడె యానందమయుడౌ ॥పర॥

ఆశలుడిగిన యపుడె అలసంశయము చెడును
ఆశలుడిగిన యపుడె అడగుద్వంద్వము లా

ఆశయుడిగిన యపుడె నణగుౖతివాసనలు
ఆశలుడిగిన యపుడె అమితవిౖశాంతి ॥పర॥
ఆశయుడిగిన యపుడె అన్నిసాధకమాను
నాశయుడిగినభక్తి యపుడె యుదయించున్
ఆశయుడిగిన యపుడె అధికతృప్తుడునగును
ఆశయుడిగిన యపుడె అమితజ్ఞానుడునా ॥పర॥
ఆశయుడిగిన యపుడె అతితుర్యపురుషుడౌ
ఆశయుడిగిన యపుడె అద్వితీయుడునౌ
ఆశచే పూదోట కవల నిౖష్క్రియుగూడి
ఆశలను తాద్రుంచి అమృతుడై మెలగూ ॥పర॥—32

## మనస్సు

మనసు నష్టంబైన మరి యవిద్యయు చెడును
మనసు నష్టంబైన మడుసు భూతములు
మనసు నష్టంబైన మారుతములయ మొందు
మనసు నష్టంబైన మడసు ౖతిగుణాళి
ప॥ బలినైన మనసు మరి భగ్నమానంతలో
అలరి నిర్గుణ ౖబహ్మమపుడె వెలుగొందూ ॥బలి॥
మనసు నష్టంబైన మాను నింౖదియచయము
మనసు నష్టంబైన మడుసు షడ్గుణముల్
మనసు నష్టంబైన మరివ్యసనములు చెడును
మనసు నష్టంబైన మరి ౖభమలు చెడునూ ॥బలి॥
మనసు నష్టంబైన మరి యవస్థలు దొలగు
మనసు నష్టంబైన మదములు నణగున్
మనసు నష్టంబైన మడసు కర్మములన్ని
మనసు నష్టంబైన ౖమగ్గు సంశయముల్ ॥బలి॥
మనసు నష్టంబైన మాయకోర్కెలు దీరు
మనసు నష్టంబైన మన్మథుడు చెడునూ

మనసు నష్టంబైన మడుసు సంసారమును
మనసు నష్టంబైన మదియు విమలమునా ॥బలి॥
మనసు నష్టంబైన మరిదివ్య పురుషునను
మనసు తుద మెలగుచును మరిశాంతులైయూ
మనసు పూదోట రాముని గూడి నంతనా
మనసు తన్మయ మంది మరిప్రకాశించు ॥బలి॥—33

## సంసారం

ఇలమీది పురుషులను చలనమృగముల జూచి
చెలగి మన్మధుడనెడి చెడు వేటకాడు
చెలపట్టి స్త్రీలనెడి బలువురుల గెడపి
యిలపలువ యెట్టివారల బ్రమలబెట్టు

ప॥ ఇట్టిమాయల తులువ నెవరు గెలువగలేరు
గట్టిగా నిర్లేప ఘను లొకరు దక్క ॥ఇట్టి॥

చెరుకు విల్లునుబట్టి చిలుక తేజినిఎక్కి
అరయు తుమ్మెద కోకిలాది బలములును
పరికించి కొలువ మహి పరమజ్ఞానుల చిత్త
మరసి పూబాణముల గరిదూర వేయు ॥ఇట్టి॥

వలసి మోహంబులను వలలనిర్మించి తా
చలన మొందించి బహుజంతు కోటులను
తొలగనీయక చిక్కు వలలోన పడద్రోసి
పొలయించు యీ వెడుగు పొసగ యిన్నిటిని ॥ఇట్టి॥

తనకు త్రిమూర్తులను తలప మునినికరమును
వనజాక్షులాదిగా వసుధపై జనుల
కనుగొనగ నూర్ధ్వ లోకము వారల వినుడి
పనిబూని సంసార వనధిలో ముంచు ॥ఇట్టి॥

పరిశుద్ధులార నాపలుకు నెరనమ్మిమది
నరలేని భక్తితో నతి శాంతులగుచూ

సిరిమించు పూదోట గురుని పదమునగూడి
నిరుపమానందామృత శరధియై నిలుడీ ॥ఇట్టి॥—34

అరయ స్థావర జంగమాదులకు పట్టైన
గరిమె పృథివిని గొడుగుగా మెత్తవచ్చు
వరస జలరాసు లే డొక్క నిముసమున
సరగ చివ్వున దాటి మెరయగా వచ్చు

ప॥ హరిహర బ్రహ్మాదులైన సంసారమను
శరధి దాటగ లేరు ధర జనులకలవే ॥హరి॥

ఘనత పదునాల్గులోకములు దాటగవచ్చు
తనరి యాకాశమును దాటంగవచ్చు
ఒనర త్రైభువనంబులును దాటగవచ్చు ॥హరి॥

కనుగొనుచు కాలచక్రము దాటగావచ్చు
వలసి భక్తులు గురుని వాక్యమును నెరనమ్మి
యలరి భవదుఃఖమను అంబుధినిదాటి
నిలిచి పూదోటపై నిర్గుణ బ్రహ్మమును
గలసి సత్పథునై ఘనత మెరయుదురు ॥హరి॥—35

మురికి వాగును బార నలతృణంబులు గూడి
స్థిరముగా తెప్పయై సుడిబడినరీతి
గురుతు సతిసుతుల బహుకూటమా పురుషుండు
మరణమై చనువేళ మరియెవరు లేరు

ప॥ పసలేని సంసారబద్ధులై దుర్జనులు
పుసిగాయలో పురుగు నశియించు విధము ॥ప॥

ధనధాన్య బహుసంపదలు నిత్యమని మదిని
తనరి మాయాభోగములకు సొలయుచున్న

క్షణభంగురంబిదియు సంతకూటంబనును
మనసులో దెలియకను మహిని బ్రాలెదరు ||ప||

కపటులై ధరపైని ఘనయోగి పుత్రులను
చపలమగు కృత్యములు చాలజేయుచును
నిపుణులై పూదోట నిజగురుని దెలియకను
కుపితులై నరకముల గోడుగుడిచెదరు ||ప||—36

## మాయాబద్ధులు

పరికించ మదిలోని భ్రమసి సరపసువులును
మరుని తూపులచేత మది చలింపుచును
ధరకేళి మృగములై తరుణి వలపులజిక్కి
నెరపచ్చి కుండగతి విరిసి పోవుదురు

ప॥ ఘనయోగి నీమాయ గడవ నెవ్వరివశము
మునుపు ముగ్గురి నిశిముంచితివె తండ్రీ ॥ఘన॥

తెలివిచెడి పంచేంద్రియములకు మది జొనుపుచును
మలినులై సంసార మగ్నులై మరియు
చలనులై బహుకాల చక్రమున దిరుగుచును
ఇలజనులు నీపదము కలియరేలాగూ ॥ఘన॥

పరమాత్మ మీకృపకు పాత్రులగు సజ్జనులు
నిరతమును మదిలోను నిన్ను ధ్యానించి
సిరిమించు పూదోట జితయోగి మిముగూడి
మెరసి మాయను దరిమి మించి ప్రబలుదురే ॥ఘన॥—37



సతి సుతులు మిత్రాది బహుసంపదల జూచి
మదినిదియు నిత్యమని మహిని దుర్జనులు
అతి మోహలతా తృణ మామునోన నూతిలో
హితవుతో మునిగి తుద హీనులై చెడరే

ప॥ నిటలలోచన ! జనులు నీమాయ పీడించ
కటకటా నీ మనసు కరుగదా స్వామీ ! ॥ని॥

మురిసి పిల్లియు కంచ మరుత గాచిన రీతి
సతులకాసించి భ్రమసి దుర్మతులు
గురుతుగా కూడి బహు కుంభినీ నరకముల
మరి యమునిభటులచే మల్లడించెదరూ ॥ని॥

నిలచిమిము నుతియించు నిజభక్తకోట్లగని
పలకరింపుచు ముక్తిపథము దెలుపుదువె
అలరు పూదోట నిఖిలాత్మ నినుగూడి న
నిలిచి ఆనందమున నిండివెలుగుదువె ॥ని॥—38

---

మురికిలో జన్మించి మురికి కాయమునమ్మి
యరసి పోషింపుచు సత్యాధి! మోహమున
మెరగు వస్త్రాలును నాభరణములు ధరియించి
మురికి దేహమున కెంత భ్రాంతిపడుదురును

ప॥ జన నేంద్రియములగూడి సంచరించెడి జనులు
గుణరహిత నీపదము కూడు టేలాగు ॥జన॥

గర్వులై గృహములను కాపురము జేయుచును
సర్వపాపాత్ములై జగతిలోపలను
గురువు దైవంబని గురుతుదెలయక జనులు
తరుపుగతి ధరపైని దగ్ధమగుచురుగా ॥జన॥

కులగర్వులైధరను గురుయోగి జనులమది
కలుకజేయుదురు శివఘాతకులు నెపుడు
తలపులో పూదోట ధర్మాత్మదెలియకను
మలినులై యిలలోను మడిసి పోవుదురే ॥జన॥—39

---

పలుగాకులై ధరను పరమ భక్తులజూచి
కులగోత్రములు నడిగి గొణిగి తిట్టుదురు
మలరహితమైన నిజగురుయోగి మతమరసి
తెలియకను యముని దెబ్బలకు లోనైరి

ప॥ కలియుగములో జనులు ఘనుల దుషించిరా
వలసియగ్నిని తామె వడిగట్టినట్లే ॥కలి॥

నిలిచి బూడిదలోను నిప్పుదాగినరీతి
మలినులందును యోగి మరియణగియుండు
తెలియ గురుసుతులలో దినకరునిగతి ప్రబలి
నిలిచి పూదోటపై నిజగురుడు వెలుగు ॥కలి॥—40

## గుణబద్ధులు

గురుని దెలియక విషయగురువు నిజమనిచూచి
ధర క్రూరమతులు కొందరు గర్వులగుచున్
పరుని దెలియక కర్మ ఫలము లాసింపుచును
నరగ జననంబునకు తిరిగి వత్తురునూ

ప॥ గుణములనుద్రుంచి నిజగురుని పదమునగలసి
ఘన దివ్యదేహులై ఘనత మెరయుదురును ॥గుణ॥

సమకూడలేకనిల సంసారబద్ధులై
కుమతులై సద్గురుని కూడనేరకను
మమతలను చిక్కుబడి మరికర్మజీవులై
విమలమగు నిజగురుని వివరింపలేరు ॥గుణ॥

పరుని దెలియక కర్మపదవులును నాసించి
పరమ యోగము మరచి భ్రష్టులై మరియు
గురిమీరి పూదోట గురుని గూడక తాము
పరమ శోకమగుచు ప్రబలు పెలాసు ॥గుణ॥—41

# జ్ఞాన — హాస్యలు

పరమాత్మముఖ కళను భవమొంది పురుషుండు
తిరిగి మదిలోనె నసి తీవ్రంబుగాను
పరగ జీవుడు సూర్యకిరణముల నిలచితా
నిరతమును కాలమున కరసి చూడగను

ప॥ తవిలి యజ్ఞానమున తన్నుదామరచియును
గురుడు వివరించ నిర్జీవి ఘనపదమగును ॥తవి॥

సతిపతుల మహిలోన రతిసేయ జీవుడును
పతివీర్యమున జారి సతి యుదరమునను
అతిశోశరక్త లీనంబగుచు జీవుడును
ప్రతిదినము మదిలోను పరమాత్ము దలచున్ ॥తవి॥

శిరసు మొదలుగ దేహ భరితాంగములు బెరిగి
మురికి తిత్తిలోనిలిచి మురికి ద్రావుచునూ
పరిపక్వమై మాయపటలమును బోదన్ని
తరుచు గాలిని జీవి తల్లక్రిందగుచూ ॥తవి॥

కమ్మదీసినరీతి ఘనమైన కాకచే
సొమ్మసిల్లగ తల్లి సూక్ష్మద్వారమును
నిమ్మచేసుక వెడలి ఇలలోను పొగులుచును
హమ్మచే జ్ఞానశూన్యాత్ముడై నిలుచున్ ॥తవి॥

అతిమోహమున తల్లి అనుదినము పోషించు
మతిచెడియు జీవుడును మాయలోమునిగి
చతుర్యగములకును చలనమున దిరుగుచును
క్షితి చావుపుట్టువులు హితవతని కగునూ ॥తవి॥

విరివిగా వసుధపై విజ్ఞాన పురుషుడై
స్థిరముగా సద్గురుని సేవజేయుచును
కరిగించి గుణములను గగనాంతరంగమున
మెరసి తనరూపమ్ము సరసి చూడగను ॥త॥

నిలిచి హృదయాబ్జమున నిర్వాత దీపగతి
అలరి దివిభువి దిశలు నంటి వెలుగుచునూ
బలమైన పూదోట బ్రహ్మంబు గూడితుద
తలప కేవల శూన్యతత్త్వమై యుండున్ ॥తవి॥—42

## సంసారబద్ధులు

తనువులోపల దివ్యతనువు దెలియక జడులు
తనువు మరచియు మురికి తనవు తామనుచున్
తనువుకొరకై సతుల ధాత్రిలో పెండ్లాడి
తనువు సతిసుతులనుచు తలచిసొలయుదురు
ప॥ సంతతము తమమదిని సద్గురుని దెలియకను
చింతా పరంపరల చెడిరి దుర్జనులున్ ॥సం॥
ఇరువుగా ధరమీద నిండ్లు గట్టుచుజనులు
తరుచు సంపదలచే తగిలి మురియుచును
మురికిదేహము తాను మొనసి పోషింపుచును
పరికి సతులనుజూచి భ్రమసి చెడుదురను ॥సం॥
కలగర్వులై జనులు గుమిసి యాడుచుమదిని
కలకాలమును సతుల గవసి తిరుగుచును
కలువరింపుచు విషయ కాంక్షలను తగులుపడి
మలములో పురుగుగతి మడిసిపోదురును ॥సం॥
మరియు సతి సుతులకై మాలపాటునుబడుచు
అరసి పరధనములును నాక్రమింపుచునూ
మురియుచును సూకరంబులరీతి బక్షించి
నరకములబడి జనులు వరలుచుందురను ॥సం॥
పలుగాకులై జనులు పరమ భక్తులజూచి
కిల కిలను నగుచు ధర గేలి చేయుచును
బలసి పూదోట నిజయోగనంటకగదా !
[illegible] ॥సం॥—43

## పశుయజ్ఞ ఖండనము

కులగర్వులై మహిని క్రూరులగు దుర్జనులు
తులువలై జ్ఞానులను దూషింతు రెపుడున్
అక్షరుని దెలియకను నక్షరాటవి మునిగి
చిలుకల వలెన్ పలికి చెడిరి దుర్మతులై

ప॥ చిద్వహ్ని జ్వాలలను జీవపశువును వ్రేల్చి
సద్విచారామృతము చాల ద్రావరను ॥చిద్వ॥

నిర్మలుల మనిధరను నీచు నీళ్ళను మునిగి
కర్మ త్రాళ్ళను చాల కట్టుబడి ఎపుడున్
దుర్మార్గులై ధరను దుర్దానములు బట్టి
ధర్ములను జూచిమది తలచి తిట్టుదురూ ॥చిద్వ॥

తొలుదొలుత మేకపోతుల మెడలవిరిచియును
పలువెరంగుల జాల చెలగి మెసగుచును
ఇల సంపదకు జీవహింసలను జేసితుద
బలమైన యమమృత్యు పాలైరి జడులున్ ॥చిద్వ॥

సోమయాజుల మనుచు సొంపుమెరయుచు భువిని
సోమకల్లుల రసము సొలసి త్రావుచునూ
కామయుతులై విషయ కాంక్షలకు దిరిగినను
సోమయాజుల నెత్తి సొడ్డేసెరంభా ॥చిద్వ॥

వలసి విత్తముగోరి వరసతీ సుతులకై
యలరి శాల్యాన్నములు నారగింపుచును
తెలివిలో పూదోట దేశికస్వాములను
తెలియనేరక నరకముల బడిరయ్యా ॥చిద్వ॥—44

## మాయాబద్ధులు

మరిమనో చలనముల మాయ యోనుల నెపుడు
తిరిగి జీవులు ప్రకృతి దేహవాసనబన్

అరయ కర్మములబడి యంధులై తిరుగుచును
గురుసుతుల మహిమ మది కోరి తెలియరనూ

ప॥ అరయ శునకంబులకు నాజ్యమందనిరీతి
గురువాక్యములు దుష్టులందు కేలాగూ ॥అర॥

బలమైన కాలసర్పముల కట్టుబడి
తెలివైన తమ దివ్యదేహంబు మరచి
సొలసి జాగ్రత్స్వప్న సుషుప్తులను బరగుచును
పలవరింపుదురు కర్మపాశ బద్ధులునై ॥అర॥

గ్రామపైశాచముల గతిని దిరుగుచు మహిని
ఏమరక పాపంబులెపుడు సేయుచును
కోమలపు పూదోట గురుని గూడకనుగదా!
పామరంబున యముని బారి బడియెదరూ ॥అర॥—45

దుష్కర్మలు

గుణరహితమైన నిజగురుని దెలియక మహిని
జనియించి ప్రకృతి చేష్టలుచేసి మరియూ
కనుభ్రమసి పురుషుడును కామవ్యసనములచే
జని తేంద్రియములగూడి సంచరింపుచును

ప॥ కంపు కంపనుబడ్డ కాకియై జీవుడోడిదప్పి
కర్మములచే దగిలి కదిసి తిరుగుచునూ ।కం॥

సుడిబడుచు బహుదుఃఖ శోక వననిధి మునిగి
చెడి విషయసంపదల చెలగి సొలయుచునూ
ఎడ తెగని సంసార ఏహ్యమున పొరలుచును
బడుగెద్దు బురదలో బడిపొగలినట్లున్ ॥కం॥

కటికెవానివలె దుష్కర్మ తత్పరులగుచు
కుటిలులై పరులగని క్రోధించి జడులున్
ఘుటికుడగు పూదోట ఘనయోగినంటకను
కటకటా! నరకముల గాసిపడుదురునూ ॥కం॥—46

## దుర్జనులు

సుజ్ఞానమైన యతిసూక్ష్మరూపము మరచి
అజ్ఞానమగు ప్రకృతి అంగమును దాల్చి
విజ్ఞాన వాక్యములు విననోరకను జనులు
ప్రజ్ఞ మెరయుచు విషయ భ్రాంతిదిరుగుచురా

ప॥ భ్రమసి పంచేంద్రియముల పట్టుబడి దుర్జనులు
శమదమాదులులేక స్వామి నెరుగకనూ ॥భ్రమ॥

కాయపోషణకొరకు కర్మనే చేయుచును
మాయ సంపదలచే మహిని సొలయుచును
న్యాయములుదెలియ కన్యాయములె సేయుచును
పాయకను సతులకును బానిసలునగుచూ ॥భ్రమ॥

దుష్టులైసజ్జనుల దూషించి సొలయుచును
భ్రష్టులైవిషయఫల ప్రాప్తిగోరుచునూ
కష్టులైసంసార కారడవిలో జిక్కి
నష్టమై ఏగుదురు నరకముల కెపుడూ ॥భ్రమ॥

కోపమను సనలమున క్రోధమే పెంచుచును
చూపులకు జిక్కి మరి సుఖము గోరుచునూ
తాపత్రయములచే ధర్మ మార్గము మరచి
యాపదలచే నెపుడు నలపరింతురునూ ॥భ్రమ॥

ప్రకటముగ చలనులై పాపచిత్తులునగుచు
నకలంకులను జూచి యరసి తిట్టుచునూ
సకలాత్మ పూదోట స్వామినెరుగక గదా!
వికలమతులై జనులు వేగమడియుదురూ ॥భ్రమ॥—47

## పంచ మహాపాతకులు

చెసి జీవులును పూర్వ చిత్కాయమును మరచి
జడరూపమగు ప్రకృతి జననమై యంతిన్

కడలేని సంసార కారడవిలో జిక్కి
వెడలి నిజగురు నెరిగి వెలయు టెట్లగునూ ?
ప॥ గాలి నెగసిన వగుడు గతిదిరిగి సుజ్ఞాన
మూలమెఱుగక నెంత మోసమున జెసిరి ! ॥గాలి॥
పంచ మహాపాతకముల పరికించి సేయుచును
యెంచి పరవిత్తంబు లెపుడు గోరుచునూ
కొంచెమగు దుర్జనుల కూడి చరియింపుచును
వంచించి పరసతుల వడిసి పట్టుచునూ ॥గాలి॥
తలచి విజ్ఞానులను దయలేక తిట్టుచును
కలకలను నగి వారి గాసిపెట్టుచునూ
బలమైన పూదోట ప్రభుపు నంటకగదా !
మలినులై యిలలోను మడిసి పోవుదురూ ॥గాలి॥—48

విషయ భ్రాంతులు

గురుయోగులను గొనుచు కుశలులై ధరమీద
సరసమగు వేదాంత శాస్త్రములు జదివి
గరగరను మాయచే కట్టుబడి తిరుగుచునూ
పరమ జ్ఞానులను పలుభాషలాడుచునూ
ప॥ భ్రష్టులగుచును విషయ భ్రాంతులై ఎప్పుడును
కష్టులైయమునిచే గాసిపడుదురునూ ॥భ్రష్టు॥
కులగర్వులై ధరను గురుసుతుల గనుగొనుచు
కులరహితులగువారి కులములడుగుచునూ
తెలియనిత్తమున నుపదేశములు చేయుచును
మలబద్ధులై ధరను మడిసిపోవుదురూ ॥భ్రష్టు॥
అసురాది కృత్యంబులవనిపై జేయుచును
కొసరితైర్థ వస్తువులు కుడిచిభ్రమయుచును
రసికులై పూదోటరాముని పదాబ్జములు
నస్తషూన భక్తిచే సలరికూడరునూ ॥భ్రష్టు॥—49

## మాయాబద్ధులు

దివము రాత్రుల తిరిగి తిమిరమగు మాయలో
వివర మెఱుగక చొచ్చి వికల మొందుచునూ
అవిరళంబుగ ప్రకృతి దేహంబు గైకొనుచు
పవనేంద్రియములగూడి పరువులెత్తుచునూ

ప॥ ఏకాక్షరంబు నోం శ్రీకరాకృతిమరచి
కాకిమై జీవుడిల కర్మముల బొగలున్ ॥ఏకా॥

మలసహితమై త్రివిధ మలములచె కప్పబడి
చలన వృత్తిని కోతివలె చరింపుచునూ
కలసి సంసార చక్రమున సుడిబడి తిరిగి
పలువరింపుచు జీవి పరితాప మొందున్ ॥ఏకా॥

కర్మపాశములచే కట్టుబడి జీవుడును
మర్మజ్ఞులకు కీడు మరియు జేయుచునూ
దుర్మార్గుడై ముక్తి త్రోవ దెలియక జీవి
ధర్మమగు తనదివ్య తనువు మరచియునూ ॥ఏకా॥

సతిసుతులు బాంధవులు చాల సంపద గలిగి
మితిలేని కర్మలన్ సుఖమిళిత మగుచూ
గతి లేక శునకంబు గతిని దిరుగుచు నెపుడు
ప్రతిలేని తన దివ్యభావమును మరచీ
మధిర పానము సేయు మానవుని క్రియ జీవి
మది చెడియు తన తనువు మరచి భ్రమయుచునూ
సదయుడగు పూదోట స్వామి సంటకగదా!
మదముతో డుత కర్మ యుదధినే మునుగున్ ॥ఏకా॥—50

## అజ్ఞానులు

పడిదప్పి జీవులు ప్రకృతి దేహముదాల్చి
పుడమిలోపల సలుల పొందుగోరుచును

కడ లేనిసంసార కారడవిలో జొచ్చి
యెడ తెగనిదుఃఖముల నెపుడు పొగలుదురా

ప॥ నిరతమును తనమదిని నిలిచి వెలుగుచునున్న
పరుని దెలియక నెంత భ్రమసిరయయో ॥నిరత॥

గడుసులై మహిలోను కాపురముచేయుచును
సుడియులై సతిసుతుల చూచి సొలయుచును
నడిమిసుఖమును నమ్మి నయము దెలియగలేక
బడుగెద్దువాదమున బడి సమసినటులన్ ॥ని:త॥

పుడమిపై వనధికడ పుండరీకము తుదను
తడియకను సుజ్యోతి తాము దెలియకను
కడువేడ్క పూదోట ఘనుని గూడకగదా !
చెడిరి నరకములబడి జీవకోటులును ॥నిర॥—51

కామాంధులు

కనభ్రమసి పుడమిపై కాలమున తొట్రుబడి
చనుదెంచి కర్మమను జలధిలో మునిగి
కణగి తలఎత్తకను ఘనపాశబద్ధులై
ఎనసి సర్వేంద్రియముల మొనసి తిరుగుచును

ప॥ దివము రాత్రులు జిక్కి తిరుగు పశుజీవుడును
శివరామ నీ పదము జేరు టేలాగు ? ॥దివ॥

చూపులను నింతిగని సొలసి కామాంధులై
యేపు మీరను ధరను యెనసి తిరుగుచును
తాప మొందుచు కోర్కె తగిలి రతిసేయుచును
ఆపదలతో నరకమందుబడు నెపుడూ ॥దివ॥

మతిచెడి మహాత్ములను మహి మీద దూషించి
ధృతి చెడియు వారితో ద్వేషించివినుడీ
మహియందు పూదోట మర్మంబు తెలియకను
మితిలేని భవములను నతిదుఃఖలదుసా ॥దివ॥—52



శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగావధూతస్వామివారి శివవరం మఠ గురుపీఠం





శ్రీ శ్రీ శ్రీ పూవోట లిం.గావధూతస్వామివారి శివవరం మఠ ముఖద్వారం



శ్రీ గురు పాదుకాపూజలో గుర్రం కొండప్ప దంపతులు, మోరగుడి



పోకూరి ఆదెప్పగారి కుటుంబము, జమ్మలమడుగు

## పాపకర్మలు

పుడమిలో జనియించి భూతేంద్రియముల జిక్కి
సుడిబడుచు దుఃఖముల శోషిలుచుచాలా
ముడిబడుచు బహుయోని ముఖములను దిరుగుచను
ఎడతెగని పాపముల నెపుడు సేయుచును

ప॥ కరుణ యుంచుకలేక కర్మతత్పరులగుచు
గురుమూర్తి నీపదము కూడుటెలాగు ? ॥కరు॥

పరసతుల జూచి మది భ్రాంతిచే దిరుగుచును
అరసి పరధనములకు నాశ సేయుచును
గురుతుగా పాపములు కోరి ఇలసేయుచును
గురుని దెలియక మదిని క్రొవ్వి కొట్టుదురూ ॥కరు॥

వదలకను జిహ్వాగుహ్యాలరుచులు గోరుచును
గోడు గుడుపగ జీవకోట్ల దునుముదురు
వేడుకతో పూదోట విభుని గానక గదా !
కాడుపడి యమునిచే గాసిపడుదురును ॥కరు॥—53

## సంసారబద్ధులు

పరతెంచి జీవులును ప్రకృతి దేహముదాల్చి
తరుచు సంపదలచే ధరను చొక్కుచునూ
దురితమగు సంసార దుఃఖవసధినిమునిగి
దరిగానకను నెపుడు తల్లడింతురునూ

ప॥ పసలేని సతిసుతుల భ్రాంతిచే కట్టుబడి
పుసిగాయలో జంతువేరాయనయ్యో ! ॥పస॥

మాటదప్పి తనుమరచి మాయతత్పరులగుచు
మితిలేని కర్మములు మెరసి జేయుచును
చతుర్యుగముల చిత్తచలనులై తిరుగుచును
మతిమంతులను జూచి మత్సరించెదరూ ॥పస॥

సొలసి జనితేంద్రియముల సొంపులకు దిరుగుచును
వలసి పరవిత్తంబు వడసిభక్షించి
నెలనైన పూదోట నిజగురుని దెలియకను
చలనులై యమపురిని పలువరింతురునూ ||పస||—54

## కామాంధులు

తరుణి రూపముజూచి ధాత్రిలో దుర్జనులు
మరుని తూపులచేత మదిచలింపుచునూ
పరికించి యింతులను పట్టి రమియించినను
మరిగాలమును మ్రింగు మత్స్యంబు విధమూ
ప॥ నిలిచి తమలోయున్న నిజగురుని దెలియకను
చలనులై మహిలోను సంచరింతురునూ ||నిలి||
నడజీవులను జంపి నయమొకింతయులేక
వడలు బెంచుక పందివలె దిరుగుచునూ
పుడమిపై విజ్ఞాన పురుషులను దూషించ
మిడిసివహ్నిలో దుముకు మిడుత విధమగును ||నిలి||
ఎపుడు దుష్కర్మముల నెడదెగక సేయుచును
అపరిమిత దుఃఖంబు లనుభవింపుచునూ
నిపుణులై పూదోట నిజగురుని గూడకను
కపటులై యమపురికి కదలిపోవుదురు ||నిలి||—55

## సంసారబద్ధులు

కుమతులై సంసారకూపంబులోమునిగి
మమతచే కట్టుబడి మాయలోనిలిచి
అమితకర్మములచే నాయాసమందుచును
శమదమాదులులేక సంచరింతురునూ
ప॥ పరికించ నిల పుణ్యపాపములచేజిక్కి
పరమాత్మ నీపదము పట్టలేలాగూ ! ||పరి||

గిజిగాండ్లవలె మహిని గీములునుగట్టుకొని
కుజనులై సర్వమును కూడబెట్టుచునూ
నిజము కాయంబనుచు నీచులై సాకుచును
సుజనులను గూడకను సుడిబడిరితుదనూ ||పరి||

శిశులు నిత్యంబనుచు సృష్టిలో సొలయుచును
దురితదూరులజూచి దూషింతురెపుడూ
స్థిరమైన పూదోట గురుని దెలియకగదా!
మరియు మృత్యువుచేత మడిసి పోవుదురు ||పరి||—56

## పంచమహా పాతకులు

పంచ భూతేంద్రియముల ప్రకృతి దేహంబగుచు
పంచవాయువులచేత ప్రవర్తింపుచునూ
పంచ మహాపాతకముల పరికించిసేయుచును
పంచేంద్రియములంటి పరువులెత్తుచునూ

ప|| మరియిట్లు చరియించు మర్కటపు జీవులును
గురుమూర్తి నీ పదము కూడు టెలాగు? ||మరి||

సప్తధాతువులైన సాకారరూపమై
సప్తవ్యసనములంటి సంచరింపుచును
సప్తావరణములు చాలగప్పగ జంట
సప్తలోకంబులను సారె దిరుగుచును ||మరి||

త్రివిధైషణములకు తీవ్రముగ భ్రమయుచును
తవిలిసంపదలు గనిధాత్రి పొంగుచును
వివరించి పూదోట విభుని దెలియకగదా!
అవుర జలబుగ్గగతి అవసిపోవుదురు ||మరి||—57

## మాయా మోహితులు

మాయదేహముదాల్చి మతిభ్రమసి జీవులును
కాయపోషణకొరకు కష్టపడుదురును

తోయ జాక్షులపొందు దూరకొనియు కోరుచును
పాయకను సంసారబద్ధులై చెడిరీ
ప॥ మది విచారించకను మాయామోహితులగుచు
తుదకపోతమురీతి తునిసి పోవుదురు ॥మది॥
సతిసుతులు మిత్రధన సంపదలగలిగి తుద
మతిభ్రమయుచును అష్ట మదములను జిక్కి
ప్రతిదినము సుజ్ఞానపరుల దూషింపుచును
మతిమాలి తుదయముని పాశమున బడిరి ॥మది॥
సారిది జాగ్రత్ స్వప్నసుషుప్తులను దిరుగుచును
దివ్యులగు వారినిజూచి దీర్ఘదుఃఖితులై
గురిమీరి పూదోట గురుని దెలియకగదా !
పరగ దివ్యేలోబద్ధ పురుషు విధమైరీ ॥మది॥—58

దుర్మార్గులు

పాపపుణ్యములచే పట్టుబడి జీవులును
తాపత్రయంబులును తగిలి సొలయుచును
కోపమను అనలమున క్రోధమే పెంచుచును
తాపసుల జూచి మది తలచి దిట్టుదురు
ప॥ దుర్మార్గులై తప్పు త్రోవలను బోవుచును
ధర్మాత్ముడగు గురుని తలచలేరైరి ॥దు॥
కోమలాంగుల ముఖము కోరిచూచుచు ధరను
కామవ్యసనములచే కదిసి పట్టుచును
ఆముకొని సతులతో అనుభవించుచు నెపుడు
పామరులునై యముని బారి బడుదురునూ ॥దు॥
మరి జిహ్వాగుహ్యాలకు మదిని పరవిత్తములు
అరసివంచించి తామాసించి యిలను
పరికించి పూదోట బ్రహ్మంబు దెలియకను
దురితమగు దుఃఖముల త్రూలిపోయెదరు ॥దు॥—59

## కామమోహితులు

ఘనకర్మ పాశముల కట్టుబడి దుర్జనులు
మనసు చలనమున మహి మర్కటముగ తిని
దినదినము కర్మముల తీవ్రముగ జేయుదురు
కణగి మృత్యువుచేత గాసిపడు దురును

ప॥ తరచు మోహములచే తగులుపడి జీవులును
మెరసి గాలమునబడు మీను విధమగుచూ ॥తర॥

మనునితూ ప్రులచేత మదిగాడిపారగను
ధరను ఇంతులజూచి తమకంబుతోనూ
తరచు సతులరమించి తనిబోని పురుషులును
సరసనగ్నిలో దుంకు శలభముల విధమా ॥తర॥

మలబద్ధులై ధరను మర్మజ్ఞులను జూచి
తులువలై వారలను దూషించి మదినీ
నెలనైన పూదోట నిజగురుని దెలియకను
మలినులై నరకముల మల్లడించెదరూ ॥తర॥—60

## నరపశువులు

స్థిరముగా గృహములో దీపశిఖ వెలుగగని
పురువుఫలమని మ్రింగబోయి మడిసినట్లున్
పరసతులజూచి మరిభ్రమయు నరపశువులును
దురితమగు నరకంబులో మునుగుదురు

ప॥ గురుభక్తి లేనట్టి కుజనులనుబంధించి
మెరగుకోరలమాయ మెరసి దిగమ్రింగున్ ॥గురు॥

జలధిలోపలిమీను సంతోషమున నెగడి
తలచిగాలము మ్రింగి ధరనీల్గినటులన్
యిలవిత్తమునుగూర్చ తెలిసి చోరులునెత్తి
బలిమిచే లోభులను బధమొత్తినటులన్ ॥గురు॥

తను మనోద్రవ్యములు ధరనేకభక్తితో
గుణరహితు కర్పించి కోరి మోక్షమును
దినకరునిగతి దివ్య తేజమూ పూదోట
ఘనయోగి పదమునను కలిసి మెరయరును ॥గురు॥—61

బహు వేష ధారులు

పరికించ క్రూరులును బ్రహ్మనిష్ఠులవలన
మరి చోరులై యోగమార్గములు దెలసి
పరమ యోగులమనుచు పలుగాకులై మరియు
గురుయోగులను నోరుక్రొవ్వి తిట్టుదురు
ప॥ కర్మసంసారులై గర్వించి ధరలోను
మర్మజ్ఞులనుజూచి మత్సరించెదరు ॥కర్మ॥
కులగోత్రమాచారములు సతిసుతమిత్రు
లలరు సంసారమను నబ్ధిలోమునిగి
తెలివిచెడి సద్గురుల దివ్యాంఘ్రి నమ్మకను
యిలజిహ్వా గుహ్యాలకు హితవు గోరుచును ॥కర్మ॥
కృపణులగు కొందరిల బహువేషములబూని
కపటులై వలపింతు కాసులకు నిట్టి
కుపితులును పూదోట గురుమూర్తి దెలియకను
చలనులై యమునిచే సమసి పోవుదురూ ॥కర్మ॥—62

సంసారాటవి

ఇలను కేళీ మృగంబులరీతి సతులవలపులకు
పురుషులు జిక్కి సొలసియంధులునై
అలరి సంసారమను నడవిలోపల జిక్కి
తెలివిచెడి కడుభ్రమసి తిరుగుచుండగను
ప॥ గురుడనెడి నేర్పరది తెరువనుచు జూపకను
గరిమె భవకాననము గడచుటెట్లాగు? ॥గురు॥

జననీ జనకు లనెడి సర్పములు గరువగను
పెనగిసతి సుతులనెడి బెబ్బులులు రొప్పన్
కినిసి బాంధవులనెడి వనగజంబులు కర్మ
జనుల మేనులు చదుపగను వరలుదురు ||గురు||
అట్టి యరిషడ్వర్గమను రేచుకుక్కలును
చుట్టి మేనులు బెరక మిట్టిపడి చాలా
పట్టి యజ్ఞానమను భల్లూకములు నీడ్వ
పట్టుబడి మహినిబహు దుఃఖపడుదురును ||గురు||
అసదు రాగద్వేషమను తేళ్ళుబాధించగా
మొరపరాళ్ళను సర్పమోహమను పసులూ
మస దురాచరణముల కామానలంబనెడి
తసుచు కార్చిచ్చుచే తాపమొందుదురూ ||గురు||
పాపపుణ్యాంబులను బహులతల చిక్కబడి
తాపమొందుచు నెపుడు ధరను గూలుదురు
దీపించి పూదోట దేవుని పదాబ్జముల
దాపుజేరని జీవతతులిట్లు పొగలు ||గురు||—63

## ధనదాసులు

కపటులై మహియందు కాచిధనవంతులను
నుపదేశములు జేసి యుదరపోషణకై
విపరీతజ్ఞానములు నిపుణులై బోధించి
అపహరింతురు జనుల యర్థములు వేడ్కన్
ప|| అట్టి దేశికులు తుద నర్కసుతు దూతలకు
పట్టుబడి పొగలుదురు బహుకాల మిటులన్ ||అట్టి||
తులువలై త్రివిధవస్తువులు బక్షింపుచును
పలువలై వావివరుసలు లేక స్త్రీలన్
చలనులై భోగించి చెదరి గురుశిష్యులును
మలినులై ధరపైని మడిసిపోవుదురు ||అట్టి||

ఎంతకాలంబును నిహపరంబులు లేక
సంతతము దుఃఖముల చింతజేయుచును
వింతయగు పూదోట విభునిగానక గదా!
అంతర పిశాచములునై యుందురెపుడు ॥అట్టి॥—64

## కామాంధకారులు

జనియించి బహుదుఃఖ వనధిలోపలజొచ్చి
మునిగి చనువున దుర్జనుల వేడుకనుగూడి
కనుగొనుచు స్త్రీలమహి కామాంధకారులై
పనిబూని శునకముల పగిది దిరుగుదురు

ప॥ ఇనునిగతి తమమదిని ఈశుడు ప్రకాశించు
మొనసి తెలియరు యిట్టి మూఢ జీవులును ॥ఇను॥

అల ఈషణత్రయంబనెడి ముప్పాత్రతాట
కలుష జనములు చాలకట్టుబడి భ్రమసి
పలువలై సంసారబద్ధులై దుర్మతులు
చలనులై నాలుగు యుగములు చరింతురను ॥ఇను॥

పరమయోగులజూచి పలుమాట లాడుచును
పరికించ సర్వపాపాత్ములై మరియు
సిరిమించు పూదోట గురుని దెలియకగదా!
తరుచు యాతనలందు మొరలు పెట్టుదురు ॥ఇను॥—65

## కర్మజీవులు

పసరశంఖము చెవిచెంపద్ద బట్టసతిను
కసిఎముక గొరక సీకును నీదుతండ్రి
కిని నలవిగాదనుచును కిలకిలను నగుచు మది
నినదమును విననిగతి నిర్లేపులారా!

ప॥ పరమయోగముగురుడు ప్రకృతిజనులకుచాల
కరుణతో కృపసేయ కానరెన్నటికి ॥పర॥

పసర నేత్రద్వయముగలవాడు సర్వముగాంచి
పరికించ ఆనందభరితుడై మరియు
ధరపుట్టుగుడ్డికిని తనుగోందు బింబముల
గురిజూపగా నతడు గురు తెరుగనటులన్ ॥పర॥

బలిమి మూగకు మంత్ర మొలసి జెప్పిననతడు
అల చెవులుగొడుకునోయని జరుగుపగిది
చెలగి పూదోట దేశికచక్రవర్తి సద
జలజములు కర్మజీవులు దెలియలేరు ॥పర॥—66

## అజ్ఞాన జనులు

గర్వులై అజ్ఞాన గ్రామసింహముల గతి
నిర్విషయులను జూచి నిందజేయుదురు
సర్వ భ్రాంతుల జిక్కి శాంతసౌమ్యులు నగుచు
గురువులను దూషించి కూలుదురు జడులు
ప॥ ఎంతకాలమునకైన ఈ కర్మ జీవులకు
చింతించగా ముక్తి సిద్ధించదయయో ॥ఎంత॥
మురికిసతులనూ జూచి ముదముచే పురుషులును
సిరికి సుతులనుగాంచి బద్ధులై మదిని
సరకుసేయక విషయ సౌఖ్యములు గోరితుద
నరకముల బడిచాల వరలుచుండుదురు ॥ఎంత॥
పనిబూని ఎపుడు దుష్పాపాత్ములై జనులు
కను భ్రమసి వెనుకముందును దెలియలేక
వినయమించుక లేక విజ్ఞానరహితులై
జనన మరణాంబుధిని చాలమునిగెదరు ॥ఎంత॥
సరస సంపదలునివి సత్యమని నమ్ముచును
మరుని తూపులచేత మదిచలించగను
దరికొల్పకామాగ్ని తనువుగాల్చగ స్త్రీల
పరికించి శునకముల పగిది దిరుగుదురు ॥ఎంత॥

పట్టి సద్గురుపాద పద్మములు నెరనమ్మి
దిట్టలై సుజ్ఞాన దివ్యవాలునను
చుట్టియుండిన విషయ చోరులను ఖండించి
గట్టిగా పూదోట ఘనుని దెలియరును ॥ఎంత॥—67

## గురువంచకులు కులగర్వులు

గురువంచకులకు మహిమల గర్వులకు
పరుల జెరచు దుర్మార్గులకు జారచోరులకు
నిర్నిమిత్తము ఘనుల నిందించు వారలకు
పరికించ క్రోధులకు భక్తిశూన్యులకు

ప॥ మనమలర నిట్టి దుర్మార్గులకు దేశికుడు
తనరు మోక్షము నొసగినను సంకటమునే ॥మ॥

చలన జనులకు మదిశాంత హీనులకు కల్లలును
బలుకు క్రూరులకు కలుషాత్ములకును
మలిన హంకారులకు మదమత్సరులకు
గురుసేవ చేయనట్టి తులువలకును ॥మ॥

సుంకరికి జూదరికి సుజనక్రోధికి తరచు
బొంకులకు మూలమగు వంకకట్టెలకు
పొంకముగ చివర బ్రహ్మమును బోధించు గురుని
దుశ్శంకలను జేసెడి శాంతరహితులకును ॥మ॥

పరనారులను జూచి భ్రమసి తిరుగుచుచాల
పరధనంబుల కాసపడు చెడుగులకును
పరహింసలను జేయు పలువలకు శివయోగి
వరులదూషించు దుష్టాప కర్ములకును ॥మ॥

పటుకఠిన చిత్తులకు పామరులకును తరచు
తటపటలు బల్కు బలుకాటోటులకును

మఱుమాయమంత్రముల మరులు కొల్పెడియట్టి
కుటిలులకు పూదోట గురుడు దూరమునా ॥మన॥—68

## అజ్ఞానజనులు

మెరుగు ముత్యపుసరము గిరిచరుని మెడ(వేయ
కోరికి (వేయును మణుల గోడవలే నటులన్
గరిమె పన్నీట సూకరమునుంచిన నదియు
కోరగానిమూత్ర సరసిని గోరువిధము

ప॥ ఇలను నజ్ఞానులకు నీరీతి గాని(కియ
తలపోయ గురువాక్యములు చెవుల చొరవు ॥ఇ॥

తనరు పచ్చలపల్లకిని శునకముంచ నది
వనర ముచుపటె గుణాబును మానవటులన్
ఘనమహిషంబుపై కస్తూరిబూయనది
చనుచు బలుబురద గుంతను బొరలు పగిది ॥ఇ॥

నక్కనేకాదసి యొక్క పొద్దుంచనది
అక్కరతో పెనుమురికి కరుగు విధముననూ
బక్కమేకకు విమల పరమాన్న మిడినది
మొక్కలపు ఆకులలములు కోరుపగిది ॥ఇ॥

అట్టిచెడు గార్ధబంబగరు గంధపుస్వాధు
పట్టనేరనిపగిది భావజ్ఞులారా !
పుట్టుగుడ్డికి మూగపురుషునికి చెవిటికిని
గుట్టు (బహ్మముదెలుప కొరగానిరీతి ॥ఇ॥

అలగబ్బిలము నులూకములకు రవికొర గానట్లు
చలనముచ్చులకు వెన్నెల గానిరీతి
తెలివితో పూదోట దేవుని పదాబ్జంబు
లలరి వీక్షించ లేవల్ప జీవులును ॥ఇ॥—69

అజ్ఞానమున తమదు నమృతకాయముమరచి
అజ్ఞానమునవెడలి నవనిలోపలను
అజ్ఞానజన్ములై హంకారగాత్రులై
అజ్ఞానవనధిలో నలరిమునుగుదురూ

ప॥ నిర్వాసనుడునైన నిజగురుని దెలియకను
దుర్వాసనలునతని దూషింతురయ్యా ॥నిర్వా॥
అజ్ఞానచిత్తులై ఆనందమొందకయె
అజ్ఞానసుతులపై నతిమోహమునను
అజ్ఞానయింతుల ననుభవింపుచునిలను
అజ్ఞానసంసారమాశ్రయింపుచునూ ॥నిర్వా॥
అజ్ఞానులైవిషయ మల్పభోగములుమది
నజ్ఞానులునుగోరి యలరి భోగించి
అజ్ఞానవస్తువులునివి నిత్యమనిచాల
అజ్ఞానభవవనధి నలరి తిరుగుదురు ॥నిర్వా॥
అజ్ఞానజీవులను నలలింగ దేహమును
అజ్ఞాన కంచుకంబర దొడుగుచునూ
అజ్ఞానతనువులును అవనిపైనూశ్చితుద
అజ్ఞానులై నరకమపుడె పొందుదురూ ॥నిర్వా॥
అజ్ఞానజనములును అరసికానగ లేరు
అజ్ఞానులకు చాల నతిగూఢమగుచూ
అజ్ఞానరహితుడగు నలపువ్వదోటగురు
డజ్ఞానులకుదూరమై ప్రకాశించూ ॥నిర్వా॥—70

కుజనులు

బురదలోపల జిక్కిన భువిబడుగు ఎద్దుగతి
మరి తేనెలోబడిన మక్షికము పోల్కిన్
మురికి కుడితిలోబడిన మూషకము కైవడిని
నరగమోదమునబడు సామజము విధమూ

ప॥ గురుని దెలియనియట్టి కుజనులును ఈ రీతి
పరుపగు భవాంబుధిని బడిపొగలుదురునూ ॥గు॥

బలిమి యురులనుబడిన పక్షి చందమునను
అలరు వలలనుబడిన హరిణమును పగిది
మలిన జిగురున జిక్క మహిమీద పులుగుక్రియ
బలుబోను లోబడిన పులివిధము నాను ॥గు॥

వనరతో డేలు నోటనుబడిన శశముక్రియ
కనువినురు నోటబడు కప్పచందమునన్
మొనసి శునకమునోట ముంగిసయుబడినగతి
ఎనసి పిల్లికినోట ఎలుకబడినటులన్ ॥గు॥

సిరిమించు మృగరాజుచే నక్కచిక్కుగతి
గిరిచరుడు నెరుకుచే ధరజిక్కు పోల్కన్
మెరయు జాలరులచే మీనములు జిక్కుక్రియ
పరంగ కోడిని పిల్లిబట్టు పగిదాను ॥గు॥

హితవుతో జెప్పెదను ఇలమీద జనులార
గత విషయుడై భక్తి క్రమముతో వేడ్కన్
ప్రతిలేని పూదోట బ్రహ్మపదమున మీరు
అతిసౌఖ్యమునగూడి అమృతులై నిలుడీ ॥గు॥—71

## అజ్ఞానజనులు

ధరను నజ్ఞానులై చరియించు మూర్ఖులకు
పరికించి నిర్గుణ బ్రహ్మమార్గమును
పరమ సద్గురుడిల పలుమారు చాటించి
కరుణతో దుర్మతుల కరసి చెప్పినను

ప॥ తెలియ రెన్నటికి స్థిరనిరంజన పదము
ఛలనులైనట్టి జడ జీవకోటులును ॥తె॥

తెలిసి సంపెగ పూలు తేటులకుగాని క్రియ
పలువకాకులకు నెమ్ములు గాని విధము
ఇలను కుక్కలకు నిర్మల ఘృతముగానిగతి
కలుషాత్ములకు జ్ఞానక్రమముగా నటుల ॥ తె॥
తనకు కలువలకు నక్కని దీప్తిగాని గతి
ఘనకంజములకు శశికళలుగా నటుల
ఒనరపూదోట దేవుని వాక్యములు
వినిసహించరు మదిని వైరికుజనులును ॥ తె॥—72

కు ల గ ర్వు లు

నెరనిరాలంబమగు నిజపదార్థము చాల
పరమ సద్గురుకృపను భక్తవర్యులును
కరతలామలకముగ కనుగొనుచు సత్పదము
సరసికూడుచు చాల నతిశాంతులైన
ప॥ అట్టి దేశికుని పాదాబ్జముల సేవ మది
పట్టివిడిచిన నుభయ భ్రష్టులయ్యెదరు ॥అట్టి॥
మనమలర నిగమాంత మర్మశాస్త్రముల విని
గ్రహియింపుచును మహాత్ముని సెలవుచేత
నొనరనిర్లేపుడగు వరగురుని నిజవాక్య
మును నమ్మి నమ్మకను మూఢులయ్యెదరు ॥అట్టి॥
మాసిన యద్దముక్రియ మలినులై శ్రీగురుని
గాసివెట్టుచునున్న కలుషాత్ములకును
భాసిల్లు నిర్గుణబ్రహ్మంబు నసెడి ధన
రాశివారలకేల లభియించునయ్యా! ॥అట్టి॥
కులగర్వులై మాయ కుటిలులై మహిలోను
జహ్వాగుహ్యాల రుచులుగోరి
పలుమారు తప్పు బోధలుజేతు రల్పులును
ఫలువల్లై శరణులను భ్రష్టుల పెట్టుదురు ॥అట్టి॥

దరిలేని భవదుఃఖ శరధిలోబడీవరల
నరసివారల మొరయు నాలకించపుడు
గురుతు పూదోటపై గురునిరంజన స్వామి
కరుణతో తనసుతుల కాచిరక్షించు ॥అట్టి॥—73

## చె న టు లు

కరుణ యించుక లేక గర్వించి దుర్మతులు
పరికించి మహిలోను పలువలగుచున్
పరమయోగులజూచి పలుమాట లాడుచును
పొరది శునకములగతి సొంపుమెరయుదురు

ప॥ ఘనకోకిలస్వరము కాకులకుగానట్లు
చెనటులకు సుజనాళిశబ్దములుగావు ॥ఘ॥

కలకాలమును విషయ కాంక్ష చేదిరుగుచును
చెలగి పరధనములకు చేతులొగ్గుచును
ఇలమీద సతులగని చలనాత్ములైచాల
మలినులై యమపురికి మరలి పోవుదురు ॥ఘ॥

పట్టి సర్వేంద్రియములు బంధించనేరకను
పట్టుబడిసంసార భ్రాంతులను జిక్కి
గుట్టైన పూదోటగురుని దెలియకగదా
మెట్టి మృత్యువుబారి మిడిసి పడుచుందురు ! ॥ఘ॥—74

## అ జ్ఞా న జ న ు లు

సతిసుతులపై భ్రమల జగతిలో దుర్జనులు
మితిలేని కర్మములు మెరసి చేయుచును
జితవిషయులును గాక జిహ్వాగుహ్యాల జిక్కి
మతిచలనులై మాయ మగ్నులయ్యెదరు

ప॥ గురుని పాదాబ్జముల గురుతెరుంగని జడులు
తరుచు నరకములబడి తల్లడించెదరూ ॥గురు॥

కనుచెదరి ధర్మార్థ కామములు నిజమనుచు
మనసులోపలగోరి మలినాత్ములగుచు
మొనసి తమతో చాల తనరి ప్రకాశించు
ఘనమైన సత్పదము గాన రెన్నటికి ॥గురు॥

కలుషమగు సంసారమను నడవిలోజిక్కి
చలనులై సజ్జనుల చేరి నిలువకను
అలరు పూదోట కేవల బ్రహ్మమెరుగకను
బలమగు భవాంబునిధి మునిగిపోయెదరు ॥గురు॥—75

గురుపంచకులు

సరసరావి యాకుకొన జలబింధు వున్నగతి
మరిమేఘమున వెడలు మెరుపు చందమున
నెరయ నీటిలో బొడము నీటిపైబుగ్గ క్రియ
అరయ తోమకయున్న అద్దమును పోల్కి న్

ప॥ నరుడనుచు శ్రీగురుని నమ్మ నమ్మని జనుల
పరమ జ్ఞానంబిటుల భగ్నమైపోవు ॥నరు॥

చెలగి రాహువు మ్రింగు సిశకరునికై వడిని
తెలియగాలిలోనుండు దివ్వెపడువునను
బలువోటికుండలో జలము నెలసినవిధము
పలుకగా రాత్రసతి పలుకెడలునటులన్ ॥నరు॥

వనర జలశూన్య కుంటను బకము నిలువనటులను
చెరువుకట్ట తెంచిన నచటి తోయం
బొనరంగ చనినట్లు పూదోట స్వాములను
కనియు కానగలేరు కర్మజీవులును ॥నరు॥—76

## కపట వేషధారులు

యిల్లాలు భుక్తికై యెల్లపుడు దూషించ
చిల్లరప్పులవారు సిగబట్టి యీడ్చన్
ఉల్లము చలింపగా నుగ్రుడై తమకమున
త్రుళ్ళిపడి తలగొరిగి మెడద్రాడు ద్రుంచి

ప॥ అట్టి సన్యాసియై అవనిపై కాకిగతి
గట్టిగా కూటికై గాసిపడి తిరుగు ॥అట్టి॥

చరణముల పాదుకలు చాల బూడిద బూసి
సరసముగా కాషాయ శాటి మొలజుట్టి
వసుస రుద్రాక్షమాలావళిమ మెడవేయుచును
హరిణ చర్మము చంక సమర బెట్టుచును ॥అట్టి॥

వేషమమరగ దాల్చి విషయాత్ముడై దేహ
పోషకుడునై ఘనుల దూషించుధరపై
దోషకారై పువ్వుదోట విభు తెలియకను
రోషచిత్తుడు యమునిలోకమున కరుగున్ ॥అట్టి॥—77

## అనుభవశూన్యులు

తనరునిగమాంత శాస్త్రార్థములు పెక్కులను
మనమలర ప్రజ్ఞతో మహీ జనంబులకు
కనినట్టిచెప్పుదురు ఘనమైన చిద్బ్రహ్మ
మును యున్నజాడ తెలియని మూర్ఖవిదులు

ప॥ మెరసి కాకులరీతి మెతుకుభాసించిధర
పరికించి సజ్జనుల భ్రమల పెట్టుదురూ ॥మె॥

అలరుచును మంత్ర లయహఠ రాజయోగములు
మాకె తెలుసునని మహిలోని ప్రజల
వలపించి మూలధన మొనరగైకొను కొరకు
పలుకుదురు స్వానుభవములేని జడులు ॥మె॥

మరి ధ్యానధారణ సమాధులును మెరిగిన
ట్లరసి బోధింతురిల అల్ప దేశికులు
సరసుడగు పూదోట సద్గురుని చరణములు
ఎరిగి కొల్వగ లేరు హీనమనుజులును ॥మ॥—78

## గురువంచకులు

గురుని నిందలు జేయు కొరగాని అల్పులను
గురునిపైకోపించు గుణబద్ధులనునా
గురువంచకులునైన కులగర్వులనుచాల
గురునితో ద్వేషించు కుజనసంగమునూ

ప॥ విడువకుండిన వినుడి విజ్ఞానజనులారా
చెడిపోదురిపుడె సుస్థిరము నాపలుకు ॥విడువ॥

గురునివాక్యము వినక కుమతులై పలుమారు
గురునితో వాదించు గుండగొయ్యలును
గురుభక్తిలేనట్టి నెరస్వామిద్రోహులను
అరసి వారలస్నేహమలరి జేయుచును ॥విడువ॥

గురుడు బ్రహ్మంబనుచు గురుతు తెలియక మదిని
గురుడు మానవుడంచు పరగవీక్షించి
గురుడైన పూదోట సరసిజాక్షునిచాల
యెరిగి యెరగని యట్టి హీన జనములను ॥విడువ॥—79



## నాలుగవ దళము

## సద్గురుమూర్తి



## అవధూతస్వామి

అవధూత లక్షణంబలరి యిప్పుడుమీకు
వివరించి చెప్పెదను వినుఁడీ నాపలుకూ
శివయోగ సిద్ధుఁడై జితవిషయుఁడై యెప్పు
డవుర నిర్గుణబ్రహ్మమై వెలుగునతఁడూ

ప॥ ఇట్టి గుణములుగలుగ నిలనునిర్వాణియగు
అట్టి గుణములులేక నవధూతయగునె ! ॥ఇట్టి॥

పరనారులను తల్లి భావమునవీక్షించు
పరధనంబులు పెంకు పగిది గనుగొనును
పరులహింసించఁడిల పరమసాత్త్వికుఁడై
పరులు దూషించమని సరకుజేయఁడుగా ! ॥ఇట్టి॥

తలపోసి వాసనాత్రయము దగ్ధముజేసి
ఘులసర్వభోగములు ఘాలింయించిచేతఁడు

తలపు మరపులుమించి తా శూన్యతత్త్వమై
యలరి నిశ్వాసనుండై ప్రకాసించుచూ ॥ఇట్టి॥

పరికించ సర్వమును బ్రహ్మమని మది తెలిసి
మెరసి నిర్ద్వంద్వుడై మితభాషియగుచూ
పరమభక్తులకు స్థిరమోక్ష మొసగుచును
నరయ యజ్ఞానులకు నతిదూరమగుచూ ॥ఇట్టి॥

అతిగూఢమై యెపుడు అల చిదాంబరముపై
నతడు నిరంజనుండతడు నిష్క్రియుడై
మితి లేని పూదోటమించద్వితీయుడై
యతడఖండంబ నెడి యమృతాబ్ధియగునూ ॥ఇట్టి॥—1

---

శమదమాదులచేత సద్భక్తి యుక్తితో
నమలుడగు గురుని చరణాబ్జములు వేడ్క
క్రమముతో నర్చించి కడయోగమును దెలసి
విమలుడై క్రీడించు విశ్వరూపుడునై

ప॥ ఇట్టి పుణ్యుడు సుమ్మి యిలమీద నవధూత
అట్టి గుణములు లేని అతడు యమదూత ॥ఇట్టి॥

తిట్టి కొట్టిన నతడు దీనుడై వగవకను
కట్టివేసినజనులు కడు శాంతుడగుచు
బెట్టుగా తన్నినను బెగడకను మహిలోను
గట్టుగతి చరియించుకడను ప్రకాశించు ॥ఇట్టి॥

మరియు బాలోన్మత్త మహిపిశాచముపగిది
పరికించ మూగక్రియ బధిరు చందమునన్
అరయగా జడునివగ నతడు సజనుడునై
ధరవిధినిషేధ మింతయు లేక తిరుగు ॥ఇట్టి॥

తెలియ షడ్రుచులుగల దివ్యాన్నమిడిన
మరి బలుపాసినన్నంబు పదులు వెట్టినను

సలలితంబుగ రెండు సమముగా భుజయుంచి
చెలగి భూచక్రమున చరియించు నతడు ॥ఇట్టి॥
వనర నిర్లేపుడై వరభక్తకోటులను
కను గొని యఖండ మార్గము జూపుదయను
గణుతింప పూదోటకడ నిర్వికారుడై
తనరుచు నిరాకార తత్త్వమై మెలగు ॥ఇట్టి॥—2

---

తలప వర్ణాశ్రమాదులలోన నెవరైన
యలరి భయభక్తితో నచలులై మదిని
తెలిసి నిర్లేపుడగు దేశికుని చరణాబ్జ
ములు చేరికొలువ వారలు నెక్కువనుచు

ప॥ సారెకను నిగమాంతసతియు ముజ్జగములను
వీరు పూజ్యులటంచు కేరి చాటించు ॥సా॥
పరమ సద్గురుపాద పద్మములు నర్చించి
నెరనమ్మి నిలిచిన శరణులనుజూచి
స్థిరశూన్య తత్త్వోపదేశమును కొమ్మనుచు
గురుడొసంగిన యపుడె పరిశుద్ధులనుచు ॥సా॥
సర్వభ్రాంతులుద్రుంచి సచ్చిదానందమున
గర్వములునుడిపి నిర్గర్వులై మహిని
నిర్వికారులు నగుచు నిర్వాసనులునునై
సర్వమును నుతియించు గురుపుత్రులనుచు ॥సా॥
కరుణతో సుజనులకు ఘనమోక్షమార్గమును
పరికించిచూపుచు పరమ సాత్వికులై
సరిలేని యవధూత చక్రవర్తులునగుచు
మెరసి భూచక్రమున చరియింతురనుచు ॥సా॥
ఘనత చిద్రూపమగు తనువు చివ్వనవిడచి
కనుగొన నిరాకారగాత్రులై మరియు

నొనర పూదోటకడ వరసత్పదంబునై
తనరుచు నిరాలంబమును నగుచు రనుచూ ||సా||—3



ధరమీద వహ్నికిని తలప పవనంబునకు
గరిమె పూర్ణంబైన గగనంబునకును
సరసి జాప్తునికిని మరి చంద్రుడాదిగ వీటి
కగయ నంటును లేనియారీతి నిలను

ప॥ అవధూత స్వాములకు నంటు లేదని శృతులు
వివరించి చాటించు వేడ్కతో నెపుడు ||అవ||

ధనధాన్యములకు మహితలపోయ మణులకును
కస్తూరి మృగమునకు కామధేనువుకు
వినుశి చదలేటికిని విమలమగు తారలకు
కనుగొనగ వీటికంటును లేనిపగిది ||అవ||

తెలియ ప్రణవంబునకు దివ్యమగు విద్యకును
చెలగి ప్రబలెశి శుద్ధ చైతన్యునికిని
కలిత పూదోటపై ఘననిరంజనుడునై
నిలిచి నిర్లేపుడై వెలుగుచున్నట్టి ||అవ||—4

## కైవల్య పట్టాభిషిక్తుడు

ఘననిరాకారుడై కదలకను సాకార
మనుదివ్యగాత్రుడై యమృతుడై యతడు
పెనుగు వాయసములను పికము బాసినరీతి
కనుగొనగ ప్రకృతులను కలసి కలయకను

ప॥ అతడు నిర్గుణబ్రహ్మ మవనిపై జనులార
హితవుతో కనుడి మని జితయోగి మహిమ ||అ||

పరిశుద్ధుడై చాల బ్రహ్మనిష్ఠుడు నగుచు
గురసుడై యవధూత చంద్రుడై మరియు

అరయ బాలోన్మత్తు జల పిశాచము రీతి
గరిమె తన్మయుడు నై క్రమముతో దిరుగు ॥అ॥

అతితుర్య పురుషుడై ఆనందమయుడగుచు
మితిలేని శాంతుడై మించు తేజము నై
ప్రతిలేని కైవల్య పట్టాభిషిక్తుడై
మతిమంతులును మెచ్చ మదిప్రకాశించు ॥అ॥

గురుకు లాంబుధి నడుమ పరిపూర్ణ కళలతో
పరికించ హిమకరునిపగిది మెరయుచును
శరణులకు సత్పదము జాడజూపుచునతడు
నెరయ నిస్సంగుడై మెరయునెప్పుడును ॥అ॥

తలపు మరపులు మీరి తా శూన్యతత్త్వమై
బలసి బాహ్యాంతరంబుల నెలుంగుచును
తెలియ పూదోటకడ దేవాది దేవుడై
నిలచి యుండును బయట నిర్వికారుడునై ॥అ॥ —5

## సద్గురు సేవా మహిమ

ఘనమైన ముత్యాలకంఠహారమురోసి
పనర గాజుపూసలను గోరువిధము
కనకభూషణతతులు కనుభ్రమసి మదిరోసి
మొనసి యిత్తడిసొమ్ములును గోరినటులన్

ప॥ గురుశిఖామణివిడిచి గురుసుతులు సజ్ఞాన ॥గురు॥
ధరసమ్మె చెడనేల సృష్టిపైమీరు

కలితనిర్మలరత్న కంకణంబులురోసి
వలసి తగరపు కడియములుగోరు క్రియను
చెలువముగ పగడముల్ చేపట్టకయురోసి ॥గురు॥
మలినమిట్కెల చాటలుగోరుపగిది

సురుచిరంబైన తాటంకములరోసి
పరగ చెవ్వాకులకు భ్రాంతిపడునటులన్
సరసమైన పచ్చలతాళివదిరోసి
అరసి గురువింద చెండాసించుపోల్కి ॥గురు॥

కళలమించినమంచి కామధేనువుపాలు
తెలిసి త్రావగరోసి చలనులైమిగుల
అలమేక మెడచన్ను లాయాసమునబిదికి
యలరి యందున క్షీరములుగోరువగను ॥గురు॥

విమల సద్గుణియైన విజ్ఞానసతిరోసి
మమతగణికలపొందు మహిగోరునటులన్
అమలమగు పూదోట యాత్మారామునిసేవ
క్రమముతో సేయకను గర్వించవలదూ ॥గురు॥—6

## శ్రీ లింగ గురుస్వామి దివ్యావతారస్వరూపం

జనియించి అవుకులో సంచరించుచునంత
బనగాని పల్లెలోపల భక్తిమెరయన్
చనిపీరక్షేత్రమున సద్గురుని గని మ్రొక్కి
గుణరహితు నేను ముక్తి కృపసేయుమంటిన్

ప॥ అమితమగు గురుని పాదాబ్జములు నిశ్చలత
శమదమాదులతోడ చాల అర్చింతున్ ॥అమి॥

అవనిగోపును బాసి యలపరించు లేగవలె
గవి శేషమున నేను చాల వరలగను
వివరించి నా మొరయు విని తీవ్రముగ వచ్చి
శివయోగి నన్ను కృపజేసి రక్షించెన్ ॥అమి॥

పరికించి నాశిరముపై కరాబ్జంబుంచి
సరసముగ తీర్థప్రసాదముల నొసగి
విరిపైన పూదోట విభుడు మోక్షము తనకు
కరతలామలకముగ కరుణించినాడు ॥అమి॥—౧

## దివ్యావతారతత్త్వము

అరయనాజన్మంబగు నయోనిస్థలంబు
నురియుచును కేదారమున ప్రకాశింతు
తిరముగా నా పేరు దివ్యలింగంబగును
పరికించ కాశిలో ప్రజ్వరిల్లుదును

ప॥ వినరయ్య జనులారా వివరించి చెప్పెదను
తనజన్మసంస్థితిని తలచియడిగిననూ ॥విన॥

దిట్టనై నిత్యవిభూతియు దేహమునసలది
అట్టిమధ్యను యోగపట్టె సిరులొలుక
మెట్టిపాదుకలు నై మెరుగుశాటిధరించి
పుట్టుజడలునుమెరయ పుడమినిచరింతు ॥విన॥

కులము బ్రహ్మకులము గురుడు నిర్గుణయోగి
చెలగి ముప్పూరును సండేలునాకెపుడూ
తలప సుజనులయిండ్ల తానువర్తించితుద
నిలిచి చంద్రునిగతిని నిండివెలుగుదును ॥విన॥

పరమహంసనై స్వర్ణపద్మాంతరంగమున
నరుదుగాచిత్కళల నంటివెలుగుదును
నిరతమును సహస్రార నిలయమున ప్రబలుచును
తరచు రూపులలోన మెరసితిరుగుదును ॥విన॥

గురుడు నాతలిదండ్రి గురుతు తెలియఁగమదిని
పరమభక్తులు నాదు ప్రాణబంధువులు
మరియు చిన్మండలముమధ్యమున క్రీడింతు
పరగ పూదోటగురుబ్రహ్మంబునంటి ॥విన॥—7

## సద్గురువుల దేకులము ?

శరణులైన పరమభక్తులతో మేము సంచరించెడి వారము
గురుని దివ్యపదముమీద దృష్టులు మనసు కూర్చియుండు వారము

గుణ డాసి మాయను గెంటించి గురుపదము గొలిచియుండేవారము
సరభస వృత్తితో ధరణిలోపల నిస్సంగులైన వారము

ప॥ మా కులములడుగ నేటికీ
కులములన్ని బ్రహ్మకులము జేసినవారి కులములడుగ నేటికి
కులము జెప్పెదను దివ్యాంతమున గురుకులరత్నమగు వారము॥మా॥
హాయి చతుర్వర్ణములు మీరి కాశిలో నాశ్రయించి యుందుము
పాలజలది సయున్న భక్తులకులమున ప్రబలుచుండెడి వారము
కేళిముజ్జగముల నెదురులేక మేము క్రీడసలుపుచు నుందుము.
ఆలసించక హృత్కమల మధ్యమున పరమహంసమైనటి
యింతుమూ ॥మా॥

మెరసిచిత్పదమునై మించిసిక్రియులమై మెలగుచుండెడివారము
పరికించినిర్గుణ బ్రహ్మమై యెప్పుడు ప్రజ్వరిల్లెడి వారము
గురువైన పూదోట గురుని సత్పదమున కూడియుండెడి వారము
పరిపూర్ణమగు నమృత గాత్రులమై బట్టబయలై నెలుగు
చుందుము ॥మా॥—8

## శ్రీ గు రు స్వా మి కృ ప

ధరనుగంగాది ద్వాదశనదుల మునిగినను
వరదానములు పెక్కలొనర జేసినను
మెరసిబహు తిరుపతుల మెలగు వేల్పులను తా
మలరి సేవించినను సధిక వస్తువును

ప॥ లేదు ఈ శ్రమలచే లేశమాత్రంబైన
మోదమున గురుడు నిజముక్తి జూపకయే ॥లేదు॥

చెలపట్టి వేదాంత శాస్త్రములు జదివినను
బలిమిగా యంత్రాది బహుమంత్రములను
వలసి పఠించినను వర యజ్ఞముల చాల
బలిమి చేసిన దొరక దధిక వస్తువును ॥లేదు॥

కనుగొనుచు సర్వయోగము లభ్యసించినను
తనరుచు బహులక్ష్య ధ్యానముల కలదె
పనిబూని పూదోట బ్రహ్మంబు దెలియకను
ఘనమలర కైవల్యమున నిలువగలరె! ॥లేదు॥—9

## సాటిలేని సద్గురుదేవుడు

ధరమీది కుధరములు సురగిరికి దీటగునె!
శరధులెన్నైన సుధశ్చరధికిని దీటె!
సరసనదులెన్నైన చదలేటికిని దీటె
మరిపులుగులెన్నైన గరుడునికి సమమె!
ప॥ హరి హరబ్రహ్మాదు లఖిలవేల్పులునైన
నిరవలంబమునైన నిజగురుని దీటె! ॥హరి॥
పుడమి తరువులు కల్పభూజమునకును దీటె!
చెడుతుట్టె పురుగులును శేషునికి దీటె!
కడు మంత్రసిద్ధులు కపిలమునికిని దీటె!
బడుగు నక్షత్రంబు లుడుపతికి దీటె! ॥హరి॥
ఇల మృగములెన్నైన యలకేసరికి దీటె!
తెలియపశువులు కామధేనువుకు దీటె!
బలునాగములు నాకపతిగజము దీటౌనె!
మలినమర్కటములు వాయుజునకు దీటె!
నవరత్న జాలంబు హరిరత్న సమమగునె!
కవులెందరైనను నాదికవికిని దీటె!
మంత్రంబులెన్నైన ప్రణవసమమగునె!
తంత్రంబులెన్నైన గురుతంత్రసమమె!
కలుషమగు గాజులాడి ముత్యమునకు సమమె!
బలవంతులెవరైన వాయుజుని సమమె!
లలితమగు పూదోట రామయోగీంద్రులకు!
తలపోయ సర్వయోగులు దీటుగారు! ॥హరి॥—10

## గురుపదసేవ

గురునిపదసేవచే నురుకు నజ్ఞానమును
గురునిపదసేవచే కూలునింద్రియములు
గురునిపదసేవచే కూలును గుణత్రయము
గురునిపదసేవచే కరగుకోర్కెలును

ప॥ గురుని సిర్గుణమహిమ కుజనులే మెరుగుదురు
పరమజ్ఞానులునైన భక్తులెరుగుదురు ॥గురు॥

గురునిపదసేవచే కులగర్వములుపోలియు
గురునిపదసేవచే కూలుచలనములు
గురునిపదసేవచే పరిశుద్ధులయ్యెదరు
గురునిపదసేవచే కొనసాగుభక్తి ॥గురు॥

గురునిపదసేవచే దురితదుఃఖములణగు
గురునిపదసేవచే కూలుసంశయములు
గురునిపదసేవచే చిరశుద్ధులయ్యెదరు
గురునిపదసేవచే ధరయశమ్ముప్రబలు
గురునిపదసేవచే శిరులుప్రకాశించు
గురునిపదసేవచే కూడుసుగుణములు
గురునిపదసేవచే పరమసుందరిమెచ్చు
గురునిపదసేవచే నిరపేక్షుడగును ॥గురు॥

గురునిపదసేవచే వరముక్తిబయలగును
గురునిపదసేవచే పరమపదప్రాప్తి
గురునిపదసేవచే గురుతుపూదోటపై
గురునిస్వరూపమై మెరయుచుండెదరు ॥గురు॥—11

## సద్గురునికి సమర్పణ

పరమగురు సంఘ్రులను భక్తియుక్తులశాంతి
నరసి పూజలుసేసి ధృతిమోదమునను

పరమ గురునికి సేవలరలేక జేయుచును
పరమ సద్గురు పలుకు నెరనమ్మ వలెను

ప॥ కనుగొనగ ముక్తికిని నొనర సాధనమగును
వినుడు సజ్జనులారా వివరింతు మీకు ॥కను॥

పరమ గురునికి దేహ భావ మర్థము లొసగి
పరమ గురుడును పరబ్రహ్మయని ఎరిగి
పరమ గురుసేవకుల ధరగూడి యాడుచును
పరమ గురువాక్యములు పఠియించవలెను ॥కను॥

పరమ సద్గురుకృపను పరమ యోగము మించి
పరమగురు పలుకుచే నిగవలంబమునై
పరికించ పూదోటపై నిర్వికారులై
నిరుపమానందులై నిలిచి మెరయూరే! ॥కను॥— 12

## (వైష్ణవ) గురు సాంప్రదాయం

తిరు మంత్రరహశ్యము తెలియజెప్పెదవినుడిస్థిరభక్తవరులారమీరు
అరయ విశిష్టాద్వైతమందు ద్వితీయాత్ముడు జనియించియు
పరికించ తిరుముడాపర వాసుదేవుడు పరమ స్వయంజ్యోతియా
సరస తిరుమేనియై సచరాచరాదులకు చాలపట్టైయుండు

ప॥ గురు సాంప్రదాయకము గురుతు జెప్పెదను
శ్రీగురుసంతతడు నుదయించుచూ ॥గురు॥

పరమ పురుషుడాది భక్తజనులకై యిలను
ప్రభవించి మెరయగను
అతని తిరువలిఘులు అచల జీవునిపేర నవనిపై శోభిల్లుచూ ॥గురు॥

జితవిషయులైనట్టి శ్రీభాష్యకారులై చెలగి ప్రకాశించగా
అతితుర్య భక్తిచే నా మహాత్ముని పాదాబ్జములు నెరనమ్ముచూ
స్తతతంబునర్పించు సాధువైష్ణవులకు సద్బోధము గురిజూపెడు ॥గురు॥

తెలియఁగను లీల భూతిని మెలగుచును సుస్థిరభక్తకోట్లు కొలువ
అలరి నిత్యభూతి యనెడి కైవల్యమున నతిభోగములు జెందుచూ
బలిమి పూదోట సత్ప్రభు నిరంజనయోగి భక్తజనముల కూడును
నిలచి సుజనులపాలి నిక్షేపమై వెలగు నిర్లేపులార వినుడీ॥గురు॥—13

## సద్గురునియందు విశ్వాసము

కరతలామలకముగ ఘననిర్గుణ బ్రహ్మ
మరసి చూపిన గురుని యతడె యితడనుచు
నెరిగిమెరుగనియట్టి యిలమీది భక్తులను
జెరుచు సంశయము సుస్థిరము నాపలుకు
ప॥ శరణ జనులార నేచాటించి చెప్పెదను
గురుని భూచక్రమున నెరనమ్మరయ్యా ! ॥శర॥
మలినులై సంసారమగ్నులును గావలదు
అలరి పరసతుల మీరాసించవలదూ
కులగర్వులై మదిని కూలిపోవగవలదు
తులువలై పెద్దలను దూషించవలదు ॥శర॥
పరమ సాత్వికులై భక్తియుక్తినిమీరు
గురుని పూజలుజేసి కువలయంబుననూ
సరసులై పూదోట స్వాములనుగూడి తుద
పరుదయిన సత్పదంబయి నిలువృశికను ॥శర॥—14

## మంత్ర - మతాతీతుడు మోక్షదాత

మతములును మంత్రముల్ మహిమీదనమితమగు
యతులకును యోగులకును నిలజనంబులకు
మతిభ్రమసి యిందరును మహిసగుణ ముక్తులును
హితవుతో నమ్మి తుది ఎరుకమరచిరినీ
ప॥ మతమంత్రముల మూలమర్మంబుజెప్పెదను
ప్రతిలేని నిర్గుణబ్రహ్మంబు వినుడీ ! ॥మత॥

తెలియజెప్పెదను సుస్థిర భక్తవరులార !
ఇలను మతమంత్ర గురువుల మాయలకును
తగులవడకను మోక్షదాత పాదాబ్జములు
వలచి భయభక్తితో గొలుచు డెప్పుడును ॥మత॥
పరమభక్తులతోను విరసమించుక లేక
నిరుపమానందమున నిస్సంగులగుచు
అరసిపూదోటకడ నద్వితీయుఁగూడి
నెరనిరాకారులై నిలువరోయన్నా ! ॥మత॥—15

## సద్గురులయెడ కులదృష్టి తగదు

సరసిలో గమనించ జలజ గర్భమునందు
పుపుడింపగా సలువ బుట్టడే మును
గరిమె మెరయుచు విష్ణువు గండకి కడుపులోన
సరగ జన్మించడే సద్భక్తులారా !
ప॥ ఇట్టివారల కులము లెంచరాదని శ్రుతులు
గట్టిగా చాటించు క్రమముతో నెపుడు ॥ఇట్టి॥
లలితముగా శంకరుడు రాతిలో ప్రభవించు
చెలగి కాష్ఠమునందు శ్రీ శుకులుబుట్టు
అలరు దాసిభూతమందు నారదుడు వెడలె
యిలయోగి పుంగవులు తెలియనే జాతి ॥ఇట్టి॥
మనమలర రూపనామక్రియల చిన్మయుఁడు
మెరసి తా పెక్కువిధముల నుద్భవించు
జనన మరణములేని సద్గురుడు పూదోట
ఘననిరంజను డొకడు కదలక వెలుంగు ॥ఇట్టి॥—16

## సద్గురులెవరైనను పూజ్యులే

హరిణమునకుదయించె మెరసి ఋష్యశృంగు
డరయ వాల్మీకిముని యలబోయ యగును

గరిమె మతంగముని కనుగొనగ యేజాతి ?
గురుతు నూర్వసికొడుకు మరి వశిష్ఠుడును
ప॥ ఇలమీది పరమ యోగులు నెందుబుట్టినను
తలప వారలకంటు తథ్యముగ లేదు ॥ఇల॥
తనరు కుంభ్రపుపట్టి తెలప నశ్వత్థామ
నొనర గర్భుండెచట జనన మగునయ్యా !
మునుపు శౌనకుడనెడి మునిజన్మ మెరుగరే
వినుడి వ్యాసులును నీచన గంధిసుతుడు ॥ఇల॥
తెలచ కాష్టమునందు దహనుండు వెడలుగతి
మొరపురాళ్ళను వజ్రములు బుట్టుపగిది
గురుతైన పూదోట గురుని వరశిష్యులును
ధరను పూజ్యులుసుమ్మి తత్త్వజ్ఞులారా ! ॥ఇల॥—17

## సద్గురుదేవుని సేవింపుము

పనిబూనిసద్గురుడు భ్రమరకీటకముక్రియ
వనర నిశ్చలభక్తవరుల నిముసములో
తనస్వస్వరూపంబు తథ్యముగ జేసికొను
ఘనుని భూచక్రంబునను మరువవలదు
ప॥ ఇట్టిదేవుని సేవ నిలమీదనిరతమును
దిట్టలైసేయకను దీరునే ! రుణము ॥ఇట్టి॥
జితవిషయులైచాల చింతించిమీమదిని
ప్రతిలేని శ్రీగురునిపాదాబ్జములను
సతితుర్యభక్తితో నర్చించి ధరణిపై
మితిలేని శాంతమున మెరసిధీరులులై ॥ఇట్టి॥
మలినమునులేని చిన్మయుహంసలైమదిని
పలసి యానందాబ్ధినోలలాడుచును
లలితమగుపూదోట రామయోగిని మీరు
కలసితన్మయున్నిద తెలిసి వేడుకను ॥ఇట్టి॥—18

## గురుస్వామి కృపచేతనే సత్పదము

లేదు స్నానములను లేదు దానంబులను
లేదు శిలలను లెస్స పూజజేసినను
లేదు ఆసనక్రియల లేదు జపతపములను
లేదు మంత్రంబులను లేదు మఖములను

ప॥ అరయగా గురుకృపను నలసత్పదం బిపుడె
కరతలామలకముగ కనుపడును నిపుడె ॥అ॥

లేదు వ్రతశీలముల లేదు మతవేషముల
లేదు పర్ణంబులవలీల మెసవినను
లేదు గిరిబిలములను లేదు పదివదలినను
లేదు తలక్రిందైన లేదు జ్ఞానమున ॥అ॥

లేదు నిగమాదులను లేదు వందననుతుల
లేదు హఠచర్యలను లేదు మౌనముల
లేదు ఈ క్లేశముల లేదు ఎన్నటికైన
లేదు సద్యోముక్తి లేదు జనులారా! ॥అ॥

లేదు సురగణమునకు లేదు మునిబృందముకు
లేదు గంధర్వులకు లేదు సిద్ధులకు
లేదు రుషిమనువులకు లేదు దిక్పాలులకు
లేదు త్రిమూర్తులకు లేదు బ్రహ్మైక్యం ॥అ॥

లేదు నిజవిద్యకును లేదు తుదికూటమికి
లేదు శుద్ధాత్మునికి లేదు సుస్థిరము
లేదు పూదోట-నిర్లేపుడగు నాస్వామి
లేదు నిర్గుణపదము లేదు చూపకను ॥అ॥—19

## బాలోన్మత్త పిశాచమువలె

కలము లాచారముల మెలగు గురువులు పెక్కు
గలరు ధరపైనిట్టి గుహల నెడబాసియూ

తెలియ నిరేపుడగు దేశికస్వాములును
తలప ముజ్జగమునందుల నరుదు వినుడీ
ప॥ అట్టినిష్క్రియుడు వర్ణాశ్రమాదుల మీరి
గుట్టుతో చరియించు కువలయంబునను ॥అ॥
సరిలేని నిగమాంత శాస్త్ర జ్ఞానులయందు
తఱుచు లక్ష్యజ్ఞాన నెరనిపుణులందు
అరయ నందరిలోను అవధూతయై మెరసి
వరపికంబునరీతి వర్తించునయ్యా ॥అ॥
ఉల్లమలర త్రివస్తువులను భక్షింపుచును
త్రుళ్లిపడివాదించు తులువ జ్ఞానులకు
అల్లదిగో మంత్రలయ హఠయోగులకు నతడు
తెల్లముగ గనుపడడు స్థిరభక్తులారా! ॥అ॥
చెలగి బాలోన్మత్తుడిల పిశాచము పగిది
బలుమేఘమున దనరు భాస్కరుని విధము
అలరి నివురుగప్పిన నిష్క్రియ నాథునుడు
మలిన మింతయలేక మహి ప్రకాశించు ॥అ॥
నిగమ గోచరుడగుచు నిర్వాణసతికవల
నగణి తానందమున నమృతుడై చాల
మిగిలి చిన్మయుని తా మించి పూదోటకడ
సగుణ రూపములపై సాక్షియై వెలుగు ॥అ॥—20

## గురుభక్తిచే బ్రహ్మపదము

అడవిదిరిగిన లేదు అంబరంబున లేదు
పుడమిదిరిగిన లేదు పుణ్యాత్ములారా!
కడువేడ్క శ్రీగురుని కరుణవడసినయపుడె
చెడనినిర్గుణపదము సిద్ధించునయ్యా!
ప॥ సత్యమనినాపలుకు చాలనమ్మనమీరు
నిత్యమగు మోక్షమున నిలిచివెలిగెదరు ॥సత్య॥

చదువులందున లేదు శాస్త్రార్థముల లేదు
కదసి నిగమాదులను గాలించ లేదు
ఇదిగో బహుయోగములు వెదకిచూచిన లేదు
పదిలమగుభక్తిచే బ్రహ్మంబు జిక్కు ॥సత్య॥
తలపోసి త్రైలక్షములను నిర్మలస్వాంతమున
చెలగిధ్యానముచేయ చిరపదము లేదు
వలసిపూదోటపై వరనిరంజనగురుం
డలరి యిదిముక్తియని తెలుపకను లేదు ॥సత్య॥—21

## గురుభక్తుడే పుణ్యుడు

గురుపదము లర్చించు శరణుడిల పుణ్యుండు
గురుసేవ జేయు నిర్గుణియె పుణ్యుడును
గురువంచనలులేని గురుసుతుడు పుణ్యుండు
గురుని నెరనమ్ము సుస్థిరుడు పుణ్యుడును
ప॥ వాడు నిర్లేపకుండౌనర ముల్లోకముల
వాడు పూజ్యుడు వినుడి వసుధజనులారా! ॥వా॥
గురుని సత్కీర్తి మహిని కొనియాడు పుణ్యుండు
గురునివద్దను ముద్దుగులుకు పుణ్యుడును
గురు జనులకును భక్తి గురిజూపు పుణ్యుండు
గురు కులాంబుధినడుమ మెరయు పుణ్యుడును ॥వా॥
నిరుప మానందముగ పరమయోగిగనతడు
వరగురుని కృపను చిద్వ్యసధి దాటుచును
గురుతు పూదోటకడ గురునిరంజనుడునై
ధరణిపై చరియించు పరమశాంతుడునై ॥వా॥—22

## మంత్రాదిమహిమలకన్న గురుబోధ అధికము

వనరగుహ్యమునొత్తి వామాంఘ్రిమూలమున
ననిలుపీడించి తా సహింపు దరుముచును

పెనసి సర్వము మదినిబేధించి నడువీధి
దినకరేంద్రులనడిమి దిడ్డిజొచ్చినను

ప॥ మరిమంత్రలయహఠ మహిమ బొందగనేల
గురునిపలుకులనునమ్మి గురుపుత్రులకును ॥మరి॥

బలసి జలరాశిపై పద్మాంతరంగమున
నిలిచి స్వయం లింగమై నిండివెలుగుచును
వలసివిశ్వముజీవజ్యోతులై మెరసి
తెలియ వేదాంతమున తేజరిల్లుచును ॥మరి॥

నిరతమును నిర్వైచట నిర్గుణజ్యోతిముఖమున
తరుచు దీప్తుల నమృతధారలొలుకగను
సిరిమించురత్నమయ చిన్మండలముపైని
పరికించిపూదోట ప్రభువునంటిననూ ॥మరి॥—23

## సద్గురుని పలుకు నమ్ముడు

అనిల భూతేంద్రియములు నమర యేబది మాత్ర
లెనయ ముప్పదియారు ఘనతత్త్వకళలన్
చనిబ్రహ్మరంధ్రమున సర్వతత్త్వములమరి
మనసుతో చిద్గగన మొనరగూర్చినను

ప॥ ఏటిహఠజపము యేటిధ్యానము మదిని
నాటిసద్గురుపలుకు నమ్మియుండినను ॥ఏటి॥

అరసినాదము యూర్ధ్వ మమృతపానముజేసి
భరితమార్తాండ శశిపావకుల మించి
గురుతు దశశత తారక కంజకర్ణికను
స్థిరమైన నిర్వాత దీపగతి వెలుగున్ ॥ఏటి॥

తలచలో బయట బహుదరుణ ప్రకాశమై
అలరి సచరాచరమ్ము లంటి ప్రబలుచును

తెలివైన పూదోట దేవదేవుని గూడి
నిలిచి నిష్క్రియుడనై నిండి వెలిగినను ||ఏటి|| — 24

## సద్గురుడు షణ్మతాతీతుడు

ఉరువడిగ భ్రూమధ్య నుచ్ఛ్వాసములు నిగుడ
ధరనురగ మెగయు నూర్ధ్వశక్తియు లేవ
చురుకు చూపుల కర్మసుఖములను జెరచితను
హరిహరబ్రహ్మల నాక్రమించకనూ

ప॥ ఆరుమతముల జిక్కి యాత్మగానగ లేరు
కోరి సద్గురు మహిని గురుతెరుగ లేక ॥ఆరు॥

మెరసిలో బయట చిత్కిరణములు దీపించ
గరిమెతోడుత దివ్యకళలు ప్రబలగను
సరసముగ నక్షత్ర సంఘములు మెరయగను
నిరతమును నుడురాజు నిలిచి తనరగను ॥ఆరు॥

అరసి రసనాగ్రమున నమృతధారలు జార
గురుతుగా ప్రణవంబు ఘోషసేయగను
సరసి జాంతరమునను జలజాక్షి వెలుగుచును
శరణులకు నానందసౌఖ్య మొసగకను ॥ఆరు॥

సరసిజాక్షినిమించి సద్గురుని కరుణచే
పరమయోగము దెలసి భక్తకోటులును
పరికించి యానంద భరితులై మదిలోను
విరివైన చిత్పదము వీక్షించగానూ ||ఆరు||

మెరయుచు చిదంబరము మించి తీవ్రముగాను
మరియు సత్పదమనెడి మర్మంబుదెలిసి
సిరిమించి పూదోట శ్రీ గురునిగూడి తుద
నిరుపమానందమున నిండివెలుగుదురు ॥ఆరు॥ — 25

## గురుపరమేశ్వరునికి శరణాగతి

ధరలోనజన్మించి ధర్మంబెతలపోసి
గురుని భూచక్రమున కోరివేడుకను
అరుదుగా నాదుహృదయాంత రంగమునందు
గురుని పాదాబ్జములు గురుతెరిగినపుడు

ప॥ పరువడిగ నానందబాష్పములు జారగను
పరమేశ్వరునికి నే శరణుజేసితిని ॥పరు॥

పదిలముగ విజ్ఞానభవనాంతరంగమున
కదిసియోంకారమను ఘనమంత్రమునను
సదయుడై వెలుగు నిజసద్గురునిచరణముల
సధికభక్తిని పూజలమర జేయుచును ॥పరు॥

శిరసుపై తనదివ్యకరముజేర్చియు గురుడు
కరపదాగ్నినవాదు కర్మములనణచి
సగుణను త్రివిధప్రసాదమార్గముజూపి
గురుభక్తి సేతునని గురిజూపెతుదను ॥పరు॥

వటమూలమైనట్టి వనరుప్రణవముకర్ణ
పుటములనువిని దృష్టిభ్రూయుగమునడుమ
పటుతరంబుగనిల్పి పరమామృతముగ్రోలి
ఘటికుడైయుండగను ఘనముక్తియనెను
బంధించి సర్వమును పశ్చిమంబున జొచ్చి
సంధించిప్రణవమున బిందువునుగూర్చి
అందముగపూదోట ఆత్మరాముని పదము
నందినిలచినముక్తి యిది నిజంబనెను ॥పరు॥—36

## సద్గురునిచే చిన్మంత్రోపనయనం

పరమాత్ముడైన సద్గురు పదంబున తనదు
శిరమంటగామ్రొక్క శిథిలమగు మాయ

కరుణ నాశిరముపై కరపంకజంబుంచి
గురుడు చిత్కళలపై గురిజూపినాడు

ప॥ కంటిరాముని పదము ఘనభక్తి యుక్తితో
జంటబాయకయుండు సద్భక్తులారా ! ॥కంటి॥

ముదముతో నాయుస్థానములు నెరుకసేసితా
సదయుడై త్రివిధ దీక్షలుప్రసాదించి
ఉచితమగు చిన్మంత్ర ఉపనయనమును జేసి
కదసి నిర్గుణపదవి ఘనుఁడొసగినాడూ ॥కంటి॥

యజ్ఞానమును జెరచి యమృతకాయుని జేసి
యజ్ఞోపవీతంబు సంజ్ఞతో వేసి
సుజ్ఞానమైనట్టి సుబ్రాహ్మణుని జేసి
విజ్ఞానమార్గంబు వివరించెతనకు ॥కంటి॥

ఘంటానాదమువింట అంటి యమృతముమింట
జంటహంసల ప్రణవమంట గూర్చుచును
అంటిలేకనుమెప్పుడబ్జకర్ణిక యుండే
యంటిస్వేతవర్ణహంసమై మెరతు ॥కంటి॥

కదలకెప్పుడు చిద్గగనాంతరంగమున
సదయుఁడగు పూదోట సద్గురుస్వామి
అదిగొ సత్పదమున సమరగూర్చుచుతనకు
పదిలముగ నమస్కపదమిచ్చినాఁడు ॥కంటి॥—27

## సద్గురు పదపూజచేత ముక్తిపదము

పుడమిదిరిగినలేదు భూమి జొచ్చినలేదు
అడవిలోనిధి నదీ యాత్రలను లేదు
గడుసు శిలలను లేదు క్రతుదానములలేదు
అడవి జొచ్చినను మిన్నంటినను లేదు

ప॥ పరికించి జనులు గురుపదపూజ చేసినను
భరితనిర్గుణ ముక్తి పదము సిద్ధించూ ॥ప॥

జపతపంబులలేదు షణ్మతంబులలేదు
ఉపవాస వ్రతములను నుర్విపై లేదు
నిపుణ వాక్కులలేదు నెరపూజలను లేదు
కపటగురువులదెలియ కడముక్తిలేదు ॥ప॥

అష్టాంగయోగముల నాశ్రమంబులలేదు
నిష్ఠతో శృతిశాస్త్ర నియమములలేదు
ద్రష్టయగు పూదోట ధర్మాత్ముడిదియనుచు
నిష్ట మెరిగించకను నిలముక్తి లేదు ॥ప॥—28

## సద్గురుని బాలోన్మత్త వర్తనము

అదిగో అతితుర్యమున సమనస్కుడై తాను
వదలక విధినిషేధ వర్తనుండగుచు
కదసి మహిలోనున్న కర్మతులు దూపింప
సదయుడై చరియింప సజ్జనుండగును

ప॥ తామసము చెడనట్టి తపసులకు నలవగునే
శమియించు సుజ్ఞానఘనులకే గాక ॥తామ॥

మచ్చరము లేక తన మహిమ జూపగ వచ్చి
ధరను బాలోన్మత్త వర్తనుండగుచూ
ముచ్చటతో భూచక్రమున మొనసి వెలుగుచును
నొచ్చె మించుక లేని యోగి యతిశగునూ ॥తామ॥

సంకల్పదూరుడై సర్వసాక్షికమున
పంకజాక్షులమాతృభావమున గనుచు
శంకలును లేక నస్ఖలితుడై వెలుగుచును
పొంకముగ వెలిగెడి పుణ్యుడతడగును ॥తామ॥

ధీరుడై యతడు సంసారదూరస్థుడై
కోరకును బిక్షంబు గుడిచి వేడుకను
కారణంబైహృదయ కమలాంతరంగుడై
శూరుడై నిలువగను సుజ్ఞానియగును ॥తా॥
రసనాగ్రమున నమృత రసముగ్రోలుచు బయట
మిసిమైన కాశిలో మెరసి వేడుకను
రసికుడగు పూదోట సద్గురుని పదమంట
అసి పదంబైయవల నమితమై ప్రబలు ॥తా॥—29

## సద్గురుడు గుణశూన్య దాత

గురువు లార్గురిద్రోసి గుణశూన్య భావమున
గురుతు జూపినవాడు నాకు గురుడూ
కొరత లేకర్థులకు ము_క్తి నిధానము
కొల్లబుచ్చినవాడు నాకుగురుడూ
గురుసుతుల దిక్కరించు దుర్మార్గులను
కొట్టి పరగదోలు ప్రభువు నాగురుడు
గురుతుమీరి ప్రణవ భేరిమ్రోయగ బయట
గుంపు గూర్చినవాడు నాకు గురుడు
ప॥ కాలమెరిగి సూక్ష్మగుహను దాటిబయలు
కడిసి వెలింగినవారు మావారు
చాల సుధాబ్దిని చిన్మయ హంసలై
సంచరించెడివారు మావారు ॥కాల॥
పసిడిస్థంభము కాళీమధ్యన నిలిపి సురల
పరిపాలనసేయు నాగురుడూ
మసలుచుండెడి తామస విరక్తుల
మర్దించవచ్చునే నాగురుడూ ॥కాల॥
కొసరు లేక రాజయోగమును సుతులకు
కొమ్మనుచు నిచ్చునే నాగురుడూ

భసితవర్ణ తేజినెక్కి బయట మెరసి
పరిపూర్ణుడై యుండు నాగురుడూ ॥కాల॥

పరువడిగా పరమభక్తులు గొలిచిరాగ
పశ్చిమంబున జను నా గురుడూ
విరినైన వెలుగుల సింహాసనముపైని
వీరుడై నిలుచునే నాగురుడూ ॥కాల॥

సురలు స్తోత్రించగా సొంపుతో మెరయుచును
చాల సూర్యనందిన నిలుచు నాగురుడు
మెరయుచును పూదోటమించి నిర్గుణుడునై
మెలగుచుండెడి వాడు నాకు గురుడు ॥కాల॥—30

## సద్గురుని కృపచే భక్తుడు బ్రహ్మమగు

ధరనునట ఘటమనెడి తనువులో వర్తించు
నరయ జీవుని కర్మమను నొందుజలము
గురుని పదసేవనా మరిచిల్లగింజ వేయ
నరుదు పంకములేక నాత్మశుచియగును

ప॥ పరమ సద్గురునికృప భక్తుడరనిముషమున
పరికించ కేవల బ్రహ్మమై నిలుచున్ ॥ప॥

ఇలసజ్జనులచెలిమి తలపోయ నదిపూర్ణ
కళలతో ప్రబలుగతి పరమజ్ఞానం
బలరి యుదయంబైన యజ్ఞాన తమమణగు
కలిత మపవర్గమార్గము బట్టబయలు ॥ప॥

కనుగొనగ చిన్నేత్రమునను సర్వము బ్రహ్మ
మనుచు నవలోకించి యానందమయుడై
తనరి పూదోట దేవుని స్వస్వరూపమై
పః లేక వెలియులోపల ప్రకాశించు ॥ప॥—31

## గురు సేవయే నిత్యము

గురుభ_క్తిస్థిరమగును కోరిచూడగమదిని
గురుజనులు బాంధవులు గురుతుదెలియకను
గురుసేవ నిత్యమగు ధరవెదకిచూచినను
గురుపలుకు సత్యమగు గురుపుత్రులకును

ప॥ కోరికలుడిగి సద్గురునివీక్షించి మది
 కోరి సత్పదముతా కూడంగవలెను ॥కోరి॥

గురుతురవిశశివహ్ని కూటస్థలంబునను
 పరిపూర్ణచిత్కళల బలసి లోబయటన్
అరయ నాపోజ్యోతి కవలసుస్థిరమగుచు
 నిరతమంతర్జ్యోతి నిండివెలగగను ॥కోరి॥

తరచుగ బహురత్న దాతుచిత్రితములా
 అరుదగు చిదంబరము లాక్రమించియును
పరిపరివిధములగు పండువెన్నెలబయట
 గురుతైన పూర్ధోట గురునిగూడుచును ॥కోరి॥—32

## సద్గురుమార్గము నీచులెరుగరు

ఘనమైనవనములో కదిసి కోకిలస్వరము
 వినికాకి బాతులకువేడ్కకానట్టున్
దినకరనిభుడైన దివ్యముని వాక్యములు
 వినినకర్మఠులకును వేడ్కయెట్లగును ?

ప॥ నిజగురునినడత మహి నీచులేమెరుగుదురు
 సుజనులైయున్న గురుసుతులుగాకిపుడు ॥నిజ॥

కళలుమించినపిల్లి ఘనముగా కూయుడిన
 తెలిసికుక్కుటము మది దిగులుపడినట్లున్
విలసిల్లు సుజ్ఞాని విమలమైనా నడత
 ఖలజాడ్యులును నతని గొలుచుటెట్లగును ? ॥నిజ॥

రవి యుదయగిరిమీద రభసమై ప్రబలినను
ప్రణవచే కలువలును భాసిల్లుటెట్లు ?
శివయోగిధరమీద చెలగిక్రీడించినను
వివరించి ప్రకృతులుర్విని ఎరుగ టెట్లు ? ॥నిజ॥
చెలగి గగనాంతమున జలజారినిలిచినను
జలజములు సిగ్గుపడి సరసినున్నటులన్
నిలిచిసుజ్ఞానులను నిగమాంతమున చెలగ
మలబద్ధులును నతనిమహిమగను టెట్లు ? ॥నిజ॥
దివము రాత్రులు మీరి దీపించుగిరితుదను
రవిచంద్రశతకోటి రభసమై ప్రబలన్
వివరించి చిద్వ్యోమ విమలాంతరంగమున
జవముతో పూదోట సద్గురుడు వెలుగన్ ॥నిజ॥—33

## అమృత హస్తము

పరమసద్గురు హస్త పంకజాతము తనదు
శిరసుపై నుంచినను చిత్తశుద్ధియగును
గరిమెతో నాదుహృత్కమలాంతరంగమున
పరమహంసై నేను ప్రజ్వరిల్లుచును
ప॥ నిజగురు నిక్రుపను నే నిర్లేపకుడనైతి
కుజనగురువులు నిట్లు కూర్చంగగలరె ॥నిజ॥
చెదరకను జిహ్వాతుద చంద్రామృతముద్రావి
మొదలి చిత్కిరణములు మోసి వీక్షించన్
ముదముతో నిగమాంతమున ముక్తిసుందరియు
నదియు నమృతాంకురంబై ప్రకాసించున్ ॥నిజ॥
తలపు పరతత్త్వమున తాలిమితో నొనగూర్చి
తలపులకు మొదలైన తాను సుజ్ఞప్తి
నిలచి పూదోటకడ నిర్గుణబ్రహ్మమై
తలపు మరపులు ద్రుంచి తా వెలుంగుదునూ ॥నిజ॥—34

## సద్గురునిధి మోక్షమతము

అరుదుగా సుజ్ఞాని యవనిపై వెలుగుచును
అరయ భిక్షాన్నము నారగింపుచును
పరగ బాలోన్మత్త పైశాచవృత్తితో
చరియించు నతని యిల నరులు తిట్టెదరు

ప. కటకటా దుర్జనులు గర్వించి జ్ఞానులను
కుటిలులై దూషించి కూలుచురు ధరను ॥కట॥

పరమ హంసై యతడు ప్రజలకును హితుడగుచు
గురుసుతులు కీర్తించ గుణరహితుడగుచు
మెరసి క్రీడించగను మేదినిలో కుజనులును
కరుణ లేకతనిగని గాసిపెట్టెదరు ॥కట॥

అరయ శరణులచేత నతడు పూజలుగొనుచు
మరివారికిని మోక్షమతము దెలుపుచునూ
గురుతైన పూదోట గురుని స్వరూపమై
నిరుపమానందమున నిలిచి వెలుగగను ॥కట॥—35

## సంగరహితుడు, సమతామూర్తి

నిర్విషయులై ధరను నిర్మలానందమున
గర్వాలను గూడకను కడను మెలగుచును
సర్వ సాక్షీకులై సద్గురుని మార్గమున
నిర్వాణులై బయట నిలిచి వెలుగుదురు

ప॥ వారి మర్మముదెలిసి వసుధలోపల జనులు
వారి సేవించినను వారె ధన్యులును ॥వారి॥

సంగరహితులునై జగతిలోపలనున్న
అంగనామణులకు అతిదూరులగుచు
బంగారు బెంచు నొకభావమున జూచుచును
ఘొంగి భూచక్రమున పొదలుచుండెదరు ॥వారి॥

పరమ యోగజ్ఞాన పరిపూర్ణ కాయులై
గురుజనులతో నెపుడు కూడియాడుచును
నిరతమును పూదోట నిజగురుని పదమంటి
స్థిరముగా నిర్భైట తేజరిల్లుదురూ ॥వారి॥—36

## జ్ఞానమయుడు - సంసారమలిన మంటనివాడు

పొలసి కుమ్మరిపురుగు బూచినంటనిరీతి
అరయ నీటను వెన్న అంటకున్నట్లున్
ధరరుచులు జిహ్వాగ్రను తగిలి తగలని రీతి
పరగనీటిలో నీరు పాపంట నట్లున్
ప। మరియు సంసారమను మలినమంటనియోగి
అరసి జనితేంద్రియముల నంటకుండెపుడు ॥మరి॥
జలజ పత్రమునందు జలమునంటనిరీతి
అల సుమములను స్వాదు అంటంటనటులన్
తెలియ సరసిలో మిత్రతేజమంటని యట్లు
మలినకాకుల పికము నిలగూడనటులన్ ॥మరి॥
ఘటములోపల దివ్యకళిక అంటనియట్లు
పటములోపల, నిలచి, వహ్ని అంటనట్లున్
మటుమాయలను జ్ఞానమయుడు నంటనిరీతి
కుటిలులను పూదోట గురుడంటబోడు ॥మరి॥—37

## రాళ్ల లో రత్నము

పెరిగి కాకులగూట పెల్లెగసి కోకిలయు
గరిమె వాటెనిబాయు క్రమమున్నరీతిన్
గురుమూర్తి యుదయించి కుజనసంగతిబాసి
సిరిమించి శివయోగి చిద్విలాసుడునై
ప। మరియు బాలోన్మత్త మహిం పిశాచమురీతి
స్ఫురగ జడత్వమున భాసిల్లు నెపుడు ॥స్ఫురి॥

ధర చిదిపిరాళ్ళ స్వయంభాతు వజ్రముబుట్టి
పరికించ భేరిచే ప్రజ్వరిల్లెడురీతి
స్థిరమైన గురుడను దివ్యాంత రత్నమును
గురుయోగజనులె మది గురు తెరుంగుదురు ॥మరి॥

శరధి చిప్పలోబడిన జలబిందువగు శుక్తి
గురుతుగానది నీటగూడని విధంబున్
గురుసుతులు పూదోట గురునంటి నిర్మైబట
తరలకెప్పుడు శూన్యతత్త్వమగుదురును ॥మరి॥—38

## గుణరహితులకే గురుప్రసాదం

ధర కాష్టమును దరచ మెరసి వైశ్వానరుడు
అరుదుగా నుదయమై మరిప్రబలి నటులన్
పరమ జ్ఞానులహృదయః పద్మకర్ణికమధ్య
స్థిరయోగి యుదయించి తేజరిల్లగను

ప॥ గుణరహితులా విభుని కోరి వీక్షింపుదురు
కనలేరు దుర్మతులు ఘనునిస్వరూపున్ ॥గుణ॥

ఘనతధేనువుల దధి కదిసి మదియించగను
వినుడి నవనీతమును వెడలి నటులన్
ధరను మించిన యమృతమయుడు చిత్కళలతో
గుణశూన్యమున పరమ గురుడు వెలుగగను ॥గు॥

ప్రకటముగ పూర్వగిరిపై నినుడుదయించగ
సకలజంతువు లానందించినటులన్
అకళంక ప్రభలతో నమితమహా పూదోట
సకలాత్ముడును వెలుగ శరణులలరుదురు ॥గుణ॥—39

## కులగర్వులు గురునిగనలేరు

చెలగియింటిలో దీపశిఖయు వెలిగినరీతి
అఖిలరగలబ్ధిలో నణగు విధమునను

తలచ తారకయోగి యిలపై ప్రకాశించ
కులగుర్వు లాఘనుని గురు తెరుంగరును

ప॥ ధర్మాత్ములకు మదినిధాయకంబై యుండు
దుర్మార్గులకు నతడు దూరమగువినుడీ ॥ధర్మా॥

ధర పూర్ణఘట జలము మరితొళకకున్నట్లు
గరిమెధృవుడెన్నటికి కదల నటులన్
పరమ పురుషుడు నిల్చి భక్తకోటులమదిని
స్థిరమైన నిర్వాత దీపగతి వెలుగున్ ॥ధర్మా॥

తెలియ మార్తాండుడును దివిని మెరసినరీతి
కళలతోడుత సుధాకరుడలరినటులన్
అలరి దివిభువి దిక్కు లాముకొని పూదోట
జలజనేత్రుడు బయట నిలిచి ప్రబలుచును ॥ధర్మా॥—40

## స్థి ర భ క్తు ల కే గు రు ద ర్శ నం

పెరిగి వాయసములను పికముకలియనిరీతి
నెరపద్మపత్రముల నీరంటనటులన్
మరియు సద్గురుడు భూమండలముపై ప్రబలి
గురుతుగా ప్రకృతులను కూడియుండడును

ప॥ శివయోగిమర్మంబు స్థిరభక్తులెరుగుదురు
అవనిపై దుర్జనులతని నెరుగవశమె ।శివ॥

నిలిచినీటను నవనీత మంటనిరీతి
అలజలధిలో చంద్రుడంటంటనట్లున్
చెలగి సద్గురుమూర్తి జితవిషయుడై ప్రబల
కలుష జనంబులతని కనుగొనగ లేరు ॥శివ॥

ధరయినునిఛాయ తగిలి తగలనిరీతి
పరికించముఖముదర్పణమున నంటనటులన్
అరయ సర్వముగండి యమితమా పూదోట
గురుడు సుజనులమదిని కోర్కెమెరయుగను ॥శివ॥—41



శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగావధూతస్వామివారి బేతంచెర్ల మఠ గురుపీఠం






శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగావధూతస్వామివారి బేతంచెర్ల మఠముఖద్వారం



శ్రీ శ్రీ శ్రీ పూదోట గురుపాదుకాపూజలో సాధుమతి సుబ్బలక్ష్మమ్మగారు
తోడి భక్తులు ఈశ్వరమ్మ. వీరమ్మ. వీరమ్మ. శంకరమ్మ. ఆచారిగారితో




శ్రీ శ్రీ శ్రీ పూదోట గురుపాదుకాపూజలో
కాకర్లపూడి సత్యరాజు కుటుంబము, శ్రీమతీ మాతృదేవులు

## తరంగములులేని సాగరమువలె

ఉర్విపై జనియించి యోంకారకాయుడై
నిర్విషయమున యోగనిపుణుడై మరియున్
సర్వము నుదాసీన సచ్చిదానందమున
దుర్విషయులకు నతడు దూరమైయుండు

ప॥ అతడు సద్గురుమూర్తి యవనిపై జనులారా !
మత వేషధారులును మరి పెక్కుగలరు ॥అ॥

మరియు బాలోన్మత్త పైశాచరీతులన్
పరమ జడుడై సృష్టిపై మెరసి దిరుగున్
నెరభక్తులనుజూచి నిజమైన ముక్తి తా
కరతలామలకముగ కరుణించు కృపను ॥అ॥

జలతరంగములేని శరధి చందంబునను
నిలిచి వెలుగుచు విమల నిగమాంతమునను
తెలివైన పూదోట స్థిర యోగిపుంగవుం
డలరి కేవల బ్రహ్మమై ప్రకాసించున్ ॥అ॥—42

## ప ర మ హం స

గురుతుగా తనహృదయ సరసిజము తుదనిలిచి
పురుషోత్తముని పదము పూజసేయుచును
గురునిమార్గం బొడిసి గురుయోగసిద్ధుడై
పరమహంసయై సృష్టిపై ప్రకాశించున్

ప॥ దుష్కర్మములుదృంచి దొరయు నానందమున
నిష్కళితుడై యున్న యతడె సద్గురుడు ॥దుష్క॥

తనరి మానవాకృతి ధరలోను క్రీడించు
ఘనులహృదయాబ్జమున కడసి వెలుగుచును
అనుదినము పదపూజ లలరి భక్తులుసేయ
గుణవంతులకు మోక్షమొసర దెల్పుచును ॥దుష్క॥

పర్వతాగ్రమునందు పరిపూర్ణ జ్యోతియనెడి
తనువునకు మూలమై తరల కెప్పుడును
నిర్విషయుడైనట్టి నిజమైన పూదోట
సర్వసాక్షియై యెపుడు చాలవెలుగొందు ||దుష్ట||—43

## బ్రహ్మమెరిగించు దేశికుడు

కరతలామలకముగ ఘననిరంజనబ్రహ్మ
మెరిగించు దేశికుని నెరనమ్మనట్టి
ధరపైని గురుసుతులు తలపనజ్ఞానులై
పరికించ చలనులై భ్రష్టులగుదురును

ప|| సత్యమిది నిగమాంతసారమగు నాపలుకు
నిత్యులైయున్నట్టి నిజభక్తులారా ! ||సత్య||

చిత్తవైకల్యమున శివయోగులను క్రొవ్వి
హత్తులైదూషించి మరియుఁతనిసుతులన్
హత్తుకొనిభ్రమలబెట్టెడి పాపాత్ములను
మొత్తుయఁముడును నినుప ముసలములచేతన్ ||సత్య||

ఇది శిక్షగాదనుచు సినసుతుఁడుగోపించి
పెదవులదరగ పండ్లు పెట పెటనుగొరికి
కుదియించివీరలను కుంభినీ నరకముల
వదలకనుద్రోయించు వగచుచుండగను ||సత్య||

బలిమికులిశమునైన బ్రహ్మాస్త్రమునునైన
అలత్రిమూర్తులుచాల అడ్డమొచ్చినను
ఇలను గురునికికీడు చెలగిచేసినకర్మ
మలపరించినబోపదిల యమునకైన ||సత్య||

కరుణతో శ్రీగురుడు కాలాంతకునిగదిమి
మెరయుచును యిట్టి స్వామిద్రోహులనకన్
చిరునగవుతో తనదు శిష్యులనువీక్షించి
సరసిపూదోట గురుడప్రభు చేపట్టున్ ||సత్య||—44

## గురుయోగులే జాతియం దైనను జన్మింతురు

కనుగొనగ సురభులందును పాలువచ్చుగతి
వనరక్షీరమున ఘృతమును బుట్టువిధము
దిననాథునందు వేడిమియు జనియించుక్రియ
తనరు శశియందు శీతలత వచ్చుపగిది

ప॥ ఇలమీద యోగీంద్రులే జాతులందైన
వలసి జనియింత్రుమహి వారెపూజ్యులును ॥ఇ॥

తలచకట్టెలయందు దహనుడును వెడలుగతి
సరస చందనచెట్టు ధరపుట్టుపగిది
సురగిరిని రత్నములు నరయబుట్టిన మాడ్కి
సరసిలో కంజములు జననమగుపోల్కి ॥ఇ॥

మలిన కాకులగూట మరిపికములును బెరిగి
మెలకువతో వాటిచెలిమి బాసినటులన్
కలిత పూదోట గురుకరుణ వడసినజనులు
కలసి అజ్ఞానులను కలియరెన్నడునూ ॥ఇ॥—45

## సద్గురుడు వర్ణాశ్రమదూరుడు

వసుధ నే జాతివాడైన శ్రీగురుని
మనకలను పూజించి మరిస్వామి కృపను
పొసగ సత్పదము తా బొరునను వీక్షించి
అసమానుడై కూడ నాథునుడె బ్రహ్మం

ప॥ అతడు వర్ణాశ్రమాదులకు నతిదూరమై
జితవిషయుడై మహిని చరియించు వినుడీ ॥అ॥

అతితుర్యశాంతుడై ఆనందమయుడగుచు
మతిమంతులకు యోగమహిమ జూపుచును
సతతమును అర్చించు సద్భక్తకోటులకు
ప్రతిలేనికైవల్య పదము ధయసేయు ॥అ॥

నిగమాంత వేద్యుడై నిలిచి చిన్మయునికడ
సుగుణములును ధ్యానించ సొంపు మెరయుచును
సగుణ నిర్గుణుడగుచు చాల పూదోటకడ
వగలు మీరుచు వెలుగు వరనిరామయుడై ॥అత॥—46

## గురుని పదార్చనచే ముక్తి

చచ్చి చావకయున్న సజ్జనులుధరణిపై
వచ్చు మించుక లేని వరగురుని పదములో
ముచ్చటను అర్చించి ముక్తిసుందరియైన
మచ్చె కంటినిగలసి మరి కలయకెపుడు

ప॥ వారె పూజ్యులుసుమ్మి వర్ణాశ్రమాదులకు
వారికిని సరిసాటి వసుధపై లేరు ॥వారె॥

నిరసించి సర్వమును నెరయ నిర్లేపులై
దురితదూరులును నవధూత వర్తనులై
గురు పరబ్రహ్మమని కోరిముల్లోకముల
సరగ చాటింతురిల భక్తిమెరయగనూ ॥వారె॥

చిత్తమను కారడవి చిద్వహ్నిచేగాల్చి
సత్తు చిత్తా నంద సంజ్ఞలను మించి
హత్తుకొని పూదోట అమృతస్వరూపులై
మత్తగజముల రీతి మహిచరింతురును ॥వారె॥—47

## శరణులకు నిరవలంబస్థితి

పరగ పిడికిటను నంబరముపట్టగవచ్చు
గరిమెగాలియు మూటగట్టవచ్చు
వరధైర్యమున విలయవహ్ని ద్రావగవచ్చు
మెరసి ముల్లోకములు మ్రింగగావచ్చు

ప॥ నెరమహామస్త్రము నిరవలంబమునగుట
గురుకృపనునపుడె భక్తుడుబ్రహ్మమగును ॥నెర॥

అలరిరాతను నార వలచి తియ్యగవచ్చు
చెలగిమృత్యువు కోరలు బెరుకవచ్చున్
బలిమివిధ్యుల్లేఖ పట్టినిలుపగవచ్చు
నల జలజసఖురథంబాపవచ్చు ॥నెర॥
సరకుసేయక కాలసర్పమును బంధించి
శిరముద్రుంచగవచ్చు శివయోగులారా!
శరణులును పూదోట గురునిస్వరూపమై
అరయ నిర్లేపులగు టతిదుర్లభమునూ ॥నెరయ॥—48

## గురుని నరుడని చూడరాదు

మలిన వర్ణాశ్రమాదులు సర్వవాసనలు
కలిత చిద్వహ్నిచే గాల్చి నిర్మలుడై
తలపసుస్థిర శూన్య తత్త్వమై ప్రబలుచును
నలరు నిర్వాసనుండైన సద్గురుని
ప॥ గురుతెరింగిటు మీరు రకుంఠితభక్తిచే
నరుడనుచు చూడ బహునరకములబడరె ॥గురు॥
నిగమాంతరంగమున నిలిచివెలుగుచు నమిత
వగల మీరిన ముక్తి వనజాక్షములలోన్
తగిలితగలక పరమ తత్త్వంబు నాదిగా
సగుణమోక్షములపై సాక్షియగు గురుని ॥గురు॥
కరుణాంబు రాసియగు వర దేశికస్వామి
నెర నిరాలంబమను నిజపదార్థమును
కరతలామలకముగ శరణులకు నీకీలు
గురిజూపు పూదోట గురులింగమూర్తి ॥గురు॥—49

## నిరాకార సాకారుడు

ఘన నిరాకారమై కదలక ప్రకాసింపుచును
నతడు సాకారమును తనువు నాల్చి

వినరయ్య యవధూత వేషమును ధరియించి
తనను కేవలముక్తి దాతయై ప్రబలు
ప॥ అట్టి సద్గురు పదములర్చించి నప్పుడే
గట్టిగ నఖండ మార్గము జూపుదయను ॥అ॥
నిరుప మానందమున నిర్లేపుడై మహిని
సరగ యజ్ఞానులకు చాలదూరమునై
వరభక్తకోట్లు చుట్టూలసి సేవించగను
నరుదుగా యోగపట్టాభిరాముడు నా ॥అ॥
వనర సాకార జీవన్ముక్తులును రోసి
తనదు సేవలుజేయు దాసబృందమును
పనిబూని పూదోట ప్రభులింగమును వేడ్క
ఘనతసుస్థిర శూన్యగాత్రులుగజేయు ॥అ॥—50

## గురునిపదసేవచే మోక్షము కరతలామలకము

సుడియలై విజ్ఞానశూన్యులైయెప్పుడును
పుడమిదుష్కర్మములు పొంగిజేయుచును
సుడిబడుచు నజ్ఞానసుందరాంగులగూడి
చెడిపోక నాపలుకు సిద్ధముగవినుడీ
ప॥ గురునిపాదాబ్జములు గొలిచినప్పుడెమీకు
కరతలామలకముగ కనుపడునుమోక్షం ॥గురు॥
తలపోయ ఈషణత్రయముచే కట్టుబడి
చలనులై జిహ్వాగుహ్యాల రుచులుదగిలి
వలసి బహుజీవులను వనరఖండించకను
పలుగాకులైపోక భక్తియుక్తినమా ॥గురు॥
కడగండ్లగుండలై గర్వించిప్రజ్ఞతో
చెడుగుణంబుల చాతచిక్కుచు భవాబ్ధిన్
పడి మహాకాలమును పలవరించకయికను
చెడనివస్తువు యిదిగో చెప్పెదను వేడ్కన్ ॥గురు॥

అరసి చెప్పెదను నాయమృతవాక్యము వినుడి
గరిమె సంసారమును కారడవిజొరకన్
ధరను కుజనులరోసి వరభక్తులనుగూడి
పరిశుద్ధులై చాల పరమశాంతులునై ॥గురు॥
ప్రతిలేని నాగురిని పదమంటి చెప్పెదను
మదిలో విచారించి హితవుతో మీకు
భక్తితో నలరిపూదోట తుద
జితకల్మషునిగూడి చెలగినిలరన్నా ! ॥గురు॥—51

## గురువాక్యముచే నిరాకారత్త్వము

గురుని వాక్యంబనెడి గురుతు చిద్వహ్నిచే
సరయ సంసారాబ్ధి యపుడె శోషిలును
గురుని వాక్యంబనెడి గురుతు మారుతముచే
గరిమె హంకార మేఘమును దొలగిపోవు
ప॥ గురుని వాక్యము వినుడి ధరణిపై జనులార
కరతలామలకముగ కనుపడును బ్రహ్మం ॥గురు॥
గురుని వాక్యంబనెడి గురుతు మృగరాజుచే
మరి అష్ట ప్రకృతులను మదగజములుడుకున్
గురుని వాక్యంబనెడి కుముదారి దీప్తిచే
నెరయ నజ్ఞానమను నిశియణగిపోవున్ ॥గురు॥
గురుని వాక్యంబనెడి నెరికులిశధారచే
సరగ భవదుఃఖమను గిరులునసియించూ
గురుని వాక్యంబనెడి చిర వినత సుతునిచే
పరునెత్తు భ్రాంతులను పన్నగంబులునూ ॥గురు॥
గురుని వాక్యంబనెడి గురుతు బెబ్బులిచేత
తరచు విషయంబులను హరిణములు గూలున్
గురుని వాక్యంబను కుముద బాంధవునిచే
పరిశించ నాత్మతాపను భగ్నమౌను ॥గురు॥

గురుని వాక్యముచేత కూలు విద్యాఽవిద్య
గురునివాక్యముచేత పరమ భక్తుడునూ
సరిలేని పూదోట సద్గురునిగూడితుద
నిరవయనిరాకార నిర్లక్ష్యమగును ॥గురు॥—52

## సద్గురుని అమృతదృష్టి

గురునమృతదృష్టిచే కూలు మాయలశక్తి
గురునమృతదృష్టిచే కూలు నింద్రియములు
గురునమృతదృష్టిచే కూలు విషంబులును
గురునమృతదృష్టిచే కూలు కిల్బిషములు

ప॥ అట్టి సద్గురునిపై హంకరించిన జడుల
పట్టి యజ్ఞానసతి భ్రష్టులను జేయు ॥అట్టి॥

గురునమృతదృష్టిచే కూలు దుష్కర్మములు
గురునమృతదృష్టిచే కూలు వ్యసనములు
గురునమృతదృష్టిచే కూలు దుర్మోహములు
గురునమృతదృష్టిచే కూలు కోర్కెలును ॥అట్టి॥

గురునమృతదృష్టిచే కూలు బంధత్రయము
గురునమృతదృష్టిచే కూలు షడ్గుణముల్
గురునమృతదృష్టిచే కూలు భవదుఃఖములు
గురునమ్రితదృష్టిచే కూలు బేధములూ ॥అట్టి॥

గురునమృతదృష్టిచే కూలు సంసారమును
గురునమృతదృష్టిచే కూలు సందియములు
గురునమృతదృష్టిచే కూలు సంతఃకరణ
గురునమృతదృష్టిచే కూలు జీవుడునూ ॥అట్టి॥

గురునమృతదృష్టిచే గురుసుతులు శాంతులై
గురునమృతదృష్టిచే గుణరహితులగుచూ
గురునమృతదృష్టిచే గూఢమగు పూదోట
గురుని పాదాబ్జములకూడి వెలుగుచురూ ॥అట్టి॥—53

## గురుడె పరవస్తువు

గురుడు తలిదండ్రడనుచు గురు తెరిగియటమీాద
గురుసేవ సేయుచును కుశలులై వినుడీ
గురుపరబహ్మమని కొంకు కొసరును లేక
గురుపలుకు నెరనమ్మి గురుపుత్రులారా !

ప॥ తెలిసి ఈ రీతిమది చలన మొందకమీారు
వలసి సద్గురునికడ వర్తించరయ్యా ॥తేలి॥
గురుని పాదాబ్జములు కువలయంబున నెపుడు
అరలేనిభక్తిచే నర్చించి వేడ్కన్
గురుపదంబులకన్న వరముక్తిలేదనుచు
గురుడె పరవస్తువని మరువకుడి మీారు ॥తెలి॥

గురు వంచకులుగాక కుజనసంగతి బాసి
గురుడె నిజదేవుడని కోరక మరేమి
గురిమించి పూదోట గురునిస్వరూపులై
అరుదగునిరాలంబమై నిలువరయ్యా ! ॥తెలి॥—54

## సద్గురు సేవచే నిర్వికల్పస్థితి

నెరయ నిర్లేపుడగు నిజమైన సద్గురుని
ధరణి జూచినయపుడె దగ్ధమగు మాయ
పరికించిగురుని పద పద్మములు భక్తితో
శిరమంట మొక్క బహుదుర్గుణము లడగూ

ప॥ ఇల జనులు నిట్టిస్వాముల సేవజేసినను
లలిత సుస్థిరముక్తి లభియించునపుడె ॥ఇల॥

తెలిసి శ్రీ గురుచరణ తీర్థ ప్రసాదములు
చెలగుచును స్వీకరించిన క్షణములోనె
తలపోయ సుజ్ఞానదావానలము చేత

బలిమి సంసారాబ్ధి పరగశోషిలును
అతని పాదాబ్జములు నచలులై కడువేడ్క ॥ఇల॥

సతతంబు వర్ధించు జనులదుఃఖములు
హతమగుచు విజ్ఞాన అమృత కిరణములతో
యతితుర్య జ్ఞప్త్యనెడి యర్కుడుదయించు ॥ఇల॥

దుష్టజనముల జూచి తొలగి యతిశాంతులై
సృష్టిపై సజ్జనులచెలిమి బాయకను
నిష్ఠతో శ్రీగురుని నెరనమ్మి కొలువతుది
యిష్టమగు సత్పదంబిపుడె సిద్ధించు ॥ఇల॥

సరకుసేయకమీరు సర్వమును మదిరోశి
నిరుపమానందమున నిర్వికల్పులునై
సిరిమించు పూదోట గురుని స్వరూపమై
తరలకను చిర సౌఖ్య తత్త్వమై నిలుడీ ॥ఇ॥—౮౫

## సద్గురుని దివ్యామృత వాక్యములు

తెలియ పండుచి చూతఫలము నెడలినరీతి
తలచఘృతమున కమ్మదనమబ్బుపగిది
ఇల నిక్షుదండముల కలమధుర మబ్బుగతి
లలితమగు తేనెసుమముల నెడలినటుల

ప॥ స్థిరమైనసద్గురుని దివ్యామృతవాక్యములు
నెరసి విశ్వంబుపైనిలిచి స్వాదించు ॥స్థి॥

ధర పునుగుగడ్డలను తావి వెడలినరీతి
సరగసుమములనుంచి స్వాదువెడలుగతిని
మరియగరు గంధమున మహిని వాసనగతి
పరికించ కస్తూరి పరిమళము రీతి ॥స్థి॥

పొలుపుమీరగ కోడిపుంజు గూసినవిధము
కలకంఠమును చాల పలికినవిధంబు

పలుమారు పూదోట పరమ తారకయోగి
నిలిచి నామదిలోను నిరతంబు బలుకు ॥స్థి॥—56

## సద్గురు హస్తము పరుసవేది

పరమపావనమైన గురుని హస్తాబ్జంబు
లరసి భక్తుల శిరంబంటు నప్పుడును
పరమామృత కాయులై ప్రజ్వరిల్లుచు నెపుడు
మరి ప్రకృతి రహితులై ధరవెలుంగుదురు

ప॥ స్థిరగురుడు పరుసమా శిష్యులును లోహంబు
గురుడు సోకిన భక్తకోట్లు హేమించు ॥స్థిర॥

కర్మలందును పికముగతి చరియింపుచును
ధర్మమార్గంబెపుడు తలపోసి చాల
నిర్మలము చేగురుని నెరయ కీర్తింపుచును
మర్మజ్ఞులనుగూడి మహిని మెరయుదురు ॥స్థిర॥

గర్వులకు దూరమై కదసి వెలుగుచు బయట
నిర్వికల్పుని ధ్యాన నిపుణులై వేడ్క-
సర్వమగు పూదోట స్వాములనుగూడి తుద
నిర్విషయులై కడను నిలిచి వెలుగుదురు ॥స్థిర॥—57

## సద్గురుడే సర్వమూ

మానవాకృతి దాల్చి మహిమీద సజ్జనులు
తానునెడి హంకృతిని తరిగి జ్ఞానమున
దీనులైసద్గురుని దివ్యపదములు జేరి
పూనినిర్లేపకుని పూజించ వలెను

ప॥ గురుడు తల్లియు దండ్రి గురుతు తెలియగమదిని
పరమ కేవల బ్రహ్మమై ప్రకాశించు ॥గురు

ధరగురుని హస్తమస్తక సంయోగమున
శరణ జనము లయోని జన్ములై మరియు
స్థిరమైన విజ్ఞాన దివ్యస్వరూపులై
పరికించి సత్పదము భావింతురెపుడు ॥గురు॥

తలచిదశ శబ్దములు దాటి వెన్నెలబయట
నిలిచివెలిగెడి జ్యోతి కళలు మీరుచును
అలరు పూదోటపై అద్వితీయుని గూడి
తెలియ నిష్క్రియులునై తేజరిల్లెదరు ॥గురు॥—58



ఐదవ దళం

# ప్రబోధం




## సదసద్వివేకం

ఇల అంబరము హస్తములబట్టి తాళముగ
వలసి వేయగవచ్చు వగలు మీరగను
మలిన మృత్యువును యమునిమర్దించి అష్ట
గజముల కొమ్ములను పెకిలి పోలియించవచ్చు

ప॥ నెర నిరామయుడనై నిల్చుటది దుర్లభము
ధరను భక్తుడు గురునిదయను నిర్గుణుడౌ ॥నెర॥

కాకునలుపైనట్టి కాలసర్పపువాడి
కోరలను పెకలించి కూల్చగావచ్చు
మేరుకుధరము నాదిమేదినిపై గిరులు
కోరిబంతులరీతి కొట్టగావచ్చు ॥నెర॥

కనుగొనగ సప్తసాగరముల పుక్కిటను
బట్టి త్రాగవచ్చు తత్త్వజ్ఞులారా!
వినుడి పూదోట దేవుని స్వస్వరూపమై
మొనసి చలనులు నిల్చుటయు దుస్తరంబు ॥నెర॥

జలము తరచియువెన్న చాలతీయఁగవచ్చు
కలితమహాగాలి మూటగా గట్టవచ్చు
తెలిసి పువ్వులస్వాదు నివిచియుకవాటమున
వలసి నించగవచ్చు వరధైర్యముననూ

ప॥ అరయఁసత్పదపుజనులగుట బహుదుర్లభము
గురుకృపనునప్పుడె భక్తుడు బ్రహ్మమగునూ ॥అర॥

సరగజీమూతధ్వని చలపట్టికుంభమున
మరియుబోయఁగవచ్చు మర్మజ్ఞులారా !
టొరసి మేఘజ్యోతి తొలగనియ్యకచాల
నెరపిడికిటనుబట్టి నిలుపగావచ్చు ॥అర॥

వినుడీ యిసుకచే నన్నము సేయఁగావచ్చు
ఘనతలోహము కనకంబును సేయవచ్చు
కనుగొనగ యిల చెడుగు గాజుపూసలునిముసమున
నాణిముత్యంబులను సేయఁగావచ్చు ॥అర॥

గరిమెమృత్యువును కాలదన్నగావచ్చు
గురుతువిలయాగ్ని గుటుకున మ్రింగవచ్చు
పరికించి యంబరము ధరణినుంచగవచ్చు
ధరణిచిరుచాపక్రియ తాజుట్టవచ్చు ॥అర॥

బలిమి చట్రాత తైలమునుదీయఁగవచ్చు
కళపెళను నుక్కుశనగలు వండవచ్చు
అలరుపూదోటస్వాముల సస్వరూపమై
నిలిచివెలుగుట కేవల దుస్తరంబు ॥అర॥—2

---

సరగ నుడుమును నుంచు జగతిపై వెయ్యేండ్లు
పరగ సర్పమునుండు పదియు నూరేండ్లు
నెరయఁవాయసముండు నేర్పుతో వెయ్యేండ్లు
ధరతటాకము లుండు తలప వెయ్యేండ్లు

ప॥ ఇలమీద హఠయోగు లీరీతినుండినను
బలిమి నిర్గుణ బ్రహ్మ పదమందలేరు ॥ఇల॥

ఉర్వి దేవాలయంబుండు నొక వెయ్యేండ్లు
తర్వులుండును మహిని తలప వెయ్యేండ్లు
పర్వతంబులునుండు పరికించ వెయ్యేండ్లు
సర్వశరధులునుండు సరగబహుకాలం ॥ఇల॥

ఒడలిపై నాశచే పరమ జ్ఞానులును
పుడమిమీద నిల్వ బోరు భోగమునకై
కడువేడ్క పూదోట ఘనుని సత్పదమంటి
చెడని కైవల్యమున చెదరకుండెదరు ॥ఇల॥—3



అలగాజుపూసలును నాణిముత్యము దీటె!
మలినసూకరములును మదగజము దీటె!
కలుష ఖరములు పంచకల్యాణికిని దీటె!
చాలపాములు ఆదిశేషునికి దీటె!

ప॥ అరయనిర్లేపుడై అవనిపై చెరియించు!
పరమయోగికి ధర్మప్రజలెట్లు దీటు? ॥అర॥

పరికించ శునకములు పంచాశ్యమునకు దీటె!
ధరపక్షులును వినత తనయునకు దీటె!
తరచు ఖద్యోతములు సరసి జాప్తుని దీటె!
గరిమె తారలు తుహినకరునితో దీటె ॥అర॥
కలితస్వాదులు వేలు కస్తూరితో దీటె!
అలరుగంధము లగరు గంధ సమమగునె
తెలియ సుమములు చాలదీపించియుండినను
బలుపారిజాత పుష్ప సమమగునె ॥అర
వినునత్తగుల్లలును వివరించిచూచినను
ఘనపాంచ జన్యమునకు సమంబగునె

కనగసర్వాయుధవర్గ మెపుడైన
కనుమాదివిష్ణు చక్రసమమగునె ॥అర॥

ఎల్ల తేజములు స్వయం జ్యోతికిని దీటగునె
కల్లయామెరుపులు బ్రహ్మకళతోను దీటె
తెల్లమిగ పూదోట దేశికస్వాములకు
పొల్లుగురువుల నతని పోల్చదీటగునె ॥అర॥—4



సృష్టిపై పరమ భక్తుల చెలిమి బాయకుంటె!
అష్టాప్రకృతుల ఖండించి నచలూడై తానుంటె!
దృష్టూలు మనోగాడ్పులు తిరమై కదలాకుంటె!
నిష్టాగురుని పదములు నెరనమ్మి తానుంటె!

ప॥ యోగమేటికీ? నాల్గుపదవూల భోగమేటికీ?
బాగైన విశిష్టాద్వైత బ్రహ్మమై తానుంటె? ॥యో॥
యోగమేటికీ నాల్గు పదవుల భోగమేటికీ?
పిండాండ బ్రహ్మాండములు తా బేధించే నేర్పుంటె!
మండలాత్రయముపై మోక్షమార్గము తా గంటె!
పండువెన్నెలబైట తా పరిశుద్ధుడైయుంటె!
నిండివెలుగుచు నున్నముక్తి నెలతాను కూడుంటె! ॥యో॥
సరిలేని చిద్రూపుడై తా సర్వసాక్షియుంటే!
నిరవాలంబమై యున్నట్టి నిజశూన్యమైయుంటె!
అరుసుగా పూదోట అమృతుడూనై యుంటె!
పరికించగా భక్తకోటులకు పట్టుగొమ్మైయుంటే! ॥యో॥—5



పులులతో పలుమారు చెలిమి చేసిన నవియు
కలుష మొందిన శిరంబులు గొరుకు వినుడీ!
మలిన సర్పములతో మరిపొందు జేయ:నవి
కఃకజెందిన తఱిమి కఱవకను:బోపు

ప॥ జలజనేత్రులతోడ చెలిమిజేసిన వినుకి
యిలను నిందలువచ్చు నెంత వారలకూ ॥జల॥
మగచిభ్రమచే జనులు మరినివ్వు దొక్కనది
యరయభగ్గున కాల్పు కేలమాను ?
సరస మదగజముతో చల్లాట మాడనది
గురుతెరుంగక విసరి కొట్టకనుపోదు ! ॥జల॥
అవనిపై నిర్లేపులైన యోగులు స్త్రీల
భవదుఃఖమునుమాని పరికించి మదిని
వివరించి పూదోట విభుని పాదాబ్జములు
అవలోకనముచేసి యమృతులయ్యేదరు ! ॥జల॥—6

## శుకయోగీంద్రుని ఘనత

తలపోయ స్త్రీలమాయనుదెలిసి గజముఖుడు
అలరుపెండ్లినిమాని యతిశాంతమునను
తెలిసి త్రిమూర్తులాదిగ సర్వజనులచే
నిలిచిపూజలుగొనెను నిష్కళంకుడునై
ప॥ సంగరహితునికి సరిసాటియెవ్వరును లేరు
సంగరహితుడు నిరంజన లింగమగునూ ॥సం॥
సరసిజాక్షులభోగసౌఖ్యములు మదిరోసి
సరసుడై భైరవుడు మెరసివేడ్కన్
అరయ దిగంబరుడునగుచు ముల్లోకముల
మరియు క్రీడించు తనమహిమప్రబలగను ॥సం॥
పట్టువిడుపులుదెలసి పాలాక్షువరసుతుడు
అట్టి యింతులమీది యాసఖండించి
పట్టుకాశయుగట్టి పొసగ నస్కలితుడై
గట్టిగ ప్రకాశించు ఘనులునుతిసేయన్ ॥సం॥
అతితుర్యశాంతుడై ఆనందమయుడగుచు
జితవిషయుడై మదిని శ్రీశుకులునొకడు

యతికులాంభుదియందు శీతకరునిగతిచాల
మతిమంతుడై వెలుగు మాయదూరుడునై ॥సం॥
పరికించనిటువంటి భక్తకోటులకెల్ల
నెరపట్టుకొమ్మయై నిలచియెప్పుడునూ
మెరసిపూదోటకడ గురుచక్రవర్తియై
శరణజనములకు సుస్థిరమోక్ష మొసగూ ॥సం॥—7

## సదసద్వివేకం

కాని దుర్మార్గులను కలసి వర్తించినను
హానివచ్చును సుమ్మి అమృతులకునైనన్
పూని ఈగయు కడుపులోజొచ్చి యన్నమును
మానకను వెడలించు మాడ్కి సిద్ధమునా
ప॥ యిలమీాద యిట్టివారల విడువవలెచాల
తెలిసి దేశికస్వామి స్థిరభక్తులారా! ॥యిల॥
పరికించ కంటిలో బలు నెరసుబడినతా
నరిసి తీసినయపుడె యధికసుఖమగును
గరిమె కంటకం బరకాల విరిగిన దాని
నెరిగితీసినయపుడె వేదనంబుడుగు ॥యిల॥
అలపాదరక్షలో గొలుకురాయుండినను
వలసి తీసిన యపుడె వరశాంతిజెందు
సొలయ చెవిలోపలను జోరీగ జొచ్చినను
మెల్లగనది వెడలించ కలకపుడు దీరున్ ॥యిల॥
వినుడి తన యిల్లాలు విభునితో పోరినను
మనసులోపలరోశి మరి యాగ్రహముసన్
వనర పురుషుడు నట్టె వ్యంగ సతినెడబాసి
తనరిబిక్షుకుడునై తనరి సుఖమొందున్ ॥యిల॥
మలిన తాపజ్వరము మహిజనుల పీడించ
నల చికిత్సను పొందినపుడె విముఖులుడునో

వలచి పూదోట స్వాముల గూడినపుడె
బలిమి భవదుఃఖములు భగ్నమై పోవున్ ॥యిల॥—8



బలిమి సంసారమును ప్రకృతి వృక్షంబునకు
తలపోయ మూలకందము మానసమును
కలిత విజ్ఞానమను ఖడ్గంబుచే దాని
నలరి ఖండించకను అచలాత్ములారా!

ప॥ వట్టి మాటలచేత వరమోక్షమును లేదు
గట్టిగా గురునికృప ఘన నిరంజనుడౌ ॥వట్టి॥

అంతకంతకు భక్తి యధికమై శోభిలగ
చింతసేయగ గురుని శ్రీ పాదములునూ
వింతలగు నజ్ఞాన విషయరిపులను దరిమి
మంతుకెక్కిన వహ్నిమాడ్కి మెరయుగనూ ॥వట్టి॥

చలనరాహును విడుచు శీతకరునికై వడిని
మలినములు లేని నిర్మలభాను పగిదిన్
అలలు సుళ్ళును లేని అబ్ధి చందంబునను
నిలిచి పురుషుడు చాల వెలుగకుండినను ॥వట్టి॥

భోరునను సద్గుణంబులు ప్రకాశించగను
ధీరుడై ఆత్ముడును తెలిసి వేదాంత
సారమగుమార్గమున చనుదెంచి యవ్వలను
కేరెచిన్మయుడునై క్రీడసల్పగనూ ॥వట్టి॥

అతితుర్యుడైనట్టి యాత్ముడు నిరీక్షించి
ప్రతిలేని నిర్గుణ బ్రహ్మమును గూడి
మితిలేని పూదోటమీరి నిర్లేపుడై
సతతమును వెలుగొందు సర్వసాక్షిగను ॥వట్టి॥—9

మన్మధునిచే చెడిరి మహిచరులు జలచరులు
మన్మధునిచే జెడెను మరిజంతు తతులూ
మన్మధునిచే జెడిరి మత్తులై దివిచరులు
మన్మధునిచే చెడిరి మరినిశాచరులు

ప॥ పంతమాడుచును పూబాణముల చేదుచును
ఎంతవారల మనసు నీతులువ చెరుచూ ॥పం॥

మన్మధునిచే జెడిరి మరిభ్రమసి గిరిచరులు
మన్మధునిచే జెడిరి మరి ఋషులుమునులూ
మన్మధునిచే జెడిరి మనువులును దిక్పతులు
మన్మధునిచే చెడిరి మాయసిద్ధులును ॥పం॥

మన్మధునిచే జెడెను మసలక త్రివర్ణములు
మన్మధునిచే జెడెను మైమరచి సర్వం
మన్మధునిచే బోదరిమి మరియు పూదోటపై
తన్మయానందమున తనరు సద్గురుడూ ॥పం॥—10

---

జిహ్వారుచులను జిక్కి చెడెను బహుజంతువులు
జింహారుచులకు జిక్కి చెడిరి భూజనులు
జింహారుచులకు జిక్కి చెడిరి మునిమనువులును
జింహారుచులకు జిక్కి చెడిరి సిద్ధులునూ

ప॥ జిహ్వాగుహ్యాలచేత జిక్కి ముల్లోకములు
జిహ్వాగుహ్యాలగెలుచు జితయోగి నాగుసుడు ॥జిహ్వా॥
జిహ్వారుచులకుజిక్కి చెడిరి గంధర్వులును
జింహారుచులకు జిక్కి చెడిరి దిక్పాలకులు
జింహారుచులకుజిక్కి చెడిరిరుషిదనుజుల్
జింహారుచులకుజిక్కి చెడిరినభచెరులు ॥జిహ్వా॥
జిహ్వారుచులకుజిక్కి చెడెను మూర్తిత్రయము
జిహ్వారుచులకుజిక్కి చెడెనుసర్వమునూ

జిహ్వారుచిజెరిచి సుస్థిరుడు పూదోట తుద
జిహ్వారుచులను లేక శ్రీగురుడు వెలగన్ ॥జిహ్వా॥—11



యిలలోను ఆశచేపోలసు జంతువులనే
తెలియజెప్పెద వినుడి ధీరాత్ములారా!
అలరి సంగీతముల నాలకించిన మీరు
కలిత హరిణముగూలుగతి యగును సుమ్మి

ప॥ సర్వేంద్రియంబులను సమయించిమదిలోను
నిర్వాసనుండైన నిర్గుణుని గనుడీ ॥సర్వే॥

పరిమళంబులు విమల పట్టుచేలములు ధర
వరభూషణములు బహు వైభవంబులునూ
పరికించ పీటిపై భ్రాంతిగలిగినమీరు
సరసగజమును నీల్గు జాడయగువినుడీ ॥సర్వే॥

గట్టిగామహిలోను కామాంధకారులై
పొట్టగుడుపులు నగుచు పరగవ్యసనములన్
అట్టె స్త్రీలను జూచి అతిమోహితులునైన
మెట్టె అగ్నిలోదుంకు మీనువిధమౌనూ ॥సర్వే॥

సరసాన్నములకునై సంతోష మొందుచును
నెరయ వాంఛలుగల్గు నీచజనములను
అరయగా జిహ్వ రుచికాసించి తిరిగిసను
పరగ గాలము మ్రింగు చేపవిధమౌను ॥సర్వే॥

వలసి వాసనలపై వసర భ్రమయుండినను
తలచ మధుపమురీతి దగ్ధమయ్యెదరూ
అలపువ్వుదోట స్వాముల పాదపద్మముల
అలరుస్వాదమును గొనుచు అచట నిలరయ్యా ॥సర్వే॥—12



మెరపుతీగయుబోలు మీస్వస్వరూపమును
మరచి అజ్ఞానులై మహిజనన మొంది
గరిమెతోడుత ప్రకృతికాయములు ధరియించి
మురియుచును భవవార్ధిమునిగిచెడవలదూ

ప॥ యిలమీదజనులార తెలియఁజెప్పెదవినుడి
వలసి గురుపాదాబ్జములు గొలువరయ్యా! ॥యిల॥

బలిమైన సతిసుతులపై యాశలనువలల
చెలగి తగిలినయపుడె సృష్టిపైమున్నా
జలధి మీనులపగిది జాలరుచేజిక్కి
పొలసిపోయినరీతి పోయెదరుమీరు ॥యిల॥

ధనధాన్యములు లోభమునగూర్చి పరులకును
వనర నన్నంబిడక వలసిలుబ్ధులునై
తనరికుడువకచాల దాచిపెట్టినమీరు
విను తేనెయీగలును నీల్గుగతియగును ॥యిల॥

పస లేని గృహములును పర్వడిగగట్టుచును
వసుధపైభోగములు వలసిగోరుచును
మసలుచును ధరవిషయమగ్నులై యుండినను
పుసిగాయలోపురువునసియించు విధమా ॥యిల॥

అతితుర్యభక్తితో అచలులై సద్గురుని
హితవుతో పూజించి అతిశాంతమునను
సతతమునుపూదోట స్వాములస్వరూపులై
జితవిషయులగు సుస్థిరులునై నిలుడీ ॥యిల॥—13

సకలాత్మ నీ పనులు సరగజేయుటె కాని
వికలమతులగు గురుల కీక పనులుసేయ
ప్రకటముగ నీపాద భక్తిసేయుటెగాని
రొకక్షణము ప్రకృతి పనులను జేయఁబోను

ప॥ వినవె యాత్మారామ విన్నపము జేసెదను
వినుతించి నినుగలసి వెలిగితినె తండ్రి ॥విన॥

తలచి నీ నిజసుతుల డాయజేరుటెగాని
కులగర్వులగువారి గొడవనేబోను
నిలిచి నీ పదములకు నేను మ్రొక్కుటెకాని
చలన గురువుల చెలిమి సేయనెన్నటికి ॥విన॥

దొరసిభక్తులతోను మెరసి పలుకుటెగాని
పరికించి కుజనులతో పలుకనేబోను
పరమేశ నీతోడ భాషించుటెకాని
ధరను ప్రకృతులు బిలువ తాబలుకబోను ॥విన॥

గురుయోగమును నేను కోరిసేయుటెకాని
మరికర్మయోగములు మదిదలచబోను
పరమ యోగమునేను పట్టి సేయుటెకాని
అరసి బహులక్ష్యములు ధ్యానించబోను ॥విన॥

సుగుణమూర్తిని నిన్నుచూచి సొలయుటెగాని
జగతిలోపల సతుల జూడనేబోను
సగుణ నిర్గుణములకు సాక్షియగు వూదోట
అగుణు నినుగూడి నే యమృతాబ్ధినగుదు ॥విన॥—14



కలుగులందును మూషికములు నుండినరీతి
బలుకొండ గుహాలందు బడలి కుందుచును
పలవరింపుచునెపుడు పడియున్న నిజముక్తి
తలపోయగాలేదు తత్త్వజ్ఞులారా!

ప॥ జితవిషయుడైనట్టి శ్రీగురుని కరుణచే
ప్రతిలేనికైవల్య పదవిసిద్ధించూ ॥జిత॥
సరస ఆకటికొరకు జలధియందునుబకము
తరలకను మీనుకై ధ్యానించువిధము

మరిభుక్తికొరకు జపమాలికలు చేబూని
నెరయ గొణుగుచుటెగాని నిర్వాణిగాడు ॥జిత॥

అలసి మేకలరీతి నాకలము నమలినను
యిలగబ్బిలములగతి తలకిందులైనన్
తెలియ పూదోటస్వాముల పాదపద్మములు
వలసి సేవించకను వరముక్తి లేదు ॥జిత॥—15



నిన్న పోలిసినవారు మొన్నగూలినవారు
నిన్నుకన్నవారు నీవుగన్నవారు
మన్నులోపలగలసి మాయమైరని మీర
లిన్నివిధములుదెలిసి యేలచెడిఎదరు ?
ప॥ కనుగొనుచుమీకునే కరుణతో జెప్పెదను
మనమలరవినరయ్యా మర్త్యజనులారా ! ॥కను॥

మీరునీల్గుట నెరిగి మెరసి మితిలేని
నిస్సారమగు సంసారవనధిలోమునిగి
వారు వీరనుచు నావారు వీరన్భ్రమసి
సారెకును భవమొంది చాలవరలగును ॥కను॥

బుద్ధిచెప్పెదనిపుడు భూచక్రమున గురుని
వద్దజేరుచు సతనివాక్యమును నమ్మి
పద్దునను పూదోట బ్రహ్మంబునొనగూడి
సద్దులేకచట నిజస్వాములైనిలుడీ ! ॥కను॥—16



అలరుచును స్వాయంభు మనువాది పుణ్యాత్ములును
చలముచే సూర్యవంశము చక్రవర్తుల్
నెలయమేనూరు కోటుల యోజనములైన
తలప విస్తారమగు ధరణిపాలించి

ప॥ మరణమై చనువేళ మదిదెలియు రిందరును
పరమాణు వంతేయును పసిడిగొని చనిరే ॥మర॥

అరయఁగా యయాతియు నాదిధర్మాత్ములును
సరిలేని చంద్రవంశము రాజవరులు
విరివిభూచక్రంబు పరిపాలనము జేసి
నెరయ కీర్తిని ప్రబల నిలచిరే మునుపు ? ॥మర॥

వసర చిర్లలదొరలు వసుధపై నీల్గిరిటు
తసర జెప్పెదవినుడి తత్త్వజ్ఞు లారా !
జనన మరణము లేక స్వచ్ఛమగు పూదోట
ఘనుని పదమున గూడి కడ సెలుగరయ్యా ! ॥మర॥—17

తలవెంట్రుకలు నెరసె నేత్రద్వయం
బుల దృష్టి తక్కువగు పొలిసె వినికిడియు
తలప శీర్షముపణకె దంతములు కదువదలె
నలకంఠమున శ్లేష్మ మధికమగునయ్యా ?

ప॥ ముదిసె సంగముచాల ముదిసె వాయువుమీదు
మదిని నాశము మోహమను సర్పయుగము ॥ము॥

తనువు చర్మమునబ్లె తనుచుకండూతి యగు
మనుజులారా ! మీకు మలిన భ్రమలొదవు
చనెను జవసత్వములు చాలయాయువు నిండె
నొసర మృత్యువు సమీపంబగును నిదిగో ॥ము॥

ఇట్టి దేహమువిడచి యినసుతుని భటులచే
పట్టువడి బహుక్లేశ పడవలవదింకను
గట్టిగా పూదోటకడ గురుని సత్పదము
పట్టినిలిచినమీదు భవదుఃఖమణగు ॥ము॥—18

మాటనిలుకడలేని మానవుడు శ్వపచుండు
బాట దొంగయు బలుసుడియ శ్వపచుండు
నీటు బహుజారుడగు నీచుడిల శ్వపచుండు
చాటించి చెప్పెదను సద్భక్తులారా!

ప॥ తెలిసి శ్వపచుడుగాని దేశికుని చరణములు
వలసి సేవలుజేయు వాడె నిర్మలుడు ॥తె॥

పంచమహా పాతకుడు పరికించ శ్వపచుండు
వంచించు గురువులను వాడు శ్వపచుండు
మంచివారల జెరచు మనుజుండు శ్వపచుండు
పొంచి జీవులద్రుంచు బోయశ్వపచుండు ॥తె॥

తల్లిదండ్రుల గూల్చు తాటోటు శ్వపచుండు
కల్లసాక్ష్యము పలుకు గర్విశ్వపచుడును
చిల్లకట్టెను ఘనుల చెనుకు నతడు శ్వపచుడును
కొల్లకాడై తిరుగు కుమతి శ్వపచుండు ॥తె॥

మాలబొంకులు బొంకు మలినుండు శ్వపచుండు
తాలిమించుకలేని తపసి శ్వపచుడును
ప్రాలుమాలిన విషయ భ్రాంతు డిల శ్వపచుండు
కాలునికి లోనైన కర్మి శ్వపచుడును ॥తె॥

బూటకపు జ్ఞానియు పోలింప శ్వపచుండు
చేటుగోరు రొరులకును చెడుగు శ్వపచుడును
పాటించి పూదోట బ్రహ్మంబు సత్పదము
కూటమి నెరుంగని కోపి శ్వపచుండు ॥తెలిసి॥—19

## ఎవడు మాల? నిర్వచనం

విమల గుణములులేని విషయలోలుడు మాల
శమదమంబులులేని జపిత కడుమాల
కుమతియై యున్నట్టి కుజనుండు బలుమాల
అమలాత్ములను జెనకు నతడు పెనుమాల

ప॥ యిట్టిమాలండైన యిలను సద్గురుపదము
పట్టినిల్చినవాడె పరమ పావనుడు ॥ఇట్టి॥
పరకాంతలను జూచి పట్టువాడే మాల
పరధనంబుల కాసపడువాడె మాల
పరుల హింసలజేయు పశుజీవుడె మాల
పరులపై ద్వేషించు పామరుడె మాల ॥ఇట్టి॥
మలిన వాసనలు మది కలవాడెయగు మాల
కులమదంబుల కలరు కుపితుడే మాల
చలన షడ్గుణములను గెలువనతడే మాల
కలుష వర్తనుడైన కర్మి పెనుమాల ॥ఇట్టి॥
గురుని నరుడనిచూచు గుణహీనుడే మాల
గురువంచకుడునైన కుటిలుడే మాల
గురునితో వాదించు గుండగోళకు మాల
గురునిందలనుజేయు కుక్కపెను మాల ॥ఇట్టి॥
కపట చిత్తుండైన కడుకోపియును మాల
ఉపకారులను జెరచు నోగు బలుమాల
నిపుణుశగు పూదోట నిజగురు స్వాములకు
నపకారమును జేయునతడె చెడుమాల ॥ఇ॥—20

## సదసద్వివేకం

అలరు మీ చిద్రూప మను నేనుమరచి ధర
మలినులై జననమై మదమత్సరములన్
అల లింగగాత్రమను నజ్ఞానకవచమును
బలిమిదొడిగియు యింద్రియబద్ధులై మీరు
ప॥ ఎంతకన్నుభ్రమసితిరో యెరిగింతుమీమదిని
చింతించి శ్రీగురుని సేవించరయ్య ॥ఎంత॥
నడిమిసుఖములనమ్మి నరులార చిరసుఖము
విడిచి పెట్టితిరి బహు వెర్రిజీవులునై

ఎడతెగక భవదుఃఖ హేయవార్థిలొ గూలి
చెడవలదు చాటించి చెప్పెదను మీకు ॥ఎంత॥

మాయసంసారమను మమతచే చిక్కుబడి
పాయకను సతిసుతుల వెంబడీ తిరిగి తిరిగి
తోయజాక్షుల బలిమితో రమించినను మీ
కాయములనర్కజుడు ఖండించునిపుడె ॥ఎంత॥

కరుణతో నిజముక్తి క్రమముజెప్పెద నిప్పు
డరసివినరయ్య నాయమృతవాక్యములు
పరమసాత్వికులై భక్తియుక్తినిచాల
గురునిపాదాబ్జములు కొలిచినిలరయ్యా ! ॥ఎంత॥

కష్టపడితిరియింక ఘనసత్పదంబనెడి
యిష్టమెరిగించెదను నిదిసత్యమగును
నిష్ఠతో పూదోట నిర్వికారునిగూడి
ద్రష్టలకుపైని వరద్రష్టలైనిలుడీ ॥ఎంత॥—21

—ం:ం:ం—

పరికించ సూకరము పదునైదు పిల్లలను
వరస యీనును యిలను చాలముదమునను
అరయమత్తేభమును నైరావతంబనెడి
యరుదు పిల్లనె యీను సదివగమెచాలు

ప॥ వరసద్గుణుండైన యొకపుత్రుడే చాలు
ధరతల్లి దండ్రులకు వరకీర్తిదెచ్చు ॥వర॥

అలగ్రామ సింహమును సతిప్రియంబున చాల
నలరకూనల నీను మహిమీదపెక్కు
బలిమి కేసరియీను పంచాశ్యమై వరలు
తెలివి కూనను నొకటి తేజరిల్లగను ॥వర॥

వినుకుక్కటము పిల్లలను జేయు పదియిరువ
దిని వాటి జననంబును వ్యర్థమే యగును

విసత పిల్లలరెంటి ఘనతి జేయుచు నవియు
పనిబూని పులుగులను పట్టి వెలుంగు ॥వర॥

చెన్నొందగా కొంగ చెలరి పిల్లలతనర
నున్నతముగా జేయు నుర్విపైచాల
వొన్నె మెరయగ హంస యొనర పిల్లలరెంటి
పన్నుగా జేయు నవి ప్రబలులోకములన్
మనమలర నినకులమను సుధాంబుధియందు
కనుగొనగ హిమకరుని గతి వెలుంగుచును
వనరపూదోట కడ వరనిరంజనలింగ
మను నాఖ్యగలిగి నే నమితమైయుందు ॥వ॥—22



గరిమెతో చదలేను కదలకను మెదలకను
పరమ శాంతిని బారు ప్రజ్ఞమెరయుచును
పరగ బెడబెడ ధ్వనుల ధరణిపై ద్రుంకుచును
మురికి వాగును బారు మునివర్యులారా!

ప॥ ఇల బేధవాదులగు జనులీరీతి పలుకుదురు
తెలియ సుజనుల వాక్యములు మధురముగను ॥ఇల॥
ఒనరగా పసునారు వన్నెమీరిన మెరుగు
కనకంబు మ్రోగునే కడుబెట్టుగాను
కనుగొనగ మహిమీద కఠినమైయున్నట్టి
ఘనత కంచుమ్రోగు కడు చిత్రమగును ॥ఇల॥
అందముగ కుంజరంబవనిపై తీవ్రముగ
పొందుగానడువ చప్పుడులేదు వినుడీ
పంది నడువగ నగును బలిమిగట్టెలరవము
చందమేర్పడియుండు సద్భక్తులారా ॥ఇల॥
అలరి పంచాననుం డాకసమునను తా
తలచి గమనించ నినదము లేదు మరియు

మలిన శునకము తప్పమార్గముల బరువిడిన
బలిమిగా ధ్వనిబుట్టు బహువిధంబులను ||ఇల||
పరమ జ్ఞానుల స్వానుభవార్థములు మిగుల
నరసి తర్కించెద రతిశాంతులగుచూ
పరికించ పూదోట గురునెరుంగని జనులు
నెర యోచికుండగతి వాగుచుంద్రు ||ఇల||—23



భరితమగు చూతతరు పల్లవంబులదినక
నరసికుటజముల పికమాసించుపగిది
సరగపువ్వుల తేనే చాలించిమధుపంబు
గురుతైన యున్మత్తలకు చనినవిధము
ప॥ ఇలనుశరణులట్రబతుకు లీరీతినగు వినుడి
బలిమిసద్గురుని సత్పదముబట్టకను ||ఇల||
కినిసిచదలేటిలో క్రీడించు రాయంచ
కనుగొనుచు బురదమడుగును జేరుపోల్కి
మనమలరశశికళలు మరగినచకోరకము
మొనసిహిమబిందువును గోరినటుల ||ఇల||
పాలుద్రావిన పిల్లి పరితృప్తి జెందకను
పోలించి పరికికిని బోవుచందమున
చాలపలుకుచు శుకము స?సపంజరములో
బాలిచేతనమలను బక్షించు విధమూ ||ఇల||
అలరి శునకంబునకు నాజ్యంబు బోయనది
యలగుంతలో చెప్ప కాసించు వగను
తెలిసి సూకరమునకు దివ్యాన్నమిడినదది
మలిన మలమేధ్యంబునకు మరగిచనురీతి
ధరప్రతివ్రతయైన తనసతిని రోయుచును
సరగ నర్తకిగోరు జారు ఛాడ్పునమా

సరసుడగు పూదోట స్వాములకు లాశ్రయము
లెరగియడగిన తులువలయి చెడినటులన్ ॥ఇల॥—24

---

## ఇంద్రియాధి దేవతలు

చరణములున్నను నచ్చట విష్ణువు
చరియించుటను గాదా!
వరుసను గమనము నన్న గురునకు
వలగొని నిలుచుటగాదా!
కరములు వున్నను నచట ఇంద్రుడు
క్రమమున నుండుటగాదా!
మురియుచు దానము నన్నను గురుపద
పూజలు జేయుటగాదా!

ప॥ భక్తియుక్తిగలుగన్ భక్తియుక్తికూడిన కనుగొనమది
ప్రజ్వరిల్లుటను గాదా! ॥భక్తి॥

అలవడ వక్త్రము నున్నగ నచటను
అనలముండుట గాదా
బలిమిగ వాక్కును నున్నను నచటను
భజియింపుట తా గాదా
జిహ్వాయు నున్నగ నచటను వర్ద్రుచు
లుండుట గాదా
అలర త్వగింద్రియ మున్నగ నచటను
అనిలుడు నుండుట గాదా

అరయగ ఘ్రాణము నున్నగ నచటను
అశ్వినులుండుట గాదా
పరికించగ గంధము నున్నగ సుగంధ
ప్రదరంబుండుట గాదా

స్థిరముగ శ్రోత్రము నున్నగ నచటను
దిశలు నుండుట గాదా
నిరతము శబ్దంబుండగ నినదము నేర్పన
వినుటయు గాదా ! ||భక్తి||

నేత్రము లున్నగ నచట నర్కుడు
నెలవై యుండుట గాదా
మిత్ర రూపమున్నగ తుద శక్తిని
మేలుకొలుపుటను గాదా !
చిత్రితముగ నుపనేత్రము దెరువగ
చిత్కళ లెగయుట గాదా
శత్రువులను రుద్రాగ్ని శిఖలచే జరచి
నిలుచుటను గాదా ! ||భక్తి||

పొందుగ హృత్పద్మము వికసించగ
బోధరూపుతా గాదా !
సందు లేక నన్నిట వెలుగుచు తుద
సాక్షిరూపు తాగాదా !
బిందువు చిద్వ్యోమమునగూడ
చిద్బీజమగుట తాగాదా !
అందమై పూదోట గురుని తానంటి
మనోన్మని గాదా ! ||భక్తి||—25

## సదసద్వివేకం

కుదురుకొన్న గురుభక్తి తెలిపిచే
కుండలిరేచే దెన్నటికో
పదునాల్గు భువనముల కాధారంబగు
ఫణియూర్ధ్వంబగు టెన్నటికో
కదలనియ్యని మైదిండ్ల వారలను
ఖండించుట నాకెన్నటికో

విదితముగా శత్రువుల గెలచినే
విజయము జెందున దెన్నటికో!

ప॥ శివశివా శివశివ యను వాక్యము నాజిహ్వాను
జతపడు టెన్నటికో
శివయోగము సద్గురుని కరుణచే
సిద్ధించుట నాకెన్నటికో ॥శివ॥
పవనబంధువులు పశ్చిమవీధిని
పసువులు బాయున దెన్నటికో
జపమున నక్షరద్వయము ప్రణవమున
సంధించుట నాకెన్నటికో
త్రివిధ పదవులును మీరిమోక్షమున
స్థిరమై యుండున దెన్నటికో
అవిరళముగ నిర్వాత దీపగతి
అచలుడగుట నాకెన్నటికో ॥శివ॥
ముచ్చటతో ముజ్జగములంటి తుద
మునసి వెలుంగుట యెన్నటికో
హెచ్చి బ్రహ్మసౌదామిని లోబయటను
యిమ్మగ ప్రబలున దెన్నటికో
విచ్చలవిడి నానంద జలధిలో వేడుక
చెందున దెన్నటికో
స్వచ్ఛమైన నిగమాంతరమున గురు
నచ్చుట కనుగొను టెన్నటికో ॥శివ।
తుమ్మెదధ్వనిగతి తుర్యపుష్పమున
దొరసి శబ్దమగు టెన్నటికో
మూమ్మూలాశల నమృత ధారలు
మోదుచు దుంకు నదెన్నటికో
నెమ్మదిలోపల నమృత మంటినే
నిర్మలమగుటయు దెన్నటికో

కమ్మక నిర్గుణ బ్రహ్మమందు నే
కలసి యుండుటయు నెన్నటికో ॥శివ॥
పరమ తత్త్వమై బయటలోపలను
పరిపూర్ణంబగు టెన్నటికో
నిరుపమ నిరవయ నిరవలంబమై
నిలిచి వెలుంగుట యెన్నటికో
సిరిమించెడి యా పూదోట గురుని
నేజెంది వెలుంగుట యెన్నటికో
తరలక సుస్థిర శూన్యతత్త్వమై
తన్మయ మందుట ఎప్పుడొకో! ॥శివ॥—26

## మానస బోధ

అక్షరంబునజిక్కి యో మనసా! ఆశలను దిరుగబోకె
నిక్షేప మెదుటనిల్చి మనసా! నిర్మలపు త్రోవ గనవే
అక్షరంబులు గూర్చి యాకాశ ముద్రలో
అక్షరంబునుగూడి యాడవే మనసా!

ప॥ నిన్ను నీవె తెలియవే మనసా! నిర్ద్వంద్వమై యుండవే
చెన్ను మెరయుచునున్న శ్రీ గురుని పదమంటి
వన్నె మెరయుచు నుండవె మనసా! ॥నిన్ను॥

నిన్ను నీవే తెలియవే మనసా! నిఖిలమును నీవు గదవె
కన్న విన్నావారిలో మనసా కదిసి వర్తించగదవె
తిన్నగా నీమదిని తేజరిల్లెడి గురుని
వన్నె మెరయుచు సతని జేరుమీ మనసా! ॥నిన్ను॥

ఉండి చెదరని తెలివితో మనసా! యూర్ధ్వసేదువ జేయవే
అచట కుదురుగ నిలువవే మనసా! వేదాంతుసిన్ దెలియవే
ఆదిత్యమధ్య కనకాంబరుని అంటుచును పావుకొని
యమృతమై ప్రబలవే మనసా! ॥నిన్ను॥

పక్షమున నుభయ కళలూ మనసా ప్రణవమున గూర్చగదవే
రక్షకుని జేరినీవు మనసా రభసమున నిలువగదవే
అక్షరాతీతమై అలరు సద్గురుడ నెడి
నిక్షేపమును జూచి నిలువవే మనసా ॥నిన్ను॥

లింగమధ్యను తెలియగా మనసా! జంగమము లీనమగునే
రంగైన జ్వాలాబ్ధిలో మనసా! రభసమున నోలలాడీ
పొంగుచును పూదోట పూర్ణపురుషునిగూడి
నింగిరీతిని నీవు నిలువవే మనసా! ॥నిన్ను॥—27

---

మరియు నాశివకరము మధ్యనిజ గురుపదము
గురిమీరగా మనసకూడుండ మనిన
పరిపరి విధముల పశువులెత్తిన బ్రహ్మ
మెరపనె చాపునను మెదిపెదను నిన్ను

ప॥ హితవుజెప్పెద నీకు మనస!
యెరుగవే నీలోన అతితుర్యమైన పరమాత్మలో జెందు ॥హి॥

ఎన్ని జెప్పిన నీవు నెరుక మరుపెరుగకను
కన్నుగానక నెప్పుడన్నిటను తిరిగెదవు
ఇన్నాళ్ళవలెగాదే యిపుడు రాముని నెలవున
నిన్నుగురు పులినోట నేడు వేసెదను ॥హి॥

అష్టపాశముల బంధాదుల విడిపించెదను
దుష్టాత్ములకు నీవు తొలగవే మనసా!
నిష్టయెరిగి యుపకృతిచేష్టలే జేసినను
నిష్టతో ముమ్మాల నిలిపెదను నిన్నా ॥హి॥

అజ్ఞానమనెడి నీ యావరణ మెడలించి
సంజ్ఞతో గురుపదము జాడ జూపెదను
ప్రజ్ఞతో నినుబట్టి పంచభూతములదర
సుజ్ఞానఖడ్గమున చూర్ణంబు జేతూ ॥హి॥

మట్టునెట్టియుమనస మర్మవీథినదీసి
దిట్టనైతుద దివ్యతేజమున ముంతూ
పట్టైన పూదోట పరమాత్మ పదమునను
గట్టికైవల్యమున కడువేడ్క నుంతు ॥హి॥—28

కలకంఠిమేల్కొని ఘనత మెరసినీవు కదిసిరూఘ్గరిగూడకే
కలకాలమును కర్మగృహములోపలమూటి కలసితిరుగబోకే
చెలగుచునిరువది నలుగురునీవు చెదరనియ్యబోకే
తెలివిచేతనీవు కదలకుండబట్టి దేవునికర్పించవే

ప॥ వద్దికతోనారు మూడుమెట్టలుదాటి బుద్ధిగలిగీయుండవే
పద్దుమీరుచునీవు ప్రణవాంతమున, దనరుముద్రనంటియుండవే!
మనసా! ॥వద్ది॥

శ్రీలమించి వాయువేగమున చైతన్యత్రయమునుదాటవే మనసా!
గాలివిసరసూక్ష్మద్వారమునజొచ్చి గగనాంతమునవెల్గవే
మేలుదెలిసి మనస మేరుతుదకు మెట్టిమెరసి తూర్పునజూడవే
కాలములూమూడు మీరివెన్నెలబయట గంతులేయవేనీవు
మనసా ॥వద్ది॥

చెలగి హంసలరెంటి నాకాశమార్గమున శీఘ్రముగనడిపించవే!
చిలుకలైదునునెగసి శివకరముపైవాలి చెలగికేరుచునుండునే
తొలకరిమెరుపులు తళుకు తళుకునమెరయ తెలివింటిలోనురికెనే
మనస
అలరుచుండెడి పువ్వుసాన కాలువ తేజోవారాసిలో దుంకునే
మనస ॥వద్ది॥

బలసి జలనిధిమధ్యపద్మ మధ్యనుగురుడు ప్రజ్ఞమెరయుచునుండునే
కలసి సింహాపుపిల్ల మొనసిజగములన్నిక్రమమున సాధించునే
కలయకలోనెలి నిండుకొని వేయికరమున మ్రింగ తా వెలుగునే
కళలచేత జగములన్నినించుక దివ్యకరముతానైయుండునే ॥వద్ది॥

చెలగి మెరపుల దివ్యచవి కెలోపల గురుడు నిలిచి వెలుగుచునుండునే
మనస
కలికి మెరసి పసిడి పూలు పురుషుని మీద కదసి చల్లుచునుండునే మనస
కలకాలము నుగురుని కదిసి భక్తి నిలిచి కాంతపూజలు సేయునే
సల్లలితముగ పూదోటరాముని గూడి సద్వ్రతమై యుండవే ॥వద్ది॥-28॥



దివము రాత్రులు మించి దినకరుల శతకోటి
దివ్యప్రకాశమగుచు
నవరత్నఖచితమగు నాహృదయ జలజమున
ప్రవిమల ప్రభలు నమర
వివరించి చూడ నోంకార పీఠను రామవిభుడు
తాంతవమాడగా
శివరామ ! నీ దివ్యపథము నే నలమరగి
చేరి ధ్యానము సేయగా
ప॥ పంచేంద్రియములాగ పసువులెత్తక గురుని
పనులవారై నిలువరే
మించి నాయాత్మ సలిసమున సద్గురు పదము
మెరసి పూజలు సేయరే నిపుడు ॥పం॥
అధికమైనట్టి యానంద బాష్పములగురుని
నభిషేక మొనరింపగా
సదమలంబైన పచ్చని వలువ మెరయుచును
నఖియ చెంతను మెలగగా
కదిసి రామునికి దివ్యాభరణములు
క్రమముతో నలరించగా
పొదలి గంధములు వనమాలికలు
రామునికి కలిసి శృంగారింపగా ॥పం॥
నిపుణులగు ముక్తి పాపలు రామునికి
నిలచి హారతు లియ్యగా

విపరీతముగ ప్రణవ మంత్రనాదధ్వనులు
వెలయ ఘోషించగానూ
కృపధూప దీప తాంబూలనైవేద్యములు
శ్రీగురున కర్పించగా
అపరిమితమగు నానందమున
పూదోటగురునంటినే క్రీడించగా ॥పం॥ —39

---

చనుదెంచి చిత్కిణము స్వాంతమునుగూడగా
మనమధోముఖమైన జనితేంద్రియములను
కనుగొనగ పురుషు డజ్ఞాన ప్రకృతితోగూడి
తనరుచును లేచి తమతమ పనులు జేయున్

ప॥ పరికించ మానసము బంధ మోక్షములకు
నరయ కారణమగును నస్ఖలితులారా ॥పరి॥

తెలిసి సద్గురిని యుపదేశమై విమలాత్మ
లలరినిర్గుణ బ్రహ్మమనెడి లక్ష్యమును
వలసధ్యానముసేయ గలసి సర్వేంద్రియములు
లలితవిజ్ఞాన కార్యమున నిలుచునపుడూ ॥పరి॥

అనలంబులోబడిన యవనిలో కాష్టంబు
లనలరూపములునై యలరు విధమునను
వనర చిద్వనధిలో వరుస భూతేంద్రియములు
మునిగి అమితశాంతి జెందిమెలగు ॥పరి॥

సరగపూర్ణాత్ముడును సర్వంబు గ్రసియించి
పరమ పావనుడునై భక్తి యుక్తినను
గురుతు సాకారనిర్గుణుని గూడిన యపుడె
అరుదగు చిదాకాశమై ప్రకాశించూ ॥పరి॥

తలపోయ శుద్ధచైతన్యుడును నిరామయుని
కలసి కేవలశూన్యగాత్రుడై తుదను

నిలిచి పూదోటకడ నిర్వికారుండగుచు
అలయఖండైక్య రసమై మెలగునెపుడూ ॥పరి॥—30

---

ఫలము జూపినయట్టి సద్గురునిపదముల పట్టువిడువబోకే!
నెలవుదప్పి మనస! పంచేంద్రియములలో గలసి వర్తించబోకే!
కలలోనైన సద్భక్తులతో గోష్టి తొలగియుండబోకే
మెలకువతో నీవు మెరసి నవకంజములు మించివెదకవే మనసా!

ప॥ ఒద్దికతో నాదబిందుకళలు పరమయోగముతో డగూర్చవే
సద్దులేనిచోట సత్పదమై నీవు సర్వసాక్షియైయుండవే ॥ఒ॥

కొలుకులంటి రెండు గోరింకపిల్లలు కొమ్మున ఎగజిమ్మనే
పలుకువింట మధ్యపాము వెడల నేడు తలుపులు విడిపోయెనే
చిలుకలు అయిదును చెలరేగితుదను శివచింతపై వ్రాలెనే
వెలుగుచు హేమనస పశ్చిమ వీధినమెట్టి తూర్పుదిక్కునజూడవే ॥ఒ॥

తళుకు తళుకున బ్రహ్మ మెరుపులు లోబయట నిలిచి వెలుగసాగెనే
ప్రళయంబుగా ప్రణవ నాదమనెడి యురుము మెరసియు గర్జించునే
పలుకులు జరిగొని పరమామృతరసము బ్రాహ్మీతుదను గూడునే
నిలచిగ్రోలుచు నీవు నిశ్చలానందమున నిజగురుని వీక్షించవే ॥ఒ॥

జలమధ్యమున పుండరీకము గాడ్పుచే జల్లున వికసించునే
జలమధ్య సూర్యచంద్రాగ్ని దీప్తులునిండి చెలగివెలుగుచునుండునే
బలసి నిర్గుణ జ్యోతి పరిపూర్ణకళలతో బట్టబయటను వెలుగునే
తలపోయగానచట తారకబ్రహ్మమై తరలకుండ నిల్వవే మనస ॥ఒ॥

కళలు మించిన రత్నపీఠమున సద్గురుడు కడువేడ్కతో వెల్గునే
చెలగి ముక్తికన్య శ్రీగురుని చరణములు వలసి పూజలుసేయునే
నిలుకడైన పూదోట రాముని నీవు కలిసి తన్మయమందవే
నిలిచి దివ్యమగుచు నిర్ద్వంద్వమైన సన్నిర్లక్ష్యమైయుండవే॥ఒ॥-31

పున్నమ చంద్రునిమించు పొంకమగు తేజనెక్కి
కన్నెనంద నన్నుజేసు ఘనుడు యెవ్వడే?

ప॥ ప్రజ్ఞ మెరసి యతనిచుట్టు పరమభాగవతులు గొల్వ
విజ్ఞాన పురుషుడైన వీరభోజుడే! ॥ప్ర॥

తెల్లని విభూతిపూసి తిరుమణి నుదుటను మెరయ
చల్లని చూపుల తండ్రి సఖయ యెవ్వడే? ॥ప్ర॥

మించి దివ్య భూషణములు మేనిపైని నిండి వెలుగ
మంచి పసిడి వలువ మెరయు మగువ యెవ్వడే! ॥ప్ర॥

ఝల్లున ముఖ కళను చమట జడిగొన చిరునవ్వు కాంతి
ముల్లోకములంటి వెలుగు మూర్తి యెవ్వడే! ॥ప్ర॥

ధర్మమను ప్రణవభేరి దశవిధముల ఘోషించ
నిర్మల రూపమున వెలుగు నెలత యెవ్వడే! ॥ప్ర॥

ముత్తెము కుచ్చుల గొడుగు మొనసి శిరసుమీద వెలుగు
కత్తిచేబూనిన ఘనుడు కలికి యెవ్వడే ॥ప్ర॥

దుంకించి దివ్యతేజి దుర్జనుల ద్రుంచి గురుడు
సంకించి సుజనులగాచు నతడు యెవ్వడే। ॥ప్ర॥

తుంబురు నారదులు బాడ దొరసి రంభనాట్యమాడ
కంబుకంఠి వెలుగుచున్న ఘనుడు నెవ్వడే! ॥ప్ర॥

శృంగార కన్నెలు ప్రబల పొంగి రవి నందిలో నిలుచు
రంగైన పూదోట కలికీ! రాము డితండే ॥ప్ర॥—82

---

మించిమనసా! నీలోగురుని యెంచిచూడమంటి
పంచవింశతితత్త్వముల పట్టువిడువమంటి
మంచివారితో చెలిమి మరువకుండమంటి
పొంచిసద్గురునిపదములు పొందియుండమంటి

ప॥ దిట్టవైమనసా ! ఎన్నటికి తిరిగిరావలదంటి
పట్టైయున్నరాజయోగ పదమైయుండమంటి ॥ది॥

బాధించికుండలిని పరువెత్తించమంటి
సాధించిచతుష్పదవులు సరగదాటమంటి
క్రోధించిముగ్గురుని తుదకూల్చి మెరయమంటి
శోధించిముక్తిద్వారమున చొచ్చినిలువమంటి ॥ది॥

గట్టిగాహృత్పద్మమున కలిసివెలుగుమంటి
అట్టితేజమువెలి పరమహంసవై చెలగమంటి
పట్టైనపూదోటరాముని పదములంటమంటి
బట్టబయట నమృతపదమైబలిసి వెలుగుమంటి ॥ది॥—33



మనస ! సంసారమను మలిన వారధిదాటి
ఘనతసాత్త్విక గుణమున నీవు తుదను
పనిబూని నాసాగ్రమున పరమ కళలుగాని
దినమునాదము నీవు తీవ్రముగ వినవె !

ప॥ మనస ! వ్యాపారములు మాని యుండవె యికను
మనస నీలోయున్న మర్మంబుగనవె ॥మన॥

సెలయేటి మొత్తమున చాల వర్షించనది
నలుపంద నమృత పానము చేసివేడ్క
చెలగి గురుధ్యానమున చైతన్యములు జెరచి
నిలిచి నీ తెలివిలో నిజము గనుగొనుమీ ॥మ॥

వికసించి లోబైట వేయురేకుల చెండు
సకల లోకములపై చెదరకున్నట్టి
అకలంక పద్మమున అమృతజ్యోతిలో నెపుడు
ప్రకటముగ పూదోట బ్రహ్మంబుగూడి ॥మ॥—34



చుట్టియున్న భుజగి రేచి కట్టి పెక్కు రంధ్రములును
మెట్టిపదునాల్గుభువనములు మించివర్ణములు
గట్టిగా అష్టపురములుగడచి తొమ్మిదిచక్రములు
దిట్టలైనినదమునగూర్చి దీపించుమనసా !

ప॥ ఇష్టముప్రాణభావను నెలమిసద్భక్తితో నీవు
అష్టసుమముల గురునిపదములర్చించుమనసా ॥ఇష్ట॥

చక్కగముజ్జగములపై సంతోషముచే శక్తిమయము
ధిక్కరించి నిశ్శబ్ధపుమింట దివ్యామృతమంటి
అక్కరతో రాజదంతద్వారాతి సూక్ష్మరంధ్రమునజొచ్చి
గ్రక్కునశృంగాటకముపై నెక్కవేమనసా ! ॥ఇష్ట॥

నిండుభక్తితోడను త్రైమండలములుమించి యఖండ
మండలాంతమున స్వర్ణమందిరములోను
అండగొనక నీవు పూదోట ఆత్మరామునితోగూడి
యుండు తన్మయసుఖకేళి నోలలాడుచును ॥ఇష్ట॥—25

## శాంతి జీవనులు

వఽసి జనకుండు నరువది వేల స్త్రీలతో
కలిసి బహుభోగ భాగ్యముల సొలయుచును
చెలగుచు గృహస్థుడై జితవిషయుడై మెరసి
మలిన మంటక నిలను మరి ప్రకాసించూ

ప॥ పరికించ సంసార పంకమున చరియించి
పొలసి పొలియరు మహిని పరమయోగులును ॥పరి॥

పరగ పదహారువేలను నూటయెనమండ్రు
వారిజాక్షులమించి వాసుదేవుడును
తరుచు వల్లవీ సతుల ద్రాత్రిపై కూడి తుద
నరయ నిర్లేపుడై వర్తించు వినుడీ ॥పరి॥

అరయ సచరాచము లందంతరాత్ముండై
మెరసి చిన్మయు డేమిటి నంట డెపుడు
ఎరుక మరుపులు మించి యిన్నిటికి సాక్షియై
తరలకను పూదోట గురుడు వెలుగొందు ॥పరి॥—36

పరమ శాంతులుసుమ్మి భవదుఃఖ రహితులును
పరమ శాంతులుసుమ్మి శక్తి యుక్తులును
పరమ శాంతులుసుమ్మి వరయోగి నిజసుతులు
పరమ శాంతులుసుమ్మి పరమ పావనులు

ప॥ జగతిపై వీరలకు సరిసాటి లేదనుచు
నిగమాదిశాస్త్రములు నిలిచి చాటించు ॥జ॥

పరమ శాంతులుసుమ్మి పరికించ నిష్కళులు
పరమ శాంతులుసుమ్మి మెలసి సిద్ధులును
పరమ శాంతులుసుమ్మి సనకాదిమానులును
పరమ శాంతులుసుమ్మి బ్రహ్మనిష్ఠులును ॥జ॥

పరమ శాంతులుసుమ్మి భావించ సితకరులు
పరమ శాంతులుసుమ్మి పరమ హంసలును
పరమ శాంతులుసుమ్మి కరుణా సముద్రులును
పరమ శాంతులుసుమ్మి పరిపూర్ణయశులు ॥జ॥

పరమ శాంతులుసుమ్మి ప్రత్యక్ష నిర్గుణులు
పరమ శాంతులుసుమ్మి ధరను నిష్క్రియులు
పరమ శాంతులుసుమ్మి పరోపకారులును
పరమ శాంతులుసుమ్మి నెరయచిన్మయులు ॥జ॥

పరమ శాంతులుసుమ్మి నిరుపమానందులును
పరమ శాంతులుసుమ్మి బ్రహ్మతత్త్వజ్ఞుల్
పరమ శాంతులుసుమ్మి ప్రబలు పూదోటకడ
పరమ శాంతులుసుమ్మి స్థిరనిరామయులు ॥జ॥—37

## జీవుల జన్మస్వభావము

గుట్టుతో సర్పముల కోరలను విషవహ్ని
పెట్టిరేమరి యొకరు పేర్చి తేజమునకు
నట్టివేడిమి నొకరు సందుంచిరే శశికి
పట్టి శీతల మొకరు పరగనుంచెదరే!

ప॥ వాటినైజగుణంబు వసుధపై జనులార!
పాటించ మధ్యన ప్రబలవెన్నడునూ ॥వా॥

కనకంబునకు కాంతి కల్పించిరే యొకరు
పెనుముండ్లకును వాడిపెట్టెనే నలువ
తనరుసుమముల స్వాధు నునిచిరేమున్నొకరు
పునుగుగడ్డకు తావిబోసిరే జనులు ॥వా॥

పరికించ శునకములకు బలుకమనిజెప్పిరే!
సరగపికములకు పంచమ స్వరమును
గరపిరే యెవరైన ఘనమయూరంబులకు
నెరయ నృత్యము మున్ను నేర్పిరే వినుడీ ॥వా॥

తెలిసి బకహంసలకు తెలుపుబెట్టిరె యొకరు
నలవాయసంబులకు నలుపెవ్వరిడిరి
యెలమి సురభూజమున కిచ్చిరె యమృతము
అలపుచూత ఫలంబు లందుచు లిడిరె ॥వా॥

గరిమె నిర్మోహంబు ఘనులకొకరిచ్చిరే
వరప్రణవమునకు ధ్వను లొసగిరేయొకరు
సరసుడగు పూదోట స్వాములకు చిరశాంతి
సరయయొకరిచ్చిరే యతనికాగుణము ॥వా॥—38

## మానవ జన్మ రహస్యం

పలుమారు మీరు నెనుబదినాల్గులక్షల జీ
వులయందు నొక్కొక్క కలుష యోనులన్ను

యిలమీద వసుసతో యేడేసిజన్మములు
మలినులైతిరిగెదరు మాయబద్ధులునై

ప॥ ముక్తిమార్గంబునే మొదలంటజెప్పెదను
భక్తితోగురునిపద పద్మములుగనుడీ ॥ముక్తి॥

కనుభ్రమసి సంసారమను వసధిలోచాల
వెనుకముందును తెలియకను జొచ్చిమీరు
మునిగితలఎత్తలేకను మోహమనులతల
మనమలరకట్టుబడి మహికూలవలదు ॥ముక్తి॥

అతి ఏహ్యామైనట్టి సతిసుతుల నెడబాసి
మితిలేనిధనధాన్య మిత్రులనురోసి
సతతమునుగురుపలుకు సమ్మతిగనమ్ముడోక
హితవుజెప్పెదనిపుడు సత్ప్రియంబునను ॥ముక్తి॥

ఎనసి జనితేంద్రియంబులను రిపులచేజిక్కి-
మునుపు భవదుఃఖంబులనుభవించితిరి
జననమరణములేని జాడ నెఱిగించెదను
వినరయ్యనాపలుకు విమలాత్ములగుచు

అరసి తత్ పదత్వంపదాసి పదములుమీరు
గురునైనసత్పదముగూడి తన్మయులై
సిరిమించిపూదోట గురునిస్వరూపమై
తరలకను చిరశూన్యతత్త్వమైనిలుడీ ॥ముక్తి॥—39

## ఉపకారం

పసులకొరకై మేఘ పంక్తులును చెలరేగి
శరధిలో తోయములును చాల ద్రావుచును
పరువు లెత్తుచు దివిని పరువడిగ యేతెంచి
ధరణిపై వర్షించు తథ్యముగ వినుడీ!

ప॥ క్రమమున పరోపకారమును సత్యమని శృతులు
సమితమునుగ చాటించు నఖిలలోకముల ॥క్రమ॥

పరుల కొరకై మహిని పారు నదులును చాల
పరులు జలములు ద్రావి బ్రతుకవలె ననుచు
పరులు స్నానము చేసి పరిశుద్ధులై యుదక
మరసి యినునికి అర్ఘ్యమలరి యెత్తుదురు ॥క్రమ॥

పరులకొరకై ధరణి పైరు బండును చాల
పరులు బక్షింపుచును ప్రబలు చుండెదరు
పరులకొరకై మింట దినుగు నర్కుండెపుడు
పరులకొరకై భువిని పసిడి యుదయించు ॥క్రమ॥

పరులకొరకై వహ్ని పక్వాన్నములు జేయు
పరుల కొరకై గాలి ప్రసరించు నెపుడు
పరులకొరకై బిడుకు పరికించ ధేనువులు
పరులకొరకై లతల ప్రభవించు సుమముల్

పరుల కొరకై మహిని పాదపంబులు బండు
పరులకొరకై ధగను భవమొందు హరియు
పరికించి పూదోట గురుడు భక్తులనపుడె
పరగ తన స్వస్వరూపమును జేసికొనును ॥క్రమ॥—40

## సద్ధర్మబోధ

మునుపు వ్యాసుండాది మునివరులు న ద్వైత
మనెడి ప్రబంధములు నానందముననూ
నొనరగా ముక్తి జీవములు తరించుటకు
పనిభూని ధరపైని ప్రబల జేసిరిగా

ప॥ తలప మోక్షమునకివి దర్పణంబులె యగును
తులిన జీవంబులకు మరిగూఢమగును ॥త॥

అరుదైన నిగమాంతమను కామధేనువును
పరమ యోగంబనెడి భక్తిచే బిదికి
కరుణతోడుత యమృతకావ్యములు జేసిరివి
శరణులును సత్పదము జాడ యెరుగుటకు ॥త॥

వలసినూతుడు విమల వరయోగ శాస్త్రములు
తెలియ జెప్పినను జనదివ్యాంజనములగు
బలిమి పూదోటస్వాములు బ్రహ్మమను రత్న
మలరి భక్తులకొసగ నవిసాక్షియగును ॥తలప॥—41



నెరయ సంసారులై నిర్మోహులై ధరను
భరితమగు నజ్ఞాన పంకంబునందూ
పొరసి పొరయకను కుమ్మర పురుగుగతిమీరు
మెరసి సాత్వికులై మెలగరోయన్నా!

ప॥ ధీరులై వినుడియిది దివ్యమగు నిగమాంత
సారమగు నాపలుకు శరణ జనులారా! ॥ధీ॥

దేహతత్వంబులును దెలిసిగురుకృపనా
దేహంబులోని ద్విదేహములు దెలిసి
దేహములపై జ్ఞానదేహంబు నెరిగియా
దేహంబుకడను మీ దేహంబుగనుడీ ॥ధీ॥

తలపోసి యతితుర్య తనువు చివ్వనవిడచి
కలక యించుకలేక కడువేగమునను
మెలకువతో పూదోట మించినిరవయుగూడి
కలిత నిర్మల నిర్వికారులై నిలుడీ! ॥ధీ॥—42



పరమగురుని పదములు భావములో నిలువజూచి
గురుని పదమున మనసు గూర్చనేరకను

గురియు దెలియక కర్మగురువుల పూజజేసి
అరసి దివ్వెలో పురుగు కరగిన రీతినయ్యో

ప॥ ఎంత జెప్పినను ముఢాత్మ లేల తెలియరు?
చింతించి సద్గురుని పాదసేవ సేయరొకో! ॥ఎంత॥

గురుని కరుణచేత కుండలిని రేచి తుదను
పరమాత్మగూడి తాము ప్రబలనేరకను
పరగసుషుప్తి మాయచే భ్రమసిగురుని కానక
మెరసి చిచ్చులో దుంకు మిడుత విధమగును ॥ఎంత॥

సారెకును రసనాగ్రమున చంద్రామృత పానముజేసి
మేరుగిరి తామాక్రమించి మెరసి వేడుకను
మీరిసుజ్యోతి బయటను మించు పూదోటరాముని
ధీరులై కలసిన యోగ ధీరులకె గాక ॥ఎంత॥ —43

---

మలినసంపదలపైని మమతగల్గుచుమీరు
వలసి సంసారమను వనధిలో మునిగి
పొలసి పోవగనేల బుద్ధిజెప్పెదవినుడి
కలుష దుర్మోహములు ఖండించినిలుడీ

ప॥ కరతలామలకముగ ఘననిరంజనపదము
నెరిగింతు నాపలుకు నెరనమ్మరయ్యా! ॥కర॥

కువలయంబున మీరు గుహ్యాజిహ్వాలసుచుల
దవిలిబహుజంతువుల దయ లేకద్రుంచి
భవపాశములచేత బలిమిగాకట్టుబడి
శివశివా! అర్కసుతుచే జిక్కవలదు ॥కర॥

బలిమైన కాలసర్పముచేత కట్టుబడి
తెలివియించుకలేక దేహములుమరచి
అలసతుల భోగంబులను విషముతలకెక్క
కులమదంబులచేత కూలిపోవలదు ॥కర॥



బేతంచెర్ల శ్రీ రామకృష్ణహరి స్వరూప పూదోట రామస్వామి





శ్రీశ్రీశ్రీ పూదోట లింగావధూత స్వామివారి మఠంలో వెలసిన శ్రీ బేతేశ్వరస్వామి



శ్రీ గురుపాదుకాపూజలో గుండా ఎల్లయ్యగారి దంపతులు - వేటంచెర్ల



శ్రీ గురుపాదుకాపూజలో గుండా ఎల్లశేషయ్యగారి దంపతులు

అరసి యీషణత్రయంబను భ్రమలచిక్కబడి
గురువు దైవంబనెడి గురుతు దెలియకను
పరమయోగులనెపుడు పలవలైదూషించి
పరుపైన నరకములబడి వరలవలను ॥శర॥

మతిమంతులైమీరు మాయశక్తినిదరిమి
జితవిషయులై చాల శ్రీగురునికృపను
సతతమునుపూదోట స్వాముల పదాబ్జములు
హితవుతో కొలువుడిక నతిశాంతులగుచు ॥శర॥—4½



అలజిబ్బటీగలకు సక్కండుగాని క్రియ
యిలపైడికంటెలకు నినుదుగానటుల
తెలియగబ్బిలములకు దినకరుడు గానిగతి
అలకలువలకును దినమణియు గానిపగిది

ప॥ శరణ జనముల నడుమ, సద్గురుడు పరిబలగను
మరి కుజనులకు నతని మహిమ కొరగాదు ॥శర॥

అరయ శునకంబులకు ఆజ్యమును గానట్లు
గరిమె టెంకాయ నక్కలకు గానియటుల
మెరయవై శ్వానరుడు మిడతలకు గానివగ
గురుతు నెమ్ములు కాకులకు గానియటుల ॥శర॥

బలుమయూరధ్వనులు పాములకు గానిక్రియ
నలుపు మార్జాల మెలుకలకు గాని యట్లు
మెలగు సంపెంగ తుమ్మెదలకు గానట్లు
తులువలకు శ్రీగురుని పలుకు కొరగాదు

చారువెన్నెల జార చోరులకు గానట్లు
భూరియశమును లోభులకు గానటుల
గారడీ సిద్ధులకు కడముక్తి గానట్లు
నీరు పాపలకెండ నెరగానియటుల ॥శర॥

విమల కుముదంబులకు వినుడి రవిగాని క్రియ
కమలంబులకు తుహిన కరుడు గానటుల
అమలుడగు పూదోట అద్వితీయుని నడత
కుమతులకు సరిపోదు గురుపుత్రులారా ! ॥శర॥—45



శీఘ్రముగ సద్గురుని పదము జేరినవాడె బ్రాహ్మణుడోయన్నా !
నిగ్రహించి సర్వేంద్రియముల నిస్సంగుడైనవాడె
బ్రాహ్మణుడోయన్నలార
ఆగ్రహించి విషయరిపుల హతము జేసినవాడె ॥బ్రా॥
జాగ్రత్స్వప్న సుషుప్తినిమీరి సుజ్ఞాన చంద్రుడై వెలగిన ॥బ్రా॥
వ॥ అగ్రజన్మమని ద్విజులు ధరననుకొన్న
శివయోగి మెచ్చడో యన్నలారా !
అగ్రజన్ముడైన యవధూత యవనిపై
చరియించునూ వినరో యన్నలారా ! ॥అగ్ర॥
అగ్రము తుద పాలజలధిలో హంసమై నటియించు నన్నలారా !
అగ్రజన్మంబవనిలో నరుదుగా నున్నది కనరో అన్నలారా !
అగ్రజన్మము వర్ణములను అంటియంటకనుండు యన్నలారా !
అగ్రజన్మమును సర్వము ఆముక వెలుఁగుచున్నది
యన్నలారా ॥అగ్ర॥
సంగతిగ నజపాక్షరముల సావిత్రినంటగూర్చిన
బ్రాహ్మణుడోయన్నలారా !
పొంగుచూ వేదాంతుడై త్రిభువనము లంటివెల్గిన
బ్రాహ్మణుడోయన్నలారా
మంగళాస్పదమైన తేజోమధ్య సంచరించునతడె
బ్రాహ్మణుడోయన్నా !
రంగైన పూదోట గురుని రభసముసగూడిన వాడె
బ్రాహ్మణుడోయన్నా ! ॥అగ్ర॥—46



కరముమధ్యనురాయి క్రమమునని కుకొని
మెరసిపూజించిన మేలెరుగునా !
కరముమధ్యనుజ్యోతి కరమునను గురినుంచి
మెరసిపూజించుతన మేలెరుగరయ్యాలు

ప॥ శీలవ్రతముల చేతజిక్కి శివునిగానగలేరు
శీలములో వెలిగే పరమశివుని దెలియరయ్యాలు ॥శీల॥

భసితరుద్రాక్షలు పరగధరియించి
పశువులై ఘనులను భవులువారనుచునూ
భసితాంగమగుభవుని భావించిచూచితే
భసితములో రుద్రాక్షపదమం టెదరయ్యాలు ॥శీల॥

పంచేంద్రియములజిక్కి పసువులుబారుచు
పంచవర్ణములపై ప్రభువుని దెలియక
పంచలింగములపై పరిశుద్ధలింగమెరిగి
పంచాక్షరీమంత్రపద మంటరయ్యాలు ॥శీల॥

జంగమదేహములంటు జాతులంటవిడువలేరు
జంగమ లింగమ రెంటిజాడ దెలియకను
జంగమరూపమను ముజ్జగములంటివెలుగగను
జంగములో వెలుగు శివలింగమంటరయ్యాలు ॥శీల॥

అరసిత్రైలింగముల నంతరంగమందు గూర్చి
నరుసుగాను దివ్యలింగమంటివెలుగరును
అరయనాహోజ్యోతికవల పూదోటగురుని
మెరసి కలసినవారే మేటిభక్తులయ్యాలు ॥శీల॥—47

పట్టెనామములు పట్టెడు దండలు
వట్టి వేషముచేత వదలదు మాయ
గుట్టుదెలిసి పరమ గురుని తానమ్మిన
పట్టువిడచి మాయ పారునోయన్నా !

ప॥ అంటు విడువరయ్యాలు ప్రకృతి, అంటు విడువరయ్యాలు
అంటువిడిచి మీరాత్మరామునిపదము
లంటి వెలిగిననిపుడె యమృతులయ్యెదరు ॥అంటు॥

అష్టాక్షరీమంత్ర మవనిలో బోధించి
కష్టులై పోతిరీ కడతేర లేక
అష్టప్రకృతులు మించి యచలాత్ములై మీరు
నిష్టతో శ్రీగురుని నెరనమ్మచును మదిని ॥అంటు॥

భుజమున ముద్రలు పొంకముగ ధరియించి
భజియించెదరు మూటకొరకు పొంగుచును
నిజము గురునిచెంత నిలుకడ గనుగొనుచు
సుజన జనులగూడి సొంపు మెరసి మీరు ॥అంటు॥

భాగవతులమంచు భ్రమలచే దిరిగెదరు
భోగీంద్రుపై గురుని పూజసేయకను
ఆగమాదుల సారమైన ప్రణవమంత్ర
యోగము మీమదిని బాగుగ దెలియుచు ॥అంటు॥

తిరుచూర్ణము తుద దేవుని తెలియక
తిరుగుచుందురు మీరు దిమ్మరులునై
పరికించి పూదోట బ్రహ్మమంటిన మీరు
పరమవైష్ణవులై నిలుతురోయన్నా ! ॥అంటు॥—48

## మతంగముని మహిమ

ధరపై మతంగముని తలపోయనేజాతి
గురువాక్యమునునమ్మి పరిశుద్ధుడగుచు
వరమునీంద్రులలోన వార్తకెక్కుచునతడు
పరమ జ్ఞానంబుచే బ్రహ్మణ్యుడయ్యె

ప॥ గురుతుగా వారలేకులమందు బుట్టినను
పరమ పావనులనుచు బలుకు వేదములు ॥గు॥

సర్వమును బ్రహ్మమని స్వానుభవముచేత
పరువడిగ వీక్షించి బ్రహ్మనిష్ఠుడునై
నిర్వికారుడు నగుచు నిశ్చలానందమున
గర్వులకు దూరమై కడు ప్రకాశించు ||గు||
గతకాముడై యతడు కలక లేశములేక
మతిమంతులకు యోగమహిమ జూపుచును
సతతమును పూదోట స్వాముల పదాబ్జములు
హితముతో ధ్యానించి జితకల్మషుడునా ||గు|| —49

## సద్ధర్మబోధ

నిరతంబుసుజ్ఞానుల నిర్మలహృత్కమలమునను
పరికించగాప్రణవ మెపుడు పలుకునుగాని
ధరనునజ్ఞానులమదిని తలపోసివీక్షించగాను
గురుతుగపరమస్వరాట్టు గోచరించునా !
ప॥ పరమభక్తులయెదుట నిరతమును నిలచిసద్గురుడు
అరయగాసర్వముజొచ్చి యంటిచెలగును ||పర||
కలితమగు వేదాంతరవమున ఘనముక్తికన్యనుమించి
అలరుచు నిర్వికారుడు నిలిచివెలగునుగాక
కులగర్వులైతనరుచున్న కుజనులమదిలో
పల చాల తెలియగా నిష్కళంకుడు తేజరిల్లునా ! ||పర||
గురిమించి చిద్గగనమనెడి గృహములోపల మెలగి
స్థిరముగా నిర్గుణయోగి మెరయునుగాక
మరియును దుర్మార్గులగుచు మహినిదిరుగుజనులలోను
సరిలేనిపూదోటవిభుడు సరగప్రబలునా ! ||పర|| —50
కాయమును నిత్యమని కడువేడ్కతో జనులు
మాయభోగంబులకు మది జొనిపివేడ్క
తోయ జాక్షులపొందు తుదజూడ దుత్తార
క్షాయులకునాసించు గతియగునా ధన్యా !

ప॥ ఎప్పుడో యేవేళనో యీతనువు నష్టంబు
దప్పదని సద్గురుని ధర వెదుకరన్నా ! ॥ఎ॥

బలిమైన దుర్విషయ భ్రాంతిచే కట్టుబడి
వలసి సంసారమను వనధిలోమునుగుచును
తలచి సతిసుతులపై తనుచు మోహములుంచ
నలరు బూరుగపండు నాసించినటులన్ ॥ఎ॥

ధరనుదుర్మార్గులై తనుచు హింసలుజేసి
పరధనంబులకాస పడెడి దుష్కర్ముల్
సిరినమ్మి పూదోట గురునిదెలియని జడుల
కరసి మోదుగఫలం బాసించినట్లు ॥ఎ॥—51



మరియు మందారసుమ మాధుర్యమును గ్రోలి
మెరయు షట్పదంబుమ్మొత్తలకు జనునె
అరసి చంద్రామృతమం బారగించెడి మనసు
సరగదుష్కర్మ వాసనలకును బోదు

ప॥ నిరతమును సద్గురుని నిలిచిచూచెడి మదియు
మరలిపోవునె ప్రకృతిమాయ రుచులకును ॥ని॥

చెలగి నిర్మలజలధి చరియించురాయంచ
మలినమగు రొంపిమడుగులకు తాజనునె
బలసి యానందాబ్ధి వర్తించు నామనసు
చలనమగు సంసార జలధిలో జొరదు ॥ని॥

పరికించ ఘనచూతపల్లవంబులు మెసగు
గురుతుపిక మరగునే కుటజంబులకును
అరుదైన పూదోట అద్వైదీయునిగూడి
తిరిగిరాకను దివ్యతేజమై తనరు ॥ని॥—52

గురుజనులు మహిలోను గురుతుపికములరీతి
గరిమె కుజనుల మహిని కలసి కలయకను
పరులు జెనకిన జగతి పరమోపకారులై
శరణ జనములు మెచ్చ చరియించవలెను
ప॥ స్థిరము జెప్పెదమీకు శివయోగిసుతులార
అరయ సర్వమును గురు కళాంశమన్నా ! ॥స్థి॥
పరసతుల నిలనుతా పరికించి చూచినను
మరి మాతృభావముగ మది దెలియ వలెను
ఒరుల విత్తము త్రోవ నొనరబడి యున్నగని
ధర నమేధ్యము రీతి తలపోయ వలెను ॥స్థి॥
పరమచిన్నేత్రమున భావించిచూడగా
పొరిది విశ్వములోను చొచ్చి ప్రబలుచును
తెరిపిలేక నఖండ తేజమగు పూదోట
పరమ సద్గురుగూడి ప్రబలవలెనన్నా ! ॥స్థి॥—53

## కర్మ ధర్మ మర్మ స్వరూపం

కర్మమున జనియించు ఘనజీవకోటులును
కర్మమున భోక్తలగు కర్మమున నణగు
కర్మమును ముగ్గురిని కడువేడ్కతో ద్రిప్పు
కర్మమే జగములకుగతియు దేవతయగును
ప॥ కర్మరహితంబైన ఘనయోగిపుంగవులు
నిర్మలంబైబయట నిలిచి నెలిగెదరు ॥క॥
ధర్మమే సర్వమును తగిలి తగలక వెలుగు
ధర్మమును ప్రకృతులు తలచి కనలేవు
ధర్మమే సుజనసంధాయకంబై యెదుట
ధర్మమే దివ్యాంత తారకంబగును ॥క॥
మర్మమే మోక్షంబు మరియుకేవలపదము
మర్మమే కుజనులకు మహిదుర్లభంబు

మర్మమగు పూదోట మహరాజయోగి తన
మర్మమెరిగినజనుల మదిప్రకాశించూ ॥కర్మ॥—54

## సద్ధర్మబోధ

వేషమమరగ గట్టివిజ్ఞాన శూన్యులై
భాషలును బహునేర్చి ప్రకృతి బద్ధులునై
దోషరహితులజూచి దూషింతురిలను మరి
యుదర పోషకులైన చెడు దోషకారుల్

ప॥ తెలియజెప్పెదను సుస్థిరయోగి జనులార
కలలోననైన వారల జేరవలదూ ॥తెలి॥

తాలిమించుక లేక తాటోటులై విషయ
లోలులై చరియించు రోత గురువులునూ
చాల మహిమలుజూపి జనులవిత్తము మదిని
సోలయించి జారసతి లీలదిరుగుదురు ॥తెలి॥

చెనటులై వేదాంత శాస్త్రార్థములు పెక్క
లనువందగానేర్చి హంకారులగుచు
వనర పూదోటపై వరగురుని దెలియకను
యినసుతుని భటులతాడనల వరలెదరు ॥తెలి॥—55



సుఖదుఃఖములచేత సుడిబడిరి జలచరులు
సుఖదుఃఖములచేత సుడిబడిరి నరులు
సుఖదుఃఖములచేత సుడిబడిరి ఖేచరులు
సుఖదుఃఖములచేత సుడిబడిరి దైత్యుల్

ప॥ సుఖదుఃఖములద్రోసి సుజనులు చిదానంద
సుఖులై నిరాలంబ సుఖముజెందెదరు ॥సు॥

సుఖదుఃఖములచేత సుడిబడిరి దిక్పతులు
సుఖదుఃఖములచేత సుడిబడిరి ఋషులు

సుఖదుఃఖములచేత సుడిబడిరి మనువులును
సుఖదుఃఖములచేత సుడిబడిరి సురలు ॥సు॥
సుఖదుఃఖములచేత సుడిబడిరి ముగ్గురును
సుఖదుఃఖములచేత సుడిబడెను సర్వం
సుఖదుఃఖములమించి స్వచ్ఛపూదోటపై
సుఖదుఃఖములు లేక సుగుణులందరును ॥సు॥—56

గురిదంఘ్రిమూలమున గుహ్యస్థానమునొత్తి
పరగప్రాణాపాను సమకూర్చవలదా!
పరగ నవరంధ్రములు బంధించి కుండలిని
తరిమి పదునారింట తా నిలువ వలదా!

ప॥ పరతత్త్వమునగూడి ప్రబలుచుండెడి ఘనులు
మరియు దుర్గుణముల మర్దించవలదా! ॥పర॥
తెలిసి రసనాగ్రమున దివ్యహూసుధద్రావి
అలరిఘంటారవము నాలించ వలదా!
వలసిభ్రూయుగముపై వహ్నినేత్రముదెరచి
కళలమించినముక్తి కన్య దెలియవలదా ॥పర॥
మెరసివెన్నెలబయట మించి వేయి రేకుల
సరసిజాతమున సద్గురుని గనవలదా!
తరచుదీప్తుల జ్యోతి కరముపై పూదోట
పరమ యోగినిగూడి ప్రబలంగ వలదా! ॥పర॥—57



చక్రంబులారు శివుని నిక్కగూర్చకా!
చక్రవర్తులును కాలచక్రమంటక
ఆక్రమించి బంధువులారనిగ మించక
చక్రమధ్య పరమహంసయై చరించకా!

ప॥ నిష్ఠతో వేదాంతమున నిలిచి వెలుగక
దృష్టిలోని దృష్టిచేత విష్ణుమెరుగక ॥నిష్ఠ॥

ధర్మబుద్ధితోడమీరు తగిలి నడువక
నిర్మలాంగుడగుచు తాను నిలిచివెలుగక
ముక్తివాంఛచేత తాను శక్తి మీరక
మర్మవాక్కుతోడ ముక్తి కన్యజేరక ॥నిష్ట॥

నాదబిందు కళలమీరి వాదమడపక
సాదరంబు మీరిశశిని సానబట్టక
వేదవేద్యుడైన గురుని చేరిమ్రొక్కక
వాదభేద తంత్రశక్తి పట్టినడుపక ॥నిష్ట॥

సదయ బుద్ధితోడ నాద జలకమాడక
అదిగొబిందు కళలనంటి యాత్మగానక
హృదయమందు పువ్వదోట విభునిగానక
చెదరిపోక శక్తితోడ తాను నిలువక ॥నిష్ట॥— ౬౪

---

కనుచెదరి మీ యమృత కాయమును మరచి
మాయనుగూడి చలనులై మహిజననమొంది
వనరగా స్త్రీ పురుషులను దేహములు దాల్చి
మనమలరగా రూపనామక్రియల మెలగి

ప॥ ఎంత భ్రమసితిరయ్య యిలమీద జనులార
చింతా పరంపరల చిక్కితిరయ్యయో ॥ఎంత॥

తలచపెండ్లాము బిడ్డలు కాళ్ళపెనగొన్న
బలిమి నిగళము కర్మబాంధవులు వినుడీ!
తెలియ యముబారి గొరియలజేయు దుర్జనుల
కలలోననైన వారల చెలిమి వలదూ ॥ఎంత॥

పరుపగు భవాంబునిధినిబడి యాశలను లతలు
సొరిది సర్వాంగములు జుట్టియొక దరికీ
జరుగనియ్యని రిపుల పరమ జ్ఞానంబనెడి
కత్తిను కొడవలిచేత తెగగనేరకనూ ॥ఎంత॥

మలినులై యజ్ఞానమాయసంపదలుమది
వలచిసత్యంబనుచు వసర నెరనమ్మి
పొలసి యెన్నటికైన పోవుననిబుద్ధిచే
బలుడైన సద్గురుని తెలియనేరకనూ ॥ఎంత॥

సర్వమును నిరసించి సద్భక్తియుక్తితో
సర్వసాత్త్వికులై సంతోషముననూ
సర్వమగు పూదోట స్వాములనుగూడి తుద
నిర్వికారులు నగుచు నిల్చికదలకుడీ ॥ఎంత॥—59

—:o:—

తలనుజడలు బోడితలలు బూడిదపూత
మొలనుముంజి చేత మొనసిబెత్తముబట్టి
మలదిరుగు లేడిచర్మమును చంకనుబెట్టి
యిలనుకూటికిదిరుగు మలినులంతియగాక

ప॥ జ్ఞానము తెలియవలదా ! తారకయోగ
ధ్యానినై నిలువవలదా !
జ్ఞానజ్ఞేయములపై కేవలయోగికైన ॥జ్ఞాన॥

కాషాయవస్త్రముగట్టి కాళ్ళపావాలు మెట్టి
వేషమమర యోగపట్టె మెడనువేసి
యీషణత్రయమును గెలువకిలశిష్యులగూర్చి
వేషభాషలదిరుగు వెర్రియోగులంతెగాక ॥జ్ఞా॥

పలుగాకులై మాయపలుకుల ధరజనుల
వలపించివిత్తము వడసి బక్షింపుచు
బలసియజ్ఞానులై పసులదూషింపుచు
బలిమైన యామృత్యుపాలిటీయోగులుగాక ॥జ్ఞా॥

కరుణయించుక లేక గ్రక్కునజీవులజంపి
ధరనుళ్ళకులనెల్ల తామసులై పూజించి

మరియువస్తుత్రయము ముక్తియనిబక్షించి
పరమజ్ఞాన మెరుగని భ్రష్టయోగులం తెగాక ||జ్ఞా||
ఆసలుడిగి సద్గురుని యాత్మలోపూజించి
నాసికాగ్రమునందు నటియించుహంసమై
మోసపోకపూదోట మూలమూర్తినంటి
పాశరహితమైనట్టి పరమయోగికినైన ||జ్ఞా|| —60



పరమ భక్తులతోడ భాషింపకున్నను
పరమ పదముత్రోవ బయలు పడుటెట్లు
పరమగురుని పాదభక్తి సేయకను మరి
పరమ తారకయోగ పదమందు టెట్లు ?

ప॥ అమనస్కుడైతుదను అలరి నిలువకను
విమల తారకమై తా వెలగు టెట్లగునూ ? ||అమ||

నిలిచివాయువులు తా నిలుప లేకున్న
తలక్రిందైన పాము తలయెత్తుటెట్లు ?
పలుమారు తా ప్రణవశబ్దంబు వినకున్న
బలమైన మోహములు భగ్నమగుటెట్లు ? ||అమ||
మనసు పశ్చిమవీధి మరినడువకయె తా
దినసాధ చంద్రుల తెసువుగను టెట్లు ?
చనుదెంచి త్రైకూటమునను నిలువకను
కనుగొనల తుదజ్యోతి కళలు గనుటెట్లు ||అమ||
వేదాంతమున గురుని వినుతి సేయకను
వాదబేధములు తా వర్జించుటెట్లు ?
పాదుకొని తాదివ్య పదమై నిలువకను
నాదబిందుకళలు నష్టమగుటెట్లు ? ||అమ||
పనిబూనియానంద పదమై నిలువకను
ఘనరవాయువులు తన వశముగొను టెట్లు

మొనసి పూదోట దేవునిగూడి తాను
తనరి సుస్థిరశూన్య తత్త్వమగు టెట్లు ? ||అమ||—61

## బ్రాహ్మణుడు జ్ఞానయజ్ఞోపవీతం

నాసాగ్రతుదను నయోని సంభవుండగుచు
కాశిలోపల దివ్యకాయమై తనరున్
వాసియుపనేత్రుడై వహ్నిశిఖమధ్యమున
పాశరహితంబైన పరమాత్ముడగునూ

ప|| అతడు బ్రాహ్మణుడగును అవనిపైజనులార
సతతమును వేదాంతసారమై వెలుగు ||అ||

పంచకోశములపై పద్మాంతరంగమున
సంచరింపుచుబయట సర్వసాక్షియగుచూ
పంచశిఖలును శిరసుపై ప్రకాశించగను
పంచవర్ణముల తుద పరమస్వరాట్టగు ||అ||

షట్కుక్షులు త్రివిధ చరణములు గలిగియును
దృష్టిద్వయములపైని తీవ్రదీప్తులను
అష్టప్రకృతులనంటి యాదిమధ్యాంతమున
ద్రష్ట స్రష్టలతుదను తా ప్రకాశించున్ ||అ||

తవిలి యుపవీత ధారణము మేనిపై
నవిరళంబుగ పెనగి యంటిమెరయగను
త్రివిధవర్ణములకడ దివ్యస్వరూపమై
వివరించగానతడు విశ్వతోముఖుడౌ ||అ||

అజపాక్షరంబులను నలప్రణవముసగూర్చి
సుజనుడై విజ్ఞానజ్యోతిపై నిలచి
విజయుడై పూదోట విమలపురుషునిగూడి
భజియింపగారాని బ్రహ్మంబునగుచున్ ||అ||—62

## గురుపుత్ర ధర్మము

పంచభూతములాది బహుబంధములు దెగు
మంచికీలును నేనె యెంచి చెప్పెదను
మించినిర్లేపుడై మెలగు గురుచరణములు
పొంచిపట్టినయపుడె పొలియుద్వంద్వములు
ప॥ గురుతు నా పలుకు నిర్గుణబ్రహ్మసారమగు
పరమజ్ఞానులువినుడి భావించిచాల ॥గురు॥
పరికించి యెదను మీ భక్తిప్రకాశింప
గురునిపూజలుజేసి కుశలాత్ములగుచు
విరివి చిన్నేత్రమును దెరచిచూడగనతడు
నెరనిరాలంబమై నిండివెలుగొందూ ॥గురు॥
తెలియగ నిరాకార దేవుడైతనరుచును
నలరిసాకార దేహముదాల్చి మదిని
నిలిచిఅవధూతయై నిజభక్తకోటులకు
తలచిసుస్థిర శూన్యతత్త్వంబునొసగు ॥గురు॥
అరశేకశరణజను లన్యోన్యభావమున
సరసిజోపలతామర బెనచినటులన్
గరిమె క్షీరోదకము గలసియుండినరీతి
విరసమింతయు లేక మెరసినిలువవలయు ॥గురు॥
మొనసిమీదు విదేహముక్తిపర్యంతమును,
పనిబూని శ్రీగురుని పనులు సేయుచును
కినిసిపూదోటపై కేవలనిరామయుని
కనుగొనుచు సతనిలోకలసి నిలుడికను ॥గురు॥—63

ఘట్టిగా నిజముక్తి క్రమము జెప్పెదమీకు
దిట్టలై వినరయ్య తెలిపెదను చాల
పట్టైన అజ్ఞాన పంకంబు వెడలిపుడు
మెట్టిన సద్గురుపథము బట్టరోయన్నా!

ప॥ ఎంతలేదన వలదిలమీాద జనులార ?
సంతకూటంబగు సంసార జంభం ॥ఎం॥

ఏటితలిదండ్రులును నేటి ధనధాన్యములు
నేటి సతిసుతమిత్రులేటి పశువులును
నేటి గృహసంపదలు నేటిభోగంబులును
నేటికిని యివిచాల వెసుగదృశ్యములు ॥ఎం॥

సష్టమగు వస్తువులునమ్మి సుస్థిరమనుచు
సృష్టిపై హంకార జీవులై యెపుడు
భ్రష్టులై పోకుడిక పరమతత్త్వంబనెడి
యిష్టమెరిగించెదను నదియె నిజమగును ॥ఎం॥

కువలయంబునమీాకు కోరినిష్ఠయుడైన
శివయోగ జితుడైన శ్రీ గురుని జేరి
యవిరళంబుగ స్వామి నర్చించ నాతండ్రి
సవిశేషముగ నపుడు సత్పదం బొసగు ॥ఎం॥

తలచదేశికు పాదజలజముల నంటినే
చెలగిసత్యము జేతుస్థిరము నాపలుకు
వలసి పూదోటపై వరనిరంజన విభుని
కలసి యమృతులు నగుచు నిలచివెలిగెదరు ॥ఎం॥—64



తలప బాలకుడైన దరణిపతి దుర్మంత్రు
లలరి బోధించవిని యారాజుమదిని
వలసి సదుప మంత్రులు వసుధవిభు బంధించి
యలమంత్రులును రాజ్య మపహాపరింతురును

ప॥ వినుడి ఈరీతి నా విమలాత్మ వంచించి
జనితేంద్రియములు భవ వనధిలోముంచు ॥వి॥

వనసి నిర్మలుడైన నొకపురుషు డజ్ఞానచలనుడై
స్త్రీలోక పదుగురిలను పెండ్లాడి కలిసివర్తించ

నాఘనుని ఈడ్చెదరు మిగుల మలిన భోగములకై మగువలందరును
ధరదాడు బిరుసైన వెరచి దాసిదాసు లరసి
పనులు సేతురతని పనుపునను
పరికించ పూదోట గురుని వరభక్తులకు
వరుస సర్వేంద్రియములు వశములగునయ్యా ॥వి॥—65



ఇలను గురుసేవకుల నెనసి తెలియని జనుల
బలిమి హంకారంబు భగ్నంబుగాదూ
తులువలై సాధువుల దూషించుధర జనుల
తెలియు భవబంధములు తెగవెన్నడైన
ప॥ పరికించనాపలుకు బ్రహ్మతుల్యము వినుడి
సరసులైయున్నట్టి సద్భక్తులారా ॥పరి॥
శరణజనముల మనసు చెదరదిట్టిన జనుల
నెరయముని భృత్యులు సేవజేతురును
గురుని పుత్రులమీద క్రోధించు యల్పులును
తరచు నరకములబడి తల్లడింతురునూ ॥పరి॥
కినిసి జనులకు మహిని కీడుజేసిన ప్రజలు
వరదుఃఖములు తుది ననుభవింతురునూ
మొనసి స్వామిద్రోహము జేయుపలువలను
తనరియర్కని సుతుడు తలలు తెగ వ్రేయున్ ॥పరి॥
పరమ శాంతులజూచి పాపాత్ములును క్రొవ్వి
పరిహాసమునుజేసి భస్మ మయ్యెదరు
అలరి నిర్లేపులను నపనిపై దుర్మతులు
మరియునిందలుజేసి మహిని గూలుదురూ ॥పరి॥
పాటించి సత్పదము బయలు జేసెదమీకు
నాటినాపలుకు మదినమ్మి వేడుకను
సీటైన పూదోట సిద్ధయ్యని గూడుడిక
చాటించి చెప్పెదను సాధు జనులారా! ॥పరి॥—66

## శూ ద్రు లు

వసజ నేత్రుని అంఘ్రుల నుద్భవింపుచును
తనరి శూద్రులు సర్వ ధాన్యముల నిలను
నొనరపండించి జనులను తృప్తి జేయుచును
వినయ భయ భక్తిచే వినులాత్ములగుచూ

ప॥ అతి శాంతులై చాల అఖిల జనములకును
హితవుతో చరియింతు రతిముదంబునను ॥అ॥

బలిమి నాకలిగొన్న పర దేశులను జూచి
పిలిచి అన్నముపెట్టి ప్రీతి సేయుచును
వలసి సతిసుత బాంధవులను పోషింపుచును
తెలియ నిర్మోహులై చెలగుచును మరియు ॥అ॥

గురుని నెరనమ్ముచును కుజనసంగతి బాసి
పరమ భక్తుల చెలిమి బాయకెప్పుడును
మెరసిపూదోట సుస్థిర నిర్గుణునిగూడి
అరయగ నిరాలంబమై వెలుగుదురును ॥అ॥—67

## వై శ్యు లు

గిరులందు తేనె నీగలు గూడబెట్టుక్రియ
పరికింపలోభమును బహుధనముగూర్చి
చెరువుకుంటలు పరుస పిరిపి దేవాలయము
లరసికట్టించెడి పర వైశ్యులారా!

ప॥ అలరి యోగీంద్రులకు నన్నమును బెట్ట నిది
బ్రహ్మార్పితమును వినరయ్యా! ॥అలరి॥

తలచగంగాది ద్వాదశ నదుల మున్గినను
తెలిసినోట వినుమిది తెలియరును

పలుమారు సేవించి బహుదానధర్మముల
సొలయగా నపవర్గ సుఖము జెందుటగా ॥అలరి॥
పిక్కుటక్కులులేక ప్రియముతో సద్గురుని
ఎక్కువ పదాబ్జములు నెరిగిసేవించి
అక్కరతో పూదోట చక్కనయ్యనుగూడి
మిక్కిలి ననంతమై మెరయవలెనన్నా ॥అలరి॥—68

## క్షత్రియులు

తనరు సతిపుత్ర బాంధవులు ధన ధాన్యములు
కనకభూషణ తతులు కడు చేలములును
వనర దాసీ జనంబులును చిత్రగేహముల
ఘనభోగ భాగ్యముల గరిమె మెరయుచునూ
ప॥ ఇన్ని భ్రాంతుల దిరుగు నిట్టి భూపతులకును
నెన్నివిధముల మోక్షమేల సిద్ధించు ॥ఇన్ని॥
కరితురగ రథములును మరిశిబికములు సేన
లరుదు గొడుగులు పడిగెలరయు చామరముల్
సరసి జాక్షులుపీవ సర్వవైభవములను
సొరది రాజాధిరాజులు గొలువ సొలసి ॥ఇన్ని॥
వలసి అరిషడ్వర్గములకు జిక్కక మీరు
మలిన ధర్మార్థకామములు గోరకను
బలమైన పూదోట బ్రహ్మంబు గూడితుద
నిలచి నిర్లేపులై వెలుగవలెనయ్యా ॥ఇన్ని॥—69

## బ్రాహ్మణులు

సరస కప్పలరీతి స్నానములు సేయుచును
సిరిమించు ధోవతులు చెలగికట్టుచునూ
మెరుగు మించినభూతి మేనిపై నలదుకొని
వరుసరుద్రాక్షతావళము ధరియించి

ప॥ వన్నె మెరయుచుద్విజులు వనరహంకారులై
యున్నివగలను భుక్తికిల చరించెదరు ॥వన్నె॥

కలితచిత్రాసనంబులపై గూర్చుండి
తెలుపు వస్త్రములు ముసుగులుబెట్టి చాలా
మలిన ముక్కులుబట్టి మాగన్ను వేయుచును
అలరి గొణుగుచు పూసల నెంచుకొనుచు ॥వన్నె॥

సర్వదుర్గుణులులై సంచరింపక యికను
శర్వుని సుభక్తులకు శరణు సేయుచును
నిర్గర్వులై పూదోట ఘనుని వీక్షింపుచును
నిర్వికారునిగూడి నిలువరోయన్నా ॥వన్నె॥—70

## సద్ధర్మబోధ

పొట్టకొరకై జనులు భూపాలకులసేవ
అట్టె సేతురుఎపుడు పట్టెడన్నముకై
దిట్టలై యీరీతి దేవదేవునిచాల
నెట్టుకొనిమదినమ్మి నిలిచిశాంతులునై

ప॥ భక్తితో దేశకుని పదములర్చించగను
భుక్తి ముక్తులుగలవు పుణ్యాత్ములారా! ॥భ॥

అలయకను సొలయకను ఆశచేచిక్కబసి
వలసిధనవంతులను కొలుచుచుండినను
కలిత ప్రారబ్ధమునకన్న ఎక్కువ లేదు
తెలిసిశాంతులునుడిగి మెలగినిరతమును ॥భ॥

మనసనెడియజ్ఞాన మాయమృగమును
జ్ఞానమనెడి క్రొవ్వాడివాలునద్రుంచి వేడ్కన్
ఘనమైనపూదోట కడను నిష్క్రియుగూడి
వనరతన్మయసుఖంబున మెరయరయ్యా ॥భ॥—71

బలిమి పిల్లిని ఎలుక బంధించి చెడినగతి
పలుమారు కప్పసర్పముబోరు విధమూ
అలరువ్యాఘ్రము హరిణమవని బోరుక్రియ
పులినిగొఱ్ఱెయు బట్టి పొలయుచున్నటులన్

ప॥ గురునిపై క్రోధించు కుజనులను ఈరీతి
తరిమివారల కీడు జెరచకది బోదు ॥గురు॥

కనుగొనగ సూకరము గజముపై బోరుక్రియ
వనర నాగము సింహమును జెనకినటులన్
కనువినుకు నెమలితో బోరి చెడినగతి
పెనగిమీనును మకరమును బోరువిధము ॥గురు॥

స్థిరదివ్వెతో పేడపురుగు బోరినరీతి
మరి అగ్నితో మిడుత మార్కొన్నపగిది
గురుతు ఖద్యోతమర్కునిమీదగవయు క్రియ
సొరిదికుండలి వినత సుతుబోరు విధము ॥గురు॥

అనలవిభుతో మేఘమును బోరియురుకు క్రియ
ఇనునితో బోరిమంచు నణగు విధము
దినకరునితో చీకటియు బోరి పొలుచుగతిని
తనర నవిద్యజ్ఞానమున చెడినవిధము ॥గురు॥

తలపోయ స్వామిద్రోహులకు ప్రాయశ్చిత్త
మలపగించినలేదు అచలాత్ములారా!
నిలిచి పూదోటపై వెలుగు దేశికస్వామి
తెలిసి నావారలని వలసి కావకను ॥గురు॥—72

---

చిన్నివెధవకు నేల సిరిమించు సొమ్ములును
వన్నెలన్నియు పుణ్యవతికి నందమునౌ
పన్నగంబునకేల బహుశాంతిగుణములును
దున్నపోతుకునేల శుద్ధబ్రహ్మజ్ఞానం

ప॥ గురువంచకులభక్తి కోరిచూడగనిట్లు
అరయబూదిలోవేల్చు ఆజ్యంపువిధమహా ॥గురు॥
కుక్కకేమిటికిమహి గురుతైనటెంకాయ
ఒక్కపాద్దేమిటికి నక్కపోతునకు
తిక్కకోతికినేల తీర్థయాత్రలకరుగ
కొక్కరపుమనుజునకు కైవల్యమేలా! ॥గురు॥
ధరగబ్బిలమునకేల తరుణుని సుకిరణములు
సరగకాకికినేల చదలేటిస్నానం
గరిమెకొంగకునేల గాయిత్రిజపగోష్ఠి
శరణద్వేషికినేల సత్పదపుమార్గం ॥గురు॥
అల గార్ధభమునకేల అగరుగంధపుపూత
యిల నులూకమునకేల ఇనుని ప్రకాశం
తెలియ వరాహమునకేల దివ్యమగుతోయములు
కలుషజనములకేల ఘనయోగమహిమ ॥గురు॥
జితవిషయునికినేల స్త్రీలపై మోహమును
గతకల్మషునికేల కాసుపైభ్రాంతి
ప్రతిలేని పూదోట బ్రహ్మంబుగూడి వర
మతితన్మయముజెంద హితమోక్షమేలా! ॥గురు॥—73



పరికించదాత కుమ్మరివాని రీతెపుడు
సరస సచరాచరము లరసివేడుకను
తరుచుగా నిర్మించి తలపోసి యందులో
మరియొకటి కొదువైన మదిక్లేశ మొందూ

ప॥ ఎట్టి వారలకైన యిలను దుష్కర్మములు
కట్టి కుడుపకపోవు ఘనయోగులారా! ॥ఎట్టి॥
నలువ శిరమును మొత్తి బలిమి బ్రహ్మహత్యచే
తెలియ ముల్లోకములు తిరిగెరుద్రుడుమ్నా

అల కపాలికపాత్ర నన్నంబు గుడుచుచును
పలువరింపుచును బహుబాధలను బడడె! ॥ఎట్టి॥

వినుడు రమాపతి ఎపుడు కనుగొనగ ధరణిపై
మొనసి దశావతారముల నెత్తి సాదు
జనుల రక్షింపుచు నిశాచరుల ఖండించి
పనిబూని యమితాపద లనుభవించుచూ ॥ఎట్టి॥

పరువులెత్తుచు దివిని పద్మమిత్రుడు నెపుడు
అరయ సురగిరిచుట్టు మెరసి తిరుగుచును
వరరాహుకేతువులు వడసి కరువగనతడు
పరితాపమునగుందు ప్రజలు జూడగను ॥ఎట్టి॥

తనరి సద్గురు నంఘ్రులును సమ్మినపుడే
గణుతింప ప్రారబ్ధ కర్మములు దెగునూ
వనర పూదోట రాముని గూడి నిలిచిన
జననమరణము లేని సర్వసాక్ష్యగును ॥ఎట్టి॥—74

---

లలిత ఎనుబదినాల్గు లక్షజంతువులలో
ఇలను మానవజన్మ మిదిదుర్లభమునా
అలరునరులందు నిశ్చలభక్తి గలుగుటయు
తెలియ నతిదుర్లభము దివ్యాత్ములారా!

ప॥ వినరయ్య యీగుణములు గలిగియుండినను
వనరవిజ్ఞానులగుటను దుర్లభమునూ ॥విన॥

పరికించి బహుగురువులరసి శోధించమది
నెరనిరాపేక్షులును మరిదుర్లభమునూ
సారది అమిత లక్ష్యములు జూపువారలు తరుచు
సరసనిర్లక్ష్య దేశికుడు దుర్లభమూ ॥విన॥

జితవిషయులైనట్టి శ్రీగురుని ధరపైని
వెదకి కనుగొని జేరుటది దుర్లభమునూ

అతని పాదాబ్జములు సరలేని భక్తితో
సతతమును గొల్చుటదియు నతిదుర్లభమును ॥విన॥

స్థిరముక్తి దాతకృప శిష్యులకు గలుగుమహి
గురుతు అజ్ఞాన ముడుగుట దుర్లభమును
పరమయోగము గురుడు శరణులకు దెల్ప వా
రరసి యభ్యాసించు టధిదుర్లభమునూ ॥విన॥

తలపు మరపులుమించు తత్త్వహా నిదియనుచు
అలరి చూపినకూడుటది దుర్లభమును
కలసి పూదోట స్వాముల స్వస్వరూపమై
నిలిచి వెలుగుటను కేవల దుర్లభమును ॥విన॥—75



తెలియఁగంధపు చెక్కలిల గార్ధభముమోసి
యెలమినా సుస్వామ ఎఱుగనివిధమునన్
తలప వేదాంతగ్రంధములు మోసుకజడులు
మలినులై అందున్న మర్మమెఱుగరును

ప॥ కదిసికూరలరుచులు ఘనదర్వి ఎఱుగునా !
చదివి విప్రులు బ్రహ్మసార మెఱుగరునూ ॥క॥

అరసి సాంఖ్యము తారకామనస్కములు మేము
యెఱుగుదుమనుచు పల్కుదురు అల్పబుధులు
పరికించ నిర్లక్ష్యభావమై యుండుటయు
నెరమహాదుస్తరము సిర్లేపులారా ! ॥క॥

బ్రహ్మంబుమేమనుచు పలుకుదుర దుర్జనులు
బ్రహ్మమైనట్టి సత్పద మెఱుంగకనూ
బ్రహ్మమగు పూదోట బ్రహ్మంబుగూడితా
బ్రహ్మమైనిల్చుటయు బహుదుర్లభంబు ॥కది॥—76



మొనసి తిలలును గానుగనబోసి యాడకను
మెనసియుండిన నూనె జననమగు టెట్లు
తనరుచును ఇక్షుదండములు భేదించకను
కనుగొనగ మధురమును గమనించుటెట్లున్

ప॥ గురుభక్తిలేకున్న గురుపద బ్రహ్మమును
సరగ ఎటువలె ప్రకాశమగును వినుడీ ॥గు॥

గట్టిగా కాష్ఠమున కాష్ఠమును తరచకను
అట్టిదారువులోని నిప్పెటులబుట్టున్
పట్టికవ్వమున దధి పరువడి మధించకను
వట్టిమాటల వెన్న యుదయించు టెటులన్ ॥గు॥

తనుమనోద్రవ్యములు దాచకను శ్రీగురున
కొనర నర్పించకను వరదాసుడగు నె
మనమలర యూరకే మర్మమగు పూదోట
ఘనునిస్వరూపమై కడనిల్వగలరె ॥గురు॥—77

---

ధరణిపై జననమగు నరకీటకముల బ్రతు
కరయ స్వల్పము నాయు వల్పచిత్తులునూ
పరికించ జమునికిని బారిగొర్రెలు యగుచు
గురుని పాదాబ్జములు గొల్వరెన్నడునూ

ప॥ ఎంత చిత్రమగు నిది చింతించగా మదిని
ఎంతవారైన మాయను గడువ లేరు ॥ఎంత॥

తెలియ శతముఖు డాది దివిచరులు చలనులై
మలిన సతులనుగూడి మదమత్సరులునై
బలిమైన అజ్ఞానపడతిచే చిక్కుబడి
ప్రళయమునకైన సత్స్వభు నెరుంగరును ॥ఎంత॥

నవకోటి సిద్ధులును నారదాది మునులు
తవిలిసఖులు సవిద్యతత్త్వరులు నగుచు

వివరించ నిందరును విజ్ఞానశూన్యులై
శివకరంబైన సుస్థితిని కలయరును ॥ఎంత॥

హరిహర బ్రహ్మాదు లల్పభోగములకై
సరసి జాత్ములగూడి సర్వభ్రాంతులునై
పరగ సంసారమను శరధిలో మునిగి తుద
నెరనిరంజనుడున్న నెలవెరుంగరునూ ॥ఎంత॥

సదయులై యున్నట్టి సజ్జనులు సాకార
పదవులును నష్టమని భావమున జూచి
కదలకను పూదోట కడవెలుగు నిర్గుణుని
అధిక భక్తిని గూడి అమృతులౌదురును ॥ఎంత॥—78



మెరుగు దర్పణములో మేరునగమును జూడ
నెరయ సూక్ష్మంబగుచు నిలిచియున్నటులన్
ధరను దుర్జనులలో తగ్గిసుజనులు చాలా
కుసుచరైు యుండినను కొదువేమివినుడీ

ప॥ పరమసుజ్ఞానులే బ్రాహ్మణోత్తములనుచు
సారిది యజ్ఞానులే శూద్రులను శృతులు ॥పర॥

మలిన జనులకు యోగమాయ మహిగప్పుచును
నలపాలలో ఘృతము నణగువిధమునను
అలలుసుళ్ళును లేని యబ్ధికై వడిమదిని
తెలియఘటములో వెలుగు దివ్యెసగిదిటుల ॥పర॥

పరికించి సర్వమును బ్రహ్మమని తెలియుచును
అరయ ప్రత్యగాత్మ కవలభక్తులకూ
పరబడగు పూదోట గురుని స్వరూపమై
నిరుపమానందమున నిలచియున్నట్టి ॥పర॥—79

కనకమిత్తడియొక్క కళనుండు
నరసిచూచిన వన్నె వేరగునుగాదే
ఒనర రజితము తగరమును నొకఛాయ
రెంటినినరికి వీక్షించగను తేటపడును

ప॥ మలిన జనములపోల్కి మహిజ్ఞానులుందురును
తెలియ యుభయుల క్రీడలు వేసువేరా ॥మలి॥

తలవ బకహంసలొక తెలుపు జలలిప్త
క్షీరమలరి త్రావినరెంటె యధికమేర్పడును
కలియ పికవాయసంబుల రూపులొకటగును
లలిత స్వరభేదముల బైటపడు నపుడు ॥మలి॥

ధరగ్రామ సింహమును మెరసి మృగరాజుభువి
పరువెత్త రెంటి భావము వేరుపడును
సరిలేని పూదోటస్వామి పాదాబ్జములు
గురుతెరుంగగలేరు కుజను లెన్నటికీ ॥మలి॥—80



పరమ శాంతుల హృదయ పద్మాంతరంగమున
సిరిమించు చిన్మయుడు మెరయుగాని
మురికి మలమూత్రముల ముసుగుతనువులలో
పరికించగా పరాత్పరుడెట్టులుండున్

ప॥ తెలియజెప్పెదను సుస్థిరభక్తవరులారా
తలచగా నిర్వైబట ముక్తిదాతయునుండు ॥తెలి॥

విలసిల్లు సుజ్ఞానవిమల జనులమదిని
నిలచి పరమాత్ముండు వెలుగు గానీ
అలరు సచరాచరముల జీవుడుండునుగాక
చెలగియందున పరమశివుడెట్టులుండు ॥తెలి॥

ఎనసి యోగీంద్రుల ఎదుర చెదరకెపుడు
మొనసి సర్వసాక్షి తనరుగాని

కనుగొనగ నజ్ఞానకర్మ జనులలోను
పనిబూని పూదోట బ్రహ్మమెట్లుండు ? ॥ తెలి ॥—81

కులమందంబులుద్రోసి కుజనసంగతిరోసి
నిలిచిసుజనులచేత నిజము క్తిజాడన్
దెలిసిసద్గురుపదము స్థిరమతినిపూజించి
వలసిమోక్షముమీకు వడయరోయన్నా !

ప॥ నెరయోటికుండలో నీరు వెలిసినరీతి
అరయనాయువు నష్టమైపోవువినుడీ ॥ నెర ॥

పట్టిన శ్వేంద్రియముల బంధించిస్వాంతమున
గట్టిగాసంసార గాధలోబడకన్
దిట్టలైసద్గురుని దివ్యవాక్యముసమ్మి
మెట్టికైవల్యమున మెరయరోయన్నా ! ॥ నెర ॥

నిలిచి భ్రూమధ్యముగ నిశ్చలానందమున
తెలియచిద్వ్యోమమున తేజరిల్లుచును
బలిమిపూదోట కేవల బ్రహ్మమునుగూడి
అలరి తన్మయమంది వెలుగరోయన్నా ! ॥ నెర ॥—82

కులగర్వులై మదిని గురుసుతుల మర్మంబు
తెలియకను వారితో ద్వేషించి మరియు
అలమిడుత దావానలములోను భ్రష్టగతి
పొలసి పోవుదురు జనులు భువినష్టమగుచున్

ప॥ శివయోగులకు కీడు చేయు దుర్మార్గుడీ
యవనిశ్వపచుని కన్న యధముడో యన్నా ! ॥ శివ ॥

పరిశుద్ధులైయున్న పరదేశి వాక్యములు
కొరగాక వారితో క్రోధించు జడులున్

మరివిశ్వభయదమై మండుచుండెడి విషము
పరికించి మ్రింగి తాము బ్రతుకు టెలాగు ? ॥శివ॥

మితిలేని భక్తితో మెరసి గురుపాదంబు
లతిప్రేమతో పూజలమర జేయుచును
సతతమును పూదోట స్వాములను గూడితుద
గతకాములై బయట కదిసి వెల్గుదురూ ॥శివ॥—83

మలినులై కర్మఠులు మహిలోను గర్వించి
కులరహితులను కర్మ కులము లడుగుదురు
అలబ్రహ్మతనువు చండాల తనువులలోను
నిలిచి బ్రహ్మము చాలనిండి వెలుగగను

ప॥ సుజ్ఞానజనుల నిలను బ్రాహ్మణులంచు మరి
యజ్ఞానులే శూద్రులని శృతులు బలుకున్ ॥సు॥

చతుర్వర్ణములకు శ్రేష్ఠకులంబని ధరను
గతకల్మషులజూచి గడుమూడు మూఢుల్
సతతమును చిన్మయుడు సచరాచరమునిండి
మతిలోపలనుజూడ మరి ప్రకాశించున్ ॥సు॥

అరసితమ మదిలోను సద్వ్యయుని దెలియకను
పరమ యోగులును పలుభాషలాడుదురు
తలచకను నిర్భైట తారక బ్రహ్మమై
భరితమగు పూదోట గురుడు వెలుగగను ॥సుజ్ఞా॥—84

ధరశుక్లశోణితమును ధాతుమూలమైన మేను
స్థిరమైన గురుమంత్ర సిద్ధుడై తాను
శరధి చిప్పలో బడిన జలబిందు ముత్యమగుచు
గురుతుగా తొల్లింటనీట గూడ నేర్చునా !

ప॥ పరికించ కర్మరిపులన్ బారద్రోలి కుంభినిపై
నిరతము బ్రహ్మైక్యమునకు నిల్చిచూడవలదా! ॥ప॥

నిలచి సద్గురుకృపను నిర్మల దివ్యాంగులగుచు
తలచిస్థూలముబోదన్ని తనరి వేడుకను
మలినభుజగి కంచుకమును మహిమీద నూడ్చినరీతి
తెలివిలోపలనిల్చి తేజరిల్లు జ్ఞానులకును ॥ప॥

అరసినిర్గుణ బ్రహ్మంబు నాశ్రయించు మహాత్ములును
మురికి దేహముపైని మోహమునుంతురా!
గురుసుతులు పూదోట గురునంటి తన్మయమునొంది
పరమామృత కాయులైయున్న భక్తవరులారా ॥ప॥—85



ఇలనుసుజనుల దిట్టుహీనజనులద్రుంచ
వెలమివేట వెకలెమృత్యువే
తులువలైజ్ఞానుల దూషించు కర్మల
దుమ్ముసేయగవచ్చు మృత్యువే
పలుమాటలాడెడి బ్రష్టజనుల రక్త
పానంబు జేయును మృత్యువే
పలువరించకుజనుల మాంసమును క్రొవ్వును
భక్షించవచ్చును మృత్యువే

ప॥ సరిలేని అవధూత చంద్రుడు ధరమీద
చాటించు వినరయ్య ఘనులారా మీరు
పరమశాంతుడైన పరదేశివాక్యములు
బ్రహ్మాస్త్రములు సుమ్మి జనులారా ॥సరి॥

గురువుదైవము విడచు క్రూరుల తలమెదడు
కొట్టి మేతలాడును మృత్యువే
గరగర నమలుచు కర్మ జనులబట్టి
గట్టుకున మ్రింగును మృత్యువే

మెరగు మీసల తీడి మెరసి తృళ్ళిడిజనుల
మెడద్రాడుసైచను మృత్యువే
మొరవెట్టగాగదల మొత్తియీడ్చి తన్ని
ముంచునరకములందు మృత్యువే ॥సరి॥

అజ్ఞానముడిగిన ఆత్మనిష్ఠుల మహిలో
అంటవెరచునయ్య మృత్యువే
సుజ్ఞానులైనట్టి సూరిజనుల ఛాయ
చొరగవెరచునయ్యా మృత్యువే
విజ్ఞానులైయున్న విజయుల దృష్టికి
వెరచి పరుగిడునయ్య మృత్యువే
ప్రజ్ఞతో పూదోట పరమగురునిసుతుల
పట్ట వెరచునయ్య మృత్యువే ॥సరి॥—86



చతుర్యుగములందు సతత చలనాత్ములై
హితవుతో మానవులు నెపుడు దిరుగుచునూ
సతిపుత ధనధాన్య సంపదల చేజిక్క
మతిచెడి కపోతముల గతిని పొగులుదురూ

ప॥ ఎంతదుష్కృతము దీని నెంచి చూడగ శివా
చింతించి మీ పాదసేవ సేయకను ॥ఎంత॥

కరుణ యించుక లేక కాపురము జేయుచును
గురువుదైవంబను గురు తెరుంగకను
తరుణి వలపులదగిలి ధాత్రిలో పురుషులును
మెరసి గాలము మ్రింగు మీను విధమైరి ॥ఎంత॥

సుడిబడుచు సంసార శోక జలనిధి మునిగి
కడలి కామాగ్నిచే గాసిపడి మరియు
అడరగా జిహ్వాగుహ్యాల రుచులు గోరినను
నిడిసి చిచ్చులో ధుముకు నిడుత నిధముగాను ॥ఎంత॥

మురికిలో జనియించి మురికి యొడలును బెంచి
మురికి దేహము జూచి మురిసి యాడుచును
మురికిగారెడి సతుల మురికిరతి నాసించి
కలికికిని మ్రొక్కెడి కుక్కబ్రతుకాయె (నయ్యయో !)

వ్యసనములచే జిక్కి యలరి చరియింపుచును
పస లేని సతుల నిజ బంటులగుచున్
రసికుడగు పూదోట రామయోగిని గనక
మునుకు లిడి యమపురికి మొనసినడచెద రే ‖ఎంత‖—87

---

కామ వ్యసనములచే గాసిపడి పురుషులను
పామరత సతులవెంబడి దిరుగుచును
కోమలాంగుల ముఖము కోరికొని చూచినను
స్వామి పాదాబ్జముల జాడగనుటెట్లూ ?

ప‖ ఏమి సేయగవలెను హీనమనుజుల బ్రతుకు
క్షేమమున సద్గురుని జేరు టేలాగూ ? ‖ఏమి‖

ముదముతో సతులగని మోహించి చలనులై
తుద మొదలెరుగ కింతుల గూడుచునువారు
సుదతి యధరముజూచి సొంపుతో గ్రోలి మది
పదిలుడై తానమృత పానియగు టెట్లూ ? ‖ఏమి‖

దుర్మదంబులమరుని తూపుల చలనాత్ములై
కర్మమతులై సతుల గవసి రతిసేయున్
ధర్మమగు పూదోట ధాతనంటక జనులు
నిర్మలానందమున నిలుచు టేలాగూ ? ‖ఏమి‖—88

---

పరికించగను పుణ్యపాపముల చిక్కుబడి
స్థిరముదెలియక యెప్పుడు జీవకోటులును

అరయగా క్రిమి కీటకాది జంతువులయందు
వసుసదప్పక తిరిగి వరలుచుండుదురు

ప॥ శివశివా ! యిటువంటిజీవులకు ముక్తెట్లు !
భువిజనులు నీపదము పొందు టేలాగు ॥శివ॥

చనువుగనుసంసార జలరాసిలోమునిగి
పనులుజేయుచుసతుల బంటులై మరియు
ఘనమోహపాశముల కట్టబడిపొగలుచును
గుణరహితమైనట్టి గురుసిదెలియకను ॥శివ॥

మలినసతిసుతులకై మాలపాటులుపడుచు
చెలగితిరుగుదు రెపుడు నాల్గుయుగములను
బలిమైనపూదోట బ్రహ్మంబుదెలియకను
పొలసిపోయెడి దీపపురుగువిధముసను ॥శివ॥—89



జితవిషయులునుగాక సృష్టిపై పురుషులును
సతుల వలపుల జిక్కి అతితమకమునను
గతిచెడియు నింతులను గాఢరతులను బెనగ
మదిని గురుమంత్రంబు మరచుటేకాదా !

ప॥ ఏటిజన్మమువృథా యిలను కుజనుల బ్రతుకు
చేటుదెలియక మృత్యుచేబడిరి తుదను ॥ఏటి॥

వలలబడి రమణిముఖ వలపుమాపుల సొలసి
అలకాను వ్యసనముల నంటి తిరుగుచును
నిలిచి తన మదిలోను నిజము దెలియకగదా !
వలలజిక్కిన పక్షివలె జెడిరి జనులు ॥ఏటి॥

అష్టమదములచేత అసురప్రకృతి భోగములు
నిష్టమని కోరుచును నింపుసొంపునను
నిష్ఠతో పూదోట నిజగురుని దెలియకను
కష్టులై జనులు నరకమున బడుదురునూ ॥ఏటి॥—90



మసలుచును సతిసుతుల మాయలకు చిక్కబడి
పసలేని సంసార బద్ధులై మరియూ
అసురకర్మములెపుడు సవనిపై జేసినను
పుసిగాయలో పురుగు నసియించువిధమూ

ప॥ శమదమాదులతోడ సద్గురుని దెలియకను
భ్రమలపడి తుదయముని బారిపడుదురునూ ॥శ॥

ధనదాన్య సంపదల ధరజనులు సొలయుచును
చెనటులై వ్యసనముల చాలదిసుగుచునూ
పనిబూని స్త్రీలవెంబడి దిసుగుచుండినను
వసర బీటనుగురియు వానవిధమగునూ ॥శ॥

కులమదంబుల జొచ్చి కుపిత సర్పములగతి
తులువలై జ్ఞానులను దూషించి జనులూ
కళలపై పూదోట ఘనుని దెలియకగదా !
మలబద్ధులై జనులు మడిసి పొయ్యెదరూ ॥శ॥—91

నిర్మలానంద జలధిలో నిలిచి ఇందుడు వెలుగుగాక
కర్మమగు రొంపిలో జూడ కానవచ్చునా !
నిత్యనిర్మలమైన నిజహృదయమునగాక
దుష్టమగు మనసులో ద్రష్టగననగునా !

ప॥ యోగి జనులమది చిదాత్మయుండును గాక
రాగాది జనులతో ఆత్మరాము డుండునా ! ॥యో॥

వసుసరాతిలోన వజ్రముండునుగాక
పరికించ చెడురాతిలోన ప్రజ్వరిల్లునా ! ॥యో॥

మొనసి చిప్పయందాణి ముత్యముండును గాక
కనుగొన కప్పచిప్పలో కదిసి వెలుగునా ! ॥యో॥

గోవు కడుపున మంచి గోరోజనంబుండుగాక
తావుగొని సూకరములో తవిలి మెరయునా ! ॥యో॥

నిలిచి జ్ఞానుల మదిలోను నిజగురుడు వెలుగుగాక !
కుల జాడ్యులలో పూదోట గురుడు ప్రబలూనా ! ॥యో॥-92

## గురుభక్తజనులు

నిగమగోచరమైన నీభక్తకోటులును
సగుణదేహముదాల్చి జగతిలోపలను
సుగుణసంసారులై సుజ్ఞానులైయెసఁసి
తవిలివర్తింతురిల ధర్మమార్గమునన్

ప॥ ఘటములోపల దీపకళిక వెలిగినరీతి
నిటలాంతముననిలిచి నిండివెల్గుదురూ ॥ఘ॥

విరిమైనభూతేంద్రియ విషయములఖండించి
సారిద్రిక్రీడింపుదురు సుజనవృత్తులనూ
బురదలోపలఁజొచ్చి పురువులంటనియట్లు
మరిదెలిసిసంసార మలినమంటదనూ ॥ఘ॥

కులజాడ్యులైమహిని కుజనులును చెలరేగి
పిలిచినీతనయులను పేర్మిదూషించన్
చెలగివారినిజూచి తెలిసిసాత్వికులై
కలకలను సగుచుమరి కలకపొందరునూ ॥ఘ॥

పరమోపకారులై ప్రజల హింసించకను
పరికించి విశ్వమును భావించిమదిని
పరమాత్ముడని ఏకభావమున కనుగొనుచు
నిరతంబుసద్గురుని నిలిచిచూతురును ॥ఘ॥

అతిభక్తితో పరమహంసలనుపూజించి
ప్రతిదినముమది పరాత్పరునిజూచుచును
మతబేధవాదముల మటుమాయమొనరించి
జితవిషయులైతాము వెలిగిమెలగుచును ॥ఘ॥—93

## ఓం కా ర దే హు లు

సదయులగు మీభక్తజనులు సంసారులై
పదిలులై ముక్తిసంపదల ప్రబలుచును
పదు నెరిగి సుజ్ఞాన పదులసేవింపుచును
సదమలానందులై సంచరింపుచును

ప॥ హంకార త్యాగులై యవనిపైనీసుతులు
ఓంకార కాయులై యుందురోయయ్యా ! ॥హం॥

చలనులగునిలజనులు చేరిదూషించినను
కలకపడకను మదిని ఘనధైర్యమునను
పలుమారు సద్గురుని పదములర్పింపుచును
కలసిసాధువులందు నిలచి వెలుగుదురూ ॥హం॥

సకలభూతముల నిజ జలజాంతరంగమున
అకలంకమైనట్టి యంతరాత్మకుడై
ప్రకటమగు పూదోట బ్రహ్మాంబుగూడుచును
వికటమగు పూదోట బ్రహ్మాంబుగూడుచును
వికల మించుక లేక వెలుగుచుందురును ॥హం॥—94

## ప్ర బో ద ము

పరమ పదమునసుండి పర తెంచి నీసుతులు
గురుకులాంబుధియందు కోరియుదయించి
నిరుపమానందులై నీచజనములరోసి
పరిపూర్ణజ్ఞానులై ప్రజ్వరిల్లుదురు

ప॥ ఇంతనుచు నీసుతుల నెంచ శృతులకు నలవె
భ్రాంతిచే సంసార పంకమంటదును ॥ఇం॥

తలిదండ్రులకు ముద్దు తనయులై యాడుచును
తలచి గురుపదసేవ నిలిచి జేయుచును

వలసి సౌందర్యంపు వనజాక్షులనుజూచి
కలయవారిని తల్లిగాను జూతురును ||ఇం||

నిజసతుల భోగమది నీచమని రోయుచును
సుజన సద్గోష్టిచే సొంపు మెరయుచును
భజనచే పూదోట బ్రహ్మంబుగలిసి తుద
నిజమోక్షమున చాల నిలిచి వెల్గుదురు ||ఇంత||—95

---

సృష్టిపై జనియించి శివయోగి పుత్రులును
యిష్టమగుసంపదల నిలమెలంగుచును
నిష్ఠతో సద్గురుని నిజమార్గమున నిలచి
భ్రష్టులగు నిలజనుల పరువ సేయదురూ

ప॥ జగతీశ ! నీ సుతుల సంసార వర్తనలు
ముగురు వారలు మూలమును దెలియఁగలరె ॥జగ॥

సంచరింపుచు మదిని సర్వసాత్వికులునై
ఎంచసుజ్ఞానులై యెనసి వేడుకను
పంచవర్ణాంతమగు పరమహంసల నెపుడు
పొంచి పూజించి పరభోగ మందుదురు ॥జగ॥

కల్లమనుజులలోను కాపురము సేయుచును
తల్లడము లేక నిజధర్మాత్ములగుచున్
చల్లనగు పూదోట సద్గురుని గలసి తమ
యుల్లమున ముక్తులై యుందురోయయ్యా ! ॥జగ॥—96

---

సుజనులగు నీసుతులు చోద్యమగుధరమీద
విజయులై జనియించి విమలాత్ములగుచున్
నిజగురునిచేత యుపదేశులై మెరయుచును
కుజనసంగతిబాసి కోరి మిముమదిని

ప॥ ఉన్మనీభావమున నొక్కటైనీసుతులు
చిన్మయపుహంసలై చెలగుదురెతంౘ్రీ! ॥ఉ॥

పంచభూతేంద్రియ ప్రకృతిదేహముదాల్చి
మించు సతిసుత ప్రాణమిత్రులనుగలిగి
సంచరింతురు సుజన సంపదలచెలగుచును
కాంచి సంసారదుఃఖ విరహితులు నగుచున్ ॥ఉ॥

క్షితిమీద మెరయుచును చెలగియింద్రియవిషయ
జితులగుచు గురుపూజచేసి సుజ్ఞాన
మతిదెలిసి పూదోట మర్మజ్ఞుగూడి తుద
ప్రతిలేని కైవల్యపదవినుందురుసు ॥ఉ॥—97



పంచభూతేంద్రియ ప్రకృతిదేహముజెరచి
కొంచమగు దుర్జనుల గోష్ఠిబోవకను
మించిసుజనులదగిలి మెరసి ఆనందమున
సంచరించుచు సర్వసాక్షీకుడగుచూ

ప॥ కుజనులును సంసారకూపంబు లోమునిగి
భజయించి సద్గురుని పదముగను టెట్లా! ॥కు॥

ధరజనులకును ముద్ధతనయుడై మెలగుచును
సరసుడై శివయోగ సాధకుండగుచు
మరిభక్తులకు మోక్ష మార్గంబుదెలుపుచును
పరులు నెన్నగబయట ప్రబలుచుండగనూ ॥కుజ॥

పిసరు దివ్యాన్నంబు పేర్కొనక భక్షించి
వసుధ యింతుల తల్లివలెను గాంచుచును
కుశలమగు పూదోట గురుమూర్తి నినుగలసి
అసిపథంబైచాల అమృతుడై మెలగన్ ॥కుజ॥—98



మాయదేహముదాల్చి మహిలోను దిరుగుచును
తోయజాక్షుల పాదఛాయ జేరకను
మాయజనులను యోగమాయ నిలగప్పుచును
మాయదగులకను నిర్మోహిమై మెరయుదురు

ప॥ మర్మజ్ఞులను దెలియ మహిజనులకును దరమె
నిర్మలంబైనట్టి నియతులకుగాక ॥మ॥

పట్టి సర్వేంద్రియముల బంధించి మెరయుచును
చుట్టి దుష్కర్మగుణులు దూరబుచ్చుచును
పట్టి సద్గురుపదము పరమయోగము దెలిసి
దిట్టలైదివ్య సుస్థిర గాత్రులగుచు ॥మర్మ॥

అదరు బెదరును లేక అవనిపై వెలుగుచును
సదమలానందమున సంచరింపుచును
పదిలులై పూదోట బ్రహ్మంబు సంటియును
అదిగో నిర్భీతులై అచుచుందురును ॥మర్మ॥— 99



జలజపత్రములందు జలములంటనియట్లు
తలచిచూడగఛాయ ధరనంటనట్లు
నిలిచినీటిలో నవనీతమంటనియట్లు
వెలిలోనుగాలియంచుల నంటనట్లున్

ప॥ గురునిపదమున మనసుగూర్చి నిలిచినయోగి
అరసి సర్వేంద్రియముల నంటియంటగబోడు ॥గు॥

అనలంబు నినుమునను అంటియంటనియట్లు
ఘనరత్నమునురాతి కెపుడంటనట్లున్
ఇనుడు తా సరసిలో నెనసియంటనియట్లు
మొనసిదర్పణమునను ముఖమంటనట్లున్ ॥గురు॥

పరికించి జిహ్వనే పలుకులంటనియట్లు
నైంస్నీరుకోడబ్ధి నీరంటనట్లున్

అరసిచంద్రుడు జగము లంటియంటనియట్లు
అరయపూదోటగురుడంట డజ్ఞులను ||గురు||—100

—•—

చెలగి చిప్పను స్వాతి చినుకంట కున్నట్లు
చలువ పాదరస మరచేయంటనట్లున్
నలిన పత్రము సరసి జలము లంటనియట్లు
అలకోకిల నిరాశ్రయంబైనయట్లున్

ప॥ సారది జాగ్రత్స్వప్న సుప్తులను మీరిమది
గురుసుతులు నిలనేమి కోరపనిలేదు ॥సారది॥

తరణి దీప్తులునిండి ధరనంట కున్నట్లు
అరయ మెరుపును మేఘమంటకున్నట్లున్
కరుణ తారాధిపుడు గగన మంటనియట్లు
వరుస మారుతము సర్వము నంటనట్లున్ ॥సారది॥

దినకరుడు నుదయించ తిమిర మణగినయట్లు
మనసు నిలిచిన త్రివిధ మలము లణగారున్
గుణరహితు పూదోట గురుని పదమున హంస
మొనసి కలసిన పంచభూతములు నణగున్ ॥సారది॥— 101

గురుపుత్రులు

తలచగురుపుత్రులును ధరణిపై జన్మించి
కులగోత్రములు గలిగి కులరహితులగుచున్
వెలయస్థూలాంగులై విజ్ఞానమయులగుచు
అలవార్ధిలో నర్కు డంటియంటనివిధము

ప॥ కలసి సర్వేంద్రియముల కలియకను సజ్జనులు
నిలిచికైవల్యమున నిండివెలుగుదురూ ॥కలసి॥
కుజన సంసారులలో గూడివర్తింపుచును
సుజన సంసారులై సొంపు మెరయుచును

నిజయోగమార్గమున నిలిచి నిర్వాణులై
అజపదంబై బయట సలరివెలుగుదురు ||కలసి||

గురునికరవీర్యమున నరులు ఘనయోనిలో
సరసులై జనియించి శాంతమూర్తులునై
అరుదైన పూదోట యాత్మరామునిగలసి
పరమపదమున నెపుడు ప్రజ్వరిల్లుదురూ ||కలసి||—102

---

చలన మించుక లేక సర్వసాక్షీకులై
కలసి సర్వేంద్రియముల కలయ కెప్పుడును
కులమదంబులు జెరచి గురుయోగులై ధరను
నిలిచి తన మదిలోను నిండి వెలయగను

ప॥ కులగర్వులును వారి గురుతు లే మెరుగుదురు
అలసూక్ష్మ బుద్ధిగల అయ్య లెరుగుదురూ ||కుల||

వికలమించుక లేక విజ్ఞానకాయులై
ప్రకటముగ ధరమీద ప్రజ్వరిల్లుచునూ
అకళంకమగు పరమ హంసలై చెలగుచును
శుకవిలాసంబునను సొంపు మెరయగను ||కుల||

మత్సరము లేక నిర్మత్సరంబున మెలగి
అచ్చమగు గురుభక్తి నాశ్రయింపుచును
ముచ్చటతో పూదోట మూలమూర్తినిగలసి
వచ్చమించుక లేక వర్తించగాను ||కుల||—103

---

సంగరహితులునగుచు సాత్వికమున మెరచి
పొంగిభూచక్రమున పూజ్యులైమరియు
మంగళాస్పదులగుచు మరిదివ్యకాయులై
నింగిభువిదిశలంటి నిలిచిప్రబలగను

ప॥ మలబద్ధులగువారి మహిమదెలియగలేరు
మలరహితులైన మర్మజ్ఞులెరుగుదురు ॥మ॥

అగ్ని నేత్రముదెరచి అరఘుటియలోపలను
అజ్ఞానమునుజెరచి అమృతులైచాలా
ప్రజ్ఞమెరయుచు ధరను భక్తులనురక్షించి
విజ్ఞానదీపమై వెలుగుచుండగను ॥మల॥

అష్టతనువులుమించి ఆనందమయులునై
నిష్ఠచెదరకగురుని నిలిచిచూచుచును
యిష్టమగుపూదోట నేకాత్మునిగలసి
ద్రష్టలై నిర్భయట తరలకుండగను ॥మల॥—104



మలినులై మర్త్యమున మానవులు సంసార
చలనులై మహాకాల చక్రభ్రమనెపుడు
అలయుచును జిహ్వాగుహ్యాపేక్షలను జిక్కి
తెలివిచెడి యమునిచే పాలసి పోవుదురు

ప॥ తలచ సురదనుజ గంధర్వాది ఋషిగణము
లలపూర్వకృత కర్మ మనుభవింతురను ॥తల॥

శిరసు భిన్నంబగు శివునిచే పరమేష్టి
హరుడు బిక్షమునెత్తు సకల జగములను
హరియు దశ జన్మముల నాయాసపడి తిరుగు
పరనుదుటివ్రాత దుడుపగ నెవరి తరము ? ॥తల॥

సురసుతులు దుర్మార్గుదరిమి నిర్మలమతిని
సురుచిరంబౌరత్న జ్యోతి పీఠమునన్
స్థిరమైన పూదోట గురుమూర్తి వెల్గగని
పరికించికూడి నిజపదవినందుదురు ॥తల॥—105



వరుస పాషండులును నొనరగా వైష్ణవులు
నరయ శాక్తేయులును నల కపాలికులున్
మరిజైన చార్వాక మలిన షణ్మతములును
ధర భేదవాదముల దగ్ధమయ్యెదరు

ప॥ మత గర్వులకు ముక్తి మహిలోన దుర్లభము
అతి తుర్యపదము గురు సుతుల కతిసులభమునా ॥మత॥

ఇలనాల్గు వర్ణములు నింగు రవితారలును
తలచ సురసిద్ధ గంధర్వ ఋషి గణముల్
తెలియ దైత్యులు నురగ దిక్పాలకులు మాయచే
చకితులై నాలుగు యుగములను దిసుగుదురు ॥మత॥

గురుపదము ధ్యానించి పరిశుద్ధులై ఘనులు
నిరతమును తమ మనో నీరజము తుదను
అరుదైన పూదోట ఆత్మరాముని గూడి
తిరిగి రారెన్నటికిని దివ్యాత్ములగుచు ॥మత॥—106

ఘటికులై గురుకృపను కదసి భూతేంద్రియముల
నిటల నేత్రాగ్నిచే నెరగాల్చి దగ్ధ
పటలమొనరించి మరి పరమ శాంతులుగను
ఘటములోపలి దీపగతిని వెలుగుదురూ

ప॥ పరమగురు చరణములు భక్తితో పూజించి
స్థిరమోక్షమునవిల్చి తేజరిల్లుదురు ॥పరమ॥

జలపూర్ణ బహుకుంభములను ప్రతిబింబమై
నిలిచి యర్కుడు బయట మరి వెలుగునటులన్
తెలియ విశ్వము జొచ్చి దీపించి తుదస్వర్ణ
జలజమున సుజ్ఞాన సత్కళల ప్రబలున్ ॥పరమ॥—107

గురుతుకుండలి లేచి కుడియెడమబంధించి
తరలకను మరి రాజ దంతద్వారమునన్
నిరతము సుధారసము నేర్పుతో ద్రావుచును
స్థిరమైన చిద్బ్రహ్మ దీప్తులీక్షింతున్

ప॥ గురుభక్తిచే సర్వగుణరిపులఖండించి
గరిమెతో తుహినకరుగతి ప్రకాశింతున్ ॥గురు॥

తెలియ నుదయాద్రిపై దినకరుడు ప్రబలగను
జలజములువికసించి సంతసిలునట్లున్
నిలిచిహృత్తీవ్రమున నిండుసత్కళలతో
బలసివెలిగెడి జ్యోతిపైస్థిరునిగంటిన్ ॥గురు॥

ధగనుద్వాదశనదులు తరలితీవ్రముగాను
శరధిలోపలగలసి స్వచ్ఛమైనటులన్
అరయనతిసూక్ష్మమై అమితమగుపూదోట
పరమపురుషునిగూడి బయటవెల్గుదును ॥గురు॥—108

---

వేషభాష లేలే ? చిత్రపు వేషము లణచినను ?
దోషరహితమా శేషుశిరముపై ఘోషలోను గురుభూషణమైతే

ప॥ సాధన తనకేలే ? కేవల బోధరూపమైతే !
వాదబేధముల బేధింపుచు ధర
సాదుజనులతో మోదము జెందితే ॥సాధ॥

యోగి జనులు సొలయన్ నిర్మలరాగము చేయుచును
నాగకన్య మది సాగి ప్రమొక్కగను త్యాగి భోగియగు
యోగ శిద్ధుడై ॥సా॥

మంత్ర తంత్రమేలే ? తా చిన్మంత్రకాయుడైతే
మంత్రరూపి శ్రీ తంత్రము ప్రదెంచియు మంత్రములో
పరతంత్రుండైతే ! ॥సా॥

భూమిదిరుగనేలే ? మోక్షసుగ్రామము జేరుచును
హేమజ్యోతిని కోమల నిష్కళ రాముడైన
గురుస్వామిని నమ్మితే ॥సా॥
మాటలు తనకేలే ? తన్మయ కూటమి దెలిసినను
సాటిలేని పూదోట గురుని నిజ చోటున గూడియు
నీటుగ వెలిగితే ॥సా॥—109



మించి త్రైశృంగములు మేరుశిఖరములందను
పంచశక్తులకడను పరమ సద్గురుడున్
సంచరింపుచున్న స్వాముల పదాబ్జములు
పొంచి షోడశవిధుల పూజసేయగను

ప॥ విజ్ఞానఖడ్గంబు విదితముగ గురుడొసగి
యజ్ఞాన శత్రువుల హతమార్చ మనునే ॥వి॥
పట్టైనముగ్గురిని పట్టివధియించి కా
నట్టై యార్వురముర్వుర హతము సేయుచును
గట్టిగా నేడు గురిని ఖండించి తీవ్రముగ
మెట్టి వెన్నెలబయట మెరయుచుండగను ॥వి॥
గ్రక్కున సాహస్రార కమలాంతరంగమున
అక్కరతో వర మోక్షాజ్ఞాక్షి కవ్వలను
చొక్కమగు పూదోట సుందరాంగుని నంటి
మిక్కిలి యనంతమై మెరయుచుండగను ॥వి॥—110



ఇలసర్వనదులలో నోలసిమునిగిన లేదు
అలరి దేవతల పూజలందు మరి లేదు
తెలియవ్రతనుతులచే సలపరించిన లేదు
తలచ క్రతుదానములందు మరి లేదు

ప॥ పరమసద్గురుకృపకు పాత్రులగుజనములకు
స్థిరముక్తి నిముషమున సిద్ధించునన్నా ! ॥ప॥

తరచుశృతిశాస్త్రంబు లరసిచూచిన లేదు
మరివేషభాషలను మరి దిరిగినను లేదు
గరిమె అష్టాంగ యోగములభ్యసించినను లేదు
అరయజపతపము లందరసినను లేదూ ॥ప॥

అలశరధిలవణంబు నారణ్యాశాకంబు
నొలసికూడినరీతి వరభక్తకోట్లు
కలితమగు పూదోటకడ నిష్క్రియునిగూడి
తలచసుస్థిర శూన్యతత్త్వమయ్యెదరు ॥ప॥—111

## విరాగము

గురువాక్యమును నమ్మి పరమ సాత్వికులై
యరయ నస్ఖలితులై యానందమునను
తరుణులను శవముగా ధరను వీక్షించిమది
స్థిరులగుచు నుర్విపై చరియించ వలయు

ప॥ మరియు బంగారమును మహిపెంకు సమముగా
పరికించి మాధవలె బ్రహ్మనిష్ఠులునూ ॥మరి॥

కలియకను దుర్జనుల చెలిమి సంతోషమున
నిలిచి సుజనులతోడ నిజములాడుచును
అరయభయమై విషము వేవేగ విడుచుగతి
మరియు భోగములపై మమతవిడవలెను ॥మరి॥

చెరుగుపాములతోడి చెలిమి మానిన రీతి
పుడమిలో దుర్జనుల పొందు విడవలెను
తడబడక సుజ్ఞాన ధర్మాత్ములను జేరి
కడువేడ్క పూదోట ఘనునంటవలెను ॥మరి॥—112

## నిర్గుణ బ్రహ్మోపదేశము

కావు త్రైగాత్రములు కావచటి సగుణములు
కావచటి స్థానములు కావుమాతృకలూ
కావచటి వర్ణములు కావచటి సగుణములు
కావచటి శక్తులును కావు వేల్పులును
ప॥ నీవు యిన్నియుగాక విమల చిన్మయునిపై
కేవలనిరాకార మీవెవిను పుత్రా ॥నీవు॥
కావు వేదంబులును కావు జీవంబులును
కావచటవస్థలును కనుగొనగ వత్సా !
కావు ఈ కర్మములు కావు ఈ పుణ్యములు
కావు ఈ భోగములు కావు ఎన్నటికినీ ॥నీవు॥
కావు ఆధ్యాత్మికము కావు అధిబౌతికము
కావు అధిదైవతము కావు ద్వంద్వములు
కావు అజ్ఞానమును కావు అంతఃకరణము
కావు ఈ జంగమ స్థావరంబులునూ ॥నీవు॥
కావు పగలును రేలు కావమిత తేజములు
కావు లక్ష్యంబులును కావు విద్యుతులూ
కావు నినదము బింధు కావు బహుసత్కళలు
కావు తుర్యమునీవు కావుసతి తుర్యం ॥నీవు॥
నీవు నిర్ద్వంద్వుడవు నీవు నిర్వాసనుడ
వీవు నిర్లేపకుడ వీ వమృతుడవు
నీవు పూడోటకడ నీవనంతంబగుచు
నీవద్వితీయుడవు నీకిక సుఖంబూ ॥నీవు॥—113



నీవు తనువునుగావు ఇంద్రియంబులుగావు
నీవు గాడ్పులుగావు నీవు నిరవయుడవు
నీవు నవకంజములు నెరమాతృకలుగావు
నీవు వర్ణంబులును నిజముగాగావు

ప॥ వినవయ్యా వరపుత్ర వివరించిచెప్పెదను
తనరు సుస్థిర శూన్యతత్త్వమగుదీవు ॥విన॥

నీవు ఈ బహుతత్త్వనికరంబులునుగావు
నీవు శక్తులుగావు నిర్వికల్పుడవు
నీవు సర్వాంగముల నిలుచువేల్పులుగావు
నీవు త్రైగుణములును నిగమములుగావూ ॥విన॥

నీవు దివిజులుగావు నీవు రుషులునుగావు
నీవు మునులునుగావు నీవద్వయుడవు
నీవు యోగక్రియలు నిలిచిచూచినగావు
నీవు సచరాచరము నీవెపుడుగావూ ॥విన॥

నీవు నాదముగావు నీవుబింధువుగావు
నీవు కళలునుగావు నిర్వాణిగావు
నీవు చిద్రూపమైనిలిచి తెలియగనవల
నీవు నిర్భయులునై నీవెమెరయుదువు ॥విన॥

నీవు ఇన్నియుగాక నీవు నిష్క్రియుడనై
నీవు నిర్గుణబ్రహ్మ నీవగోచరము
నీవు పూదోటకడ నెరనిరామయుడనై
నీవచ్యుతరాశియై నీవెప్రబలుదువు ॥విన॥—114

## పరమజ్ఞానం

పరమ జ్ఞానమున చెడు పరగ మాయలశక్తి
పరమ జ్ఞానమున చెడు బలిమి స్వాంతమునూ
పరమ జ్ఞానమున చెడు పంచ భూతేంద్రియములు
పరమ జ్ఞానమున చెడు మరికోర్కెలన్ని

ప॥ సుగుణులైయున్నట్టి సూరి జనులార యిది
నిగమాంతమున నెపుడు నిలిచి వెలుగొందు ॥సు॥

పరమ జ్ఞానమున చెడు పాపపుణ్యంబులును
పరమ జ్ఞానమున చెడు ప్రకృతి భోగములు
పరమ జ్ఞానమున చెడు భరిత భవకాననము
పరమ జ్ఞానమున చెడు భవదుఃఖ తతులు ॥సు॥
పరమ జ్ఞానమునచెడు పగలు రేలును శృతులు
పరమ జ్ఞానమున చెడు వరుస చక్రములు
పరమ జ్ఞానమున చెడు బహువర్ణ మాతృకలు
పరమ జ్ఞానమున చెడుదురు సర్వవేల్పుల్ ॥సు॥
పరమ జ్ఞానమున చెడు బహుకాల గతులు తుద
పరమ జ్ఞానమున చెడు పశుజీవు డప్డూ
పరమ జ్ఞానమున చెడు వరనాల్గు పదవులును
పరమ జ్ఞానమున చెడును బంధమోక్షములు
పరమ జ్ఞానుండైన వరచిన్మయుడు నాదు
చిర నిరాకారమున జెందిలయమైనన్
గరిమెతో పూదోట కడసర్వ సాక్షినై
అరయ శూన్య మశూన్యమై ప్రకాశింతు ॥సు॥—115

## (ప్రళయం) పంచోత్కారణము

నలువ తనువులు నూరు నష్టమైనను బ్రహ్మ
ప్రళయమగు దీనికినిపై నద్భుతమునై
విలయాంబువులకడను వెలగు వటపత్రమున
వలసి నారాయణుడు పవళించి కూర్కన్

ప॥ పంచప్రళయములునే ప్రకటించి చెప్పెదను
మంచి జిజ్ఞాసనివినుడి మర్మజ్ఞులారా! ॥పం॥
హరిచాత్రములునూరు నవసి పోయినతుదను
పరికించనిది విష్ణు ప్రళయమగు కడనూ
హరునికిని ఈ కాలమరనిమిషమగు శివుడు
పరగనీల్గిన క్షుద్రప్రళయ మిదియగునూ ॥పం॥




శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగమూర్తి స్వాములవారి మఠంలోగల 400 సం॥ముల
అశ్వత్థవృక్షము - క్రొత్తగా రామకోటిమందిరం - బేతంచెర్ల




శ్రీ శ్రీ శ్రీ పూదోట లింగమూర్తి స్వాములవారి శ్రీ పాదుకలకు
పల్లకీ వుత్సవం - బేతంచెర్ల



శ్రీ గురుపాదుకా పూజలో
గుండా సుబ్బారాయుడుగారి దంపతులు - నంద్యాల



శ్రీ గురుపాదుకా పూజలో
శ్రీ కాకుల శేషమ్మ మాతృశ్రీ వన్నమ్మగారు - గోవిందపల్లె

మొనసి ప్రణవమునాది ముల్లోకములుతుదిని
వనరగర్భమునుంచి వనజాక్షి వేడ్కన్
పనిలేక నిర్గుణియు పరమ చిన్మయునిలో
గొనకొనుచుకూడ నాల్గవ ప్రళయమగును ॥పం॥

తలపోసిశుద్ధచైతన్యుడును నటమీద
నిలిచి యతితుర్యమున నిర్లేపుడగుచూ
అలనిరంజన పదంబలరి వీక్షించనతని
కలసితన్మయుడైన కడప్రళయమగునూ

సర్వమును తనవ్యోమ జఠరమున నుంచితుద
సర్వశూన్యంబునై సత్పదమునగుచూ
సర్వపరిపూర్ణమై చారు పూదోటకడ
సర్వమునకు నుభయసాక్షినైయుందూ ॥పం॥—116

---

మెరసిమన్మథుగెలుచు మేలుజెప్పెదను సు
స్థిరులునై వినుడి పరమదేశికుని కృపను
గురుని చరణాబ్జములు కువలయంబునచాల
నెరనమ్మియున్నట్టి నిజభక్తవరులు

ప॥ బలిమిచిద్వహ్నిచే పొలియించి రతివిభుని
తలపు మరపులుమించి తనరుచుండుదురు ॥బ॥

కులమదంబులు జెరచి కుజనకూటము బాసి
మలినమిూషణత్రయము మూడ్చి వేడుకను
చలన మొందని దీపకళికవడి వెలిగియును
తెలియ తరగలు లేని జలరాశిపగిది ॥బ॥

గర్వమును లేక నిర్గర్వులై చెలువొంది
సర్వవాసనలెల్లజెరచి శాంతులునై
పర్వమగు గురుభక్తిమహిమమీద పొగడుచును
నిర్వికారులునగుచు నిలిచి మెలగుదురు ॥బ॥

మలినముడిగినయట్టి మార్తాండువిధమున
కలితనిర్మలమైన జలరాసిదోడి
కలుషదూమము లేని ఘనతసనిలునిగతి
కలుషమించుక లేని గగనంబు క్రియను ॥బ॥
అష్టమదములనుడుపి ఆనందమున బ్రహ్మ
నిష్ఠులై వెలిలోను నిండి ప్రబలుచును
నిష్టపూదోటకడ నిర్వికల్పులునగుచు
ద్రష్టలకు వెలిశూన్య తత్త్వమయ్యెదరు ॥బలిమి॥—117

## ఆత్మబోధ (కోలాట తత్త్వము)

బంధమూడదన్ని మధ్య - పాము రేచరే చెలియ
గ్రంధి త్రయము చించి సూక్ష్మగుహను దాటరే
గ్రంధియుత సువర్ణ దండము కరము నుంచరేమీరు
సింధు కన్యలార చిటుకు శివున కివ్వరే
ప॥ కోలు కోలు కోలు అమృత సరసి దాటరే చెలియ
కోలు పరమ శివునితోను గూడి వేయరే ॥కో॥
ప్రజ్ఞ మెరసి పగలు రేలు పైకి జిమ్మరే
ముగ్గురినిగూర్చియు ముమ్మాల నివ్వరే
అగ్ని పర్వతమును మీరు అలరిదాటరే చెలియ
నిగ్గువన్నె చీరగట్టి నిలిచి వెలగరే ॥కో॥
అష్టకందుకముల శిరమందలంకరించరే
దృష్టికొనల స్వర్ణ రేఖ తీర్చి మెరయరే
నిష్ట ఏక చక్రమునను నిలిచి వెలుగరే
బ్రహ్మ నిష్ఠులారా శివుని బెనగి నిలిచి వేయరే ॥కో॥
మించు బ్రహ్మ కంకణములు మెరిసికట్టరే చెలియ
పంచపంచ వర్ణములను పాట బాడరే
మించినుచులు నూర్ధ్వమునను పొంచికూడువరే చెలియ
ఖించి తెలివి లోన మినుకు నెంచివేయరే ॥కో॥

కర్ణములను నినదఘోష కదలియాలకించరే సర్వ
వర్ణరహితులగుచు మీరు వార్తకెక్కరే
పూర్ణుడైన యాపూదోట భోగిగూడరే చెలియ
నిర్ణయించి బట్టబయట నిలిచి వెలుగరే ॥కో॥—118

## ఆ త్మ బో ధ

పరిశుద్ధమై ప్రబలు పరమ జ్ఞానంబనెడి
ధర నాత్మరత్నమును బడసి తీవ్రమున
గురుతు నార్వురు చోరకులు నెత్తుకొనిమాయ
పురములోనుంచి యుప్పొంగి వేడుకను

ప। అట్టిమణి మహిమచే హంకార చిత్తులై
గట్టిగా విషయభోగముల సొలయుదురు ॥అ॥

బలిమైన వస్తువుకు పై కావలిగను
కలిత సద్గురుడు దొంగల జాడ దెలిసి
వలసి విజ్ఞానుడను వరసుతుని రా బిలిచి
తెలివి నా రత్నమును తిరిగి తెమ్మనెను ॥అ॥

పనిబూని గురుని సత్పదము గట్టిగనమ్మి
వనర సుజ్ఞానమను వాడి వాలలర
మనమలర ప్రకృతి ధామము జొచ్చియాఘనుడు
కనుగొనుచు నజ్ఞాన కలికి తలద్రుంచు ॥అ॥

కలుషదుర్గుణరిపుల ఖండించి యాచోట
నల జీవమాణిక్య మతడు గైకొనును
అలరి శ్రీగురుస్వామి కర్పించు నాఘనుని
భళిరె యని తన స్వరూపం బిచ్చి మెచ్చు ॥అ॥

అతడు దేశికుని కృపను నతితుర్యభక్తుడై
యతడు నిర్గుణుడునై యమృతాంగుడగుచు

సతడు పూదోటకడ సభల సాక్షిగనుండి
నతడు వెలిలోనిండి యద్వితీయుడు నౌ ||అ||—119

~~~~~

తనువులును నాల్గింట జనియించు దైవతము
లును సగుణ తత్త్వముల నెడి కారడవి మీరు
తనను జ్ఞానాగ్నిచే దగ్ధంబు సేయకను
ఘన నిరంజన పదమునను గూడు టెట్లు ?

ప॥ ఇట్టిచిక్కులు కొన్ని యెరిగి యెరుగకయున్న
యట్టివారలు సంశయాబ్ధి మునిగెదరు ||ఇ||

గరిమెనష్టాంగ యోగము లమిత లక్ష్యములు
తరుచు నిగమాంత శాస్త్రము లక్షరములు
సరస చిద్వహ్నిచే జెరచకను యిన్నిటిని
నెరనిరాలంబమై నిలుచు టేరీతి ? ||ఇ||

యిలను నిర్లేపుడై వెలుగుచుండెడి గురుని
పలుకు గట్టిగనమ్మి భక్తకోటులును
వలసి పూదోటపై వరనిరామయులునై
అలరు దేశికస్వాములై యుందురయ్యా ! ||ఇ||—120

—◆—

పంచాక్షరీ పైని వెలుగునమ్మా ! పంచశక్తుల
ప్రణవమంత్రమున గూర్చునమ్మా !
పంచశిరముల పామును రేచియు
పంచ బ్రహ్మలపైన నటియించు చున్నా !

ప॥ రామయోగిని జూడరమ్మా ! అమ్మయ్యా
యితడే రామయోగిని జూడరమ్మా !
యేమరక మనమందర మిపుడీ స్వామని నమ్మిన
సత్పద మొసగును ||రామ||
~~~~~

ఇంట పాపల గూర్చునమ్మా! కంటిపాపతో
 నంటి యంటక యుండునమ్మా!
జంటగిరుల తుద చెదరక నెప్పుడు అంటి హంసమై
 యాడుచు నుండెడి ||రామ||
పుండరీక పురములోనమ్మా! కోట్యర్క ప్రభలదండి
 తేజమైయుండునమ్మా!
నిండివెలుగు కుండలీ శిరములపై తాండవమాడేడి
 తారకరామ యోగి ||రామ||
రంగురత్న పీఠమున నమ్మా! పరమభక్తులు
 పొంగుచు పూజలు సేతురమ్మా
చెంగలింపుచును శాంతుల మదిలోన అంగనరో
 అమృతాంగుడైన నిజ ||రామ||
ఘంటారవము వింటినమ్మా! పూదోటరాముని
 నంటినే నిలిచియుందునమ్మా!
మింటి మంటినడుమ మెలగుచును తుద
 గెంటక నెప్పుడు కేరుచుండెడి ||రామ||—121

## తన్మయబోధ

అజ్ఞానమున వ్రతము లాచరింపుచు మీరు
ప్రజ్ఞతో రాళ్ళ కర్చన జేయుచును నాత్మమరచి
విజ్ఞానులైమీరు విమల భయభక్తియ నెడి
సంజ్ఞతో సద్గురుని జాడ తెలియకను
ప|| కర్మ మార్గములచే కడ తేరగాలేరు
ధర్మమార్గము దెలుపు దాత నెరుగరును ||కర్మ||
మలినులై ధరను షణ్మతములను వలలబడి
చెలగుచును జహ్వాగుహ్యాలకుచుల దగిలి
జల మధ్యమున వెలుగు స్వామి పదాబ్జములు
నెరవెరగి పూజించు నేర్పు దెలియకను ||కర్మ||

యిలను తొలకరి మెరుపులకు బీజములు నెగసి
అలరి యూడుగ చెట్టు నంటిన విధమున
వలసి పూదోట కేవల నిర్గుణుని జ్ఞప్తి
గలసి తన్మయ మొందు క్రమము దెలియకను ॥కర్మ॥—122

## బ్రహ్మాండ స్వరూపము

ఆదికూర్మముమీద నష్టగజములున్నవి
మోపించి గజములమీద భుజగమున్నది
ప్రోదిగాభుజగము మీద మేదినీ త్రిపురములున్నవి
మేదినీ త్రిపురముల మీద వేదాతీతమున్నది

ప॥ ఇన్నివిద్యలు నాదు ముఖమున నిపుడు వెడలునే
అన్నిటిపై నిలిచిగురుడు వన్నె మెరయునే ॥ఇ॥

జంట యేసులమీద నంటి జ్యోతులున్నవి
అంటి జ్యోతులపైన కంటి అగ్నియున్నది
కంటి అగ్నిమీదను ఘంటారవంబున్నది
ఘంటారవముమీద కదసి యమృతమున్నది ॥ఇ॥

పొంగుసుధా వార్ధిపై శృంగారపు వనమున్నది
శృంగారపు వనములోను బంగారపు మేడయున్నది
బంగారపు మేడపై దివ్యాంగన వెలుగుచున్నది
అంగనపై పూదోట ఆత్మారాముడున్నాడు ॥ఇ॥—123

మూసియు నుభయ మార్గములలో నమ్మానవీక్షించ
యెదుట మొనసి గురుడు వెలుగునమ్మా!
నాసికాగ్రమున కాసిపురిలోన నిజ
దాసులకును నుపదేశంబు నొసగిన

ప॥ రామయోగిని జూడరమ్మా! భక్తులపాలి
కామధేనువ్వనె యుండునమ్మా!

క్షేమముతో నిజ హేమకంజమున
కోమలజ్యోతియై యామునక వెలిగేటి ॥రామ॥

యోగపట్టాభి రాముడమ్మా! యీతడు నా
లూగు వేదముల మూలమై యుండునమ్మా!
యోగి జనులకును రాగము జేయుచు
త్యాగిభోగి శివయోగి రత్నమగు ॥రామ॥

నెరభక్తకోట్లు గొలువనమ్మా! ముక్తి
పురమున పరమపద రాజైయుండునమ్మా!
స్థిరమైన పూదోటలో నిరతము మెరయుచు
గురుతారకమై గురుతుగ వెలిగెడి ॥రామ॥—124

## విరాగము - గురుసేవ

యిష్టమెరిగించెదను యిలమీద జనులార!
కష్టమగు సంసార కలుషాబ్ధిలోనూ
భ్రష్టులై మునుగకను పరమ సాత్వికులై
నిష్టతో శ్రీగురుని నెరనమ్మి వేడ్క

ప॥ సేవ జేయుచుగురుని చిన్మయానందమున
చావుపుట్టువులేని జాడ గనుడికను ॥సేవ॥

పరికించరజ్జు సర్పభ్రాంతి యీ జగము
ధరపైని శుక్తి రజతభ్రాంతి తనువుల్
సరసమృగ జలభ్రాంతి సర్వభోగంబులును
సరగ మేఘజ్యోతి చందమీ సిరులు ॥సేవ॥

కులము నాచారములు గల గురువులనుద్రోసి
తెలియ సత్కలితుడగు దేశికుని కృపను
నిలచి పూదోటపై నిష్కళ బ్రహ్మమును
గలిసి సత్పదమునై కడు మెరయరయ్యా! ॥సేవ॥—125

## నవచక్ర బోధ

పరమ సద్గురుకృపను పరిశుద్ధులైనాత్మ।
సొరిది నవచక్రములు శోధించి వేడ్క
తపచు ముప్పదియారు తత్త్వములలో నెపుడు
పరమ తత్త్వము మదిని భావించవలయు

ప॥ స్థిరము జెప్పెదమీకు శివయోగ సుతులార
నెరయ కేవలముక్తి నిర్శైబటయున్నా! ॥స్థిర॥

తలచ పగలును రేలు దాటి యద్భుతమగుచు
కలితనిర్మల బిందుమున పీఠమునను
బలసిబహు శతకోట్యర్క ప్రబల విరచితమగుచు
సలుపుచును సదసత్తునై ప్రకాశించు ॥స్థిర॥
తెరపి లేకనునిండి తెలియగుణ సామ్యమగు
నరయస్వయం జ్యోతి కవల పూదోటన్
పరమ పురుషునిగూడి పంచతనువులు మించి
యరుదుగ యఖండైక్యమగు రసంబగును ॥స్థిర॥—126

## బ్రహ్మ తత్త్వము

పాలలోపల ఘృతము పరగడాగినరీతి
పూలలోపలస్వాదు పొంచి యున్నటుల
తాలిమితొ తిలలందు తైలముండినరీతి
చాల బడబానలము శరధినున్నటుల

ప॥ తెలియ బహుగూఢమై తేజరిల్లుచు గురుడు
సిలిచియఖిలము జొచ్చి నెరసి దీపించు ॥తెలి॥

అరయ మిత్రుడు మేఘమందు డాగినరీతి
స్థిర ఘటములో దీపశిఖయుండుపగిది
మరి నారికేళ ఫలమరుదుగా నున్నటుల
మెరవ రాళ్ళలో వజ్రములు డాగినటుల ॥తెలి॥

చెలగి పూ_క్తికము నిజ శిరమునుండినరీతి
తలచ భూగర్భమున ధనమున్న రీతి
బలమైన పూదోట బ్రహ్మమది యెప్పుడును
తొలగి దుర్జనులకతి దూరమై వెలుగు ॥ తెలి॥—127



తెలియ చిద్బ్రహ్మముఖ దీప్తులను నుదయమై
కదసి బిందువుశోడ కంజమున మెలగి
నిలచి నేత్రములందు నెరయ తల్రకిందగుచు
నొలసి జాగ్రత్స్వప్న సుప్తులను దిరిగి
ప॥ గురుకరుణచే తన్ను కోరిచూడగ నాత్మ
పరమ తారకమునై బయట వెలుగొందు ॥గు॥
వర చక్షువునను త్రైవర్ణ్య పటలముగప్పి
వరుస షట్కంజదళ వర్ణాక్షరముల
సరసి కూడుచు జీవహంస సర్వేంద్రియముల
దిరుగు వాయసముగతి తరుచు జగములను ॥గు॥
నిలిచి ప్రకాశించు నూర్ధ్వజ్వాలలను ప్రకృతి
పొలియించి తన జ్యోతి పుంజమును మించి
అలరు చిద్వ్యోమమున కవల పూదోట విభు
గలసి నిర్గుణుడునై కడవెలుగ వలెను ॥గు॥—128



## ద ర్ప ణ ద ర్శ న ము.

ఘరజనులు మంచి యుద్ధములోన తమముఖము
సరసిచూడగ స్వచ్ఛమై వరలినటుల
అరయ నంతర్లక్ష్యమను దర్పణములోను
కరతలా మలకముగా గాన్పించు బ్రహ్మం
ప॥ పరికించి చెప్పెదను పరమయోగులు వినుడి
నిరనిరాలంబమగు నిజగురుని మహిమ ॥పరి॥

చలనమొందని తేటసరసిలోపల జూడ
జలజారి సత్కళల వెలుగు విధమునను
అలర నిర్మలాత్మయనెడి ముకురమున చాల
తెలియగా నిష్క్రియుడు దీపించునయ్య ॥పరి॥

నిగమ గోచరుడునై నిఖిలమును నిండి చి
ద్గగనాంతరంగమున కదల కెప్పుడును
సగుణ నిర్గుణుడునై స్థిరుడు పూదోటపై
నగణితానందాబ్ధియై ప్రకాశించు ॥పరి॥—129

## ఆ త్మ బో ధ

సుజ్ఞానులను గూడరా! అజ్ఞానులను విడువరా
ప్రజ్ఞతో భూచక్రముపైని పరమగురునీ వెదుకరా

ప॥ గురుని పాదముబట్టరా! ఓరె గురుని పాదము బట్టరా
కోరిపూజా సేయరా! నిరతము కైవల్యమున నిలిచి
వెల్గుమురా! ॥గురు॥

మించి యురగిని రేచరా! యెంచి ప్రకృతులణచరా!
పంచకన్యలద్రోసి మించిదివికీ నడవరా ॥గురు॥

ఎడమకుడినీ బోపరా! నడిమివాకిట జొరబడుమురా!
కడకంటి దృష్టిని మదిలో చెడని పదవి తెలియరా ॥గురు॥

ముల్లోకములు మీరరా। మెనసి స్వర్ణగృహమున జేరరా!
తెల్లమిగ ముక్తికన్య దివ్యకళలు చూపురా! ॥గురు॥

పండువెన్నెల మించరా! దండితేజము వెలినిండరా!
అండగొనక పూదోటపై నద్వితీయుని గూడరా ॥గురు॥—130



అక్కా! పరశివుని ముఖమున నద్భుతరూపమై వెడలి
చొక్కమగు లింగాంగియైన సుగుణుడెవ్వడే!

ప॥ సత్తువర్ణమగు సందిపై కత్తిర్ఘుళిపించి కేరూనే
హత్తి నిలువుగండ్ల పురము నభవుపుత్రుడే ॥స॥
ఆజ్ఞతారకమున నడగు నాహుతిని దెలిసియు
ప్రజ్ఞతో వీరంగ మాడెడి ప్రభువుడెవ్వడే
చంద్రశేఖరుని పనుపున శత్రువుల భేదించి చెలియ
యింద్రాదిదేవతల దరిమిన ఈశుడెవ్వడే ॥స॥
పొంగుచూ కైలాసగిరిపై పువ్వుల చవికెలో పల
రంగుగ తాండవమాడు రారాజెవ్వడే
చుట్టు ప్రమధులుగొల్వ సుజ్ఞాన జ్యోతిపై వెలుగు
పట్టైన పూదోట గురుని పట్టియీతడే! ॥స॥—131

పంచ భూతేంద్రియముల ప్రకృతి దేహముబాసి
పంచ వింశతితత్త్వంబులు మించు ప్రణవమైయుండిన
గురుని బోధచేనీవు గుణరహితుడై యున్న
పరగురుని భావమున పరతత్త్వమైయున్న

ప॥ నీవే బ్రహ్మము జీవా!..........
నిలచిచూడగ మదిని నీవు చెదరకను
నిగమాంతరమున నీవు చిదాత్మనై నిలచివెలిగితే ॥నీ॥
గట్టిగ మనసనెడి నినుచుట్టిన వల్లదుంచీ!
మెట్టి త్రిజగములు మించి కేరుచును బట్టబయలునై
ప్రబలుచునుండిన ॥నీ॥
ద్రష్టా ద్రష్టలపై వరదృష్టియు చెదరక నీవూ
అష్టతనువులనె యంటి యంటకను అష్టాక్షరముల
కవ్వాల మెరసిన ॥నీ॥
మొత్తముగా చిత్కళలూ దివి మొనసి ప్రకాశించ
సత్తుచిత్తు సరసానందముపై చిత్తులయముతుద
చిన్మయమైన ॥నీ॥

సన్నుతింపగరాని సత్పదము నీ వగుచు
అన్నన పూదోట నిర్గుణు నున్నత పదమునె
యొప్పుగ గూడిన ॥నీవే॥—132



వస్తువును తనలోను నొక్కటైయుండగా
విస్తరించియు మదిని వెదక నేరకను
వస్తు వెఱుగక మఱికి వస్తువులు భక్షించి
యస్తమించుచు జనులు నవని గలుతురును
ప॥ కర్మమలముల నాత్మగప్పి కొనగలేరు
నిర్మలంబైనట్టి నిజముగనరన్నా ॥కర్మ॥
ఖండించి మతములును కడకు జిమ్మినబయట
నిండి తేజోకళలు నిలచివెలుగగను
పండు వెన్నెలబయట పరిపరివిధములను
పుండరీకము మధ్యపొలతి ప్రబలగను ॥కర్మ॥
అరసిచూడగ గురుం డద్వితీయుడు నగుచు
పరిపూర్ణమగు చిదాభాసియై తుదను
మెరసి పూదోట సద్గురుని పదమునుగూడి
స్థిరశూన్య తత్త్వమై తేజరిల్లెదరు ॥కర్మ॥—133

## ఆత్మ తీర్థ యాత్రలు

అదిగో గంగా యమున నాసాగ్రములె యగును
కలసితామ్రపర్ణి గౌతమి చక్షువుల్
విదితముగ సింధు కావేరి వీనులగును
మొదల భారతియు ముమ్మూల స్థలమగును
ప॥ తిరుగనేటికి భ్రమసి తీర్థయాత్రలకు నిక
స్థిరమైన శుద్ధాత్మ తీర్థవాసియగు ॥తిరు॥
కురుక్షేత్రమగు మధ్య గురుతు కేదారమగు
నరయు జిహ్వాగ్రహమున అలరు శ్రీశైలం

గరి మెను నహోబిలము కాశీస్థలంబగును
గురుసూర్యనంది తుద గురుడు వెలుగగను ॥తిరు॥
వసధి కడపద్మంబు వసర శ్రీరంగమగు
కనుగొనగ నంతర్జ్యోతి కైవల్య మగునూ
వినుతింప పూదోట విభుని పాదాబ్జములు
ననుదినము నిధి భక్తులై యంటి వెలుగగను ॥తిరు॥—134

ఆత్మబోధ (అఖండ ఎరుక)

పంచభూత స్తోమములతుద బయలు చేసిన ఎరుకయు
పంచవర్ణములైన మాత్రల పారమింగిన ఎరుకయూ
మించి నాహృత్కమల మధ్యను మెలగుచుండెడి ఎరుకయు
పంచ పంచధ్వనుల కేరెడి ప్రణవమగునిజ ఎరుకయు
ప॥ ఎరుక జెప్పెద వినుసఖి !
ఎరుక మరపుల రెంటిగనుతుద ఎరుకలోపలి ఎరుకయూ
ఎరిగి కలియగ తన్మయముగను మెరసియుండెడి ఎరుకయు ॥ఎ॥
సంగతిగ రవిచంద్రవహ్నుల సదనమున గురు నెరుకయు
అంగ మధ్యను పాదుకొని శివలింగమైనది ఎరుకయు
పొంగి దశభువనాంతరిక్షము మ్రింగివెలిగెడి ఎరుకయు
రంగుమీరి యనంతమైతుద రభసమైనది ఎరుకయు ॥ఎ॥
పరమ పదమగు జ్యోతిమధ్యను బలసివెలిగే ఎరుకయు
శరణులను చిద్రూపమై మరి మెరయు చుండెడి ఎరుకయు
నిరుపమానందమున నెప్పుడు నిలిచివెలిగెడి ఎరుకయు
అరుదుగా పూదోట కవ్వల నమృత పదమగు ఎరుకయు ॥ఎ॥–135

నా ద బ్ర హ్మ ము

గురుకృప గలిగిన నాదమురా తుదగురియై
నిలిచిన నాదమురా !
శిరము మధ్య పాదుక ముమ్మూలను
ఛిత్కళ లెడలిన నాదమురా !

ఆదిమ జ్యోతికి నావలనిండిన అఖండ
ప్రణవనాదమురా!
ప్రణవమూలమున నిండియుబయట
ప్రపంచమైన నాదమురా!

ప॥ నాదమెశివ సంధానమురా!
పాదుక నిగమాంతంబున నెప్పుడు
మోదుచున్న గురునాదమురా! ॥నా॥

పంచవర్ణముల నాదమురా ప్రపంచరహితమౌనాదమురా
పంచపంచపలుకుల ప్రేరేపుచు మించియున్నగురునాదమురా ॥నా॥

జంగమరూపమునాదమురా ముజ్జగముల దిరిగెడినాదమురా
అంగమధ్య భుజగిని నెడలించి నిరంగమైనగురునాదమురా ॥నా॥

జీవరూపమగునాదమురా యీ జీవులమ్రింగిననాదమురా
జీవజ్యోతియై సర్వశూన్యమై స్థిరమై యుండెడినాదమురా ॥నా॥

కనుగొనలాడెడినాదమురా, వెలిరామనేత్రమగునాదమురా
కణగియమృతధారలుగురియగ జ్యోతినబుట్టిననాదమురా ॥నా॥

పరమహంసయగునాదమురా కడ పరిపూర్ణంబగునాదమురా
నిరతముపూదోటను తానవ్వల నిలిచివెలుగుగురునాదమురా॥నా॥

కర్ణికతుద నోంకారమురా తనకర్ణభూషణమునాదమురా
నిర్ణయించిచూడగలోవెలి పరిపూర్ణమైనగురునాదమురా॥నా॥-136

## బంధత్రయ ప్రబోధం

కుదురుగా మెడిమచే గుహ్యంబు నొత్తితా
నధికముగ పీడించి యాకుంచనమున
చదరనీయక నపాను జలమధ్యమున నిలిచి
ముదముతో నిలువనిది మూలబంధంబు

ప॥ ఇదియె సిద్ధాంతులకునైన యనుభవసిద్ధి
ఇది తామసులకు ధరనెరుగు టెట్లగున్ను? ॥ఇ॥

పురికొల్పి రెంటియును భూతేంద్రియ మారుతము
మరియు పూరించియును మణిపూరకమున
మెరసినాభికి క్రిందుమీాదు పీడించఫణి
పరువెత్త వడ్డాణబంధమిది యగునూ ॥౧॥
కడచి చుబుకమునువంచి కంఠస్థుడైనిలచి
జడిగొన సుధారసము సరవిగ్రోలుచును
నడినాళమున జొచ్చి నాదాంతమునగూడ
బడిన జాలంధర బంధమిది యంద్రూ ॥౨॥
బంధత్రయంబులును పరికించి తీవ్రముగ
సందులేకను ప్రబలు సావిత్రితోడ
పొందుగా సమకూర్చి భూరిశాంతుడైన
బంధత్రయంబపుడె భగ్నమైపోవు ॥౩॥
సిరిమించు సాహస్రార శిఖరాగ్ర పీఠమున
పరిపూర్ణమహా జ్యోతి బయట మెరయుచును
గురుతైన పూదోట గురుని సత్పదముతా
స్థిరముగా గలసిన విదేహముక్తియగును ॥౪॥— 137

## ఆత్మ బోధ

బలిమైనసూత్రములు ప్రాణాదివాయువులు
తెలియపూసలుచుట్టు దేహేంద్రియములు
చలనమాసంసార జలధిలోక్రీడించు
నులిన జీవుని గ్రమ్మి మానసము ముంచున్
ప॥ చిత్తమను వలద్రెంచి జీవుడను మత్స్యమును
సత్తైన ఆనంద సాగరము జొచ్చున్ ॥చిత్త॥
స్థిరమనోతేజిపై దీపించి పురుషుండు
పరువడిగ సుజ్ఞాన బలము తనరగను
మెరసి పచ్చిమవీధి మించి రజతాద్రిపై
పరిశుద్ధుడై పరాత్పరుని ధ్యానించు ॥చిత్త॥

మదితోడ నన్ని చిన్మండలంబునగూర్చి
సదయుడై క్షేత్రజ్ఞ సద్గురుని కృపను
పదిలమౌ పూదోట పరమయోగినిగూడి
అది అద్వితీయమై అగణితంబగును ॥చిత్త॥—138



చలనంబులై యుండు సర్వేంద్రియములు విరివి
అరయ తా మారుతములలర స్వాంతమును
గరిమెతో మదగజము గతిదిరుగు వెలిలోను
పరికించ యెవరికా పక్షి చేబడదు

ప॥ పట్టుబడుగురు కృపను పదపక్షహీనమై
గట్టిగా మది సుధాకరుని గతి వెలుగు ॥ప॥

అతితుర్య ఫలరసం బానందమున ద్రావి
సతతమును చిద్వ్యోమ శబ్దంబు వినుచున్
మితిలేని శాంతితో మెరసి ప్రణవాంతమున
ప్రతిలేని యద్వైత పదము వీక్షించు ॥ప॥

పరమ విజ్ఞానపర పక్షములతో వేగ
తరచు శాఖల దివ్య తరువుపై కెగసి
భరితమగు పూదోట బ్రహ్మమనియెడిపండు
సరసముగ నది మ్రింగి సత్పదంబగును ॥ప॥—139

## పరమయోగి విగమ్ము

నిష్ఠతో సహాపు తా నిగుడించ వలెరా
దుష్టగుణంబుల నూలించ వలెరా
దృష్టిలోపల వెలుగు ద్రష్టను గనరా
నష్టవిధపూజల నర్చించవలెరా

ప॥ యోగివై నీ వెపుడు విలసిల్లవలెరా
భోగత్యాగివై సజ్జనుల పూజించవలెరా ॥యో॥

యోగమె సుజనోద్యోగము గదరా!
యోగమె సర్వవిరాగము గదరా!
యోగమెబిందు సంయోగమే గదరా!
యోగమె దివ్యాంత భోగము గదరా! ॥యో॥
సన్నబిలము నీవు తిన్నగ జొరరా!
చెన్నుమీరీ పండువెన్నెల తుదరా!
వెన్నముద్దతో ముక్తికన్యను గనరా!
పిన్నపడుచును గూడి వన్నె మెరయుమురా! ॥యో॥
చక్షురగ్రము మధ్యలక్ష్యంబు దెలిసియు
లక్ష్యముపై నంతర్లక్ష్యమున్ గనరా
లక్ష్యముపై నిర్లక్ష్యమై నిలరా
సాక్షివై పూదోటస్వామి నే ననరా యో॥—140

## భగవత్తత్త్వము

పరమ సద్గురుడు హృత్పద్మాంత రంగమున
అరుదుగా నచ్చోటనంటి వెలుగుచునూ
పరమస్వరాట్టగుచు భావమధ్యనునిలిచి
గురుడు ప్రణవాంగమై ఘోషించు తుదనూ
ప॥ ఇది తెలియగానలవె యిలమీద జనులకును
ఇది తెలియగాముక్తి యపుడెసిద్ధించు ॥యిది॥
నిగమాంతమున నెపుడు నిర్వాత దీపగతి
ముగురి శిరములపైని మొనసి వెలుగుచును
అగణితంబైనదిని అచలుడై వర్తించు
పగలు రేలును మించి ప్రబలు సత్కళలన్ ॥యిది॥
సరసుడై నిండుబయట సచ్చిదానందుడై
మెరసి భువనాంతమున నిండివెలుగుచును
పరికించి పూదోట బ్రహ్మంబు నంటతా
నిరుప మానందమున నిండి మెరయుటను ॥యిది॥—141

## తత్త్వోపదేశము

శివుని ముఖకళయందు సిద్ధముగ జన్మించి
భవుని దెలియగలేక ప్రకృతి రూపగుచూ
పవనములతో గూడి పంచేంద్రియంబుల గలసి
వివరించి నీ జన్మవిధము మరచితివీ

ప॥ దివము రాత్రులు దగిలి తిరిగి భ్రమయక నీవు
శివరూపు నీవగుచు జీవ నిను దెలుమీ ॥ది॥

బలిమైన సంసార బంధమున కట్టుబడి
వెలసి దుర్వ్యాసనముల వెంట దిరిగెదవూ
సొలసి జాగ్రత్స్వప్న సుషుప్తి మీరుచును నీవు
అలరు తురీయ పదమై వెలుగు జీవా ! ॥ది॥

అష్టమదముల నీవు హంకరించక యికను
యిష్టార్థ మెరిగింతు యిక ముక్తి జీవా !
సృష్టి రూపము మరచి చేష్టలన్నియు నుడిగి
నిష్టతో తెలియగను నీనె బ్రహ్మమును ॥దివ॥— 142

తలపోసి రాజదంత ద్వారమున జొచ్చి
తెలిసి భ్రూయుగ మధ్య దృష్టి చెదరకను
కళలు పదహారు శివకళతోడ నొనగూర్చి
కళల మీరిన జ్యోతికళ నీవె జీవా ! ॥దివ॥

వేదాంతరంగమున విమల సుజ్యోతిపై
పాదుక చిదానంద భావమై నీవు
ఆదియగు పూదోట యాత్మరాముని గూడి
మోదమున స్థిర శూన్యమును నీవు జీవా ! ॥దివ॥—142ఎ

## పరమయోగము

దిక్కులను మేతొాడి తీవ్రముగ సర్పంబు
మిక్కువణో పుట్టకును మగుడినటులన్

గ్రక్కునను సద్గురుని కరుణవడసినయప్పుడె
అక్కరతో నజ్ఞానమడగి లయమౌను

ప॥ అదియేలకలుగు చిదాత్మ సమరససుఖము
కదిసిబిందువును సత్కళలగూర్చకను ॥అది॥

ఘుమ్మనను భ్రమరంబు కుసుమస్వాదుకు నెగసి
హుమ్మమీరుచుజొచ్చి యంతరాళమునన్
క్రమ్మకొని పూదేనె కదిసిగ్రోలినరీతి
నెమ్మదిని వెలిగెడి నియతులకెగాక ! ॥అది॥

మండలాంతమున శశి నిండుచిత్కళలకును
అండగొనగ చకోర మరగినటులన్
కుండలితుద పరమగురుని దివ్యాంగమున
నిండుభక్తినికలియు నిపుణులకెగాక ! ॥అది॥

ఉదయగిరిమీద రవి యుదయించుకాలమున
కదలుచును చక్రవాకము లెగసినటులన్
పొదలుచును ఓంకార భూరిశబ్దమువినుచు
సదయుడై కూడు శివ శరణులకెగాక ! ॥అది॥

సంజ్ఞతో సహస్రదళ జలజాంతరంగమున
సుజ్ఞానమను పరంజ్యోతి వెలుగగను
ప్రజ్ఞతో పూదోట బ్రహ్మంబుగూడుచును
విజ్ఞానులై యున్న విమలులకెగాక ॥అది॥—143



ఊర్పులును నిగుడించి నేర్పుతో డనునిల్పి
హృన్నీరజంబున వరదర్పణంబుపై ద్రష్టయైగాక
నిల్చి నిజ జ్యోతిగని నిజగురుస్వాములను
వేదాంతమున తాను వెలసి కలయకను ?

ఫ॥ భక్తిలేకను జీవన్ముక్తి యూరకకలదె ! సద్గురుస్వామిపై
భక్తిభావములు బ్రహ్మపదంబున యుక్తినిగూర్చకయోగియెట్లగును

మాటిమాటిని మీరి మరి మాటినిబోమిాటి
మాటినంటి ముమ్మాలను వెలిగెడి కూటస్థునితా
కూడినిలువకను ॥భ॥

భానుచంద్రులపైని పరమ సత్కళలెగయ
పూనినినదమున పొందుగగురుపద
పూజసేయకను భోగముగలదే ॥భ॥

అంతరంగమునందు నానంద పదమైన
శాంత తేజమున జడిగొన నమృతము
పంతముతోతగ పానముసేయక ॥భ॥

కోమలంబైనట్టి గురుతైన పూదోట
రాముని పదములు రభసముతోడుత
ఆముక కూడుచు అగణిత మగుచును ॥భ॥—144

## చతుస్సూత్ర సిద్ధాంతం

(సర్పరజ్జు - మృగజల - శుక్తిరజత - అంబరములు)

ఇలమీాద బహుదేశికుల వెదకి శోధించి
మలినులగువారి మాయలకు జిక్కకను
తెలిసి నిర్లేపుడగు దేవుని పదాబ్జములు
చెలగిసేవించ నతనిచెంత మెలగెదనూ

ప॥ ఇదియఖండైక్య రసమిాకీలు జెప్పెదను
పదిలులై వినరయ్య బ్రహ్మనిష్ఠులును ॥ఇది॥
సరిలేని నాదుసద్గురుని సత్పదము సు
స్థిర భక్తితోనమ్మి దేశికుని కృపను
అరుదుసచరా చరములన్ని నిర్మలబుద్ధి
పరికించ సర్పరజ్జు భ్రాంతియగును ॥ఇది॥
తనరు నుపనేత్రమున తథ్యముగ బుద్ధిచే
కనుగొనగ నిగమాంతమున ప్రబలు నెపుడు

ఘనమైన వరముక్తికన్య కూటమితనకు
వనుపడగ మృగజల భ్రాంతియగు నిదియు ॥ఇది॥

నిలిచి నేశమదమాదులతోడ మెరయుచును
కలితమతి తుర్యయోగమున తీవ్రమునన్
వలసి పరమాత్మలో గలియ యావలదీని
తరపోయ శుక్తిరజిత భ్రాంతి నిజము ॥ఇది॥

గరిమె చిత్కాయమను కవచంబు విడిచినే
నరయగ నిర్గుణుండనై యంబరము రీతి
భరితమగు పూదోటపై నిరంజనుడనై
నెరయ నిరాకార నిష్క్రియుడనగుదు ॥ఇది॥—145

## అ స్థి ర జీ వి త ము

అవని జనులారా మీ యాయుసగు నూరేండ్లు
భవమొందినదిమొదలు బాల్యయవ్వనముల
దవిలి తటపటలచే తలపనేబది యేండ్లు
దివము రాత్రులచేత తెగిపోవు నిజము

ప॥ తనువు నిత్యముగాదు తలపోసి మీమదిని
మొనసి సద్గురుని పదములు కొలువుడికను ॥తను॥

తనను సతిసుత పుత్ర ధనదాన్యముల భ్రమలు
వినుడి తక్కిన యేబది యేండ్లు లయమూ
పనిబూని వృద్ధులై బహు క్లేశముల గుంది
యొనర నరకములందు వరల వలదికను ॥తను॥

చెలగి చెప్పెదను దేశికుని చరణాబ్జములు
తెలిసి నెరనమ్మి సుస్థిర భక్తియుక్తిన్
నిలిచిపూదోటపై నిగమవేద్యునిగూడి
వెలరుచు నిరాకారమై వెలుగరయ్యా! ॥తను॥—146

## సర్వము నూ బ్రహ్మమే

ఏల చెడిపోయెదరు మేలుజెప్పెదమీకు
చాలవినరయ్యా నా సద్వాక్యములును
ప్రాలుమాలకగుగుని పాదాబ్జముల నెపుడు
తాలిమితోగొల్వగను దయచేయుమోక్షం

ప॥ చాటించిచెప్పెదను జగతిపైజనులార
నీటుగానాపలుకు నెరనమ్మరయ్యా! ॥చా॥

గర్వులై సజ్జనులగాసిపెట్టకమీరు
దుర్విషయములను బోద్రోసివేడుకను
సర్వమును బ్రహ్మమని స్వానుభవముచేత
నిర్వికారులునగుచు నిలిచి కనుగొనుడీ ॥చా॥

శివయోగసిద్ధులై జితయోగులైచాల
నవిరళసుభక్తిచే నానందులగుచు
వివరించిపూదోట విశ్వసాక్షినిగూడి
భవదుఃఖములు లేక ప్రబలరోయన్నా ॥చా॥—147

## శ్రీ గురునికి శరణాగతులు

పుడమిపై జననమై పొసగ జడజీవులై
కడగండ్ల గుండలై కపటాత్ములగుచు
చెడుగు సంసారులై చెడిపోక శ్రీగురుని
కడువేడ్కతో జేరి క్రమముచే కొలుడీ!

ప॥ అలరి వినరయ్యా నాయమృత వాక్యము మదిని
తెలియ మోక్షమునకిది దివ్యాంజనంబు ॥అల॥

బలువిషయలోలురై పరసతుల కాసించి
కలసి యింతులతోడ చెలిమిసేయకను
చెలగి దేశికస్వాముల పాదపద్మములు
ఫలసి పూజలుసేయుడు భక్తియుక్తిన్ ॥అల॥

గురు చరణకంజములు వరముక్తియనినమ్మి
పరమదుష్టుల చెలిమి చేయకెప్పుడును
సరసులై పూదోట సరిమించి నిర్భయట
నరుదు సత్పదము మీరై వెలుగరన్నా ! ॥అల॥—148



ఏలచెడి పోయెదరీ యిలమీద జనులార !
మేలెఱిగించెదను మీకు నేనిపుడు
చాల భయభక్తితో సద్గురుని పదసేవ
వాలాయముగ సేయు డాలసి చెప్పెదను

ప॥ అలరి వినరయ్య నా అమృత వాక్యములు మది
తెలియ మోక్షమున కివి దివ్యాంజనములు ॥అ॥

గురుతైన విన్నాణ కొవ్వాడి కత్తితో
ధరకుల మదంబులు తెరిగి నిశ్చలులై
సరగ నీషణత్రయము జెరచి నిర్మోహమున
పరమ సాత్వికులై భావించి మీరు ॥అ॥

కలిత సంసారమను కారడవి తీవ్రమున
కలిత చిద్వహ్నిచే గాల్చి మెరయుచును
తలపోసి వాసనాత్రయము దగ్ధముజేసి
కలకలేకను మీరు క్రమముతో నిపుడు ॥అ॥

సిరులు మించిన గురుని శ్రీపాదకంజములు
నిరతంబు నర్చించి నిష్కళంకులునై
స్థిరమైన పూదోట దేశికస్వాములను
సరసి సమకూడి తుద సమ్మతులై నిలుడీ ॥అ॥—149

## నిరవలంబ పదమే శాశ్వతము

పరికించ భూలోకసుఖము పాతాళలోకములను సుఖము
పరసయూర్ధ్వలోకసుఖము లొరసి తెలియఁగను

సరగ రావియాకులకొనను నిలని జలబిందువుల పగిది
అరయ యీలోకముల భోగాలల్పంబు వినుడీ
ప॥ పరమవిజ్ఞానులైనట్టి భక్తవరులార
మరచియైన నిట్టిసుఖము; మదినిగోరకుడీ ॥పర॥
వలసి యింద్రాదిలోకసుఖము
వరబ్రహ్మలోకసుఖము
కలితవిష్ణులోకసుఖము కైలాససుఖము
తలపజీమూతమున వెడలి చెలగు విద్యుల్లేఖరీతి
నలరు యీ భువనములసుఖము లాసించవలదు ॥పర॥
కనుగొనిన నాలుగుపదవులు కలలోనైన గోరవలదు
వసర సాకారముక్తులనువర్జించి మదినిపనిబూని
నిర్గుణముక్తిభావించి పూదోట తుదను
తనరు నిరవలంబపదము నెరసినిలరయ్యా! ॥ప॥—150

---

గురుడు నాభక్తికి కొమ్మా! మెచ్చి పరమసుందరినిచ్చెనమ్మా!
పరికించ నాసాధ్విగొమ్మా! నన్నెడబాయ దెప్పుడోయమ్మా!
నిరతంబునా ఎదుట నిలిచివెలుగుచుచాల
మురిపెమలరగ నాతో ముచ్చటలాడునే!
ప॥ ఎంత బిలిచినరాదె! కొమ్మా నాతో పంతగించుక
నున్నదమ్మా! ॥ఎంత॥
ఇంతివినవె నిగమాంతమున వెలిగెడి
మంతకత్తెను నా చెంతకు తేతేవె
భక్తిచేయు నెపుడుకొమ్మా! నాదుపనులు నడప
నేర్చు నమ్మా ॥ఎంత॥
భుక్తి కమృతముబోయు కొమ్మా! సర్వభోగంబు
లొసగునోయమ్మా!
యుక్తితో నన్నెపుడు యూరడించుచునుండు
ముక్తికన్య యనెడి మోహనాంగిని దేవె ॥ఎంత॥

పరులుగానకుండ కొమ్మా! విమల పండువెన్నెల
బైటనమ్మా!
పరిపూర్ణమై యెపుడుకొమ్మా! పరమపదములో
నుండునోయమ్మా! ॥ఎంత॥

పరిపరివిధముల ప్రబలుచు నాకలికి
గరిమెమెరసి సామగానంబు సేయునే ॥ఎంత॥

వలపించిభక్తజనులను కొమ్మా! ముద్దువనజాక్షి
బిలుచునోయమ్మా!
మొలకనవ్వులతోను కొమ్మా! గురుసుతుల యలక
దీర్చును దయనోయమ్మా! ॥ఎంత॥

అలరుకేవల బ్రహ్మమనెడి పెన్నిధిచాల
వలచి యల్లదియనుచు తెలియజూపునమ్మ ॥ఎంత॥

సగుణమై శోభిల్లు కొమ్మా! చాలనిర్గుణియై
యుండునమ్మా!
సగుణ నిర్గుణములకు కొమ్మా! నేను
సాక్షినైయుండునో యమ్మా ॥ఎంత॥

మిగిలి పూదోటపై వగలు మీరుచు నెపుడు
సగణితానందమున అమృతుడనైయుండు ॥ఎంత॥—151



ఒనర క్షేత్రములన్ని యొక్క పృధివినిగాదె
తనరు తీర్థములొక్క వసధి జలమగును
ఘనవేల్పులేమైన కఠిన శిలలునుగాదె
మనమలర దానమెందును సేయనొకటె

ప॥ తలప యీ్యభ్రమల నిశ్చల మోక్షమును లేదు
తెలియ గురుకృపను సుస్థిర బ్రహ్మమగును ॥తల॥

ధగనదుల స్నానంబులరయ జలమెక్కటే
వరుస మంత్రములు పెక్కొక్కటె శబ్దంబు

అలపూజలెన్నైన అర్చించుటొక్కటే
తరుచుగా మ్రొక్కుతుద దండములు నొకటే
అమితశృతి శాస్త్రములఅచల ప్రణవంబొకటె
క్రమయోగములుపెక్కు కడయోగ మొకటె
అమరి పూదోటపై సక్షలితుడైనట్టి
విమలమగు గురుడొకడె వినుడి జనులారా ||తల||—152

## తత్త్వబోధ

సృష్టిపై సుజనూల సేవించవలెరా!
నిష్ఠతో సద్గురుని నెరనమ్మవలెరా!
కష్టభవాదుల ఖండించవలెరా!
ద్రష్టలపై సర్వ ద్రష్టను గనరా!
ప॥ భక్తిచే నిర్గుణ బ్రహ్మపదములు రా!
యుక్తిచే పూజించి ముక్తిచేకొనరా! ||భ||
విజ్ఞానజ్యోతిని వెలిగించవలెరా!
అజ్ఞాన బలముల నణగించవలెరా!
సంజ్ఞతో శివయోగి జాడెరుగ వలెరా!
ప్రజ్ఞతో నిగమాంత పథమూన జనరా ||భ||
పెనగొన్న తనువులు భేదించవలెరా!
మొనసి చిదారణ్యమును దాటవలెరా!
పరగ పూదోట స్వామిని గూడవలెరా!
తనరి కేవల శూన్యతత్త్వమై నిలరా! ||భక్తి||—153

బలుచీకటింటిలోపల దివ్వెబెట్టినను
మలినమగు తమమపుడె పొలసియున్నటులన్
తెలివినినదము కర్ణముల గోచరించినయపుడె
తొలగి యజ్ఞానమునుదూగమై యుపను

ప॥ ఇదిసత్యమగు వినుడి ఇలమీాదజనులార !
ఇది తెలియ బ్రహ్మైక్యమిపుడె సిద్ధించు ||ఇ||

దినకరుండుదయించ తిమిరమణగినరీతి
ఘనతనాదము బిందుకళలవిరచితమై
కనుగొనగ పరంజ్యోతి మెనస్ప్రకాసించ
తనుగుణంబులు నపుడె దగ్ధమైపోవు ||ఇ||

అరదు అంతర్లక్ష్యమను పర్వతము తుది
నెరయుచిద్బింబమును నిలిచి ప్రబలగను
పరికించ పూదోటపై బట్టబయలునై
నిరవయ నిరాకార గురుడుకనుపడును ||ఇ||—154

## జ్ఞా న య జ్ఞ ము

తెలిసి పురుషుండాత్మ తీర్థమగు స్నానమును
చెలగిసేయుచు విమల శీలుడై మరియు
వలసి భక్తిజ్ఞానవైరాగ్య శాంతులును
నిలిచి విప్రులు వేదములు చదువవేడ్కన్

ప॥ ఇది జ్ఞానయజ్ఞమగు నిదిముక్తి సాధనము
ముదముతో వినరయ్య మునివరులారా ! ॥ఇది॥

వనస సాహస్రదళ వనజంబు వేదికయ
గురుతుబింపువు హోమగుండమగు నడుమ
మరి పరంజ్యోతనెడి మంత్రాగ్ని ప్రబలగను
సరసవేల్పులు సోమపాత్రలో మెలగన్ ॥ఇది॥

వనరభూతేంద్రియములు సమిధలుగజేసి
తనరు ఘృతమును సర్వద్రవ్యములొసంగి
పనిబూని పురుషుడును ప్రణవమంత్రముతోడ
అనలంబులో జీవపశువు వేల్చనగును ॥ఇది॥

సారదిశశిసారమగు సోమపానము జేసి
యలరిసుజనులకు దివ్యాన్నమును బెట్టి
వరస తాంబూలాదు లొసగ సుజనులును
మెరసిపొగడుచు మోక్షపురము జేరుదురా ॥ఇది॥
అతితుర్యభక్తితో నమృతాబ్ధిలో మునిగి
జితకల్మషుండగుచు చిత్పురుషుడపుడూ
మితిలేని పూదోట మించి గురునికి మ్రొక్కి
ప్రతిలేని నిర్గుణ బ్రహ్మమై వెలుగున్ ॥ఇది॥—155

## (తత్త్వమసి) ఆత్మబోధ

అలరు తత్పద త్వంపద అసి పదంబులకీలు
తెలియ విస్తారముగ తేటపరచెదను
అలదేవ దత్తమగు నమృత పదమున వెడలి
నిలిచి తత్పదమనెడి నిజలక్ష్యమగును
ప॥ అరయగా నిది యఖండైక్య రసమగు వినుడీ
పరికించి చెప్పెదను భక్తవరులారా! ॥అర॥
కనుగొనగ నాపదంబున నంతర్లక్ష్య
మనెడి కన్యక యుదయమై ప్రకాసించున్
మనమలర దానిలో మహదాది జగములును
తనరుచును జననమై దట్టమై ప్రబలూ ॥అర॥
మలిన జీవుడును చిన్మయునందు ప్రభవించి
తలపనంతఃకరణ దర్పణంబున వలసి
ప్రతిబింబమై వనర త్వంపదమునై
కలిత సచరాచరములును చొచ్చిమెలగు ॥అర॥
గురుని కృపనాత్ముడును పరమ యోగము దెలసి
మెరసి మాయలరెంటి మించి యసి పదమై
సరస పురుషద్వయము సత్పదంబున గూడి
నెరయ వెలసిన యపుడె నిర్లక్ష్యమగును ॥అర॥

తలపు మరపులు మీారి తాఁశూన్య తత్త్వమై
బలసి నద్వితీయమగు బ్రహ్మమగు వినుకీ
చెలగి పూదోట కడ చిరనిరామయుడనై
వెలగుచును నే నుభయములకు సాక్షినగుదూ ॥అర॥—156

---

వరశాస్త్రనిపుణులకు వర్ణాశ్రమాదులకు
గరిమెనష్టాంగ యోగాభ్యాసులకును
మరిసిద్ధపురుషులకు మతవేషధారులకు
పరికించ జప తపో బహుమాంత్రికులకు

ప॥ అల యద్వితీయ బ్రహ్మైక్యమును వీరలకు
తలపోయగా లేదు ధరసుజనులారా ॥అల॥

శతమఖుడునాదిగా సర్వసురనికరమునకు
గతమలినులైన ఋషి గణములకునూ
అతిశాంతులైన సనకాదిహానులును
సగుణమతమునమ్మి యఖండసార మెరుగరును ॥అ॥

తెలియనైరి మూర్తులకు దివ్యమగుప్రణవమున
కలుశ్రుతిబృందమున కచలనిర్గుణికీ
కలిత చిన్మయునికి కడపువ్వదోటపై
మెలగు సత్పదకూటమిని కలిగి లేదు ॥అల॥—157

---

కర్మమున నుదయించు ఘనజీవ కోటులును
కర్మమున వర్ధిల్లు కడు చిత్రిములై
కర్మధర్మంబులును కడకుజిమ్మిన యపుడు
కర్మరహితమునైన ఘనుడు కనుపడును

ప। సర్వజ్ఞులార నే సత్యముగ చెప్పెదను
నిర్వాణ పదమిపుడె నెరబట్టబయలా ॥సర్వ॥

వాసనలె సంసారమూహించి చూడగను
వాసనలె భవదుఃఖ వననిధియగు మరియూ
వాసనలె పురుషునికి వనర బంధకములగు
వాసనలుదెగిన నిర్వాసనుడె యగునూ ॥సర్వ॥

సర్వమజ్ఞానమున సంభవించును నణగు
సర్వశూన్యమునంటు సగుణ నిర్గుణుడై
సర్వపరిపూర్ణుడై సరిమించి పూదోట
సర్వసాక్షియెపుడు సద్గురుడు వెలుగన్ ॥సర్వ॥—158

ఆపదల సంపదల నానంద మొందకను
పాపపుణ్యములచే పట్టుబడకెపుడూ
దీపించు శ్రీగురుని దివ్యపాదాబ్జముల
దాపుజేరిన సతడు దయసేయు మోక్షం

ప॥ సుజ్ఞానమగు దివ్యసుందరాంగినిగూడి
అజ్ఞానమైనట్టి యజ్ఞాతి విడుడీ ॥సు॥

వలసి దేసికు కృపను వరభక్తి యుక్తిచే
చెలగిద్వంద్వములన్ని ఛేదించితుదను
తలపులోపల మెలగు తారకబ్రహ్మంబు
తెలిసినిర్మలులగుచు నిలిచిమెరయుచును ॥సు॥

అతితుర్యమైనట్టి అంబరము మీరుచును
మతిమంతులై గురుని మరువకెప్పుడును
హితవుతో పూదోట జితకల్మషునిగూడి
ప్రతిలేని నిర్గుణ బ్రహ్మమై నిలుడీ ॥సు॥—159

అరుదందగను విశిష్టాద్వైతమును మీరు
పరికించి మదిలోను పరగవీక్షించీ

దురితమగునజ్ఞాన తోయజాక్షినిమీరి
నెరియచిన్మయులగుచు నిలువరోయన్నా !

ప॥ సత్యమనినాపలుకు చాలనెరనమ్మితే
అత్యుత్తమంబు బ్రహ్మైక్యమునుగలుగూ ॥స।

కపటుడై నట్టి హంకారరిపు బోదరిమి
చపలముడిగియు, జ్ఞానసఖునిచేపట్టి
విపరీతమైనట్టి విషయబలములదృంచి
అపరిమితశాంతమున నిపుణులైనిలుడీ ।సత॥

తనువులైదునుమీరి తలుపుమరపులుడిమించి
తనరుచు నిరాకార తత్త్వమునుగూడి
వసరవూదోట దేవునిస్వస్వరూపమై
జనన మరణములులేక నిలువరయ్యా ॥సత్య॥—160

---

దినకరుని యందు వరదీప్తి వెడలినరీతి
ఘనరత్నముల కాంతులు బాడముగతిని
వనర రాతిలోమంచి వజ్రమును బుట్టుక్రియ
మొనసిశుక్తిని ముత్యమును వెడలుపగిది

ప॥ ఇల నిరంజలింగ మీరీతి నుదయమై
మలిన మంటకను నిర్మలుడునై మెలంగూ ॥ఇల॥

సరసిజాంతకునందు సత్కళలు వెడలుక్రియ
సిరిమించి కాష్టముల శిఖవెడలు నటులున్
అరయకస్తూరి మృగమందు జనించుక్రియ
గరిమెసుమముల స్వాదు గమనించు పగిది ॥ఇ॥

బురదలో పద్మమును పొసగి జనియించుగతి
శరధిలో నమృతము చనుదెంచురీతి
వరకౌస్తుభమణియు వనధిలో బుట్టుక్రియా
పరగ పుష్పులోపట్టు వెడలుపగిది ॥ఇల॥

తనరు వనమున కల్పతరువు బుట్టినవిధము
వినుడి పరుసము పృథివిలో వెడలునట్లున్
ఘనసారమును సరటిగడ్డలో బుట్టుక్రియ
కినిసిసంజీవి గిరులను మొలచువిధము ॥ఇల॥
లలిత జనులహృదయ జలజాంత రంగమున
బలిమిస్వయంజ్యోతి ప్రబలు క్రియమరియున్
అలరు చిద్బీజమున కవల పూదోట కడ
నిలిచి నిర్భయలునై నేప్రకాశింతు ॥ఇ॥—161

ప్రణవసాదన

ఇలను నూడుగ బీజములు మేఘ గర్జనకు
నలరి చివ్వున వృక్షమంటు విధమునను
నిలచి ప్రణవమువింట నిజగురుని వీక్షించి
తలపుగలసిన నుభయద్వనినష్ట మగును
ప॥ గురు పుత్రులీరీతి కూడిపర తత్త్వమును
నిరుపమానందమున నిల్చి మెరయవలెను ॥గురు॥
మరిచకోరంబిందు మండలంబున కెగసి
పరికించి శశికళలు బక్షించినటులన్
అరుదునిటలోర్ధ్వమున నమృతపానివై మరియు
స్థిరునంట పద్రుచులు శిథిలమైపోవున్ ॥గురు॥
శుకము చివ్వున నెగసి చూత ఫలరుచులుగాని
అకళంక తరువుపై అలరియున్నట్లున్
ప్రకటముగ పూదోట బ్రహ్మంబుగూడిమది
వికల మించుకలేక వెలుగు నెప్పుడును ॥గురు॥—162

అవస్థాత్రయ ముక్తి వివరణ

సరసి జాప్తుడు పూర్వగిరిపై ప్రకాశించ
సిరిదప్పి కల్వగవ సిగ్గుపడినటులన్

స్థిరమైన విజ్ఞాన చిత్కిరణు డుదయించ
నరయ జాగ్రదవస్థ యపుడె లయమౌను

ప॥ అపుడు జీవాత్మ పరమాత్మగూడును
యోగనిపుణులైయున్నట్టి నిర్వాణులారా ! ॥అ॥

అరయ కల్పాల ప్రియుండంబరంబున మెరయ
జలజములు ముకుళించి జవముడిగినటులన్
పొలుపైనమదిని ప్రభోధ చంద్రుడు ప్రబల
తలచస్వప్నావస్థ దగ్ధమైపోవున్ ॥అ॥

భరిత శంకరుకంట పావకుండుదయించ
నెరమంటలను జగము కరగిపోయినటులన్
పరికించి పూదోట బ్రహ్మంబు వెలిగినను
దొరయు సుషుప్త్యవస్థ తొలగిపరువెత్తున్ ॥అ॥—168

## ఆ త్మ బో ధ

పరికించనద్వైత పదమున నుదయుడై
తిరిగిజీవుడు బిందుస్థితికి నేత్రములన్
మమతవిశ్వముజూచి మలపు దేహమునమ్మి
వేదాంతమగునిజ విమలాత్మమరచూ

ప॥ దివమురాత్రులుదిరిగి తెలిసిగురుకృపజీవి
వివరించ తనుదెలియ విమలాత్ముడగును ॥దివ॥

సలరిసాహస్రమున సమిత తేజోదీప్తి
నిండ ఋగ్వేదమగునా 'అ' కారమునన్
వెలగి స్వాత్మగుణంబు పరగప్రాజ్ఞుడునై
చెలగి సుషుప్తినిగాఢ చిత్తమునమునిగీ ॥దివ॥

తలచకంఠస్థుడై ధవళవర్ణపుచెలువు
కలసియజుర్వేద ఘన 'ఉ' కారమునన్

నిలిచిసత్త్వగుణంబు నొలసితైజసు పేర
నలరి స్వప్నావస్థలనుభవింపుచును ॥దివ॥

గరిమెహృదయస్థలపు కారణతమోగుణా
వరుగను 'మ' కారహా సామమున నిలచి
మరికృష్ణవర్ణమై మెరసి ప్రాజ్ఞుని పేర
సొరదిసుప్తినిమునిగి సాక్షితనువరచున్ ॥దివ॥

గుణత్రయంబునుమించి గురిమహాకారణము
ఘనసత్త్వవర్ణమై కనకాంబుజమునన్
కణగియధర్వణోంకార మాత్రనుగలసి
మొనసితుర్యని నామమున నాత్మవెలగు ॥దివ॥

అకలంకమగు జ్యోతికవల సతితుర్యమై
ప్రకటమగు పూదోట పరమసద్గురుని
సుకరమగు సద్భక్తి సొంపుతో సమకూడి
సకలరూపములతుద సాక్షియైప్రబలున్ ॥దివ॥—164



గురుయోగమున మనసుగూర్చి మెరయుచును
పరులు నెన్నగ తాను బ్రతుకుట నిజము
పరుని కీర్తనలు తా ప్రకటముగ బలికి
గురిమించి తానూరకున్న దే నిజము

ప॥ విన్నవించగ నేల వేదాంతమునను
తన్ను తాగన నిజము తత్త్వజ్ఞులారా ॥విన్న॥

చెలగి హంసలగూర్చి జలజమధ్యమున
నిలిచి చరియించిన నిర్వాణితానె
వలసి బ్రహ్మానంద వార్ధిలోజొచ్చి
తలచి యోలలాడ తానె నిజహాను ॥విన్న॥

పరమ పదమునతాను పరమ హంసగుచూ
స్థిరంబైనిల్పిన తాను శివయోగియగుసూ

గురుతైన పూదోట గురుని నేనంటి
పరమ తారకమై తా ప్రబలుచే నిజము ॥విన్న॥—165

## ఓంకారముయొక్క ప్రశస్తి

కోరగాని సప్తకోటి మంత్రములలో
అరుదైన ప్రణవ మంత్రంబధికమగును
తరుచు వర్ణములపై దశశబ్ధములతోడ
అరుదైన జ్యోతిముఖమున నిలచిపలుకు

ప॥ ఎంత యద్భుతమిది ఎంచి చూడగమదిని
రంతుసేయుచు బయట రమ్యమై తనరున్ ॥ఎం॥

కుడిఎడమ బల్కుచును గోచరంబై యెపుడు
నడిమింట నద్భుతోన్నత కళలలరన్
జడిగొనుచు నమృతము చెలగి గురియంగాను
చెడని పదమగుచు జలజాంతమున ప్రబలు ॥ఎం॥

ముగురు మూర్తులకవల మొనసియనంతమున
నిగమాంతరంగమున నిండివెలుగుచును
సుగుణమగు పూదోట సుందరాంగునిచెంత
నగుముఖంబున నింతి నయముతో మెలగున్ ॥ఎం॥—166



జనన మరణములేక సచ్చిదానందుడై
దినకరునిగతి బయట తేజరిల్లుచును
మనసుతోడను గూడి మతి దప్పి జీవుడును
కనుచెదరినపుడె త్రైకాయుడై నిలుచున్

ప॥ గురుని పాదాబ్జములు గురుతెరుంగక కదా
పరికించగా త్రివిధ బంధములు గలిగెన్
పంచభూతములైన ప్రకృతి యింటిలో జొచ్చి
షంచెకన్నెం గూడి ప్రవర్తింపుచును

పంచవింశతి తత్త్వ భరిత సతులను బెనగి
సంచరించుచు మహదాది జగములను చెలగి ।।గురు।।
అష్టమదముల జిక్కి యాశలను పొరలుచును
ఇష్టమును తనమదిని ఎరుగ నేరకను
కష్టుడై విషయ భోగముల భ్రాంతినిదిరుగు
ద్రష్టయైయున్న తన తనువు దెలియకను ।।గురు।।
నలుగురును మంత్రులును కలసి జీవాత్ముడును
చెలగి మర్కటముగతి చలన వృత్తిలను
అలపుణ్యాపాపంబు లనుభవింపుచు నెపుడు
నిలిచి తన మదిలోని నిజము దెలియడును ।।గురు।।
పరువు లెత్తుచు మనో పవనముల గూడియును
తిరుగు శునకము గతిని తీవ్ర వ్యసనములన్
తరుచు సతులను గూడి తనిబోక పురుషుండు
స్థిరమైన తన యమృత దేహమును మరచున్ ।।గురు।।
ఆశపాశలద్రుంచి యాత్మారాముని కృపను
త్రోసి కుండలి కంట దూటి తీవ్రమునన్
కాశీస్థలమునందు క్రమతో నిలిచి తుద
భాసిల్లు అసిపద ప్రాప్తి దెలియడునూ ।।గురు।।
జలదికడ సహస్రదళ జలజాంతరంగమున
పొలుపలరుచున్న నద్భుత జ్యోతిమించి
తెలిసి యతి తుర్య దేహంబు సరిమించి
వలసి పూదోట స్వాముల గలియలేడు ।।గురు।।—167

## సుజ్ఞాన సోమయాగం

సుజ్ఞానమగుచు తా సోమయాజైనిలిచి
అజ్ఞానమను పశువు నమరబట్టుచును
అగ్నిముఖమునపశువు నమరనాహుతిజేసి
ప్రజ్ఞతోడుత సోమపానంబుగొనుచు

ప॥ నడజీవులనుజంప న్యాయమా! శరణులకు
నెడ తెగక శివధ్యానమెపుడు జేయకను ॥నడ॥

అష్టమదములను బ్రహ్మాగ్నిలోబడవైచి
నిష్టతో కర్మములు నీరుగాజేసి
చేష్టలుడిగిందు ప్రసిద్ధగుండమునుజొచ్చి
ఇష్టలింగమునంటి హితవు తెలియకను ॥నడ॥

కనుగొనలతుదదివ్య ఘనతేజరూపమై
ఘనతవిమలజ్యోతి కడను మెరయుచును
పనిబూనిపూదోట బ్రహ్మపదమంటి కా
నణగియున్నని జెందె క్రమము తెలియకను ॥నడ॥—168

## ఆత్మ తత్త్వ బోధ

పంచభూతముల ప్రబలజేయునుతుద
పంచేంద్రియముల పనులునడుపునయ్య రామవాక్యం
పంచబ్రహ్మల పంచతావుల నిలుపునే రామవాక్యం
పంచాక్షరములపై ప్రణవమై యుండునే రామవాక్యం
కర్ణికా మధ్యమున కదలక యుండునే రామవాక్యం
పూర్ణజ్యోతితుద పొంగివెలుగుచునుండు రామవాక్యం
కలుష సంఘములన్ని ఖండించివేయునే రామవాక్యం
అలరికాలాతీతమై కలయకుండునే రామవాక్యం
కలిగినవారికి కానరాకుండునే రామవాక్యం
కలిమిలేనివారి క్రమముతో రక్షించు రామవాక్యం
అంటిచూడమదిని అద్భుతమైయుండు రామవాక్యం
అంటిముజ్జగములకవల వెలుగూనయ్య రామవాక్యం
జంటగిరులపైని సాక్షియై యుండునే రామవాక్యం
అంటి జలజమధ్య అమృత పథమైయుండు రామవాక్యం
ప్రేమాతో నిరతము పేర్చి వెలుగునయ్య రామవాక్యం
కామధేనువు రీతి క్రమముతో సిరులిచ్చు రామవాక్యం

కోమలమగు జ్యోతి కొనను మెలగుచుయ్య రామవాక్యం
ఆముక లోవెలి అంటి ప్రబలుచునుండు రామవాక్యం
పరమహంసై తేజోబయట ప్రకాశించు రామవాక్యం
పరమకారణ రూపై ప్రజ్వరిల్లుచునుండు రామవాక్యం
పరమామృత కన్యను బాయదు పూదోట రామవాక్యం
పరికించి నిర్గుణ బ్రహ్మమంటగూర్చ రామవాక్యం 169

## తాండవ నృత్యము

చక్కనీ గురునంఘ్రిని బుట్టిన
ఎక్కువ జలములనూ
గ్రక్కున మునుగుచు చిక్కువీడగ
తన చొక్కపు దేహము మిక్కిలి మెరయగనూ

ప॥ కంచికి బోనేలె వేల్పుల పొంచిచూడనేలే
పంచవర్ణముల మించు తేజమున
ఎంచి గురుని భావించి చూచితే ॥కం॥

దృష్టిద్వయముపై నిర్మలదృష్టిలో 'గురుపదము'
నష్టపుష్పముల నిష్టభక్తిచే
నిష్టతో పూజలు ద్రష్టైచేసితే ॥కం॥

కంటి కవాటములు మూసియు
మింట్రెతోవ నురికి యింటను నమృతము
నంట్రెగోలి నడిమింట మెరయు కలకంఠిని బొందితే ॥కం॥

మెండుగ చిత్కళలు మదిలోనింపి వెలగగను
పండువెన్నెలయు నండను జేసుచు
కుండలి శిరముల తాండవమాడితే ॥కం॥

పట్టపగలుగాను మోక్షము
చుట్టెప్రబలగాను
అట్టెజ్యోతిపై అలపూదోటను
గట్టిగ రాముని పట్టి వెలిగితే ॥కం॥—170

ఒంటి పృథివిమీద నంటి జలములున్నవి
ఒంటి జలములమీద నంటి యగ్నియున్నది
ఒంటి నగ్నిమీద నంటి వాతమున్నది
ఒంటి వాతముమీద నంటి గగనమున్నది

ప॥ ఎన్నియైతివెమాయ యిన్నిరూపుల
వన్నెమీరుచు గురునివద్ద కావలుండువె ॥ఎన్ని॥
జంట చక్రములపై ఒంటి స్తంభమున్నది
ఒంటి స్తంభముమీద వనితయున్నది
ఒంటి వనిత శిరముపై కంటి జ్వాలలున్నవి
కంటి జ్వాలలమీద నొంటి సుమంబున్నది ॥ఎన్ని॥
ఒంటి సుమముమీద నంటి కళలున్నవి
అంటికళమీద నొంటియమృతమున్నది
ఒంటి యమృతముమీద నంటి జ్యోతియున్నది
అంటిజ్యోతిపై పూదోట అభవుడున్నాడు ॥ఎన్ని॥—171

## చిలుక తత్త్వము

పగలమేఘమురీతి, కప్పియుండినమాయ
నొంటిపదమునజిమ్ము చిలుకా
పగవారలైన పదినలుగురునిసరిమించి
పైతరువుననున్నవాలు చిలుకా
నిగమగోచరమైన శృంగారవనములో
నిలువకను నదిగడచిచిలుకా
సగుణనిర్గుణమైన సద్గురునిపాదములు
చాలసేవించవే చిలుకా
చక్కగానీఎదుట విజ్ఞానగూటిలో
చయ్యననుజొరగదవె చిలుకా
చొక్కమగుజ్యోతి పంజరములోపలనిలిచి
సొంపుమెరయవె రామచిలుకా ॥చ॥

చ॥ అజ్ఞానమను నైదు మూడు తావులుమీరి
ఆరుసిరులను మించుచిలుకా
ప్రజ్ఞమెరయుచు కాలుడను పిల్లిసీకొరకు
బహుపొంచియున్నాడు చిలుకా
విజ్ఞానమను స్వర్ణశాఖపై నీవెపుడు
వేడ్కగదలకనుండు చిలుకా
సుజ్ఞానమగు నాలుగాను స్వరములనీవు
చోద్యముగ బలుకవేచిలుకా ॥చ॥

మూడుసెలలునుదాటి మూటిమోటునను
ముమ్మూలసెలకెగయవే చిలుకా
మూడు మూడూరుచుల మూలమగు
ఫలరసము మోదమునద్రావవేచిలుకా
వేడుకతో నిర్బైట నేకాక్షరము గనుము
వేదాంతరూపమై చిలుకా
వాడకను పూదోట వరయోగిపుంగవుని
వలసికూడవె రామచిలుకా ॥చక్క ॥—172

## ఎరుక (తత్త్వము)

పట్టి వినవె ముక్తి జనులమదిని యెడబాయ కుండెడి
యెరుక జెప్పెనే
గట్టిగ గుణములు ఖండించి చెదరక కడువేడ్కతో
నీవు నిలువవే
ఘంటారవము వింటసంటి జిహ్వను రుచులు
కడకంటె దృష్టిని జూడవే
అంటి నీటి మధ్య నకలంకమై వెలుగు
నాత్మరాముని నీవు గూడవే

ప॥ దండి ఎరుక నడుగవే చెప్పెదను హా
యెరుక సర్వము మింగి ఎరుకలోపల నిలిచి

యెలమి ప్రకాశించు యెరుకా!
నిరతము సుజనుల నిటలాంతమున చాల
నిండి వెలిగెడి స్వాత్మ యెరుకా! ||దండి||
పగలు రేలును గట్టి ప్రాణ పానులగూర్చి
ఫణిరాజు నెగయించవే
బెగడక ముప్పదియూరు తత్త్వంబులను బిందుతోడను గూర్చవే
సుగుణ దృష్టిని నీవు సూక్ష్మ వీధినజొచ్చి
సూర్య చంద్రుల మీరవే
నిగమాంతరంగమున నిలిచి ప్రకాశించు
జగదాత్ముని నీవు గూడవే ||దం||
కరుణతో సద్భక్తి గలిగియుండిన గురుని
కరతలా మలకముగ జూపేనే
విరినైన హంసల నయనాగ్రమున గూర్చి
విరజానదిని నోలలాడవే
అరుదుగ నీ హృదయాబ్జ కర్ణికపైని
యానందమున నీవు నిలువవే
అరవిందనయన నీవంతర్జ్యోతి తుదను
నతితుర్య పురుషుని దెలియవే ||దం||
మున్ను నీవంటి గరితెలకు నేను
మూలమైన ఎరుక జెప్పితినే
ఎన్నటికినీ నన్నె నమ్మియుండిన
యిపుడేకముగ బ్రహ్మమును జూపెదనే
కన్నె వినవె నాపలుకు సత్యమనుచు
గట్టిగ శిరముపై నుంచవే
నన్నె మీరుచు నీవు వరరాజయోగినీ
వాలాయముగ నిపుడు కూడవే ||దం||
అక్కరతో నన్ను అడిగిన ముచ్చట
నరలేక నీకునే జెప్పెదనే

ముక్కంటి మొదలైన ముగ్గురు మూర్తులకు
మొనసి యందరాని యెరుక
గ్రక్కున విభుడును కదసి సంతోషమున
కదలక నీ ఎదుట నిలుచునే
తక్కు పిక్కులు లేక నన్ను నమ్మిన ముక్తి
దాతను నిన్నిపుడు గూర్చెనే ॥దం॥

సకలాత్మమై మెరయు సహజానందూడైన
సత్య పదార్థము జూపేనే
శుకశౌనకాది ముని జనుల మదిలోన
సొంపు మెరసెడి నిజ యెరుక
అకళంకమై నాదబిందు కళలా తుద
నద్భుతమై తనరు యెరుక
ప్రకటమైన లోబయట నిలిచి వెలుగు
పరమగురునీ నిన్ను గూర్చెనే ॥దం॥

గురుతుగా నీ మదిని కోరిన విధమెల్ల
కొమ్మరో నీకునే జెప్పేనే
పరమ నిధానమగు బ్రహ్మమాతంకని
పరికించి నీ కిపుడు జూపేనే
నిరతమూ నీలతోయద మధ్య వెలిగెడి
నిగమాంత వేద్యమగు నెరుక
పరమ యోగీంద్రుల పట్టుగొామ్మెయున్న
పరమ పదరాజును జూపేనే ॥దం॥

నిండు భక్తిని భక్తకోటులు తమ మదిని
నిలిచి చూచెడి మేలుజెప్పేనే
అండపిండాండమూలాముకొని నిర్భైట
అంటివెలిగెడి మేటియెరుక
దండి తేజముమించి తరలక నెప్పుడూ
నిండి పండిన యెరుకజెప్పేనే

నిండు మెరుపుల చిన్మండలమునగురుని
నెలతరో నిన్నునే గూర్చెనే ॥దం॥
చతుష్పదవులుమించి మితిలేనివస్తువై
చెలగుచుండెడిమేలుజెప్పెనే
ప్రతిలేనికైవల్యపదమున మెరసెడి
ప్రభునిరంజనయోగి గూడవే
అతివరో పూదోట రాముని పదమున
సతడెనీవైనిలిచి మెలగవే
సతత మద్వైతమై సగుణరూపులపైని
సర్వసాక్షిగ నిల్చిప్రబలవె ॥దండి॥—173

## ఆ త్మ బో ధ

మొదట నిష్కళ బ్రహ్మముఖ కళను నుదయమై
సదమల జ్ఞానమై పొంగినెలుగుచునూ
మదిభ్రమసి జీవుడును మనసులో వలగలసి
అదనుతో పురుష వీర్యమున నిలచియును

ప॥ చలనంబుుడిగి నిశ్చలనుడై జీవుండు
నిలచి తనుదాజూడ నిర్గుణుండగునూ ॥చల॥
కలసి సతిపతుల రతికాలమున గమనించ
నిలచి సతియుదరమున నిశ్చలుండగుచున్
పలవరింపుచు యూర్ధ్వభావమై జీవితన
తలపులోన పూర్వ (పరిపూర్ణ) తనువు చింతించు ॥చల॥
తరలకను బ్రహ్మరంధ్రంబు బయలుపరచుకొని
అరయు ఘంటారవం బాలకింపుచును
సిరిలొలుకు చిత్కళలు శీఘ్రముగ గనుగొనుచు
నిరతమును సుధారసము నిలిచి త్రావుచును ॥చల॥
పదిలుడై జీవాత్మ పరిపూర్ణ దృష్టిచే
ఛైదరకను లోబయఃట ఛెలగిచూడగను

ఎదుట నాపోజ్యోతి తుదను వెలుగుచునున్న
అదిగో జీవుడు గురుని యంటిచూడగను ||చల||
నల్లి శల్యాదిగా సప్తధాతువులతో
పిల్లయై అంగములు పెరుగగా మరియున్
తృళ్ళి దశమాసములు వెళ్ళినంతనె జీవి
తల్ల క్రిందైపడును ధరమాయతముచే ||చల||
మరి జ్ఞానశూన్యుడై మాతృగర్భము వెడలి
పర తెంచి మహిలోను ప్రకృతిదేహియై
తరుణి పోషించగను తరుచు తత్త్వములతో
పెరుగు జీవుడు దేహ పెంపు దీపించన్ ||చల||
శివజీవుడై జనుల సృష్టిలోగలయకను
వివరింప తనపూర్వ విజ్ఞాన మెరిగి
దివము రాత్రులుయిమించి స్థిరయోగి కృపను తా
వివరించ సత్పదము వీక్షించి మదిని ||చల||
భుజగపతి నెగయించి భ్రూమధ్యమున జొచ్చి
అజపదంబున మనసు నంటగూర్చియునూ
నిజమైన సత్కళలు నిలచి వీక్షింపుచును
భజన సేయుచు గురుని భక్తియుక్తులను ||చల||
అష్ట ప్రకృతులపైని అమిత ప్రకాశమై
ద్రష్టయై నిర్బైట తరల కెప్పుడునూ
నిష్టతో పూదోట నిష్కళంకునిగూడ
చేష్టలును యుడిగి సుస్థిర శూన్యమగుడున్ ||చల||—174

## తత్త్వ స్వరూపము

కదిసి కమఠముపై నష్టగజములున్నవి
కుదురుగ కరులపైని నిలచి కుండలియున్నది
పొదలుచునహిమీద నిలచి భూమియున్నది
అదిగో ధరపైనిలచి కోటి అమితమైనది

ప॥ కంటి నమ్మా! పరమపదము కన్నుగొనలందున్
వింటినమ్మా! ఘంటారావము వీనులయందున్ ॥కంటి॥
షష్ఠసుమములపై కనక స్తంభమున్నది
నిష్ఠతో జలరాసి మధ్య నిలచియున్నది
యిష్టమగు స్తంభముపైని యింతియున్నది
ఒంటి కుసుమముపై నిందు డుదయించుచుండె
మింటనిందు రాజుపై జ్యోతి మెరయుచున్నది
అంటి జ్యోతిపై పూదోట అయ్యాయున్నాడు ॥కంటి॥ —175

## చిలుకా! గీతము

అతితుర్య పథమున చిలుకా!
నీవు అద్భుత జ్యోతివై చిలుకా!
ప్రతిదినము గురునితో చిలుకా!
నీవు భాషింతువే। రామచిలుకా!
ప। పంచవర్ణములపై చిలుకా! విషయ
ఫలవాంఛ గోరకే చిలుకా!
పొంచియముడనుపిల్లి చిలుకా!
నిన్ను త్రుంచ దిగుగునె రామచిలుకా! ॥పంచ॥
విశదంపు కాశిలో చిలుకా! నానా
విధమైన వనమందు చిలుకా!
పసిడి యాకలు వెలుగ చిలుకా! దివ్య
పంజరములో రామచిలుకా! ॥పంచ॥
పరికించి నినుజూడ చిలుకా!
నీవు ప్రణవస్వరూపమై చిలుకా!
మెరసి నిగమాంతమున చిలుకా!
నీవు తరుచుగ బలుకవే చిలుకా! ॥పంచ॥
నిజగురుని సెలవుచే చిలుకా!
నీవు నిలిచి మనోరూపమై చిలుకా!

సృజియించి ముగ్గురిని చిలుకా !
మాయ సృష్టినడుపు రామచిలుకా ॥పంచ॥
జంట రెక్కల సన్నచిలుకా !
సూక్ష్మ చక్రమధ్యనునిలచి చిలుకా !
అంటి భ్రూయుగమధ్య చిలుకా !
లీలనాడించవే రామచిలుకా ! ॥పంచ॥
రవిచంద్రులనుగూడి చిలుకా !
నీవు రాజవీధిన చెలగి చిలుకా !
పవనవేగముతోను చిలుకా !
రేయుబవలు దిరుగుచు రామచిలుకా !
సృష్టిరూపమైన చిలుకా !
నీవు చైతన్యజాలము చిలుకా !
అష్టరేకుల ద్రొక్కి-చిలుకా !
నీవు ద్రష్టవై ఆడించు రామచిలుకా ॥పంచ॥
ఒక్క నిముషములోన చిలుకా !
అగ్నినొసర నేత్రము దెరచి చిలుకా !
గ్రక్కన చీకటివనము చిలుకా !
నీవు గాల్చి మెలగవె రామచిలుకా
జంటసెలలబోక చిలుకా !
నీవు నొంటిసెలకు నెగసి చిలుకా
కంటసప్తగిరులు చిలుకా !
నీవు గడయు చివ్వన రామచిలుకా ॥పంచ॥
సురగిరీపై నిలచి చిలుకా !
నీవు మెరసి బయటచూడు చిలుకా !
పరిపూర్ణశాఖలన్ చిలుకా !
యొంటి తరువు ప్రబలునె రామచిలుకా ॥పంచ॥
దనరివృక్షముతుదను చిలుకా !
రత్నతరుచు దీప్తులతోఢ చిలుకా !

కొనసాగి దివ్యమై చిలుకా!
స్వర్ణ కొమ్మ మెరయును నె రామచిలుకా ॥పంచ॥
అంటికొమ్మమీద చిలుకా!
చాల అమృతధారతొలుక చిలుకా!
మింట నెప్పుడు నిలచి చిలుకా!
పండు మెరయుచుండునె రామచిలుకా ॥పంచ॥
ముగురుమూర్తులై నచిలుకా! పండుముట్టనలవిగాదె! చిలుకా
సగుణనిర్గుణమైన చిలుకా! మేటిసద్గురునిచే రామచిలుకా ॥పం॥
బారీభక్తిని నీవు చిలుకా! పరబ్రహ్మమను పండునుచిలుకా
ఆరగించు నీవుచిలుకా! బ్రహ్మానందమున రామచిలుకా ॥పం॥
ప్రళయ కాలమునాడు చిలుకా!
చిద్భాను బింబమురీతి చిలుకా!
కళల బయట నీవు చిలుకా!
యేకాకినై యుందువే రామచిలుకా! ॥పం॥
కైవల్య పదమున నీవు చిలుకా!
నీవు కదలక యుందువు చిలుకా!
వివరింప నిర్భైట చిలుకా!
నీవు వెలుగుచుందువే రామ చిలుకా! ॥పం॥
అదరు బెదరులేక చిలుకా!
పూదోట కవ్వల నిలిచి చిలుకా!
బెదర కెప్పుడు నీవు చిలుకా!
సర్వసాక్షివై యుందువే రామచిలుకా ॥పం॥—176

## చందమామ తత్త్వం

కులముబాసిసృష్టిపైని చందమామానేను
గురునిచాలవెదుకగాను చందమామా
కలికిచిలుకపలుకులోన చందమామా నేను
కంటూనే మేల్కొంటిని చందమామా

అందమైన బ్రహ్మమెరుపు చందమామా
నాముందరప్రకాశించునే చందమామా
బిందుపీఠమున గురుడు చందమామా
మెరసిపెంపుతో తాండవమాడు చందమామా
అందమైనబ్రహ్మమెరుపు చందమామా !
పండువెన్నెల బయటను చందమామా 'గురుడు'
పరిపరి విధముల వెలగు చందమామా
నిండి బయట జ్యోతిపైని చందమామా
గురుడు నిర్లేపుడై యుండునె ఓచందమామ
వరుసతొమ్మిది మెట్లకిన్నెరచందమామా
ఏబదియొక్కతంతువులదనరు చందమామా
పంచ పంచధ్వనులరవము చందమామా
మెరయత్రైవర్ణకాయలు చందమామా 'గురుడు'
అరసి తంతువులుమీటూనె చందమామా
మంచిపూలచవికెలోన చందమామా !
గురుడువింంచి పాటలుబాడునె చందమామా
పంచ పంచధ్వనులరవము చందమామా
పిండబ్రహ్మాండములు భేదించునే చందమామా
రేచి మూసి వసుధచించి చందమామా పగలు
రేలుమీరి యెక్కిపోవచందమామా !
చూచి సద్గురునిపదములు చందమామా
అచటసొంపుతోనిల్చితిని చందమామా
తెరువులైదు నెదుకగను చందమామా
నుంచి తేటవెన్నముద్దగంటి చందమామా
తెరిపిలేని ముద్దలోను చందమామా నేను
మరపులేని ఎరుకగంటి చందమామా
వరుసషోడశవింశతిరాసులు చందమామా
వలసియొక కుప్పవేసి చందమామా



శ్రీ పూదోట లింగమూర్తి స్వామివారి గురుపీఠాంతర్గత శ్రీరామ మందిరం - తరిమల





తరిమల శ్రీరామ మందిర ముఖద్వారం



కీ. శే. తరిమల సుబ్బారెడ్డిగారు



కీ. శే. మలగవల్లి రామచంద్రారెడ్డిగారు

విరివైన ప్రణవగరిశలోను చందమామా
నేను మెరసి యున్ని నించితినె చందమామా
అలరుచు చిద్వ్యోమమున చందమామా
గురుడు తలపుమరపులు మించునె చందమామా
నిలిచిపువ్వులతోటపైన చందమామా గురుడు
నిరవలంబమైయుండునే చందమామ —176 ౧

## తుమ్మెదా! తత్త్వం

బ్రహ్మముఖమున వెడలి తుమ్మెదా! కన్ను
భ్రమసి తిరిగెదవేల తుమ్మెదా!
బ్రహ్మమవలోకించు తుమ్మెదా!
చిద్బ్రహ్మమై మెలగావె తుమ్మెదా!

ప। ఘంటారవము వింట తుమ్మెదా మదిని
క్రమమున జూడవె తుమ్మెదా!
జంట బాయక గురుడు తుమ్మెదా!
నీవెంట దిరుగునె గండు తుమ్మెదా!
కర్మేంద్రియములనే తుమ్మెదా! వలల
కదిసి తిరుగబోకె తుమ్మెదా
దుర్మార్గులను బాసి తుమ్మెదా!
పరమ ధర్మము దెలియవె తుమ్మెదా! ॥ఘం॥
బుద్ధిచెప్పెద నీకూ తుమ్మెద
అష్టపూలపై వాలకే తుమ్మెద
సిద్ధము నామాట తుమ్మెద పరమ
శివుని పాదమాస తుమ్మెద ॥ఘం॥
మెట్లలైదును గడచి తుమ్మెద, సప్త
ఘట్టులు దాటవే తుమ్మెదా
మెట్టి చివ్వనమెగసి తుమ్మెదా! రుచులు
అట్టె గ్రోలఘె గండు తుమ్మెదా ॥ఘం॥

ఘుమ్మనచలరేగి తుమ్మెదా నీవు
కుడిఎడమలునుబోకె తుమ్మెదా !
ముమ్మాలసెలనెగసి తుమ్మెదా ! మూటి
మోటున నిలువనె తుమ్మెదా ! ॥ఘుం॥

తేటవెన్నెలబయట తుమ్మెదా ! గురుని
పాటించి వెదకవె తుమ్మెదా !
తోటలోపల జారగ తుమ్మెదా ! అతడు
దొరసి చేపట్టునే తుమ్మెదా ! ॥ఘుం॥

పుండరీకము మించి తుమ్మెదా ! పుప్వ
బోధాస్వరూపమై తుమ్మెదా !
ఎండవెన్నెలమీరి తుమ్మెదా ! సుమము
నిండివెలుగునె గండు తుమ్మెదా ! ॥ఘుం॥

నిరుపమానందమున తుమ్మెదా ! నీవు
నిలిచి వీక్షించవె తుమ్మెదా !
పరమ భక్తులకెల్ల తుమ్మెదా ! తుదను
పట్టై యుండునె గండు తుమ్మెదా ! ॥ఘుం॥

చొక్కమగు పూదోట తుమ్మెదా !
మంచిచక్కనయ్యను గూడి తుమ్మెదా !
చుక్కరీతిని నెపుడు తుమ్మెదా నీవు
మిక్కిలిప్రబలవే తుమ్మెదా ! ॥ఘుం॥—177

## అమృత కన్యా వివాహం

కన్నవిన్న చెలియలార గండకిలో స్నానమాడి
వన్నెమీర చంద్రకావి వలువగట్టరే

ప॥ సువ్వి పూదోట విభుడు సువ్వియవధూతకిపుడు
సువ్వియమృత కన్యలిచ్చు సువ్వీలాలీ

పొన్నగంధుల రత్నభూషణములు మేనజెట్టి
కన్యలార సొగసుమించి కదసివెలుగరే ॥సు॥

తిరముగాను సద్గురుని దివ్యమందిరంబు జొచ్చి
తరుణులార గురునిపూజ తగిలిసేయరే ॥సు॥

గురునికృపకు పాత్రమగుచు కోరిజ్ఞానతత్త్వవిధము
విరివిగాను సువ్వాల విస్తరించునే ॥సు॥

మర్మమనెడి కొడవలిపుడు మగువలార చేతబూని
కర్మమనెడిచెత్తగోసి కడకుజిమ్మరే ॥సు॥

ధర్మమనెడి మార్గమునను తరుణులారతగిలి నడచి
నిర్మలాంగులారపనులు సిలిచిసేయరే ॥సు॥

పంచవర్ణరాజనములు పసిడి కుందెనలనించి
మించివెలుగు రోకండ్లను మెరసిపట్టరే ॥సు॥

అంచితముగ జంగజాచి ఆవరణములును జార
పంచకన్నెలార తవుడు బారదంచరే ॥సు॥

వసుధవాసుకిని రేచి వరుస కమలములును గూర్చి
పొసగతోరణములు పురము నెసగగట్టరే ॥సు॥

ఆశతోడ యోగినిపుడు అంతరంగమునసునుంచి
కాసీస్నాన మాచరించి గారవించరే ॥సు॥

చొక్కమైనపసిడిశాల్వ సొంపుమీర వల్లెవాటు
ముక్కుతుదను స్వర్ణరేఖ మొనసి వెలుగునే ॥సు॥

పిక్కటిల్ల భూషణములు పెండ్లికొడుకు మేననమర
నక్కజముగ దివ్యపీఠి నతనినుంచిరే ॥సు॥

కలికి మూలసౌధమెడలి కంకణములు గదల కన్య
తొలకరి మెరుపురీతి నిలిచి వెలుగునే ॥సు॥

వెలుగు భాషికములు గట్టి వేదమంత్రములతోడ
చెలిని యోగమంటపమున చెలులుసిల్పిరే

భసితవర్ణ చీర తెరను పతిని సతిని నిలుప బుధులు
పసిడి సూత్రమ్ము సతికి పతియుగట్టెనే ॥సు॥
పొసగ బ్రహ్మముళ్ళు వేసి భోగవతులు పాటబాడ
పసిడి బొమ్మ తలంబ్రాలు పతికిబోసెనే
పొరులా తెరనుదీయ దంపతులు వసుంధతికి మ్రొక్కి
మీరి షడసాన్నములును మెరసి కుడిచిరే ॥సు॥
గురుని పూజలపుడు జేసి గోవుల్లాస గృహముజొచ్చి
పరమ కన్యతోడ విభుడు పానుపెక్కెనే ॥సు॥
నెలతరాజ యోగరసము నించికసక పాత్రబట్టి
మెలకువతో వసంతమనిపు మీదచల్లెనే ॥సు॥
సొలసి దివ్యరసము విభుడు సుందరాంగి మీదనుంచి
కలికిదివ్య కరమునతడు కదిసి పట్టెనే ॥సు॥
కలిసి సుందరాంగి విభుడు గాఢరతులపెనగినైదు
పదియుకళలుఃగూడ రేయు బగలు మరచిరే ॥సు॥
బిందుమర్మ వీధిజార ప్రియముతోడ సదరమంటి
సందులేక తన్మయము నొంది లేచిరే ॥సు॥
జలజమధ్య ప్రణవరవము చెవులనాలకించి మదిని
చెలగి హంసలంటగూర్చి నిలిచియుందురే ॥సు॥
సెలనదీచరుల తేనెజారు పెరల మచులుఃగొనుచు
కెలన నమృతకొలని జలక్రీడలాడిరే ॥సు॥
శృంగార వనములోన చెలగి ఫలము లారగించి
పొంగిసరస మాడిరపుడు పువ్వుబంతులన్ ॥సు॥
అంగములను స్వర్ణపుష్ప హారమపుడు వేసి నూత్న
శృంగారవతితో ఘనుడు రంగుమెరయునే ॥సు॥
అఖండ తేజోబయట నిలిచి అద్భుతానందమున
సుఖంబుండిరంత విమలజ్యోతి చవికెల్లో ॥సు॥

నెలమి పువ్వుదోటగురుడు నిర్మలాంగియైన ముక్తి
కలికినిపుడు అవధూత ఘనునకిచ్చెనే ॥సు॥

గగనవీధి గోచరించె కనకవర్ష మపుడు గురిసె
సుగుణులపుడు నాడిపాడి సొంపుమెరసిరే ॥సు॥

పంకజాక్షులార వినరె పరమయోగ సారమిదియు
శంక లేకవిన్న ముక్తి సమూ కూడునే ॥సు॥

సిద్ధపురుషులారనిదియు శీఘ్రముగను అర్థమెరిగి
సద్దులేక సువ్వాల చక్కబాడరే ॥సు॥

అదనముక్తికన్య కల్యాణమెవరు పఠనసేయ
పదిలముగను గురుడు శోభనములొసగునే ॥సు॥

జలధియు నుప్పొంగె పృథివిశాంతి దనరెనపుడు
సొలసివేద తతులునపుడు స్తుతులు చేసెనే ॥సు॥—178

## తారకరామాష్టకము

1. చుట్టియున్నపాము లేవగ సుప్తిచీకటిబాసెనే
గట్టుమధ్యను సూక్ష్మకుండలి కంట జ్వాలలుదుంకునే
పట్టితో త్రిపురములమీదను పాపడాడుచుండెనే
గట్టిగా ననునేలు నిర్గుణఘనుడు తారకరాముడే!

2. చొక్కమగు బంగారుశాలువ చుంగులిరుగడ చెలగునే
పిక్కటిల్లుచు భూషణంబులు పెనగియురమున వెలగునే
అక్కరో నాహృదయమధ్యను నతడు తాండవమాడునే
చక్కదనములకెల్లమూలము స్వామి తారకరాముడే!

3. సిగ్గుచూపులనాల్గుపదవులు నెలతచే నాడించునే
అగ్గలపుశృంగారపీఠమునందు చెలితో వెలగునే
ముగ్గురికి మీదగుచు గురుడును మూలమేడను నుండునే
జగ్గునను నిగమాంతరంబున సాక్షి తారకరాముడే!

4. అంతలో చంద్రామృతధారలు అతివముఖమునదుంకునే
సంతతము సుషుమ్నాబిలమున వింతభ్రమరముగ్రోలునే
శాంత తేజము మీదిపండును పొంతచిలుకలువ్రాలెనే
యింతిరోననునేలు నిర్గుణు డెలమి తారకరాముడే!
5. తొలకరిమెరుపైన సభయుకు దొడ్డసామ్ములువెలగునే
కలికియొక్కతె పాటబాడుచు కనకకిన్నెరమీటునే
మొలకనగవుల నమృత మొలకగ మునులహృదయము రేచునే
పలుకులను వలసించు సుజనుల పాలి తారకరాముడే!
6. పదిలముగ పరమామృతఫలముల పడతి కావలియుండునే
కదసిచూడగ కలికితనపై కనకపుష్పములుంచునే
సుదతివిను ప్రణవాంతరంబున సొంపు మెరయుచునుండునే
విదితముగ తనఎదుట వెలగునె వెలది తారకరాముడే!
7. అక్కచూడవె జ్యోతిమధ్యను ఆటలాడుచు నుండునే
చుక్కరీతి సువర్ణదీప్తుల సుతులుజూడగ వెలుగునే
మక్కువతోనిరైబట నెప్పుడు మగువప్రబలుచునుండునే
చక్కగాపూదోటరాముడు సర్వసాక్షియుండునే!
8. దొరయగా యీ యష్టకము అవధూతచంద్రుడు జేసెనే
ధరనుమోక్షము గోరువారికి దర్పణంబైయుండునే
సరసులై యిదిచదివినను సత్పదమువేగ సిద్ధించునే
పరమ భక్తిని దీనియర్థము బ్రహ్మనిష్ఠులు తెలియరే! —179

## తత్త్వాష్టకము

1. శంక లేకను అగ్నిక్రింది సర్పమును నెగయించునే
కంకణముచే కర్మబలముల కదిసి పృథివిని నణచునే
ఓంకరింపుచు చక్రవర్తుల నుర్విపై తాగూల్చునే
పొంకమగు నవధూత చంద్రుడు పువ్వుదోటను వెలుగునే
2. దిట్టతనమున మర్కటంబును దివికి చివ్వునయెగయునే
ఘెట్టల్లారను ఘూడు ఘీర్చు ఘేరుపై లంఘించునే

అట్టి దివి భువి నడుమ వెలుగుచు అరసి దిక్కులు ప్రమింగునే
ఘట్టిగా పూదోట రాముడు కడను సాక్షియుండునే

3. అగ్నిలోపలి మీన మొక్కటి అరసి మొసలిని ప్రమింగెనే
సౌంజ్ఞ మీటుచు బకము దశవిధ సర్పముల బక్షించునే
ప్రజ్ఞ మెరయుచు సంది యొక్కటి బైట రంకెలు వెయునే
తజ్ఞుడగు పూదోట రాముడు తారకంబై వెలుగునే

4. పొంచి హంసలు దివికి నెగయగ పొదలో పులి దిగ ప్రమింగెనే
మించి సింహము అష్టగజముల మెక్కి గుహలో యుండునే
మంచిరత్నము ముదముతో నొక మత్యమును ధరియించునే
యెంచగా పూదోట రాముడు యేకపదమై వెలగునే

5. అంతమగు శివకరము కళలను నమృత ధారలు దుంకునే
రంతు సేయుచు గండు తుమ్మెద రభసమున తా గ్రోలునే
చింత సేయుచు చిలుక హిమగిరి శిఖరమునకును ఎగసెనే
శాంతమున పూదోటరాముని చరణమున తా నిలుచునే

6. కదసిచూడ త్రికూట గిరిపై కనక సౌధము నుండునే
ఎదుట వెలగుచు దివ్యసుందరి హేమకరములు జూపునే
సదయురాలై వీణ మీటుచు సామగానము జేయునే
పదిలముగ పూదోట రాముని పత్ని తానై యుండునే

7. చక్కగా చిద్బ్రహ్మ దీప్తులు చంద్రగిరిపై నిండునే
నిక్కి చూడను మనసులోపల నిలిచి వెలుగుచునుండునే
చొక్కమగు దివ్యాంతరంబున చుక్కరీతిని వెలగునే
యొక్కపగు పూదోట రాముడు నింత ప్రబలుచునుండునే

8. అట్టి నిజగురు కరుణచే లింగావధూతి సద్భక్తితో
యిట్టి అష్టకమున్ రచించె మహిన్ పఠింపుడు సుజనులు
బట్టబయటను దీని అర్థము భాస్కరుని గతి వెలుగునూ
దిట్టలై పూదోట రాముని దివ్య పథమున నిల్వుడీ —180

1. తల్లి పలుకులు వింటసుతుడును తరిమి భుజగిని మెరసెనే
త్రుళ్లుచుండెడి కర్మములను తాదృంచి దివికిని నెగసెనే
కొల్లలుగ దివ్యామృతధారలు కుడిచి కేకుచు నుండెనే
తెల్లమిగ నవధూత చంద్రుడు దివ్యపదమై ప్రబలునే

2. దిట్టతనమున కోతియొక్కటి గట్టులేడును నమలెనే
గట్టిగా మృగరాజు సప్తగజములను మర్ధించునే
అట్టిమోము నందు నొక సతియుంటి విశ్వముమ్రింగెనే
దిట్టదై యవధూత చంద్రుడు అమృతపదమై వెల్గునే

3. పంతమాడుచు గండుపిల్లియు పగలు రేలును మ్రింగెనే
గుంతనక్కయు నయిను పులులనుకొట్టి తుదబక్షించునే
కాంతి కనుగొని చిలుక యొక్కటి కనకగిరి దిగమ్రింగెనే
ఇంతిరో అవధూతచంద్రుండేక పదమై మెలగునే

4. పొంచి పొదలోనున్న ఘనమగు పులిని గొర్రెయు బట్టెనే
కంచు కుండలో కనకమృగమూ కదిసిబయలును మ్రింగెనే
పంచ వర్ణములైన మీనును పావడును దిగమ్రింగెనే
మించిచూడ యవధూత చంద్రుడు మేలిమిగ వెలుగొందునే

5. కన్యయొక్కటి మేడమీదను కదిసి పాటలుపాడునే
తిన్ననిపలుకులను తాపసధీరులను రాబిలుచునే
పిన్నవయసున బాలుడొక్కడు కన్నుగొనలనుచూచునే
వన్నెతో నవధూతచంద్రుడు నొగసికలికినిబట్టెనే

6. మిక్కుటంబగు పసిడిశాలువ మేనిపైదీపించునే
చొక్కమగుహృత్కమలమధ్యను సొంపుతో విహరించునే
చక్కగాలోబయట మెరయుచు సఖియ తాండవమాడునే
అక్క వినుమవదూతచంద్రుండమృతుడై తా వెలుగునే

7. గట్టిగా పూదోటరామునికలిసి ధృవమైయుండునే
పట్టునను చిన్మండలముపై బ్రహ్మమై తా మెరయునే
గుట్టుదెలియగ దీని యర్థము బట్టబయట నెయుండునే
అట్టిఘనుడవదూతచంద్రుండష్టకము నిర్మించెనే

## మరుగుపదములు

అంగహీనమైన మృగం బాదికూర్మ రీతి జగము
మింగి వెళ్ళి గవయు దాని మెలకువెంతో తెలియరా!
సంగతిగను మూడుగిరుల సంచరించి మేసుతుదను
పొంగి పువ్వుదోటలోనే పొంచి మెరయు చుండురా!

ప॥ దిట్టడగుచు గురుని పదము పట్టినిలిచి యుండె జాణ
అట్టి కనక మృగమునతడు పట్టనేర్చురా ॥దిట్ట॥
వన్నెలైదు గలిగియుండు వనర పదమునీాదనుండు
తిన్నగా త్రిపాదములను తిరుగ నేర్చు నెరుగరా
కన్నుమాణిక్య కాంతి కదసిలోను వెలినిజూచు
చున్న, అగ్నిశిఖల మృగం బోంకరించుచుండురా ॥దిట్ట॥
మండలములు మీారి శుద్ధమండలములో దాని టెంకి
పండురుచులు మేసి మృగము బలసి చెలగుచుండురా
నిండివెలుగు పువ్వుదోట నిలయుడైన గురుని సుతుడు
అండగానక కనక మృగము నతడు మ్రింగెచూడరా ॥దిట్ట॥=182



విజ్ఞాన పురుషునందు విమల జ్వాలలెగసి వరుస
సంజ్ఞలోకములనన్ని క్షణములోను గాల్చెరా
ఆజ్ఞనున్న కమఠమదలె అష్టగజములపుడు బెగడె
ప్రజ్ఞమెరసి పాము లేచి బయలు బ్రాకెచూడరా

బ॥ బహ్మవిష్ణు రుద్రులకును భావములవిగాదు తెలియ
బ్రహ్మనిష్ఠులకునుదీని భావములవిరా ॥బ్ర॥
పెక్కు విధములైనకోతి నిక్కిదివికిచౌకళించి
ధిక్కరించి పండు మ్రింగి చొక్కియుండు తెలియరా
ముక్కుతుదను గ్రొడ్డునతికి చుక్క వంటె కొడుకుబుట్టి
ఘక్కున బ్రహ్మాండములను పగులరంతుసేయురా ॥బ్ర॥

గట్టుపైకి నుభయనదులు కదిసి దుమికి పారనట్టి
జంట నీరు పాపలెగసి యంబరమున నిల్చెరా
జంటమాను చొకళించి మెరసిసుఖాంబుధిని సొరగ
అట్టె నిప్పుకంటిపిల్లి పట్టి మ్రింగి పొదలురా ॥బ్ర॥

మెండుకొన్నగాలి తుదను బండికంటి బిలము జొరగ
నండగొనక కన్య యొకటి ఆరగించి మెలగురా
గుండు వేయి వక్కలగుచు కొనలుసాగి ప్రబలినపుడు
గుండుమీది నక్కనగుచు గుమిసియాడురా ॥బ్ర॥

చొక్కమైన ధరిణిలోను యెక్కువైన రత్నమంది
చిక్కెననుచు ముద్దుగుమ్మ శిరముపైనియుంచెరా
ఒక్కపలుకులోన దీనికొనర నర్థభావముండు దీని
దిక్కరించి పూదోట దేవుశిన్ని యెసగురా ॥బ్ర॥—183



నెరనిరావరణమైన విరివిసూక్ష్మభరణిలోను
నరయ సచరాచరములన్నియుండె యణగి మెలగురా!
వరుసరూపనామక్రియల నొనర కార్యకారణములు
నరగజననమైనవిధము చాలజెప్పెద తెలియరా!

ప॥ నిరవలంబమనెడిగురుడు నిజము దీనియర్థమెల్ల
కరతలామలకముగను మెరసి చెప్పనేర్చురా ॥ని॥

అలరు నంతరిక్షమందు నమృతగాత్రమైనపక్షి
వలసి యడవిలోనిగూట నిలచి క్రీడసలుపురా!
బలిమిహంసముఖ కళను బహువిచిత్రితంబునగుచు
తెలయవిశ్వజ్వాల మహవి తెరిపిలేకప్రబలురా ॥ని॥

పరమహంసనాసనమున ప్రజ్వరిల్లుదీప్తియనెడి
సరసమలిన హంసవెడలి సగుణతతులనందురా!
గరిమెతోను నన్నిటందు క్రమముతోడ జొచ్చివేగ
తిరచు జీవకణములగుచు నెరసితేజరిల్లురా! ॥ని॥

మనుజకీటకములుదీని మర్మమెరిగి పట్టనలవె
వలసిశాస్త్రజ్ఞాన నిపుణులొడసి పట్టలేరురా
మునులు సురలుమూర్తిత్రయము మొదలు యాపులుగుమదిని
తనరి తిరుగులాడజూచి కినిసిపట్టలేర్చురా

సంతసమున దేశికస్వామి సత్పదంబునమ్మి
సంతలోనె విమల ఖగము నారగించి తుదనురా
పంతమునపూదోటపైని నేనే యద్వితీయమగుచు
యెంత వింత బట్టబయట నేనెలుంగుచుందురా ॥నిర॥—184



చదలు సుతుని తావుచేత సరగ నొక్కపాప గదల
బెదరిరెండు పన్నగములు పెనగిపైకి యెగసెరా
మదముతోను కమఠ మొకటి మూడులోకములన్మ్రింగ
అదిగొకచ్ఛపమును జెలిగె ఆరగించె చూడరా

ప॥ అరసిచూడ దీనియర్థ మల చిదాంబరమున కవల
నెరయ బట్టబయలునగుచు నిలిచి ప్రబలుచుందురా ॥అ॥
గుంతనక్కయైదు పులులకొట్టి మేతలాడదాని
యంతలోనె యఱ్ఱచీమ నారగించెచూడరా ॥అ॥
పంతమూన తెల్లజీమపట్టి గ్రామసింహావిభుని
చింతచేసి మ్రింగెనిదిగొ యెంతవింత జూడరా ॥అ॥
వసుస జీవతతులవిమల వాలుగొకటి మేతలాడి
గరిమెదివికి పుటముతెగసి గగనబిలముదూరెరా
మెరసి యుత్తర దక్షిణములు మీరి పశ్చిమమునకురికె
సారథి తూర్పుమించి శూన్యశరధిలోనుజొచ్చెరా ॥అ॥

పట్ట పగటివేళ నమృతప్రభలతోను నుడువిభుండు
చుట్టివెలుగ కెంపుచాయ చుక్కబొడిచెచూడరా
గుట్టుబైట నోరులేని పుట్టమధ్య ఘాతచేసి
అట్టె యేడు మూడుగిరుల నారగించెచూడరా ॥అ॥

కలకలేని ఝషముపైకి గవసి బయలు మ్రింగెదాని
వలసి నిర్లేపుడౌకడు వసర మెసగెచూడరా
బలిమి మూర్తిత్రయము దీని భావమెరుగలేరు వినర
అలరు పూదోటగురుడు తెలియజెప్పనేర్చురా ॥అ॥
అరసిచూడదీని యర్థమల చిదంబరమునకవల
నెరయ బట్టబయలునగుచు నిలచి ప్రబలుచుండురా —185



ఒక్క పదములోన విశ్వమొసర వెడలి ప్రబలజూచి
నిక్కిదీర్ఘభుజగియన్ని నేర్పుతోను మ్రింగెరా
ముక్కు తుదను కాకివంటి ముసలి ముండనృత్యమాడ
పెక్కురూపులా నిరాంగి ప్రియముతోను మెక్కెరా
ప॥ బలిమి ముక్తిసతికిదీని భావమలవిగాదు తుదను
అలరు చిన్మయుడు మదిని తెలిసి తెలియ లేడురా ॥బ॥
తుట్టెపురువు నఖిలజగము చుట్టెనిదుర బోవుతరిని
అట్టెలేచినపుడు విలయ మంతలోనె తోచురా
గట్టుమీది యబ్ధిపైకి మెట్టికొంగ యెగయగాంచి
పట్టిమీను మ్రింగి మెరసి పగలు రేలు మించెరా ॥బ॥
అంతలోనె పక్కిచాప నరయ మొసలి నడుపుదాని
పంతమున నోరులేని బాలుడారగించెరా!
చింతచేసి బట్టబయలు చెలగి యతని మ్రింగు యీ
వింతలన్ని పూదోట విభుడు యిన్నెరుంగురా ॥బ॥—186



కొండముచ్చు మహిని కోతిపిల్లల మ్రింగె
నిండు వార్థిలోమీను నిగుడి మొసలి మ్రింగె
మండుచుండెడిపండు మరిశుకము బక్షించె
నింపునీళ్ళనుజ్యోతి నుండి వెలగెను దీని

ప॥ తెలియరయ్యా! నెరజాణ నీమేలునే, తెలియరయ్యా
యిలలోన భావజ్ఞులకు నేడాది గడువిత్తు ॥తె॥
పొదలికాళ్లువచ్చి భూమి నాట్యముద్రొక్క ॥తె॥
కదిసి దివికి సహస్రకరములు వచ్చెనుయిదుగో ॥తె॥
కొదుమమొక్కటిదరిమి పొదలో పులినిబట్టె ॥తె॥
మొదటినీరూనిల్చి మొసలినిద్రుంచెను ॥తె॥
హమ్మనకుండేలు నారుకుక్కలదరిమె ॥తె॥
ముమ్మాల మానుబిల్లి మూడుజ్యోతులద్రిమింగె ॥తె॥
యిమ్మైన నెమలికంటను యిందుడుదయించె ॥తె॥
కమ్మసర్వంబును కచ్ఛపంబుద్రిమింగె ॥తె॥
నీరూపములో సప్తగంగలు బారెను ॥తె॥
నీరునంటని మొలక నిలిచిబైలుద్రిమింగె ॥తె॥
సారెకుండలికంట చంద్రామృతముద్రుంకు ॥తె॥
పారిభృంగ మొక్కటి బ్రహ్మాగ్నిద్రిమింగెను ॥తె॥
గుండులోపలిపుంజు కూత లేసెశివేళ ॥తె॥
రండముండవద్ద రాజరత్నంబుంది ॥తె॥
పండుగోతిలో దీని భావమున్న దికోరి ॥తె॥
నిండుపూదోటపై నిజగురుని కిది తెలుసు ॥తె॥—187

## ద్విపద (అవధూత ప్రభువు)

చుట్లున్ బెట్టినపాము రేచినపుడున్ సూక్ష్మకుండలి రేచనే
గట్లుమీరిహంస వహ్నిబిలమునన్ కదిసి చయ్యనజొచ్చెనే
కృష్ణమోని యూర్ధ్వనేత్రము క్రీడించు క్షీరాబ్ధిపై
విష్ణుడఖిలాంతరాత్ముడగుచున్ విమలపదమై యుండునే
నిష్టన్ జూడ సప్తదళపీఠమధ్యన్ నిగమాంతమై వెలగునే
ద్రష్టగ నిర్వాతదీపగతి తుదన్ తరలకెప్పుడు నుండునే
శబ్దంబై క్షరాక్షర కారణరూపమగుచున్ చైతన్యమైయుండునే
శబ్దాంతరజ్యోతిర్లింగమై నిశ్శబ్దంబునైయుంకునే

పండువెన్నెలగాయ సూక్ష్మబయటన్ చిద్బ్రహ్మకళలెగయునే
కేదారాద్రి సుధారసంబలరుచున్ మోదంబునన్ దుంకునే
ఆదిమధ్యాంతశూన్య ప్రకాశమై తుదన్ యమృతపదమైయుండునే
భగ్నుడైనిలిచి చూడగమదిని పరమాణువై యుండునే
నిర్గుణమై నీవారశూకగతి నిర్బీజమైయుండునే
అమలంబై చిదాకాశబయటన్ మహా ఆశ్చర్యమైయుండునే
అమితానంద సముద్రమధ్యమునన్ అనాదియైయుండునే
అమనస్కుడై నిరామయుండగుచు అమృతాబ్ధియైయుండునే
సమరసానంద స్వస్వరూపుండగుచు సర్వాత్ముడైయుండునే
సుఖసద్భక్తిని పూదోటరామునిపదము సుజ్ఞానులున్ గూడరే
అఖండజ్యోత్యంత బీజమగుచున్ అవధూత తా వెలుగునే —188

## —: జీవ బ్రహ్మైక్యము :—

### ద్విపద

ఆలకింపుము జీవ ఆత్మైక్యరీతి
మూలము నీకును ముచ్చటవలెను
తేటగా జెప్పెదను తెలియంగ వినుము
బూటకము కాదిది బోధ జనకంబు
మోహ దుఃఖములచేత మొనసిన యట్టి
దేహము నేననే తెలివి బోనాడు
అది ఎట్టులన్నను అరయజెప్పెదను
సదసద్వి చారమగు శ్రవణములచేత
జడదృశ్య భావమని చెప్పంగబడును
జడరహితమైనట్టి చైతన్య మీవు
అటుగాన దేహంబు నీవు గాబోవు
చటులముగ నంతఃకరణ చతుష్కంబు
నీవు గానేరవు నీవాలకింప
పోవును సుషుప్తిలో ప్రాణంబులడగి

నీవుపోనేరవు నిల్చియుండెదవు
కావున యవినీవు గానేరవైతి
ఈ విషయేంద్రియము లీదేవతలును
నీవేల యూమవు నిక్కముదెలియ
లేదు నిద్దురతోడ లేశమంతైన
అదిగాన వాటిలో నంటుటగాదు
అదిగాక ప్రాణాది వాయువుల్ గావు
ఎటువలెనన్నను ఎరుగజెప్పెదను
అల పంచతన్మాత్ర లీవెపుడుగావు
పటువుగ మేను ఈ పట్టుననుండి
సుఖదుఃఖమాదిగా రెండుగుణములును
సుఖసుప్తిలోపల సొంపు లేకణగు
కావున యవినీవు గానేరవెపుడు
మనము నీవన్ననో మనుటయేలేదు
షడ్భావ షట్కోశములు నీవుగావు
షడ్వర్గములును షడూర్ములునుగావు
అటులైన నేనెవ్వడంటె జెప్పెదను
పటుతరమగునీదు దృష్టితోడుతను
కనుస్థూలసూక్ష్మ కారణములమీద
యేసని వెలిగేటి ఎరుకవే నీవు
కావున శ్రీగురుని కానంగబోయి
తనుమన ప్రాణముల్ తగసమర్పించి
వినయ భయ భక్తితో వేడుకోవయ్యా
ఆ గురుడెరిగించు నైక్యమంత్రంబు
నీ వున్న చోటును నిక్కముగా దెలుపు
నీ వైక్యమగు చోటు నిలుకడ దెలుపు
అది ఎట్టులన్నను ఆలింపులెస్స
అక్షిలోపలనీవు ఆడుచున్నావు

అక్షీణగతితోడ అదిదెలియుమయ్య
సాక్షి యేమంటివా సాక్షి జెప్పెదను
విశ్వతః చక్షురుత విశ్వాక్షమనియు
విశ్వసాక్షిని దెలిపి వివరించుకృతియు
నిదిగాన నైక్యంబు నెరవుతో వినుము
నీ రూపు తెలియఁగ నెరిఘోషబుట్టు
వేనుగా కాఘోష వీనుల వినుచు
నాసా త్రికోణంపు నడిమి రంధ్రమున
భాసురంబైన నేత్రద్వయమును గూర్చి
మానసం బచ్చట మరలించి నిలిపి
పుటద్వయముచేతను పూరించి వాయు
నిటలంబుపైగాను నిగుడి తీయుచును
వేసారబోక నూర్ధ్వము లోతుజూచి
భాసాత్మకంబైన గురుని భావింప
నాసమయంబున నడినెత్తిలోను
అతిఘోష వినగను శక్యంబుగాను
సతమైన ప్రణవంబు సాగిభోరనగ
దేహి పరవశమగుచు దేహంబు మరుప
ఆవేళ నరికాలి చిచ్చుతోగూడి
పేర్మితో వ్యానవాయువు పెకలివచ్చు
వచ్చి యాధారంబు వడితోడ జొచ్చు
జొచ్చి యచ్చటనున్న సుశుచిరవహ్ని
ఇల అపానుని గూడి యిరవు భేదించి
అచ్చోటు గదలి స్వాధిష్ఠానమంటి
కుండలి భేదించి కుటిలు డున్నట్టి
మణిపూరకముబొంది మాణిక్యకాంతి
యై వెలుగుచున్నయా వహ్ని సమానులగూడి
పశ్చిమ ద్వారహినియగుచు డా మనము

పృష్ఠ భాగంబున బోవుచునుండ
నత్యుష్ణ మగుచుండు నపుడు దేహంబు
నారీతి బోవుచు నాయునా హతము
గడచి యామీద విశుద్ధ చక్రమును
కలిసి ఉదానుని కలుపుక తరలి
యెలమి యాజ్ఞాచక్రకమంచుల దిగువ,
నెరి ప్రాణుడున్నట్టి నెలవున జేరి
మరిచూపు వాయువుల్ మనసుతోగూడి
సరవితో ఏకమై సన్ననైయున్న
బ్రహ్మరంధ్ర నాడిలో భోరున జొరగ
మరణకాలావస్థ మదికపుడుగలుగు
వెరవక శ్రీగురుని యిరవుతోదలచి
బెదరక మండల త్రయము భేదించి
పిండ బ్రహ్మాండముల్ ప్రియముతోగూర్చి
మెరయు సాహస్రార మేరు శిఖరమున
చెదరక ప్రణవ పీఠంబుపై జేరి
కుదురుకావేళ నొక కోర్కెలు లేక
నిరుపమనిర్గుణ నిరవయం బగుచు
సరవి చిదాకాశ సత్తామాత్రమైన
శ్రీలింగ గురుడైన చిద్బయలందు
చింతావిరహిత చిదాకాశమంటి
వెలిలోపలను తేజో వ్యాపకమునిండి
కలయ సర్వంబును కలిసిలయమగుచు
అపుడు నిశ్శబ్దమై అది చెప్పరాక
అమనస్కమగుచు నఖండమైయుండు
అపుడు జీవబ్రహ్మ ఐక్యమదెయగును
అపుడు నత్యుష్ణంబున నణగిసర్వాంగ
మ్లుమృతోపమంబగు నది చెప్పనేల

సకలక్లేశవిముక్త సంభ్రమంబదియు
నీ జీవబ్రహ్మైక్య నెలవిది సుమ్మి
జల శర్కరన్యాయ సరణిది సుమ్మి
శిఖయుక్త పూర్ణరస యోగమిది సుమ్మి
మహనీయమగు తత్త్వమసి మహావాక్య
పద్ధతి యిదియు జీవన్ముక్తిసుమ్మి
ఇది గురుస్వామి కృప యెరుగవే జీవి
వివరముగ నామాట విశ్వసించినను
నీవె బ్రహ్మంబనై నెగడెదవె జీవి
ఇతర మతంబుల ఇతరమార్గముల
ఇట్టి ఐక్యపు మార్గమిక కలుగబోదు
వట్టి మాటలుగాని వైభవంబిల్ల
నామాట నమ్ముము నయముతో జీవి
జిహ్వేంద్రియంబును జిడ్డంటనట్లు
భవపాశ నిర్ముక్త భవ్యుండవగుదు
ఇది నిశ్చయంబని ఎరుగుము జీవి
అవధూత చంద్రుని వాక్యములు నమ్మి
అమృతమైనీవు నిలువవే జీవి —189

## గు రు ని రా ద ర ణ

గురుని సత్కృపగలిగి కుంభినిపై శరణు
లరసి త్రైవాసనలు నిరసించలేక
నెరచిత్తచలనులై గురుసేవజేయకను
పరమ జ్ఞానంబుచెడి భ్రష్టులైనట్టి

ప॥ వారు భక్తులుగాదు వారు ముక్తులుగాదు
ఘోరమగు నరకముల గోడుగుడుతురునూ ॥వారు॥

గురునిస్వరూపమును గురుతుగా ధరియించి
నురుగు దండించేసని క్రొవ్వి హంకృతిని

గురునిపైకోపించి గుడ్లెర్ర జేయుచును
గురుని నరుడనిచూచు గొంటుగాయలును ॥వారు॥

గురునిపైద్వేషించి కుంఠితభక్తులై
గురునితోవాదించు ఘోరకర్ములును
గురువంచకులుచాల గురునితోపలుమారు
నెర యబద్ధములాడు నీచ జీవులును ॥వారు॥

గురుని పదములుబాసి ధరను పలుగాకులై
తిరుగుచుండు కూటికై తిండి పందలునై
సరసాన్నములుగల్గు స్థలములకు నేతెంచు
పరదేశిగాడతడు పలువ మనుజుడునూ ॥వారు॥

గురునివాక్యముచాల కుశలులై నమ్మకను
గురుని సంకటపెట్టు గుణబద్ధులకును
గురునైనపూదోట కురుడు రోసినమున్న
దొరుకు సద్గురుడు బహుదూరమగు వినుడీ ॥వారు॥—190



గురువంచకుల(బతుకు గురుతుజెప్పెదవినుడి
విరివి అడవినిగాచు వెన్నెలయుబోలి
సరసబీటనుగురియు జడివానగతియును
నెరమోటికుండలో నీరువిధమగునూ ॥గురు॥

ప॥ భావించగా యిట్టి పాపకర్ములుధరను
జీవచ్ఛవములండి శివయోగులారా! ॥భా॥

తెలియకగాలిలోనుంచు దివ్వెవడువుసమరియు
కలితమానట్టి మేఘజ్యోతివిధమూ
కలశ జలముల బొడము ఘనమైనబుగ్గ(కియ
తొలగుపహ్నాని వెతలు మిణుగుర్లపోల్కిన్ ॥భా॥

ఘనజలముపై బాతు మునుగసమిధలగతి
వనర తనువులు మహిని పడ వేసిజడులు
పనుపడినపూదోట బ్రహ్మంబుగానకను
కనుగొన భవాంబుధిని మునుగుదురయా ॥భా॥—191

కపట గురువు

మలినసతిసుతులకై మాలకాకులపగిది
తలప తాటోటులై ధనవంతులకును
పలుమారు తప్పబోధలుచేసి వలపింతు
రలరి వారల విత్తమాసించి జడులు

ప॥ పొంచి మహిలో నుదర పోషకులునీరీతి
కంచమిడువక పిల్లి గాచుకున్నటులన్ ॥పొం॥

మరియోగశాస్త్రముల మర్మములుచాల
నెరపద్ధతులవలన నేర్చిబహుగొంటు
తరచు మాటలచేత తత్త్వనిష్ఠులజూచి
యరసి వాదింతురిల నల్పజ్ఞానులును ॥పొం॥

గురువులకు గురుడైన గురునినవలోకించి
గని సర్వమతడంచు స్వానుభవమునన్
నెరనిర్విషయులును నిలిచిపూదోటపై
సర్వసాక్షినిగూడి శరణమందెదరు ॥పొం॥—192

మలమూత్ర రేతములు మరిభంగి సుర ఫలల
మలరి యిది మోక్షమని యనుభవింపుచును
చలనులై జిహ్వాగుహ్యాల రుచులుమదిగోరి
యిలపైని దిరుగుదు రింపు సొంపునను

ప॥ కలియుగములోనిట్టి కర్మ గురువులుగలరు
తెలియజెప్పెదను సుస్థిర యోగులారా! ॥క॥

తరచు నిగమాంతశాస్త్రములు బహునేర్చి
ధరను శిష్యసమూహమరసి కూర్చుకను
నెరయ విత్తముకొరకు నిపుణులై మహిజనుల
నరయ నర్తకరీతి వలపింతురయ్యా ! ॥కలి॥
పెరుగాకులకు వెరచి పికముడాగినరీతి
వనర నా గురుడు పలువలకు దూరమునై
కనుగొనగ పూదోటకడను నిర్లేపుడై
తనరి ప్రబలును ముక్తిదాతయై యతడు ॥కలి॥—193



## ఆరవ దళం

# అఖండసాధన (హంసయోగం)




## వైరాగ్యము

శేత రక్తంబులను మలినమూ చేయకుండ
భూతబీజము గలిగి పొదలుకుండా
నాతిభోగంబులకు నాట్యమాడెకుండ
వాతములచే నెపుడు వాగేటికుండ

ప॥ మలమూత్రములకెల్ల మరియు పట్టగుకుండ
మలిన లిప్తంబైన మరిపచ్చికుండ ॥మః॥
కులగోత్రములుగల్గి గుమిసి యాడెకుండ
ఎలమినవరంధ్రముల నిల వెలయుకుండా
సలలితంబుగ యిదియు సాకారమగుకుండ
చలనవృత్తిని మహిని చరియించకుండా ॥మల॥
దుర్మదంబుల నెపుడు దూలి యాడెకుండ
మర్మజ్ఞులకు కీడు మరిసేయుకుండా

ధర్మము పూదోట దాతసంటనికుండ
నిర్మలంబై స్వర్ణ నియతమగుకుండా ॥మల॥—1

నెలతకొప్పునుజూచి నిటలభాగముజూచి
కలికిఘ్రాణముజూచి కన్నులనుజూచి
చెలియ ముఖముజూచి లలితవక్త్రిముజూచి
అలరు ఉదరముజూచి అధరమునుజూచి

ప॥ ఎంతభ్రమసిరి పురుషు లింతులనుజూచిమది
చింతించకను మురికిచెడు పీనుగులకు ॥ఎంత॥

ఘనకరంబులుచూచి వనిత గళమునుజూచి
నునుపు కుచములఃజూచి నూగారుజూచి
తనరు మధ్యముఃజూచి తరుణి పిరుదులుఃజూచి
పెరుదొడలుజూచి పదవనజములుజూచి ॥ఎంత॥

తరుచు సొమ్ములుజూచి ధవళచేలముఃజూచి
మెరుగు కాయముజూచి మిణుకులనుజూచి
చిరునగవులనుఃజూచి స్త్రీల వలపులుఃజూచి
గురుతైనపూదోట గురునిజూడకను ॥ఎంత ।— 2



అన్న మదముచే నింతులును పురుషులును
బలు క్రొవ్వి మన్మధుడు బాధించు ననుచూ
పలుకుదురు పలువలును మలిన కామాంధులై
అలయన్న ముడిగినను సతి డెందు చనునో

ప। వలసి పురుషులును సతివలకు బానిసలునై
పలవరింతురు వారి ప్రాణసతులనుచున్ ॥వల॥

కనుగొనగ స్త్రీల తనువును తోలురక్తమును
నెరసి మాంసము నెముకలును మజ్జసరముఃల్
పసర మేదస్సు ముఃకి సతుల మేనులగు
వినుడి మలమూత్రముఃల కునికి పట్టగును ।వల।

ఇట్టి కాంతలగూడి ఇహపరంబుల సుఖము
లట్టి పురుషులకు లే వరసి చూడగను
పట్టయిన పూదోట బ్రహ్మంబు గానకను
గట్టిగ భవాంబుధిని గాసిపడుదురును ॥వల॥—3



తనదుగృహములమీద తనదుప్రియసతిమీద
వనరుపుత్రులమీద వస్తువులమీదన్
పనిబూనివీటిపై బహుమోహముండినను
వినుడి పులుగులు పొలుసువిధమౌనుసుమ్మీ!

ప॥ గురుతైన విజ్ఞాన వరవాలుచేబూని
గరిమె జనితేంద్రియముల ఖండించరయ్యా! ॥గురు॥

తరచు పశువులమీద ధనధాన్యములమీద
సరసమిత్రులమీద సంపదలమీదన్
అరయనన్నిటిమీద అతిమోహముండినను
మరిసైశ్యుడిలలోను మడుసువిధమగునూ ॥గురు॥

దిక్కనుచు సద్గురుని దివ్యపదములునమ్మి
మొక్కలపుబొంతులును నుక్కడచితుదనూ
చొక్కమగుపూదోట చక్కనయ్యనుగూడి
మిక్కిలి ననంతమై మెరయరోయన్నా! ॥గురు॥—4



దుర్మతుల నెడబాసి తుర్యభక్తినిమీరు
మర్మమగు శ్రీగురుని మార్గమునుదెలసి
కర్మధర్మంబులును ఖండించి మీ మదిని
నిర్మల నిరాకార నిష్క్రియునిదెలుడీ

ప। హితవుతోజెప్పెదను యిలమీద జనులార
అతిదుర్లభముసుమ్మి అరయ నరజన్మంబు ॥హి॥

జనని జనకులు కాళ్ళ పెనగొన్నగళములు
తనదుయిల్లాలు సుతులును బొందయగును
వినుడి మిత్రకళత్రులును గట్టి శిలలగును
కనుగొనగ సంసారమును బంధకమునా ||హి||

అరయ భోగములన్ని అపుడె నెరకుచియగును
పరికించ యిన్నిమది బలువిషంబగునూ
గరిమతోనివి తృణముగాజూచి ధరణిపై
పరమభక్తులగూడి బ్రతుకరోయన్నా ! ||హి||

వలసి కుమ్మరిపురువువలెను నజ్ఞానమగు
మలిన పంకములోను మరి చెరింపుచును
కలసి కలయకమీరు ఘన చిదానందులై
తలపు మరపులుమించి మెలగరోయన్నా ||హి||

సర్వమును బ్రహ్మమని స్వానుభవముచేత
నిర్విషయులై చాల నెరయవీక్షించి
సర్వమగు పూదోట స్వాములస్వరూపులై
నిర్వికారులునగుచు నిలువరోయన్నా ! ||హి|| — 5



యిల తరువులును బుట్టి పొలసి పోయినపగిది
జలబుద్బుదము పొడమి సమసినట్లరయ
కలితవిద్యుల్లేఖ ఘనమేఘమున నెడలి
యలరినప్పుడె నష్టమై పోవువిధము

ప॥ ఇటులచెడి యదృశ్యమగు నీ మాయాతనువులు
పటుతరంబైన సత్పద మంటుడికను ||ఇ||

బెట్టుగాకూయిడిన పెనుపలుకు రాత్రిలో
నట్టె శబ్దంబగుచు నణగు విధమునను
చుట్టు పొడవైయున్న సొంపైన ఘటములో
నెట్టుకొని జలమచట నిలువకున్నటుల ||ఇ||

జనులార వినుడి ఈ సంపదలు మదిలోను
కనుగొనగ జీమూతగతి ప్రబలుననగు
పనిబూని పూదోటపై నిర్గుణ బ్రహ్మ
మునుగూడి అమృతులగుచును నిలువరయ్యా! ॥ఇ॥—6

వనిత మేనులు తెలియ నొనర రుధిరము పలల
ము శల్యమును నరములును కప్పతోలు
కనుగొనగ కుక్షిలో కసరు మలమూత్రముల
కునికి యూరువులు రొంపికిని చెడుగు డొక్క

ప॥ మనమలర నిటువంటి మగువలను కాముకులు
కనుచు పుత్తడి బొమ్మలనుచు పొగడెదరు ॥మన॥

అరయ వెనుకను తెలియ నీతి బాహ్యముగు కుంట
పరికించ ముందటను బహుమురికి గుంట
మరిసతుల పాలిండ్లు మాంసంపు గంతులగు
వరుస సర్వాంగంబు లొనర దుర్గంధం ॥మన॥

పలుపాపముల కెల్ల పట్టుగానున్నట్టి
వెలదులరమించ ప్రత్యక్ష నరకమునా
లలిత పూదోటపై కేవల సద్గురుని సుతులు
కలలోన మరచి వీరల తలచబోరు ॥మన॥—7

వసుధనార్గురు చక్రవర్తులును ఖేచరులు
పొసగ పదునారుగురిట భూపాలకులును
అసమానులై పృథివికై బోరి తెగిరి తుద
యిసుమంతపసిడి తనువెంటగొనిపోయిరె

ప॥ ఇలభోగములునమ్మి యీ రీతి చెడిరయ్యా
ఫొలుచువిద్యుల్లేఖ బోలుసుఖములకై ॥ఇల॥

ముజ్జగంబులవారు, మునులు ఋషిమనువులును
బిజ్జిలుడునాది శివబేధవాదులును
రజ్జుసర్పభ్రాంతి రమ్యమని విడువరివి
సజ్జనులు వినుడి యీ సౌఖ్యములు వలదు ||ఇల||

నిగమాంతశాస్త్రములు నిజయోగమార్గములు
సగుణమోక్షములుమది సరకుసేయకను
సగుణులై పూదోటకవలను నిరామయుని
సుగుణవృత్తినిగూడి సొంపుతోనిలుడీ ||ఇల||—8

---

నిరతము ప్రాణుని నిరసింపుచునే
నురగి దరిమి తుద నగ్రనేత్రముఖ
నెరమంటలచే నిఖిలభూతములు
దరికొని కాలగ ధరపై నేనిక

ప|| నిలువలేనె యోగురమూర్తీ! నీ నిజపదమంటక నాస్వామీ
పలుకుల వలపుల పరిపరివిధముల
తలపులోను వెలి తాండవమాడగ ||ని||

పెళపెళ ప్రణవము బెట్టుగ మ్రోయగ అలరుచుమది
దివ్యామృతము ద్రావుచు
ధళధళమను వెలితారక మెరుపులు
నిలిచి నిటల తుదనిండి వెలుగనే ||ని||

అరుదుగ రవిశశి అనలవార్ధిపై
గురుతుగ ప్రబలెడి సరసిజాంతమున
నిరుపమ జ్యోతిని నిర్మలచవికెలో
దొరకొని నే పూదోట విభుగనక ||ని||—9

## హంసోపాసన

వినికని తన మదిని విమలాత్మ్న ధ్యానించి
ప్రణవమున నాసాగ్ర పవను బీల్చియును
అనలంబు రేచియును నహిలోకమును జొచ్చి
అనిలుచే కచ్ఛపము అదరిపడినపుడు

ప॥ శంక యేమిటికి మదియింక యిలపై తనకు
పొంకముగ పూదోట భోగికృపగలిగి ॥శం॥

అధికముగ పీడించ ప్రాణు తీవ్రముగాను
చదిపి స్వాధిష్ఠాన చక్రమున నిలిపి
హృదయ ప్రాణుని నాభిక్రింద జేర్చియు తాను
పదిలంబుగా ప్రాణఽపాను సమకూర్పన్ ॥శంక॥

వెలయు డెబ్బది రెండువేల వీధులు దిరుగు
మలయు ననలమున కల్మషను కరిగించి
చలమునను ఫణిరేచి సర్వతత్త్వంబులును
కలియ గూర్చుక బిందు కంఠమున నిలను ॥శం॥

పరికించగాలిచే బ్రహ్మరంధ్రము జించి
గరిమె రవిచంద్ర మార్గములు తడకట్టి
శిరసు తుదలో బైట చిత్కిరణములో ప్రబల
గురిమీర తాను త్రైకూటమున నిలను ॥శం॥

అట్టి తేజము మధ్య నకలంక దీప్తులను
గుట్టు చిద్వ్యోమమున గురుతుగా నిలిపి
దిట్టడై పూదోట దేవదేవుని గలిసి
బట్టబయలై తాను ప్రబలుచును యెపుడు ॥శం॥—10

## హంసయోగము

పంచశిరములుయెత్తి పణిమింటికిని సిగుడ
పంచవర్ణములచిలుక పలుక మధుసురిసెన్

పంచాగ్నిమధ్య భానుడును నుదయించె
పంచముఖములను ప్రభవించె కిరణములు
ప॥ జలమధ్యమున బిందు చెలరేగియాడగను
నిలిచి సుజ్యోతియై నిండి వెలుగుచును ॥జ॥
అష్టదిక్కులుమీరి యాదిమధ్యాంతముస
చేష్టలన్నియునుడిగి చెలగి వేడుకను
అష్టదళపీఠమున హంసయైచరియించి
యిష్టమై తాతుదను యేకమై ప్రబలున్ ॥జ॥
మనసు పంచాక్షరీమంత్ర బీజంబగుచు
మనసు చిదాకాశమున మరియునిలుచు
మనసు వెలినిండి మహాతేజమగుచు నా
మనసు పూదోట రామునిమరగియుండున్ ॥జ॥—11

పురికొల్పి రెంటియును, భుజగంబు నెగయించి
అకుమగాబిందువును అటకబోజిమ్మి
యురువడిగ గాలిచే యూర్ధ్వశక్తినిరేచి
మరిప్రణవమున త్రివిధ మలము లణచగను
ప॥ కలదు జీవన్ముక్తి ఘునచిదాకాశమున
నిలిచి నిజగురుపదము కలియు జాణలకు ॥కల॥
కణగి స్వాంతమును నా కంఠబిలమునజొనిపి
ఘునమారుతము ముక్తికన్యతోగూర్చి
పనిబూని నిర్గుణప్రకృతికవ్వల నిలిచి
అనుదినము పరమహంసయై చెలగుచుండన్ ॥కల॥
తలపోయ శుద్ధచైతన్యుడై మెలగుచును
చెలగి సద్భక్తితో శీఘ్రముగ మరియు
పనిబూని పూదోట బ్రహ్మమనుసత్పదము
కలసి తన్మయులైన ఘునులకే గాక ॥కల॥—12

పదిదళములక్రింద ఫణి రేచినపుడె
పదిలముగఁ బానుడు ప్రాణుని గూడెగదరా
పదినలుగురితో బిందు పరగ సుషిరము జొచ్చి
పొదలుచు చిన్మంత్రమున నిలిచెగదరా

ప॥ పరుని గనవలెరా తాగుడు నంటవలెరా
అరయు తారక బ్రహ్మమై వెలగవలెరా! ॥ప॥

నాదబిందు కళలనడుమ నమృత జ్యోతియై
మోదుచు వేదాంతమున ప్రబల వలెరా
సాధుడై మహదాది జగములంటి తాను
ఆదిచిదాభాసుడై వెలగ వలెరా ॥ప॥

కదసి వెన్నెలబయట క్రమముతో డుత నిలచి
వదలకను భక్తితో వర్తించ వలెరా
అదిగో పూదోటపై ఆత్మరాముని గూడి
పదిలుడై తాబట్ట బయలుగావలెరా ॥ప॥—13

---

మనసు చిన్మ్వన దివికి మరిపుటము లెగయఁగను
పనిలుడు సుషుమ్నానాడి జొరగ తుదను
కనుగొనగ సర్వమును కరిగించి స్వాంతమును
వసర భ్రూయుగ మధ్యమున నిలిచినపుడు

ప॥ పరువడిగ నానంద బాష్పములు గురియఁగను
గురుని లోపల పరమ గురుని గనవలెనూ ॥ప॥

ఎండవెన్నెల కడను పుండరీకంబునను
అండజేసుకను తా నవల తెలియఁగను
అండ పిండాండములు నాముకొని నిర్బైట
నిండి స్వయం జ్యోతి నిలిచి వెలగగను ॥ప॥

పరమ కారణమగుచు బఁసి చిత్కళలతో
గురిగ వెలుఁగుచు రత్నకుంభంబు రీతి

మునియుమను పూదోట మూలబ్రహ్మము గూడి
తరలకను స్థిరశూన్య తత్త్వమై తనరు ॥పరు॥—14

---

అగ్ని కాకతో పాము వెడల అష్టతనువులపుడు విరుగ గంటినే
ప్రజ్ఞ మెరసిబిందు నడవీథిలోనొక్క పరువుబారగగంటినే
సంజ్ఞలైన సూర్యచంద్రులు నిరుగడల సరిసేయ నడువగంటినే
అగ్నిసరసిని పరమహంసయై జలజమున నాటలాడగగంటినే

ప॥ ఓ గురుమూర్తి కలగంటి కలగంటి మేల్కొంటినే
కలలోనవెలినిండి ఘనతేజమగు దివ్యకలలోనే నిలగంటినే ॥ఓ॥

పట్టువిడిచి పంచభూతేంద్రియంబులు పరువులెత్తగ గంటినే
గట్టిగసర్వము రుద్రాగ్నిజ్వాలల కరిగిపోవగ గంటినే
పట్టపగలు పండువెన్నెలబయటనే బ్రహ్మకళలను గంటినే
చుట్టు సహస్రకోటి దీప్తులునిండగ సుజ్యోతినే గంటినే ॥ఓ॥

మంతుకెక్కిన చిత్కళ లమృతబింధువులు మర్మవీధిని దుంకనే
చింతలుడిగి చంద్రామృతధారలు మదిని చెలగి రుచులు గంటినే
అంతరంగమునందు నానందపదమునై అంటివెలుగ గంటినే
కాంతిమీరిన పువ్వుదోట రాముని పదము కదసి వెలుగ
గంటినే ॥ఓ॥—15

---

గుణములుమూడు బెనచవలెను
ప్రణవ ఘనరవము లాలించవలెను
గొనకొని ప్రాణాపానునిగూర్చి
క్రిందైన పణిరాజు నెగయించవలెను

ప॥ మనసు తన్మయము గావలెను
తాను యినునిగతి వేదాంతమున వెలగవలెను ॥మ॥

ఇచ్ఛహృదయము దాటవలెను
ఘనసు స్వచ్ఛమై తుదకు సథవథలెను ॥ఘ॥

చొచ్చిద్విదళము తుదను
సూక్ష్మచక్రముమధ్య ముచ్చటతో తా ప్రబలవలెను ॥మ॥
షష్ఠబ్రహ్మల గూర్చవలెను
తానుదృష్టి గోచరము గావలెను ॥మ॥
అష్టదళపీఠమున హంసయైచెలగి గురు
నిష్టచెదరక నుండవలెను ॥మ॥
ఎండవెన్నెల మించవలెను
బైట పుండరీకమున నిలువవలెను ॥మ॥
దండిసాహస్రదళముల
పైని చిత్కళలు మెండుకొని దివినిండవలెను ॥మ॥
తనరుజ్యోతిని మీరవలెను
తాను ఘన చిదాకాశమవ్వవలెను ॥మ॥
పనిబూనిపూదోట బ్రహ్మంబునూగూడి
మొనసి నిష్క్రియుడు గావలెను ॥మ॥—16

---

కదసి యూర్పులు నిగుడకుండలి గగనవీధికి చొకలించక
మదిని ప్రణవంబాలకించక మండల త్రితయంబు మించక
కదిసిబిందువు గాలిహంసము ఘనతసుషిరము జొచ్చి యవ్వల
చెదరకను హృత్కమల మధ్యను చెలగియాడకను

ప॥ యోగమూరికె గలుగునె మరియుర్విపై బహువేషభాషల
యోగచర్యలుమీరు నిర్గుణయోగి యిదియనిచూపక ॥యో॥
భగ్గునను చిద్బ్రహ్మదీప్తులు భావవీధిన బ్రజ్వరిల్లక
నిగ్గుమెరుపులు సూక్ష్మబైటను నిండిబ్రహ్మండమున వెలుగక
ముగ్గురాదిగ జ్ఞానవహ్నలొ మొనసి సర్వము జెరచి నిలువక
తగ్గిపరశివునందు నాత్మని యొనరగూర్చకనూ ॥యో॥
నిరుపమంబై గాజుకుప్పెలొ నిలిచివెల్గెడి దివ్యకైవడి
ద్వారయుగమును దివ్యాంజనముపై తొలగకను చిద్వ్యోమమైతుద

అరయగా నిర్గుణుడునగుచును అమృత పదమై మెలగివేడుక
భరితముగ పూదోట రాముని పదమునంటకను ॥యో॥—17



పదమూలమగు సిఖయు పవనమున సంధించి
చదురు మూలాధారచక్రమున గడచి
పొదలి స్వాధిష్ఠాన పురము నధిగమించి
పదిలముగఁ బానుని ప్రాణు గూర్చకను

ప॥ యోగ మూరక కలదెయుక్తి శక్తులచేత
శ్రీగురుని కృప తనకు సిద్ధంబుగాక ॥యో॥

చిప్పనను దశదళముల క్రింద జెలగు శక్తిని లేచి
ప్రణవతో హృదయ చక్రస్థుడగుచు
త్రివిధమలములు విమల దివ్యాగ్నిచే జెరచి
జవముననను హంస పశ్చిమ వీధి జొరక ॥యో॥

ఘంటానాదము వింట కళల బిందువులొలుక
అంటి జిహ్వాను రుచులు కంట గ్రోలుచును
జంట చక్రము తుద జ్వాలాచక్రమునంటి
మింట గాయిత్రియును మెరసి తాగాకన్ ॥యో॥

చెదరకను లోబైట చిక్కిరణములు ప్రబలగను
కదసి రజితాద్రిపై గ్రమ్ముకొని వెలుగు
అదిగో హంసం బెపుడు అష్టదళపీఠమున
పొదలుచును గురునిగని పొగడియాడకను ॥యో॥

అరయుచు చిదానందు డగుచు నతితుర్యమున
గరిమెతో జ్యోతి చక్రమున స్థిరమగుచు
గురువైన పూదోట గురునిగూడ నవధూత
సురలు బొగడగ సర్వశూన్యమున దెలుగు ॥యో॥—18

నిష్ఠతో పెనుబాము లేచియు నీరు నగ్నియు గాలిగూర్చియు
అష్టతనువులు నాక్రమించియు అధికడపట హంసగూర్చియు
అష్టదళముల మధ్యనెపుడు అమృత జ్యోతైనిలచిదనరుచు
దృష్టికొనలను పరమహంసై తేజరిల్లుచును

ప॥ శాంత బీజములతుద సత్పదపు జాడ తెలియుచును
అంతలో నమనస్కపదమున నంటి చిన్మయమై వెలుంగుచు ॥శా॥

నిద్ర లేచియు మేలుకంటను నిలిచి మెలగెడి, గురునిగనుగొని
భద్రమగు తనలోని వస్తువు భావమధ్యను గోచరించగ
రుద్రగుండములోని యమృతము రూఢి జిహ్వాగ్రమున గ్రోలుచు
ఛిద్రసము తానై బట్టబైల చెలగి మెరయుచును ॥శా॥
ముద్రలైదును మీరి శాంభవిముద్ర దెలియుచు తీవ్రమున తా
ముద్రయగు నంబరము రీతిని మొనసి సర్వము నంటివెలుగుచును
భద్రమగు ఖేచరియు లోపల పరమసద్గురు పదముగనుగొని
ఛిద్రసదృష్టులను పూదోట రాముని చెలగికూడుచును ॥శా॥—19

---

పదపార్శ్వములమధ్య ప్రళయాగ్నియును రేచి
గదిమి ఆర్గురిదరిమి కడుశాంతమునను
కదసియనిలునబిందు గగనవీధినిజొనిపి
చెదరకను ప్రణవమునుచెలగి కూర్చకను

ప॥ వట్టివేషములచే పరమోక్షమునుగలదె
పట్టైన సద్గురునిపదము బట్టకను ॥వట్టి॥

కరగి దివ్యాగ్నిచే కరుగుచును పూదేనె
తనరి సెలయేటిముత్తమున దుంకగను
చనుదెంచి జిహ్వాతుద చంద్రామృతముగ్రోలి
దినకరునిమద్యమున తేజరిల్లకను ? ॥వట్టి॥
అగ్నిమండలముతుద నానంద పదమగుచు
ప్రజ్ఞతో రజితాద్రిపై వెలుంగుచును

సంజ్ఞతో పూదోట సద్గురునిపదమంటి
సుజ్ఞానులైబైట సొంపుమెరయకను ? ॥వట్టి॥—20

—∞—

నీలతోయదమధ్య సద్గురుని నిల్చిచూచుచు
చూపులచే నాసాగ్రదిరిగె పవనుని యెగబీల్చి
చాలనయనాగ్రమున విమలకళలు వెలుగగంటి
గెంటక సద్గురుని పదములంటి యచటవుంటి

ప॥ కంటి కంటినీ యీ ప్రకృతి వీడ కంటి కంటినీ ॥కంటి॥
మనసుతోడను పంచతత్త్వముల నెంచిగూర్చుచూ
దిననాధచంద్రులు నడచే తెరవులుబంధించి
పనుపడిబింధువు బ్రహ్మపదమున తాజొనిపి
కనుగొన త్రికూటగిరిపై గ్రక్కున తానిలిచి ॥కంటి॥
అదియమూలమై ఆదిమధ్యాంత మేకతేజమై
చెదరక సర్వశూన్యమున చిద్రూపుని తామించీ
అదిగొ పూదోటరాముని సంటిమదినిసాక్షి
సదమలానందమున సర్వసాక్షైతుదనిలిచి ॥కంటి॥—21

—————

పంచేంద్రియముల పసువులెత్తించి మీ పాదమునుబట్టితిని గురుపతీ
పొంచిమది నీ దివ్యామృతము జిహ్వానుయెంచుచుగ్రోలితినె గురుపతి
మించివెలగు మీ రూపముమది నే నెంచ నలవియగునె గురుపతి
పంచకోశములపై నటియించెడి బ్రహ్మమా ననుగావు గురుపతి

ప। గట్టిగ తామస జ్ఞానులగూడినే కలసియుండలేనె గురుపతి
దట్టమైన దుర్మార్గులచెండుచు దయతో నన్ప్రోవు గురుపతి ॥గ॥
పెక్కువిధములగు హంసలు మేడవునెక్కి నిలచినపుడె గురుపతి
చిక్కువీడి హృత్కమలమధ్యమున చిన్మయమైతిగదె గురుపతి
చక్కగమదిని నీవాతదీపగతి మిక్కిలివెలుగుచును గురుపతీ !
మొక్కడజూచిన జీవకోట్లతుద నేకపదమునీవె గురుపతి ॥గ॥

పట్టువిడిచిసర్పము వెడలిన మహా ప్రళయముదోచుగదె గురుపతి
చుట్టుక రుద్రుసికంటిజ్వాల జగమట్టైకాల్చెగదవే గురుపతి
గట్టిగ పదుగురితో హంసము చిద్గగనముమీరెగదే గురుపతి
బట్టబైట పూదోటగుసడ మీ పదమంటితిగదె గురుపతి ॥గ॥—22



నిష్ఠతో భుజగి రేచి నీరునగ్ని గూర్చి
దృష్టిమధ్యనిలిచి తాను త్రిపురములు సాధించి
యిష్టము మదిలో తెలసి యీశుడై తా నెరసి
చేష్టలుడిగి హృత్పీఠమున చిన్మయుడై ప్రబలకను

ప॥ ఏలడంభము షడ్దర్శనము లేల జంభము
వేళయెరిగి గురునిలో తానేనని మెలగుచుండె ॥ఏ॥

తనువులన్ని బెనచి తుర్యతనువు నంటగూర్చి
దనరు మించి జ్యోతితుదను తారకమైనించి ॥ఏ॥

అనుదినము పరమాహంసయై ఆనందమున నిల్చి
వనరమిన్నులైదు మించి వన్నెకెక్కి మెరసి ॥ఏ॥

దండి తేజోమార్గమున దాటి కడను మెరసి
పండుపండి వదలురీతి ప్రకృతులు భేదించి
నిండుభక్తితో పూదోట నిజగురుని తాగలసి
పండినిండి బట్టబయలై బ్రహ్మమై తానుండె ॥ఏ॥—33

## అఖండసాధన (హంసయోగం)

బంధించి రంధ్రములు ప్రాణపానుని
రెంటిసంధించి తీవ్రముగ నేసఖియా
అంధకారంపు భుజగిని రేచి శతృవుల
హతముగావించి మించి సఖియా
బంధురపు మారుతముతో గూడి
బిందుస్థంబంధ నడవీధినడచ సఖియా

సంధించి యమృతధారలును నయనాగ్రమున
చాలగా వర్షించునే సఖియా
ప॥ శంకయేటికి తనకు సద్గురుని పదమంటి
సరిగ క్రీడించగను
పొంకముతో సద్గురుడు పొసగ జీవన్ముక్తి
భోగనను కృపజేసెనే సఖియా ॥శం॥
ఘంటానాదమును నడిమింట్రమోవగ
నుభయకర్ణముల నే వింటినేసఖియా
అంటి జిహ్వాగ్రమున నానందమున నేను
అమృతపానము జేసితినే సఖియా ॥శం॥
కంటెలోపల దివ్యకంటి చిత్కిరణముల
మింట నద్భుతముగానె సఖియా
జంట బాయకగురుడు జలజాంతరంగమున
నంటి మెలగగ గంటినే సఖియా ॥శం॥
అక్కరతోపగలు రేలునుమీరుచు నేను
ఆనందమునజూడ సఖియా
చక్కగా విషయసూన్యమున చంద్రునిమధ్య
జలజాక్షి నెలగ గంటి సఖియా
చొక్కమగుజ్యోతి సింహాసనముపై గురుడు
సొంపు మెరయగ గంటినే సఖియా
అక్క! పూదోటరాముని పదమంటినేనపుడు
తన్మయ మొందితి సఖియా ॥శంక॥—24

---

పరమాత్ము ధ్యానించి ప్రాణు నిరోధించి
తరిమి భుజగిని సర్వతత్త్వముల తోడన్
తిరముగా మనసుతో తీవ్రముగ గూర్చి తా
తనువాత సూక్ష్మ రంధ్రము జొచ్చి తుదను

ప॥ నిలిచి నిగమాంతమున నిజగురుని జూచితా
నలరి కలసి చిదాత్మునై ప్రకాశింతూ ॥నిలి॥

సరసిలోకడ హృదయ జలజాంతరంగమున
మరియు గోవుల్లాస మండలము లోను
పరమ నిర్వాత దీపమురీతి తనరుచును
నిరుపమానందమున నిలిచి వెలుగుదునూ ॥నిలి॥

పరిపూర్ణమగు జ్యోతి బయట వీక్షించినే
పరమ తారకమగుచు ప్రజ్వరిల్లుచును
సిరిమించు పూదోట శ్రీ గురుని గూడినే
నెర నిరాలంబమై నిలిచి తనరుదును ॥నిలి॥—25

---

యెలమి గురుమార్గమున నెగయించి కుండలిని
చెరగి తీవ్రత హృదయ జలజమును దాటి
కళలుగూర్చక నేను గగనవీధిని నురికి
అలరి నిగమాంతమున నిలిచి వెలుగుచును

ప॥ కాలునికి సాక్షేసి కడను ప్రకాశింతు
నీల తోయదమధ్య నిర్వికల్పుడనై ॥కా॥

నిద్రమేల్కొని లేచి నెరభక్తి యుక్తితో
ముద్రలైదును మించి మొనసి వేడుకను
చిద్రసదృష్టిచే శ్రీగురుని వీక్షించి
భద్రమగు నిర్గుణ బ్రహ్మమై తుదను ॥కా॥

నవకంజములు గడచి నయముగోరుచు మదిని
పవన బంధువులు వర ప్రణవమున గూర్చి
వివరించి పూదోట విశ్వసాక్షిని గూడి
అవుర నిర్గుణ తత్త్వమై వెలుంగుచును ॥కా॥—26

అది దెలసి పీడించి ఆ కుంచనము జేసి
చదరకుండలు రెంటి చేర్చి వహ్నియును
పదిలుఁడై రేచి పెనుబాము నురికించి తా
ముదముతో నగ్ని బిలమున జొచ్చి యవలన్

ప॥ పంచ మాతృకల తుదను ప్రణవ స్వరూపమై
మించి ఆనందమున మేను మరచితిని ॥పంచ॥

పలుమారు శ్రోత్రముల ప్రణవనాదము వినుచూ
చెలగి ఖేచరినంట జిహ్వా గూర్చియును
వలసి యమృతము గ్రోలి వరయోగి మార్గమున
సొలసి మదిలో జ్యోతి కళలు జూచుచును ॥పంచ॥

స్వరములను బంధించి చంద్రార్కులను మించి
నిరతమును నిర్భైట నిలిచి మెరయుచును
పరమ తత్త్వంబు దన భావమున దలపోసి
నెరయ ధ్యానించి నే నిష్కళంకుడనై ॥పంచ॥

వెలిలోను వెలగి తుద జలజాంతరంగమున
నలరు నాదము బిందు కళలాక్రమించి
బలసి శతకోటి రవి ప్రభల విరచితమునై
మెలగు స్వయంజ్యోతి మించి వేడుకను ॥పంచ॥

పరికించి తారక బ్రహ్మమై యవ్వలను
నిరుపమ నిరాకార నిర్ద్వంద్వమగుచు
వరనుడగు పూదోట గురుని పదమంటినే
నరయగా సత్పదంబై వెలుంగుదును ॥పంచ॥—27

---

చక్కగా దృష్టిమది సద్గురుని పైనుంచి
యుక్కణచి చుట్టున్న యురగమును రేచి
గ్రక్కున ముప్పదేనారు కళలుగూర్చుక ముఁగురి
ధిక్కరింపుచు సూక్ష్మదిడ్డిజొచ్చియును

ప॥ పనువడియు నలచెన్ను భ్రమలపడకను నేను
గుణరహితమైన సద్గురుని గూడితిని ॥ప॥
కంటిదృష్టులతుదను కమలాంతరంబున
నొంటియింటనునిద్ర వసర మేల్కనుచూ
ఘంటానాదమునువిని ఘననేత్రమును దెరచి
అంటిసర్వముగాల్చి అమితమైయుందూ ॥ప॥
మిక్కుటపు సత్కళలు మెరసి ప్రకాశించ
నెక్కువగు జ్యోతిపై నేకాక్షరమునై
అక్కరతొ పూదోట ఆత్మరామునిగూడి
యొక్కటై ధృవపదంబొనర నేసగుచూ ॥ప॥—28



పరమకోటరమందు ప్రచరించు మారుతము
పరికించి క్రిందికి పరగపావకు రేచి
విరివి డెబ్బది రెండు వేల నాళములలో
తిరుగుపవనము తీవ్రగరిమె పూరించీ

ప॥ నిరతమును సద్గురుని నిలపి తనమదియందు
పరమ తత్త్వమున మది బంధించవలెను ॥నిర॥
నవరంధ్రములుమూసి నయముతో చివ్వనను
దివికహిని తీవ్రముగ ధృతితోడ నెగయించి
పవన భూతేంద్రియములు బంధించి బుద్ధితో
వివరించ కంఠమున వేడ్కతో నిలచి ॥నిర॥
సడిమియింటను ఘంట నాదంబు మ్రోయగను
జడిగొనుచు సుధారసము చాలద్రావుచును
కుడియెడమ దృష్టులను గూర్చి భ్రూయుగముకడ
నెడ తెగని సత్పద ధ్యానమున నలర ॥నిర॥
అరుదైనగాలిచే నంతరాళము జించి
యరికి ముదమున జొచ్చి యూర్ధ్వవాకిటను

మెరసి శృంగాటమును మించివెన్నెలబైట
పరిపూర్ణ కళలపై పరమాత్మగనుచూ ॥నిర॥

ప్రకట సాహస్రదళ పద్మమధ్యను వెలుగు
నకలంకమైన జ్యోత్యంతరంబుననూ
సుకరమగుపూదోట సుందరాంగునియంటి
సకలజీవులతుదను సాక్షియైయుందూ ॥నిర॥—39

## హంసయోగమున నిష్ప్రపంచస్థితి

పరమ సద్గురుకృపను పవనము నిరోధించి
పరమకుండలి లేచి సర్వమునుమించి
పరువెత్తి నడవీధి బ్రహ్మరంధ్రముజొచ్చి
పరికించ సత్కళల బయట వెలుగుచునూ

ప॥ స్థిరముగానే తుదను చిద్రూపమై మెరసి
పరమ స్వరాట్టనెడి బ్రాహ్మణుడనగుచున్ ॥స్థి॥

అజపాక్షరములు ప్రణవాక్షరంబునగూర్చి
విజయంబుబొందితా విమలాత్మయగుచు
అజపదంబై నేను ఆనందమయుడనై
నిజగురుని నిర్బైట నిలచి వీక్షింతున్ ॥స్థి॥

చెలగి సాహస్ర రేకుల చక్రమున నెపుడు
నిలచి యంతర్జ్యోతి నిండి వెలుగగను
అలరి విశ్వముజెరచి యకళంకయోగమున
మలినము లేక నిర్మలుడనైయుందూ ॥స్థి॥

పంచాగ్నులనుమించి ప్రజ్వరిల్లుచు నేను
పంచ బ్రహ్మలమీరి పరిశుద్ధ మగుచున్
పంచవర్ణంబులను పరమనిష్ఠనుదాటి
మించి తేజముసనే మెలగుచుందుమను ॥స్థి॥

 

వివరించగాతుదను విశ్వతోముఖుడనై
అవిరళంబుగ సర్వమంటి ప్రబలుచునూ
ఔర ! పూదోటపై అద్వితీయునిగూడి
భవములును ఖండించి బయట తనరుదును ॥స్థి॥—30

---

మొదలైన ప్రణవముఖమున వెలిగెడి పవను
మదివేగమున దివిచి మణిపూరకమునకున్
కదిసి యమృతముక్రింద కచ్ఛపముభేదించి
అదిగో పాతాళంపు టహిరేచినపుడున్

ప॥ పన్నగాశిపుకంట ప్రణయాగ్నిజ్వాలలను
చెన్నుమీరిన సర్వచేతనములణగున్ ॥పన్ను॥
వెలయ డెబ్బదిరెండువేల వీధులపవను
కలయపూరించి దుష్కర్మములు జెరచి
అలనాభిక్రిందైన అచలఫణినెగయించి
తలచి బందువు తాలుమూల నిలువగను ॥పన్ను॥
కుడి యెడమ, తడకట్టి నడినాళమునజొచ్చి
జడియకను తాసూక్ష్మ శక్తిదరుముచును
పుడమిపై నిలిచియును, భూతేంద్రియమారుతము
నెడ తెగని శబ్దమున యెనయగూర్చగను ॥పన్ను॥
జలరాశికడ విమల జలజాంతరంగమున
నలయూర్ధ్వ కుండలియు సమితమైయుండున్
తలచివేయి శిరములను తరచు రత్నములలరి
బలసి శతకోట్యర్క ప్రభలతో వెలగున్ ॥పన్ను॥
మరిబయట పణిరాజ మండలాంతరమునను
అరయ చిచ్ఛక్తియు ననంతమై ప్రబలున్
పరిపూర్ణజ్యోతితుద బ్రహ్మమై విలసిల్లు
గురుడైన పూదోటగురుని గూడితిని ॥పన్ను॥—31

---

## హంసోపాసన

పన్నగేంద్రు రేచగ ప్రళయమైనది
సన్నబిలము జొచ్చిపోవ సఖియయున్నది
వన్నెలైదును మీర పండువెన్నెలయున్నది
పండు వెన్నెలబయట పరతత్త్వమున్నది.

ప। వింటి కంటి గురునిరూపు విమలజ్యోతియందు
అంటి మేనుమరచి బయట నమితమైయుందున్ ॥విం॥

ఆరుపూలమీదచూడ అదిగో మేరువున్నది
నీరుమధ్య తేజరిల్లి నిలచియున్నది
మేరువంటి జగములన్ని మెరయుచున్నవి
పారజూడలోను బయట ప్రబలుచున్నది ॥విం॥

పాపలపై పరమపదము బయలైయున్నది
చూపులలోను నిలిచి ముక్తిపాప యున్నది
ఆపోజ్యోతి మధ్యమెరసి యాడుచున్నది
పాపశిరసుపైని పూదోట ప్రభువున్నాడు ॥విం॥—32

---

అనిలు నిరోధించి ఆరు మూడునుగట్టి
వసర రెంటినిగూర్చి వాసుకిని రేచి
తనకు ముప్పదియారు తత్త్వములు మదితోను
మెనసి యాత్ముడు కంఠబిలముననుజొచ్చి

ప। అంటి రసనాగ్రమున నమృతపానముజేసి
ఘంటానాదమువింట కళలు వీక్షింతున్ ॥అం॥

అజపాక్షరములతో నంతరాళముజొచ్చి
భజనచే రవి చంద్ర పావకులమీరి
రజితగిరిపై తరచు రత్నదీప్తుల ప్రబలు
నిజమైనజ్యోతి తుద నిర్గుణుని గనుచున్ ॥అం॥

మరి జ్యోతిమండలము సరిమించి తీవ్రముగ
మరియు చిదాకాశమునుజొచ్చి తుదను
గురువైనపూదోట గురుని పదమునగలసి
నిరతమును నిర్బైట నిలచి వెలుగొందూ ॥అం॥—३३



మెరసివేయి రుచులతో మిత్రుడునుదయించి
విరివిగా జలజములు వికసించునపుడున్
స్థిరముగ త్రికూటమున చిద్బీజమును ప్రబల
గరిబొడిచి సూక్ష్మపంకజము వికసించున్
ప॥ పరువెత్తిమారుతము బ్రహ్మరంధ్రము జొరను
అరుదుగాజలమధ్య హంసనటియించున్ ॥పరు॥
సరసముగ వనధికడ చంద్రుడును నుదయించ
సరసిలో కలువలును అరసివికసించున్
సరగలోబయట విజ్ఞానచంద్రుడు వెలుగ
గరిమెచ్చిత్తచకోరము కళలుద్రాగున్ ॥పరు॥
విరివగు సహస్రదళ సరసిజాంతరమునను
సురుచిరంబగు పరంజ్యోతికవ్వలను
స్థిరమైనపూదోట శ్రీగురుని గలిసితుద
నిరవలంబంబగుచు నిండివెలుగుదును ॥పరు॥—३४



ప్రకృతిరూపంబైన ఫణిరాజు నెగయించి
విశ్వగుణములు జెరచి విజయమున మరియు
సుకృత దుష్కృతములను సొంపుతోగాల్చి నే
సుకృతజ్ఞానుండనై జగతి మెరయుదును
ప॥ రాకపోకలు జెరచి రాజయోగినిగూడి
శోకరహితంబునై సొంపు మెరయుదును ॥రాక॥
సంగతిగ బిందువును నింగికినిబోమీాటె
గంగ యమునలమధ్య ఘనమూలదెరచి

శృంగాట మార్గమునజొచ్చి సద్గురుపదము
పొంగి లోబయటనే పొసగ జూచుచును ॥రాక॥

గట్టిగ సహస్రదళ కమలాంతరంగమున
చుట్టి ప్రబలెడి పరంజ్యోతిబయటలను
గుట్టైనపూదోట గుణరహితునంటినే
దిట్టనై నిర్భైట తేజరిల్లుదును ॥రాక॥—35

తల్లక్రిందైయున్న తక్షకుని భేధించి
తల్లడించగ సర్వ తత్త్వములుగాల్చి
మెల్ల నేబిందువును మింటికినిబోమీటి
కొల్లలుగ నమృతంబు గ్రోలివేడుకను

ప॥ నిరతమును చిత్కళలు నిటలాంతమున గనుచు
పరమ సద్గురుదివ్యపదము గనుగొంటి ॥నిర॥

కదసి చూడగ హృదయ కమలాంతరంగమున
కుదురుకొని యోంకార గురుడు మెరయుచును
ఇదిగో శతకోట్యర్కు లెనసి ప్రబలినయట్లు
అదిగొవెలిలోనిండి యమితమై మెలగన్ ॥నిర॥

బట్టబయటనునిల్చి పరిపూర్ణమెరపులను
గట్టిగ స్వయం జ్యోతి కదలకను నుండున్
అట్టి జ్యోత్యంతమున నతితుర్యపదమైన
పట్టైన పూదోట ప్రభువు గూడితిని ॥నిర॥—36

పడియున్న కుండలిని పవనమున నెగయించి
కుడి యెడమబంధించి గూర్చి యనిలునిచే
నడిమి వాకిలిదెరచి నడిచి పశ్చిమవీధి
గడచి తూర్పున గురుని కదసిచూడగను

ప॥ ఎంతచిత్రితమిది! యెనసి చూడగమదిని
సంతతము గురుమూర్తి సదయుడై వెరగున్ ॥ఎంత॥

సత్తువర్ణముకళల సర్వమును ఆముకొని
మొత్తముగ ముమ్మూల మొనసి ప్రబలగను
చిత్త పీఠముమధ్య చిత్కిరణములతోడ
హత్తియు పరంజ్యోతి యమితమై యుండూ ॥ఎంత॥

అకళంకమైనట్టి అద్భుతజ్యోతిపై
సకలాత్ముడై గురుడు సంచరించగను
ప్రకటముగపూదోట బ్రహ్మంబు నంటినే
వికల మొందకయెపుడు వెలుగుచుండుదును ॥ఎంత॥—37



చుట్టితలక్రిందైన సూక్ష్మకుండలిలేచి
పట్టి బింధువు దివికి బారజిమ్ముచును
అట్టైనయనాగ్రమున అగ్ని నేత్రముదెరచి
గట్టిగా సర్వమును గాల్చిమెరయుచును

ప॥ నిజగురుని కృపనునే నిశ్చలానందమున
సుజనవృత్తిని యెపుడు సొంపు మెరయుచును ॥నిజ॥

తలచి చూడగబయట తరుచు మెరుపులతోడ
బలసిశతకోటి రవిప్రభల విరచితమై
అలరుసాహస్ర రేకుల అబ్జకర్ణికను
నిలచి సుజ్యోతిపై నిర్వికారుడనై ॥నిజ॥

అరయ చిద్వ్యోమమున నమృత స్వరూపమై
నిరతమును సద్గురుడు నిలిచివెలుగగను
పరికించి పూదోట బ్రహ్మంబుగూర్చినే
అరయు లో వెలినిండి అమృతమైయుందున్ ॥నిజ॥—38



అట్టి హంసలమీాటి అబ్ధిమధ్యంబునను,
గట్టిగా స్వర్ణమయ కమలాంతమునను
పట్టైన ఓంకార ప్రణవాక్షరమున తా
దిట్టనై గూర్చినే తేజరిల్లితిని

ప॥ అమితమగు శివయోగ మభ్యసించియునేను
అమనస్కసిద్ధియై యాటలాడుదును ॥అ॥
సోమసూర్యులమించి సొంపుతో సద్గురు
స్వాములను గనుగొనుచు సద్భక్తితోడన్
ఆముకోని సర్వంబునంటి నిగమాంతమున
కోమలంబైన నిర్గుణుని మించితినీ ॥అ।
మితిలేని దినకరులు మెరసి కూడినరీతి;
ప్రతిదినము నిశ్చైబట ప్రబలుచుండగను
మతిదెలసి పూదోట మర్మజ్ఞుగూడి నే
సతతము నఖండమై చాల వెలుగుదును ॥అ'—39



నాసికాగ్రముతుదను నటియించుమారుతము
వాసిగాదివిచి తను వహ్నిక్రిందికిని
గాసిపెట్టుచు రెంటికలయపూరించి పణి
త్రోసి యూర్ధ్వముచేసి తుదమూతదెరతు

ప॥ ఇది రాజయోగమగు నెనసిచూచినమదిని
యిది దివ్యపుంజమై యిది ప్రకాశించున్ ॥ఇది॥
నవరంధ్రములుగట్టి నాసాగ్రమునజొచ్చి
తివిరి కంజము తాను దివికిజిమ్ముచును
దివమురాత్రులుమించి త్రివిధతనువులుదాటి
వివరించి లోబయట వెదకిచూడగను ॥ఇది॥
జలమధ్య సహస్రదళ జలజాంతరంగమున
నిలిచి యంతర్జ్యోతి నిండిప్రబలగను

తలపోసి యపవర్గ తరుణి చిద్వ్యసమించి
వలసిపూదోట స్వాముల గూడినిలుతు ॥ఇది॥—40

హంస యోగమున (భ్రమరకీటకభావము)

పవనములు బంధించి ప్రకృతి గుణములుద్రుంచి
దివికికుండలి దరిమి తీవ్రముగ నేను
అవలి శబ్దమువింట నమృతపానముచేసి
శివుని నయనాగ్రమున చెలగి ధ్యానింతున్

ప॥ తెలియ కేవలమునై దీపించు సత్పథము
నలరి గురుభక్తిచే నంటి వెలుగుదును ॥తెలి॥

మరి సూర్య చంద్రాగ్ని మండలంబులమించి
పరికించ బహురత్న ప్రభల విరచితహా
కరమర్థి నామనో కమలాంతరంగమున
స్థిరమైన విజ్ఞాన దీపమై మెరతున్ ॥తెలి॥

అమితమగు భక్తితో నతితుర్యపదమునే
సమకూడి యమనస్కసౌఖ్య మొందుచును
భ్రమర కీటకగతిని ప్రబలినే గురుకృపను
విమలమగుపూదోట విధునిరూపైతిన్ ॥తెలి॥—41

ముక్కుపై చిత్కిరణములను
మొనసి తిరిగెడినిలుదివిచి
అక్కరో వేదుమెలికల
నిజాహి గేచ పలెనే

ప॥ గోకుల దిన్నెలో ప్రబలు గోపాలస్వామికి మొక్కి
చేకొని జంబుకేశ్వరుని చెలియాచూతమే ॥గో॥

భేదించి పంచతత్త్వముల బిందువుతోడ సంధించి
శోధించి బ్రహ్మరంధ్రముతా చొచ్చి పోవలెను ॥గో॥



తరిమల శ్రీరామ మందిరం లోపలిద్వారం భక్తమండలి





శ్రీ లింగదేవులచే నుతించబడిన శ్రీ గోకులదిన్నె గోపాలస్వామివారు




శ్రీ పూదోట పీఠాంతర్గత శ్రీ గీతామందిరం - ఓంకార పీఠం - కామినేనిపల్లె





శ్రీ పూదోట పీఠాంతర్గత కామినేనిపల్లె మందిర బాహ్యద్వారము

పండువెన్నెల నధిగమించి దండి తేజోబయట జూడ
మెండు మెరుపులను జ్యోతి నిండిప్రబలునె ॥గో॥
పట్టైన చిన్మండలమున పరిపూర్ణాఖండమై మెరయు
గుట్టైన పూదోటరాముని గూడి యుందమె ॥గో॥—42

—: హంసయోగమున తత్త్వదృష్టితో తన్మయం :—

కన్నుగొనలదిరుగు పవను చెన్నుమెరయ వహ్నిక్రింది
పన్నగమునుదరిమి తీవ్ర మన్ని తత్త్వములను బిందు
ఉన్నతముగగూర్చిమధ్య సన్న బిలముజొచ్చి పైని
కన్నుదెరచి దేహగుణము లన్ని జెరచిన

ప॥ ఏటియోగ మేటితలపు ? యేటిదృష్టి చిత్పథనమున
నీటుగాను కూడిమదిని నిలిచి వెలిగినన్ ॥ఏటి॥

కంటిపాపలంటగూర్చి యింట నమృత మంటచెలగి
వెంట మువ్వురంటినడువ జంట చక్రములనుమించి
మింటి మంటినడుమ స్వర్ణపు టొంటినగముపైన తా
గెంటకెపుడు ముక్తికన్య నంట జూచినన్ ॥ఏటి॥

పండు వెన్నెలాక్రమించి దండి తేజోబయటనిలిచి
అండ పిండాండములను అంటి ప్రబలుచున్న జ్యోతి
మండలమున పువ్వుదోట మండలాధీశునంటి
పండి నిండి తన్మయమున యుండు ఘనులకున్ ॥ఏటి॥—43

## హంసోపాసన

పంచభూతేంద్రియములు ప్రాణాదివాయువులు
పంచమాత్రలు శక్తిపంచకంబులును
పొంచిత్రిగుణములును పొసగ త్రివిదాగ్నులను
నించి బిందువుతోడ నినదమునగూర్చి

ప॥ నిలిచి నిగమాంతమున నిజగురుని వీక్షించి
కలసి తన్మయమొంది ఘనత మెరయుదును ॥నిలి॥

పరికించ రవి చంద్రపావకుల మీరుచును
గరిమె సాహస్రదళ కమలమధ్యమునన్
సిరిమించు బహురత్న సింహాసనస్థుడై
పరమ తారకయోగి ప్రజ్వరిల్లగను ॥నిలి॥

అవిరళంబుగ కనకాంబరము తనరగను
భువనేశుపై దివ్య భూషణములమరన్
దివిజస్తోత్రుండైన దేవాది దేవుడును
వివరించ పూదోట విభుడు ప్రబలగను ॥నిలి॥—44



పవనంబుచే సధోవణి రేచి చిప్పనను
డివికి బిందువుమీటి తీవ్రముగ నేను
రవిసుధాంశులమధ్య రాజవీధినిజొచ్చి
నవచక్రములుమించి వివరించగురుడు

ప॥ కరతలామలకమా ఘనులువీక్షించమది
పరమస్వరూపైన పరమాత్మ మెరయన్ ॥కర॥

శమదమంబులతోడ జలమధ్యమున స్వర్ణ
కమలకర్ణికనంటి ఘనజ్యోతిలింగం
అమిత మార్తాండశశి అకలంకప్రభలతో
విమలపదమై బయట విరచితంబైనన్ ॥కర॥

అరయ పిండాండ బ్రహ్మాండ ఘటములజొచ్చి
నెరసి ప్రతిబింబమై నిగమాంతమునను
స్థిరమైన బహురత్న దివ్యమందిరములోను
గురుతైన పూదోట గురుడు వెలుగగను ॥కర॥—45

గురుపాద పద్మములు గురుతుగా ధ్యానించి
సరగ పూరక రేచక కుంభకములన్
తరుచుగాలిచే సర్వతత్త్వములు భేదించి
పురికొల్పి రెంటిపెను భుజగి రేచినను
ప॥ అరసిచూడగనిదియు సమనస్క సిద్ధిదము
ధరనుశాస్త్రజ్ఞాన తామసుల కలవె ॥అర॥
మనసు మారుతమును మరిస్వేచ్ఛగా లేచి
చనుదెంచి తీవ్రముగ సత్తుబలములతో
ననలార్క హిమకరుల కవలప్రణవంబునను
నొనరసర్వముగూర్చి తనరి ప్రబలినను ॥అర॥
నిగమ గోచరమైన నిర్వాతదీపగతి
సగుణరూపములందు తగిలి వెలుగుచును
సుగుణమగు పూదోట జగదీశు గలసితా
నగణితా నందాబ్ధియై ప్రకాశించున్ ॥అర॥—46

## స్వయంజ్యోతి

ప్రళయవాతమున నహి బంధించి సర్వమును
కలయగూర్చుకపైని కనుమదాటియును
సలిలమధ్యను హేమ జలజమున నిలచితా
తలచి సుజ్ఞాన నేత్రమున వీక్షించన్
ప॥ అరుదు దివ్యాంకురమున కతితుర్యబీజమహా
పరునంటియపుడె తా పరమాత్మయగును ॥అరు॥
స్థిరచిత్తమహా విమల సిరిమించు ప్రమిదెలో
సరగ షడ్భక్తులను చమురు నించియును
అరయ బిందువను వత్తినంటి స్వయంజ్యోతి
నిరతమును నిర్భైట నిలిచి వెలుగగను ॥అరు॥
అది వేదసారమై ఆనంద పదమగుచు
సదియుఖేచరి ముద్ర కవల మెరయుచును

అదియు పూదోటకడ నాత్మ రాముండగుచు
అది యోగజనులమది అమితమై ప్రబలు ॥అప॥—47

వెలియంఘ్రిమూలమున చలనబీజమునొత్తి
అలగుహ్యామును సణచి అకుంచనమునన్
బలిమిరెంటిని బెనిచి ఫణిరేచిమరిసత్తు
కళలు మదిగూర్చి హిమకరునిగతి ప్రబలి

ప॥ ఆనందమునను పరమాత్మలోపలగూడి
తానసెడి భావమును తలపు మరవవలెను ॥ఆ॥

పరికించి యనిలుచే బ్రహ్మ రంధ్రము జించి
తరలినే రాజదంత ద్వారమునను
మెరసి వెన్నెల బయట గురుని యవలోకించి
స్థిరముగా వెలిబ్రహ్మ కిరణములు గనుచున్ ॥ఆ॥

పట్టు సహస్రదళ పద్మముగ్ధ నెయంటె
చుట్టి వెలిగెడి పరంజ్యోతి కవ్వలను
గట్టిగా పూదోట ఘనయోగి నంటినే
డిట్టనై నిర్భైట తేజరిల్లుదును ॥ఆన॥—48

తెలియనిష్కళ బ్రహ్మదీప్తిచేనుదయించి
నిలిచి పురుషుడు మనో నీరజాంతమునన్
తలక్రిందులై ధరను తలచ వృక్షముగతిని
అలరి యనిలుని గూడి అఖిలరూపులునౌ

ప॥ గురు చికిత్సనుజీవి కుటిల మీడగతుదను
కరుణతో జూడ దినకరునిగతి ప్రబలు ॥గుహ॥

మరి జ్ఞాననేత్రమున మాయపటలము గప్పి
గురిగానకను దేహగుణములను జిక్కి

పరికించ మర్కటముగతిని యుచ్ఛ్వాసముల
తిరుగు పగలును రేలు త్రివిధకాలములన్ ॥గురు॥

తనరి సద్గురు మార్గమున ననిలంచే నదో
ఫణి రేచి నడవీధి బయలుపరచుకను
మనసు ననిలము నాత్మమర్మబిలమున జొచ్చి
గుణ శూన్యమునను నిర్గుణుని వీక్షించు ॥గురు॥

తెలియలోబయట బహుదినకర ప్రభలతో
వెలుగు సాహస్ర రేకుల కమలమునను
నిలిచి అంతర్జ్యోతి నిశ్చలానందమున
నలరి పిండాండ బ్రహ్మాండముల వెలుగు ॥గురు॥

మెరసి దివ్యాంకురముతుద నిర్విష్క్రియుండనై
నిరతమును సద్గురుడు నిలచి వెలుగగను
సరిలేని పూదోట సర్వసాక్షి నిగూడి
అరయగా క్షేత్రజ్ఞు డమితమై ప్రబలున్ ॥గురు — 49

---

మనమలర రవిచంద్ర మార్గములుబంధించి
అనుదినము విమల సిద్ధాసనస్థుడనై
అనిలునిరోధించి యాకుంచనముచేసి
మెనయ రెంటినిబెనగి పెనువురగి రేచి

ప॥ అతితుర్యభక్తిచే నానంద మయుడనై
మితిలేని సత్పదము మెరసి ధ్యానింతూ ॥అతి॥

పరున ముప్పదియారు పరతత్త్వములుమదిని
గరిమితోగూర్చి త్రైకాయములుమించి
అరసి ఆకాశ సుస్థిర బిలంబునజొచ్చి
నెరయ చిత్రజ్యోతి నిలిచి వీక్షింతు ॥అతి॥

వనర స్వాంతము గాడ్పులను తుర్యమునగూర్చి
ఘనవిద్యగడచి చిత్కాయమును విడచి

కనుగొనగ పూదోటకడ శాశ్వతత్త్వమై
తనరుచు నఖండమై తా ప్రకాశించు ||అతి||—50

హం సో పా స న

సరికించి నాసికా పదయుగళ చరపవను
విరసించి గళమునను విలసిల్ల బీల్చి
మరి వహ్ని రేచి కర్మముల నెడి మలములను
కరిగించ రేచక క్రమము యిది గాదా

ప|| విన్నపము చేసెదను వినవె సద్గురుమూర్తి
విన్న కన్నది నీకు వివరింతు తండ్రి ! ||విన్న||

గుదస్థానాఽపానుగూడ ప్రాణునిగూర్చి
విదితపహా డెబ్బదిరెండు వేల నాళముల
కదసి తిరిగెడి గాలి కలయపూరించినే
నదిగా నాభిననిల్ప నది పూరకంబు ||విన్న||

ఉరగమును మేల్కొల్పి యూర్ధ్వముఖముగజేసి
కరుణతో పదునైదు కళల గూర్చుకను
పరికించి బింధువును బ్రహ్మరంధ్రముజొనిపి
గురిమీాట ప్రబలగా కుంభకము గాదా ||విన్న||

సదయుడై భూతేంద్రియ సర్వవాతంబులను
నదిక మాహాజ్యోతి కంతరంగమున
పదిలముగ బింధువును ప్రణవంబుతోగూర్చి
కుదురుకొన కేవల సుకుంభకము గాదా ||విన్న||

సిరులుమించిన విమల చిద్గగనమును జొచ్చి
విరినైనపూదోట విభుని గనుగొనుచును
పరమభక్తిని పరబ్రహ్మంబులోగలసి
స్థిరముగానిల్వ సుస్థిరముక్తి గాదా ||విన్న||—51

ఉరగమును భేదించి యుభయత్రోవలుగట్టి
తనుచు గాలిని మధ్యభావమును త్రోసి
పరిపూర్ణభక్తితో పశ్చిమంబున జొచ్చి
గురుని నయ నాగ్రమున కోరిచూడకను

ప॥ విదితముగ నిశ్చయము విమల తేజోమధ్య
సదయుడై నిగమాంత సదనమున వెలుగున్ ॥వి॥

ఘనుడు స్వాంతంబనెడి కమలాంతరంగమున
దినకర శతకోటి దీప్తులమరగను
జననవృద్ధులు లేక నాముకొని సర్వమును
ఘనదివ్య పుంజమై కదలక వెలుంగున్ ॥వి॥

పరమదహరాకాశ పదమంటి వెలుగుచును
సుమ చిరంబగు స్వయంజ్యోతి కవ్వలను
స్థిరమైన పూదోట శివయోగినంటినే
పరమ హంసగ బయట ప్రజ్వరిల్లుదును ॥వి॥—52

నిలిచి మారుతముచే నిగుడించి వాసుకిని
తలగకుండగ చతుర్దశ తత్త్వములను
కలియ గూర్చుక బిందు గగనవీధిన నెగసి
చెలగి షోడశదళ జలజమున నిలకన్ !

ప॥ అది యేలకలుగు పరమాత్మ సమరససుఖము
మది చలనులై తిరుగు మదమత్తులకును ॥అది॥

పొసగదృష్టులు గూర్చి పుండరీకమున నిజ
కుసుమ మధ్యను ప్రణవ ఘోషంబు వినుచున్
రసనాగ్రమున నమృత రసము గ్రోలుచు జీవ
బిసతోడ నాకాశ బిలము జొరయకనూ ॥అది॥

విరివైన సాహస్రార విమలాంతర రంగమున
పరమగురుని జ్యోతి పైగను గొనుచున్

అర లేని పూదోట యాత్మారాముని గలసి
నిరవయమై తాను నిలిచి వెలుగకను ॥అది॥—53

---

గుట్టు వామ మెడిమె చేత గుహ్యామూల మొత్తియనిలు
గట్టిగా పీడించిచెలగి కలయ ప్రాణఽపానుగూర్చి
చుట్టుయున్న భుజగి లేచి మట్టుబెట్టి శతృవులను
నట్టె బిందు బ్రహ్మముఖము నంటినిలువకన్

ప॥ వెలయ నేలకలుగుముక్తి విమలజ్యోతి మధ్యగుపని
కలసి తన్మయమున బయట నిలచి వెలుగకన్ ॥వె॥

ఉసికిజీవ హంసదివిచి యుత్తరదక్షిణములు మించి
పడమటి ద్వారమున జొచ్చి ప్రణవనేత్రమును దెరచి
మెరసి ప్రకృతులంట గాల్చి యురిమికాలు నోటుపరచి
మెరసిమేరువెక్కి తూర్పుమెట్టి గురుని చూడకన్ ॥వె॥

అదిగొ నాదబిందుకళల కవలమించు తేజమధ్య
నధిగమించి మండునట్టి యంతర్జ్యోతి పైనినిలిచి
సదయుడైన పూదోట సద్గురుస్వరూపమంటి
పదిలుడైనిర్భట పరబ్రహ్మమై నిలువకన్ ॥వె॥—54

---

నిరుపమానందమున నిర్గుణునిధ్యానించి
పరమ కోటరముపై ప్రళయగాడ్పులునూ
నెరశబ్దమును చాల నేర్పుతో విడిచి తా
నరస ప్రాణునితోను సంధించి మరియు

ప॥ ఈ కీలు సద్గురుం డెరిగించినంతలో
చేకూడు తన్మయము శివయోగులారా! ॥ఈ॥

బలిమైన విలయాగ్ని పవనంబు సమకూడి
కలిత నాభిక్రింద కను వినుకు లేచి

మెలకువతో పాతాళ బిలము తీవ్రతజొచ్చి
చలముచేనాది కచ్ఛపమును భేదించి ॥ఈ॥

తనరియచ్చట నురగమును తాడనముసేయ
గను వాని విషవహ్ని గవసి యిరుగడల
కనుగొనగ సప్తలోకములును దహియించునపుడు
నునికి చేసినపాప నూర్ధ్వముఖిసేసి ॥ఈ॥

కెరలించి సూక్ష్మభుజగిని యూర్ధ్వకుండలిని
మెరసి జ్ఞానాగ్నిచే మీదిలోకములు
వరుస నన్నియుగాల్చి యొక్క నిముషములోను
నరయగ చిదాకాశమై ప్రకాశింతూ ॥ఇ॥

అతితుర్యమగు గాత్రమలరి చివ్వున విడచి
గత స్వాంతమున నిరాకారమై తనరి
ప్రతిలేని పూదోటపై నఖండంబగుచు
సతతమును నే సర్వసాక్షినై యుందూ ॥ఈ॥—56

## నవచక్ర బోధ

తనరుచును సుఖాసనంబున నుండి ప్రణవమున
ననిలుని నిరోధించి నాకుంచనమునన్
వనరరెంటిని బెనచి వహ్నిక్రిందను వున్న
పెనుబాము నూర్ధ్వ ముఖమును జేయవలెను

ప॥ ఈ కీలు సద్గురు డెరిగించి నంతలో
చేకూరు స్థిరముక్తి శివయోగులారా! ॥ఈ॥

కలిత నవచక్రములు క్రమముతో శోధించి
తలచి ముప్పదినారు తత్త్వములు మించి
లలిత జిహ్వాలనడుమ రాజదంతెను బిలము
నలరిచని సుధ్రగోలి నతి ముదంబుననను ॥ఈ॥

పగలు రేలును రెండు బంధింపుచును యుభయ
ఖగములను సమకూర్చి గాడ్పు స్వాంతములు
గగనమార్గము నాత్మ గమనింపుచును రెంటి
నిగమాంతమున వెలుగు నెలతతో గూర్చి ॥ఈ॥
పరికించవిమలమగు పండువెన్నెల బయట
తిరమగు పరంజ్యోతి దీప్తులలరగను
వరతారకాదుల వరుసతో శోభిల్ల
నరయ పురుషుడు చిదాంబరమునై ప్రబలు ॥ఈ॥
ఘనత చిన్మయమను తనువు తీవ్రత విడిచి
కినిసి కేవల శూన్యమున గూడి జ్ఞప్తిన్
కనుగొనగ పూదోటకడ నిరవలంబమై
మొనసి సహజానందుడై ప్రకాశించు ॥ఈ॥—57

గుదస్థానాపాను గుహ్యంబుపైనునిచి
హృదయప్రాణుని నాభిక్రిందొదగజేసి
కదిసి ప్రాణునపాను క్రమముతో నొనగూర్చి
యదలించి కుండలిని యచలుడై నిలిచి
ప॥ వాద భేదములతో వరయోగి తానగునె
ఆది మధ్యాంతలయమై వెలుంగకను ॥వాద॥
అనిల తేజిని నెక్కి యాత్ముడతి తీవ్రమున
చనుదెంచి హృదయాబ్జమున మించివేడ్కన్
మెనసి తాలుమూలముల మధ్యభేదించి
దినకరుని గతిబైట తేజరిల్లకను ॥వాద॥
నిలిచి హృత్కమలమున నిర్వాతదీపగతి
నలరి భువి దివి దిశలు నంటిప్రబలుచును
బలసి పూదోట నిజబ్రహ్మంబునంటి తా
కలసి తన్మయమంది నిలిచి మెరయకను ॥వాద॥—57ఎ

కుదురు వామమెడిమెచేత గుహ్యమునుపీడించి
మూలబంధము పోజిమ్మి ప్రాణాపానుగూర్చుక
ప॥ కేసినేనిపల్లె చెన్న కేశవరాముని చిటుకు
నాసికాగ్రమునసనిలిచి దాటి వేయరా! ॥కేసి॥
అగ్ని రేచి నాభిక్రింది యహిపునిభేదించి మించి
ప్రజ్ఞమెరసి నడిమి వాకిలి పారదెనువరా! ॥కేసి।
ఘంటానాదమువింట దృష్టులంటగూర్చిచూడ విమల
మింట ముక్తిపాపజ్యోతి కళలుజూపురా! ॥కేసి॥
చొచ్చి బ్రహ్మరంధ్రమున సూర్య చంద్రు లాక్రమించి
ముచ్చటతో ముక్తిసతిని మొనసికూడరా! ॥కేసి॥
సిరిమించి పూదోటకవల శ్రీగురు పాదపద్మముల
పరమ భక్తితోడగూడి ప్రజ్వరిల్లరా ॥కేసి॥—58

---

మొనసి యాకాశమను ముద్రలోపల దిరుగు
ననిలు నాకర్షించి యానాభిక్రింద
పనుపడగను నపాను ప్రాణముతో సంధించి
మనసుతో మారుతము మరియు పూరించి
ప॥ కంటె చిన్నేత్రమున కదిసి వెలిగెడిగురుని
అంటలో వెలిమరచి యమితమైయుందూ ॥కం॥
భువిని తలక్రిందైన భుజగమును భేదించి
గవసి పదహారింట కదలకను నిలిచి
పవనంబుతో సూక్ష్మపంకజము బోమీాటి
దివిభువి మధ్యమున తీవ్రముగ నిలిచి ॥కం॥
జలమధ్య విమలమగు జలజాంతరంగమున
బలసివెలిగెడి జ్యోతి ప్రబలతుదను
నిలిచి నే పూదోట నిజగురునిగూడి తుద
తలచనుస్థిరమూర్త తత్త్వమైయుందూ ॥కం॥—59

---

చెన్ను మీరి ప్రాణాపాను చెలగనంట గూర్చి తాను
పన్నగమును పైకి దరిమి బంతులాను మూడు మీటి
కన్నుగొనల మూత జిమ్మి కాశీమధ్య మనసు నిలిపి
వన్నెమీరి గురుని పదము వలసిపూజ సేయక

ప॥ కదసి విషయ లోలురైన కర్మలకును ముక్తిలేదు
సదయుడై చిన్మంత్రుడై పొసగ పొంగి వెలుగక ॥కద॥

అట్టెకంటి జ్వాల రేచి అష్ట ప్రకృతులణచి మాయ
పట్టు విడచి సూక్ష్మ బయట పరమ హంసయై చెలంగి
గట్టుమీద సమృత కన్య ఘాత వేసి పాటబాడ
బట్టబయట వెలుగుచున్న పరమ గురుని దెలియక ॥కద॥

పన్నగంబుపైన నెపుడు ప్రతిభమించి వెలుగుచున్న
కన్నెయు భువనాంతరములు కమ్ముకొని తుదను మెరసి
మిన్నులై దుమ్రింగి కడను వెలుగుచున్న జ్యోతిజొచ్చి
అన్ని మరచి పూదోట అభవుసంటి వెలుగక ॥కద॥—60



మూసి మాయనిద్రృష్టుల తా యూర్ధ్వముమీటుచు
నాసుకిని రేచి తాను వహ్నిబిలమునజొచ్చి
ఆసన్నుడై ప్రణవమున సఖలమంటగూర్చి
వాసిగా హృత్కమలమధ్య నొనరనిలిచిన

ప॥ భేదమేలనూ ధరణిలో తా నభేద్యుడైయుండ
వేదాంతరంగమున నిలిచివెలిగి నమితమగుచు ॥భే॥

నిండుమెరుపుల త్రికూటగిరిపైనిల్చి తనరగాను
కుండలీరంధ్రమున దుంకు గురుతైన అమృతమును
యండగొనక గ్రోలిమది నా సందమొందుచును
పండువెన్నెలబయట చిద్బ్రహ్మ తేజమగుచు ॥భే॥

జంటహంసల విజ్ఞానసతి యెదుటగూర్చుచు
మింటిమఠటి రెంటెనడుమ మెరసి నటియింపుచును

నొంటివెలుగు నంతర్జ్యోతిమంటలో తా జొచ్చి
అంటి పూదోటరాముని యమృతపదమైయుండ ॥భే॥—61

నించి కుండలిని నెగయించి పంచశక్తుల
మించి పంచేంద్రియముల ద్రుంచి
పంచ తత్త్వముల పరువెత్తింపుచు
మించి సుజ్ఞానియై మెరయుచు నెపుడు

ప॥ హంసయై యాటలాడవలెను కాశిలో
పరమ హంసయై తా నాటలాడవలెను ॥హం॥

హంసోహంబనియెడి యక్షరద్వయమును
నల గాయిత్రిని నంటగూర్చితుద ॥హం॥

దిట్టైముగ్గురి నంటబట్టియు జంత్రోవలు
గట్టి మింట్రోవను దా మెట్టి
పట్టగు హృత్పద్మాంతరంగమున
అంటి యమృతపదమై యద్భుతముగ ॥హం॥

మండలత్రయమును ఖండించి
పండువెన్నెలబయట దండితేజమై మించి
అండగొనక పూదోటకు నవ్వల
నిండుభక్తితో నిజగురు నంటుచు ॥హం॥— 62

గురుని వాక్యమునమ్మి కుండలిని దివికిదరిమి
పరగ సూక్ష్మ వీధిని పరుగు లెత్తుచును
మెరసిపంచ శక్తుల మించి మేరువుదాటి
విరివైన వెన్నెలబయట విస్తరించకన్నూ

ప॥ వట్టివేషముల దిరుగ కొట్టూను కాలుడు
పట్టు వెలసి గురుని పదము పట్టినిలుఛక ॥వట్టి॥

రెంటిమూటి జోడు గూర్చి రెంటి రెంటి ద్రోసి గురుని
సంటకున్న ముక్తి నహి యందు రధికులు
జంట హంసలంటగూర్చి మింటమెరయు కళలఃమీరి
అంటి పరమ హంసయై తా నాటలాడక ॥వట్టి॥

మింటి మంటి నడుమ నిల్చి మెరయుచు హృత్కమలమునను
గెంటక తా హంసయై జగములంటి వెలుగక
అంటి విమల జ్యోతి బయట నరసి పూదోటరాముని
సంటి ధృవమై యుండెడి మహాత్ములకేగాక ॥వట్టి॥—63



## ఆ ర వ ద ళ ము

# అఖండసాధన (పరమయోగము)




గుట్టు నయనాగ్రమున గురుని ధ్యానించితా
నట్టె గురుకరుణచే ననిలుని బంధించి
దిట్టడై మధ్యశక్తిని దివికి నెగయించ
గట్టిగా యూర్ధ్వముఖమున కన్ను దెరచ

ప॥ మొనసి బ్రహ్మాగ్నిచే భూతేంద్రియములు జెరచ
మనసు హృత్కమలమున మరి ప్రకాశించు ॥మొ॥

యెండవెన్నెలనగ్ని మండలాంతమున తా
నిండు భక్తితో మదిని నిలిచిచూడగను
పండువెన్నెలబయట పరిపూర్ణకళలతో
నిండి సద్గురుమూర్తి నిలిచి వెలుగగను ॥మొ॥

ప్రళయకాలమునాటి జలరాసికై వడిని
తెలియస్థావరజంగమముల జొచ్చివెలుగున్
కలితమగు బ్రహ్మాండ ఘటము పగిలినరీతి
బలసి తేజోరాసి ప్రబలుచుండగను ॥మొ॥

క్రిందుమీదను దిశలు సందులాముక తుదను
పొంది నిగమాంతమున భూరితేజమునై
కందమేర్పడ మూలకందమున చెదరకను
నిండునందున నిండి నే ప్రకాశింతు ॥మొ॥

పరమామృత జ్యోతితుద పరికించిచూడగా
పరమతత్త్వంబగుచు బయటమెరయుచును
అరుదైన పూదోట యాత్మారాముని గలిసి
నిరుపమంబైతాను నిలిచి వెలుగగను ॥మొ॥—64



కరుకైమించిన పంచకల్యాణిపై నెక్కి
కరమున వీర కంకణముగట్టి
మెరపుసాన కత్తి మేలుచేతపట్టి
గురుతుగ భూచక్రము గొడుగు మెరయచెలియ

ప॥ కోలు కోలు కోలు కోలే కోలన్నయే
కోలె కోలె కోలన్న
కోలని కేకుచు గుర్రమును దుంకించి
కాలిగెట్టెలరజము గగనవీధిని నెగయ ॥కో॥

పసిడికళ్ళెము చతుర పదము లందెలుమ్రోయ
పొసగ తేజికి బిరుదు పూసవేసి
శశి సూర్యులంకెనల జాణ్యైడె బిగద్రొక్కి
మిసిమి తళుకుచేత మెరసికల్లెము చెలియ ॥కో॥

ఒనర భూషణములు వరుసతో వెలుగగ
మినుకు పసిడిశాటి మెరయగను
దినునాథుగతిమాయ ధిక్కరించితాను
మొనసి ముక్తిద్వారమున జొచ్చితిని చెలియ ॥కో॥

జగన్మోహనాంగి తా జలమధ్యవెలుగుచు
సొగసుమీరి ముఖ జ్యోతిచూపు

మగువ పాటలుబాడి మంగళారతులిచ్చి
సుగుణి జెలగి పూలు సొంపుతో జల్లును ॥కో॥

పాలుపొందు చవికెలో పాలతిని గనుగొని
కదిసి దివ్యకరము కదిసిపట్టి
కలసి కలయక పరమకన్య నధిగమించి
భళిరె పూదోటపై బ్రహ్మమంటితె చెలియ ॥కో॥—65

## పరమయోగమున మరుగు పదములు

మూటిరెంటి మూటివీడి ముమ్మూల ఇంటిలోన జేరి
నాటి గుణములను జెరచి యోగి నాయకుని నంటగోరి
మూటి మూటి మీరి నారికూడి మూటి మూటి గుణమువీడి
మూటి మూటి మీది మొనయ మేల్ దెలియుచు
మూటి కధికమైన మూర్తి గనుంగొని

ప। సేవించ బోదామురారె భక్త సేవితుడగు త్రిపురహారే
భావించి చూచిన వీరె గురుదేవుడే మోక్షసంచారె ॥సేవిం॥

చెలుల నైదుగురిని మించి సరసిజ నేత్రుని చాలగాంచి
అలనాలుగైదు ఖండించి నాలుగారును మదిలోనబెంచి
పలుమారు పదియింట జొచ్చి సన్నపదమున మనసు నెక్కించి
అలముక్తి సతికూర్మి నలవడ చేసుక అలగియుండెస్వామి నచట
కనుంగొని ॥సేవిం॥

పదియారు విధముల దెలిసి ఆరు పగవిధముల తానుగెలిచి
సదులు నారిటి చేత నలసియుండిన తను గనుగొని మెరసి
సుదతూల ముగ్గురి దెలసి మేలు వదలని సుదతితో గలిసి
పదునాల్గు విధముల బ్రజ్వరిల్లుచునున్న అదిగో పూదోటపై
ఆత్మారాముని పదము ॥సేవిం॥—66

బొమ్మలపై పొదరింటిలోను పొలతి గులుకుచు
కమ్మక వెలుగున క్రమమునగూడుచు
సొమ్మసిలుచునే సొంపు మెరయకను
ప॥ తాళలేరా రామా నేనిక తాళలేరా
తాళలేరా తారక జ్యోతికికడ
తారకమంటినే తన్మయమొందక ॥తాళ॥

ఆనరించి పెనుబాము నే యూచి రేచి
రేచక పూరక కుంభకముల తుద
గోచరించు నిర్గుణ పదమునుగని ॥తాళ॥

నాదమంటి అమృతము పానంబుచేసి
వేదముతుద నిజ విమలకన్యకపై
పాదుకొన్న నీ పరమ రూపుగని ॥తాళ॥

నిన్ను నే నిర్గుణరామా ఎన్నినాడరా
విన్నకన్న నీ యన్ని గుణములు
వెన్నెలబైటను నిన్నుగూడకను ॥తాళ॥

వేళలేరా! దివ్యలింగారతి వేళలేరా
మేలిమి పువ్వుల మెచ్చులతోటను
చాలవెలుగు నీ సత్పదమందక ॥తాళ॥—67

త్రివిధ గాత్రంబులును త్రివిధవాసనలు మరి
త్రివిధ మోహంబులును త్రివిధగుణములును
త్రివిధ జీవంబులును త్రివిధశక్తులు మలిన
త్రివిధాజ్ఞలును బలిమి త్రివిధ హంకృతులు
ప॥ గురుసుతులు సిన్నిటిని జెరచకుండిన తుదను
నరయ నిర్గుణ బ్రహ్మైక్యమును లేదు ॥గు॥

సర్వ వ్యసనంబులును సర్వసంపదలు నిల
సర్వ భోగంబులును సంసార భ్రాంతి

సర్వ వేషంబులును సర్వడంభములును
సర్వ సంకల్పములు సర్వ సంశయముల్ ||గురు||

గురుని నరుడనిచూచు కుత్సితపు భక్తియును
గురుసేవకును నోపకున్న చెడుబుద్ధి
గురువంచనలు జేయు కుటిలమగు స్వాంతమును
గురుని వాక్యము నమ్మకున్న యజ్ఞానం ||గురు||

సర్వ బేధంబులును సర్వ వాదంబులును
సర్వ కిల్బిష చోర జారవిద్యలును
సర్వ పుణ్యాంబులును సర్వ పాపంబులును
సర్వ ద్వంద్వంబులును సగుణ పదవులును ||గురు||

బహు మాయోపాయములు బహు మంత్ర తంత్రములు
బహు చలనములు తరుచు భవదుఃఖములును
బహుహూపములపైని ప్రబలు పూదోటకడ
బహుశాంతుడగుచు గురుపదము బట్టియును ||గు||—68

## పరమయోగమున - జ్ఞానరథోత్సవము

అరయ గాత్రము రథము హంకారమును నొగలు
చరణంబులగు నుభయ చక్రంబు లిరుసు
పరికించ చిత్తమును ప్రాణంబు చీలలగు
గరిమె మోహము త్రాళ్లు కాడియజ్ఞానం

ప|| అన్నిటికిమూలమై అచలపురుషుడు నిలిచి
యిన్నిటికి ప్రేరేచు నెనసి మెనయకను ||అన్ని||

మొనసి యింద్రియహయము పగ్గము స్వాంతమును
సారథగుబుద్ధి మునికోలధైర్యం వినికి విని
సంచార మునికి నేత్రద్వయము
పెనగునంతఃకరణ పీఠ మాత్మునికి ||అన్ని||

తెలివి కవచము దొడిగి దివ్యచాపముబట్టి
అల ప్రణవమను బాణ మనురసంధించి
చెలగి వేయుచు మాయసేనలను పొలియించి
గెలుచు తనయశము దిక్కుల ప్రకాశించ ||అన్ని||

పరమజ్ఞానులు చుట్టుబలసి కొలువగవేడ్క
మెరసి మండలత్రయము మించి యాత్మడును
అరుదు నోంకార భేరతి తుర్యమునమ్రోయు
వరుస నవభూమికలు నొనరదాటుచును ||అన్ని||

మతిదెలిసి ముక్తిరమ మంగళంబులనొసగ
ప్రతిలేకప్రబలు చిద్భవనంబుజొచ్చి
మితిలేక పూదోటమించి సద్గురునితా
హితవృత్తిగూడియును జితయోగియగును ||అన్ని||—69



గురునివాక్యంబను సరస జ్ఞానాగ్నిచే
సరగ రాజస తామసములు జెరచిమరియు
వరుస త్రై దేహములు వసర దగ్ధముజేసి
గరిమె యఖండమార్గము దెలియవలెను

ప|| వట్టి మాటలచేత వచ్చునే నిజముక్తి
గట్టిగా శ్రీగురుని కరుణచేగలదు ||వ||

బలిమి సాత్త్వికుడునై పరికించియాకాశ
బిలము తీవ్రతజొచ్చి పేర్మిలోబయటన్
వలసి వేదాంతమున వెలుగు స్వయంజ్యోతి
కలసి కలయక తుదిని నిలచి మెరయకను ||వ||

నెరయ చిజ్ఞప్తనెడి నేత్రమునజూచి పై
నిరవలంబంబనెడి నిజగురునిగూడి
అరసి పూదోటకడ నమృతాంగుండగుచు
స్థిర యద్వితీయుడై తేజరిల్లకను ||వ||—70

## పెద్దకానాలబుగ్గ రామలింగని స్మరణ

చరణ మూలముచే యోని చెదరకుండగ ద్రొక్కి భుజగి
తరిమి బంధత్రయము ద్రుంచు తరుణి యెవ్వడె ?

ప॥ శమదగుణము లుప్పొంగి జగదాత్ముడై వెలగు నెపుడు
రమణిపెద్ద కానాలబుగ్గ రామలింగడే! ॥శ॥

మింటి త్రోవనురికి నడిమి కంటె జ్వాలచే
ముజ్జగములంటి గాల్చి బయట మెరయు సతివయెవ్వడే ॥శ॥

పంచవన్నెలధిగమించి పసిడికొండపై లంఘించి
సంచరించు యినుని రీతి సఖియా! యెవ్వడే ॥శ॥

పండువెన్నెల బయటచెలగి వన్నె మెరయు చున్నముక్తి
కన్నె నంటిమించికేరు ? కలికీ యెవ్వడే ॥శ॥

చక్కని పూదోటగురుడు స్వచ్ఛమైన దివ్యచవికెలో
చుక్కరీతి నిలిచివెలుగు ? సుదతియెవ్వడే ॥శ॥—71



పదునారు పదియు పంద్రెండొక్కటిగ జేసి
కదిసి ఆరిటితుదను ఘనము దెలిసియును
పదివిధములను కేరు పడతి కెరలింపుచును
అతను నిత్యానంద మమృతపానుండై

ప॥ ఆగవలె గురునికీలరయ మదిలో దెలిసి
కూడి ముమ్మూలకడ గురు తెరిగినటుల ॥ఆగ॥

వదల కై దారిటెని వహ్నిలోబడ వేసి
కుదియించి యారిటెని కూలద్రోయుచును
చెదరకుండను మూటి జీవితేశ్వరుగూర్చి
ముదముతో నానందమున నిల్వవలెను ॥ఆగ॥

ఆరింటిమీదికి నలరగా లంఘించి
యూడు నాల్గిటబట్టి యమర నూదుచును

తారాధిపుని తరణి తరిమి పైకెగయుచును
తారకజ్యోతితుద తరుణి కనుగొనుచు ||అగ||

అతితుర్యముననను హంసాంతరాళముజొచ్చి
మదివిస్తరించి లో మర్మమెరుగుచును
అతివముఖ కళలు వేదాంతమున వెలుగగను
సతతమును చిదాత్మపై జాడ దెలియుచును ||అగ||

అరసి యవలోకించి యతితుర్యభక్తితో
మెరసి సాత్వీకమున మించి పురుషుడును
పరికించిపూదోట బ్రహ్మంబు గలిసి తా
నెర నిరాకారమై నిల్చి వెలుగొందు ||అ||—72

## గాయత్రీ ఉపాసన

కర్మముఖమున వెడలి కాలములచే జిక్కి
కర్మమే జేయుచును కడగాన లేక
కర్మమణచియు దివ్య కాయుడై వెలగిన
నిర్మల బ్రహ్మణ్యుడుగ నిలుచునో యన్నా!

ప॥ చాలకర్మధ్వయము సావిత్రితో గూర్చి
కీ లెరిగి తుద మెలగ బ్రహ్మణ్యుడన్నా! ||చాల||

గాయత్రి శృతులకు కన్నతల్లైయుండు
గాయత్రి జగములకు కారణంబగును
గాయత్రి లోకముల కడను ప్రకాశించు
గాయత్రి గురు తెరుగ ఘనుడు బ్రాహ్మణుడు ||చాల||

భేదించి కుండలిని పేర్చి తీవ్రముగను
మోదంబుతో జొచ్చి ముక్తిద్వారమున
నాదబిందు కళల నడుమ సుజ్యోతిపై
పాదుకొని యుండగా బ్రహ్మణ్యుడగును ||చాల||

పంచవర్ణములకడ ప్రణవ స్వరూపమై
పంచ పంచ ధ్వనుల మించి వెలుగుచును
పంచకోశములపై బలుదివ్య తేజమై
పంచముఖుఁడైన సద్బ్రహ్మణ్యుఁడగును ||చాల||
సిరిమించి యెప్పుడును చిద్రూపమై తనను
నరయఁగా నిరాశియై వెలుగుచును
పరికించ పూదోట బ్రహ్మంబు తా నగుచు
పరమస్వారాట్టనెఁ బ్రహ్మణ్యుఁ డతఁడు ||చాల||—73

## చెడుగుడాట

పంచప్రాణుల బంధన సేయుచు
పంచశిరము పణి పరువెత్తింపుచు
పంచేంద్రియముల బయలున గలుపుచు
పంచోర్ధ్వములను పైగొని కులుకుచు
ప|| చెడుగుడాడెనే దేవుడు చెడుగుడాడెనే
చెడుగుడాడెనే మురియుచు చెడుగుడాడెనే ||చె||
చెడుగుడు గుడుయను చిరప్రణవంబున
సుడిబడ యేగ్గురి చూపుల దరుముచు
పుడమిని నలుగురి పోవదన్నుచు
గుడుసులముగ్గురి కరమున గొట్టుచు ||చెడు||
పట్టుగుపదముల పరువడి ద్రొక్కుచు
అట్టెగెంటికి ఆవలదుంకుచు
గట్టిగకోపులు గదిమితోలుచును
గుట్టుబైట కో కో యని కేకుచు ||చెడు||
మొత్తముగా మెయిభూషణలు మెరయఁగ
సత్తుమేనిపై స్వేదము జారగ
గుప్త పుటందెలు ఘోషింపంగ
హత్తిబయట దా నాడుచు పాడుచు ||చెడు||

గ్రక్కున ధరపై గంతులు వేయుచు
మొక్కవ పదరజమక్కున గప్పగ
ధిక్కరించు ముఖదీప్తులు ప్రబలగ
చక్కగలో నెలి మిక్కిలి మెరయుచు ||చెడు||

మెట్టిలపై తా మెలకువజూపుచు
చుట్టుగుకునిగని సుజనులు పొగడగ
అట్టిపూదోటకు నవ్వుల మెలగుచు
బట్టబయలునై ప్రబలుచు నెప్పుడు ||చెడు||—74



వనర పావకు రేచి వాయువులు బంధించి
తనరు భూతేంద్రియముల దరిమి తీవ్రమున
చనుదెంచియు విశుద్ధ చక్రమున నిలిచి తా
మొనసి యాబ్రహ్మనాడిని జొరగ వలెనూ
ప॥ నిరతమును శివయోగ నిపుణులై సజ్జనులు
గురుతారకమున మది గూర్చవలెనన్నా ! ||నిర||
తెలిసి నిగమాంతమున దివ్యాంత రత్నంబు
నిలిచి యవలోకించి నిష్కళంకులునై
వలసి పూదోట కేవల బ్రహ్మపదమును తా
కలసి యమనస్కులై నిలువవలె నన్నా ! ||నిర||—75



ఆధారపుప్ప రథముపై నధికుడై తానిలిచి
పాదుకొన్న అహి పవనుచే పరువులుపారించి
కాదని త్రిపురములు క్రమముతో సాధించి
నాదబిందుఃకళల మధ్యనంటి గురున్ జూడగ
ప॥ వింతలాయెను రాముని నాలో చింతసేయగను
వింతలాయె నిగమాంతమున శాంత తేజమాయెనే !
నళిత న్నాక్రమించి తా ప్రణవాంతమున నిజమాయె ||విం||

మెట్టి మనోవేగమున మెట్టులాను గడచి తనదు
పట్టున ఓంకారరవము బలసి మ్రోదగాను
అట్టై ప్రణవమున బిందు వంటగూర్చి తుదను
గుట్టుబైట పరమగురుని కోరి నే జూడగను ||వి౦||
బయలు సర్వమును సూక్ష్మ బయలుగా తా దెలిసి
బయలులోని బైటను చిద్బయలు తానై నిలిచి
బయలుమీరియున్న పరబ్రహ్మను వీక్షించి తా
నిశ్చయమైన పూదోటగురుని పదమంటిన తుదను ||వి౦||—76



అతితుర్యమైనట్టి యగ్నిజ్వాలను సర్వ
చైతన్య జాలములు జెరచి తుదను
చతురుడై మదిని నిశ్చేతనుడై నిలిచి
జితవిషయుడై గురుని సేవజేసినను
ప॥ అష్టాంగ యోగముల గష్టపడనేమిటికి
యిష్టలింగమున తానేకమగు తరిని ||అ||
దృష్టిమధ్యనుమనో దృష్టిచే జూచితా
ద్రష్టయందును మారుతము విస్తమగుచో
నష్టదళ కమలంబు నంటి చిత్కళలతో
నిష్టతో ప్రబలినను నిజహతంబగును ||అ||
వ్యోమపదమై రాజయోగంబు విలసిల్లు
నాముకొని వెలిలోను నమృతపదమగుచు
హేమదీప్తులతోడ నేకాక్షరంబైన
రాముడగు పూదోట రాజయోగినె యంట ||అ||—77



పరమ యోగముచేత పాపపుణ్యములు చెడు
పరమ యోగముచేత కరుగు నజ్ఞానం
పరమ యోగముచేత ప్రకృతి గుణములు దెగును
పరమ యోగముచేత భ్రమలన్ని పోలియున్

ప॥ నిర్విషయులార నేనిజము చెప్పెద వినుడి
సర్వయోగముల వర సారమిది సుమ్మీ ॥నిర్వి॥
పరమ యోగముచేత భవబంధములు వీడు
పరమ యోగముచేత బాయుసంసారం
పరమ యోగముచేత భక్తి ప్రకాశించు
పరమ యోగముచేత పరిశుద్ధుడగును ॥నిర్వి॥
పరమ యోగముచేత భావము నభావమును
పరమ యోగముచేత భగ్నమైపోవున్
పరమ యోగముచేత బద్ధజీవుడు గూలు
పరమ యోగముచేత ప్రబలు విజ్ఞానం ॥నిర్వి॥
పరమ యోగముచేత నిరుపమానందుడగు
పరమ యోగముచేత పరిపూర్ణుడగును
పరమ యోగముచేత పరమపద రాజగును
పరమ యోగముచేత మరి చిన్మయుడునా ॥నిర్వి॥
పరమ యోగముచేత ప్రత్యగాత్ముడు చాల
పరమ యోగముచేత బ్రహ్మమునుగూడు
పరమ యోగముచేత పరగ పూదోటపై
పరమ యోగముచేత నిరవలంబమునా ॥నిర్వి॥—78



చెలగి భూచక్రమున శ్రీగురుని చరణాబ్జ
ములును నర్చించి నిజముక్తి మార్గమును
దెలిసి పిండాండంపు చిక్కులును భేదించి
వలసి నా స్వస్వరూపమును ధ్యానించి
ప॥ సర్వమును మిథ్యయని స్వానుభవమునమదిని
నిర్విషయమైచాల నిష్క్రియుడనాదు ॥సర్వ॥
వసర నవనిచ్చెనలు మెరసి తీవ్రత నెక్కి
గుమత్తు ఝాడ్డగ నెదుట గోచరింపుచును

అరుదుగా బహుకోట్యర్క దీప్తులదనరు
స్థిరనిర్గుణజ్యోతి సరసిచూడగను ||సర్వ||
గ్రక్కునను సువిద్యయను కాననముగడిచి తుద
అక్కర చిదాకాశమను నడవిదాటి
చొక్కమగు పూదోట జొచ్చియవ్వలనిలిచి
మిక్కిలి యనంతమై మించి వెల్గుదును ||సర్వ||—79

తనరి తేటులు కుసుమ తావి వెదకుచు చాల
మొనసి ఘుమ్మున పుష్పముల కెగసినట్లున్
ఘనులు భూచక్రమున ఘనయోగిగను గొనుచు
గుణరహితుడైనట్టి గురు జేరవలెను

ప|| అరసి నిజగురుపదము లరలేనిభక్తితో
గురుసేవ జేయవలె గురుపుత్రు లెపుడున్ ||అరసి||
కళలమించినహృదయ కమల కర్ణికమధ్య
నలరు సద్గురుపూజ లమర జేయుచును
తలచి త్రివిధ ప్రసాదములు గైకొనిమదిని
తెలిసి గురునిచే త్రివిధ దీక్షవడయుచును ||అరసి||
దిట్టలై విమలమగు దివ్యాంతరంగమున
గట్టిగా బ్రహ్మంబు కదసి ధ్యానించి
గుట్టైన పూదోట గురుమూర్తి నంటితుద
నెట్టుగా మోక్షమున నిలచి వెలుగుదురు ||అరసి||—80

అల యరుంధతి దృష్ట్యాది లక్ష్యంబులును
తలచ ఛాయాపురుష ధరదివ్యదృష్టుల్
తెలివిలోపల దివ్యలక్ష్యమున తాజూడ
యిటను కాల జ్ఞానములు విపులమగును

ప॥ భ్రమసి మహిలో దిరుగు బహువేషధారులకు
అమిత నిర్గుణపదంబందు: టేలాగూ ? ॥భ్ర॥

అతిశ్రేష్ఠమై హఠాద్యష్టాంగ యోగములు
శృతులు శాస్త్రపురాణ హిత జపతపంబుల్
మదిని సత్వసమంటి తన్మయుండైన
హిత సర్వయోగములు హతములై పోవున్ ॥భ్ర॥

మరిద్విలక్ష్యములపై మధ్యలక్ష్యము మించి
గురుతు నంతర్జ్యోతి కొనను మెరయగను
పరికించి పూదోట బ్రహ్మంబు నంటితా
నెరయ నిర్లక్ష్యమై నిండి ప్రబలుదును ॥భ్ర॥—81

---

పంచముఖములను భూతేంద్రియముల
ప్రకృతి దేహములు జేయుచును
అంచితముగ సర్వాంగ దేవతలు
నజహరి రుద్రులు మొదలుగను
మించి స్వరాట్టను పురుషుని ముఖమున
మెరసెడి తేజో కళాంశమునన్
ఎంచగ సర్వము విరచితమగునని
ఎప్పుడు విద్యయు బలుకగనూ

ప॥ నిత్యము నిత్యము సద్గురు పదములు
నేప్పుతోడ నెరనమ్మిననూ
నిత్యము నాపోజ్యోతి మధ్యమున
నిరవయ పదమై నిలిచినను ॥ని॥

స్రష్టగు స్థావర జంగమాదులలో
జీవరూపమై జొచ్చియును
అష్ట తనువులను అంటి అంటకను
అచలవృత్తి చరియింపుచును

యిష్టమగు రవి చంద్రాగ్నుల కడ
నేకమైన హృత్పద్మముసన్
ద్రష్టై చెదరక దివ్యపుంజమై
దనరుమించి తాప్రబలగను ||నిత్య||

చింతించగ మది చిత్కిరణములు
చెలగుచు వెలిలో నిండగను
వింతలుగా మాణిక్య దీప్తుల
వెలిగెడి తారక జ్యోతికినీ
ఆధారమైన పూదోట గురుని గని
తానంటి మనోన్మని జెందుచునూ
సంతతమును నిర్భయమై వెలుగుచు
సర్వసాక్షియై నిలిచిననూ ||నిత్య||—82

పరమయోగమును గురుకృప దెలియుచు
గరిమె మారుతము క్రమమున రేచుచు
గురుతగు రెంటినిగూర్చుచు నేర్పుచే
మెరసి కుండలిని వింటికి దరిమెడి

ప|| యోగిని నేనేరా నిర్గుణ యోగిని నేనేరా
యోగిని నేనే యోగికులము తుద
త్యాగిని భోగిని యోగ జితుండను ||యో||

తనరుచు దేహత్రయము మించి నే
దినమణి నిశిమణి తేజంబులు తా
నొనరమించినే పరధైర్యంబున
పనువడి వెన్నెల బయటను సెలగెడి ||యో||

చెలగుచు సురగిరి చివ్వునదాటుచు
వలసి ముక్తిసతి నొయ్యన మీటుచు

కళల దనరు చిద్గగనము గడచియు
అలపూదోటకు నవ్వాల ప్రబలెడి ॥యో॥—౮౩

---

పరయోగి నీ కృపను వామాంఘ్రి మూలమున
వడి గుహ్యమును నొత్తిరామా
పరికించి యాకాశపదముద్ర తిరిగెడు
ప్రణవ వాయువుబీల్చి రామా
ఇరువొంద మారుతం బిడ పింగళలబట్టి
ఇరువురిని సంధించి రామా
అరయ డెబ్బదిరెండు వేల నాడుల జనెడి
యనిలుపూరించియో రామా

ప॥ దివము రాత్రులుమీరి త్రికూట గిరిపైకి
తీవ్రముగ లఘించి రామా
నవచక్రములురోసి యద్భుతజ్యోతి తుద
నమ్మి నిన్నంటితిని రామా ॥దివ॥

అనలంబు రేచి నాభిక్రింది కుండలిని
నెలవుతో నెగయించిరామా
మణికన్యతోడనే మహదాది జగములను
మరి వేగమున దాటి రామా
చనుదెంచి సూక్ష్మరంధ్రమున చయ్యనజొచ్చి
సగుణ పదవులుగడచి రామా
ఘనమైన చిన్నేత్రమునుదెరచి కర్మముల
కరగించి మెరసితిని రామా ॥దివ॥

పరుపడి సుధాబ్ధిపై పైడికల చవికెలో
బాలకుని లాలించిరామా
సిరిమించు సహస్రదళ శిఖరాంతమున ప్రబలు
చిదాభాసుదాటి రామా

పరమాణురూపమున బ్రబలెడి పూదోట
    పరమాత్మ నంటినే రామా
నిరతమును నిశ్చట నిలచియు ననంతమై
    నిండి వెలిగితిని నే రామా "దివ॥—84

## ముక్తి పూజ

రసికుడై నాసికాగ్రమున తానిలిచియును
వశకరంబగు స్వర్ణ వనజాంతరమునన్
పొసగ సద్గురు పాదములు భక్తియుక్తితో
విశదముగ నెపుడు షోడశ విధంబులను
ప॥ పూజసేయుచు గురుని పొంగి నిరతమునేను
రాజయోగిగ ముక్తి రాజునైయుండు ॥పూ॥
మురిపెమున చిన్మంత్రంబును భజనజేసి తా
నరసి యమృతంబుల నభిషిక్తుజేసి
మరియష్ఠ పుష్పములు మనసుతో సంధించి
స్థిరముగా వెలుగొందు చిన్మండలమునన్ ॥పూ॥
పగలు రేలును మీరి పరిపూర్ణ శాంతితో
నిగమాంతరంగమున నిలిచి వేడుకను
అగుణుడగు పూదోట యాత్మరాముని నేను
సుగుణమగు జీవపుష్పమున సొంపుతోడ ॥పూ॥—85

## పరమయోగమున, అఖండజ్యోతి, ఆత్మపూజ

అరసి నిశ్చల చిత్తమను ప్రమిదంగోచాల
సరగపడ్వర్తియను చమురు బోయుచును
నరుదు నాతన్లక్ష్యమను జ్యోతివెలిగించి
గరిమె ప్రణవంబనెడి ఘంటమ్రోదించి
ప॥ సిరిమించు గురునికిని సేవజేసిన మీకు
కరత లామలకముగ కరుణించుమోక్షం ॥సి॥

అలయకను సొలయకను నమితభయభక్తితో
వెలుగుచును చిద్గగన సింహాసనముపై
నిలచి ప్రకాశించు నిజగురుని చరణములు
వలసి మీ యాత్మసుమములను సర్పించి ॥సి॥

ఉనికి జ్ఞానాగ్నిలో నుచ్ఛ్వాస నిశ్వాస
మను ధూపమును వేసి యచలబుద్ధినినా
కనక పళ్యంబులో ఘన పద్రసాన్నముం
చనుదినము శ్రీగురుని కర్పించి మరియూ ॥సి॥

నిర్వాసనగు మదిని నెరయ కస్తూరలది
సర్వాంగములను భూషణము లలరగను
తర్వాత త్రివిధగుణ తాంబూల మొసగుచును
సర్వోప చారముల సంతృప్తి జేసీ ॥సి॥

సరసులై సద్గురుని సత్పదము మోక్షమని
నెరనమ్మి సర్వమును నిరసించిమదినీ
సరిలేని పూదోట స్వాములను గూడియును
వరస్వస్వరూపమై మెరయరోయన్నా ॥సి॥—86

వనర విన్నాణి కొవ్వాడి వాలునుదాల్చి
మొనసి తా ననేక వాసన ద్రెంచివేడ్క
కనుగొనుచు దేహవాసనద్రుంచి తీవ్రమున
ఘన శాస్త్రవాసనయు ఖండింతు నేను

ప॥ వినుడి సన్మనులార వివరించి చెప్పెదను
తనరి సుస్థిర శూన్యతత్త్వమై యుందు ॥వి॥

బలమైన నిర్గుణ ప్రకృతి వాసన నేను
తొలగనీయకను తుత్తుమురు జేయుచును
అలరి అసి పదమనెడి యతితుర్య వాసనయును
ఛలుసి భేదించి నిర్వాసనుడ నగుదును ॥విను॥

నిరతిశయ నిర్ద్వంద్వ నిగమాంత వేద్యునై
నెర నిరామయుడనై నిలచియెప్పుడును
అరయ పూదోటపై నద్వితీయుడనునై
పరికించ నిర్లక్ష్యభావమున మెరతు ॥విను॥—87

---

ఘన నిరామయుడ నేననెడి హంభావము
నొనరగా కొవ్వాడి వాలుచేబూని
పనిబూని మూడు నాడును నేడు ఖండించి
తసరి మైదును మూడు తా ద్రుంచిమరియు

ప॥ ఆనందవనధినై యల చిదాంబరము తుది
వెలయుచుండెద చిరశూన్యతత్త్వమై యెపుడూ ॥ఆ॥

తరిమి మైదిటి మూటి తరిగి యతిశాంతమున
గరిమె నవగృహంబుల గాల్చి తీవ్రమున
మెరసి దశశబ్దములు మ్రింగి తను వేగమున
సరసి విద్యావిద్యల హతను జేయుచును ॥ఆ॥

వినుడి సజ్జనులార వివరించిచెప్పెదను
నొనరనాతావు నెవరును తెలియ లేరు
జనన మరణములేక చాల పూదోటపై
కనుగొనగ నే నిరంజనుడనై యుండూ ॥ఆ॥—88

---

హల కులిశ మత్స్యముల జలజ శంఖాంకుశం
బుల రేఖ లలరుస్వాముల చరణములకు
చెలగి మ్రొక్కుచునేను నిలచి నుతిసేయవిని
కలియ, ననువీక్షించి యొలసి చేపట్టెన్

ప॥ అరసి చెప్పెదమీకు నవనిపై జనులార
పరమ సద్గురుని సుస్థిరయోగమహిమ ॥అ॥

స్థిరమైన తనచరణ తీర్థ ప్రసాదములు
పరికించి కృపచేసి భక్తిదెలుపుచును
గరిమెను నఖండ మార్గము జూపుచునప్పుడె
నిరుపమానందమున మెరయుదును వినుడీ ॥అ॥

ఘనమైన విజ్ఞానఖడ్గంబు ఝుళిపించి
తను త్రయంబును ద్రుంచి తరిమిగుణరిపులన్
కనుగొనుచునే నప్తగాత్రములు ఖండించి
మొనసి ముక్తి ద్వారమున జొచ్చియవలన్ ॥అ॥

నిలిచి వెన్నెలబయల నెరసి ప్రకాశించు
కలిత నాదముబిందు కళలాక్రమించి
బలిమి మూలప్రకృతిపైకి లంఘించినే
దెలియు చిద్వ్యోమమున తేజరిల్లుదును ॥అ॥

నెరనిరాలంబమై నిజశూన్యతత్త్వమై
అరుదైన ఆదిమధ్యాంత శూన్యమునై
భరితమై పూదోటపై నద్వితీయమై
తరలకను తుది సమృత శరధినైయుందు ॥అ॥—89

## కురుక్షేత్ర రణము

గురుని కృపను శుద్ధాత్మ మెరసి సద్గుణసేన
లిరుగడల ప్రభలగను పరమశాంతుడునై
కరమునను సుజ్ఞాన ఖడ్గము ప్రకాసించ
గరిమె దుర్గుణరిపుల ఖండించి తనరు

ప॥ కురుక్షేత్రమున దెలియఘోర రణరంగమగు
పరమయోగులు దీని భావ మెరుగుదురు ॥కురు॥
కడు వేడ్కతో మోక్ష గవని తీవ్రతజొచ్చి
మొన తెగక భక్షువరు లెపుడు వెనువెంటన్

నడువసాహస్రార నగముపై లంఘించ
చెడని వరముక్తి రమ చాలనుతియించు ॥కురు॥

అలరు విద్యనుమించి అతితుర్య పురుషుడై
తలపు మరపులు మీరి తలపోయరాని
బలిమి పూదోటకడ బ్రహ్మంబు నొసగూడి
నెర నిరాకారమగు నిర్భయలునగును ॥కురు॥—90

జీవుడను దొర ప్రణవ ధనుస్సును ధరించుట

చిత్తవాజిని నెక్కి జీవుడనుదొర నాణ
కత్తిచే ఝళిపించి కడుశూరుడగుచు
మొత్తమగు హంకార మూల బలములద్రుంచి
సత్తు బలములుగొలువ చాలవెలుగొందు

ప॥ ఇదిసుమ్మి యుద్ధమగు నిలను సజ్జనులారా
యిది మోక్షసాధకం బెరుగ జెప్పెదను ॥ఇది॥

తలపోసి రాజదంత ద్వారమునజొచ్చి
నిలచి సురగిరిపైని నిండు వేడుకను
అల ప్రణవమను విల్లు సలరి యెక్కనబెట్టి
సలలితంబగు మనోశరము సంధించి ॥ఇది॥

శరము విడిచినను సుస్థిర చిదాకాశమను
గురికిదాకియు పూదోట గురిమీరి యవల
నిరవలంబంబనెడి గురుగలసి నాత్మడును
నెర నిరంజనపదవి నేర్పుతో గెలుచు ॥ఇది॥—91

ఒనరనిర్మల బుద్ధియను గజముపై నెక్కి
తనరు జ్ఞానాంకుశంబును తాబట్టివెలగి
ఘనత పురుషుడును నాగమును పురికొల్పితా
పనిబూని యజ్ఞాన బలము బోదరుమూ

ప॥ వినుడి యిదిఖండనము విమలగురుసుతులార
కనుగొన యఖండ మార్గము బట్టబయలు ॥వి॥

బలిమైనసుజ్ఞాన బలము గొలువగతా
వలసి సుస్థిరముక్తి ద్వారమున జొచ్చి
తెలియ ప్రణవంబనెడి దివ్యభేరీధ్వనులు
కలితముల్లోకములు గడగడ వణంకు ॥వి॥

మెరసి ఏడును మూడు గిరులు చివ్వనమించి
పరమ దహరాకాశపదము మీరుచును
గురుతు పూదోటపై గురునిస్వరూపమై
నిరుపమానందుడై నిలుచు నాత్ముడును ॥వి॥—92

విశ్వాత్మ సాధన

అరుదగు నిరాలంబమై వెలుంగుచు నీవు
నరయ బ్రహ్మంబనెడి హంకారముడిగీ !
చిర చిన్మయుం డనెడి పరమ భక్తుడవగుచు
నిరతమును సద్గురుని నిలిచి ధ్యానించూ

ప॥ భక్తియోగము సమము పరికించ నీమదిని
యుక్తితో దెలియ నొక యోగమును లేదు ॥భక్తి॥

విశ్వరూపకుడవై విశ్వంబులో జొచ్చి
విశ్వ జీవుండవై విస్తరిల్లుచును
విశ్వదూపడవునై విశ్వకారణమునై
విశ్వసాక్షిగ నీవు వెలుగుమీ వత్సా ॥భక్తి॥

నిరుపమానందమున నిజముక్తిదాతవై
నిరవయుడవైచాల నిర్లేపకుడవై
మెరయుచును పూదోట మించి యమృతుడవగుచు
గరిమె శూన్యాతి శూన్యగాత్రమై ప్రబలు ॥భక్తి॥—93

నిష్ఠ మెరయగ నగ్ని నేత్రంబు దెరచియును
అష్ట ప్రకృతులగాల్చి యానందముననను
షష్ఠ బ్రహ్మల తుదను జలజాంతరంగమున
నిష్ఠ నోంకారమున నిలచి సద్భక్తిన్

ప॥ శమదమున సద్గురుని చరణమంటుచు తుదను
అమనస్క పదమగుచు అటలాడుచును ॥శమ॥

గుభ గుభను నినదంబు కుడియెడమ మోదగను
అభిలాషతోడ తా నమృత మంటుచును
ఉభయ హంసలగూర్చి యుచ్ఛ్వాసమున బిందు
వభవునంటగ మీటి ఆనందమునను ॥శమ॥

అరసి సర్వముతాను అక్షరంబునగూర్చి
పరికించ నిగమాంత పదమునైచాల
నెరయ వెన్నెలబయట నిర్గుణబ్రహ్మమగు
గురుతైనపూదోట గురుయోగినంటి ॥శమ॥—94

---

చూతఫలములరసము శుకము ద్రావినరీతి
ప్రీతినమృతము మదిని పేర్చితుదగ్రోలన్
జాతియురగము నాగస్వరముధ్వని విన్నట్లు
ఆతీరు ప్రణవరవ మాలింతు స్వామీ!

ప॥ పరమాత్మ నీ దివ్యపదము ధ్యానింతునే
వరుసషట్కమలములు వెలసి వికసించన్ ॥పర॥

దినకరుని కిరణములు తీవ్రముగ బక్షించి
మొనసి చక్రవాకములు గవసినట్లున్
అనయమును నాస్వాంతమను చకోరంబెగసి
దినము నాసాగ్రమున స్థిరముగా నిలుచున్ ॥ప॥
క్రమముతో నీటినై కమలాంతరంబునను
అమితమై ప్రబలెడి చిదాకాశమునన్న

మమతతో పూదోట మహాయోగి పదమునే
సమకూడి యానంద సౌఖ్యమున మెరతు ॥ప॥—95



గురుమూర్తి కరుణచే యిరువురిని బెనచి తా
నురగమును భేదించి యూర్ధ్వముఖ జేసి
తరుచు తత్త్వంబులను మెరసి బుద్ధినిగూర్చి
మరి తాలుమూలముల మధ్య చెదరకను
ప॥ అలరు నుపనేత్రమున నఖిలాత్ము జూచినే
వలసి బ్రహ్మానందవనధి జొచ్చితినీ ॥అల॥
గుణరహితమై మదిని కోరి పరతత్త్వమును
తనరి నాసాగ్రమున తలచి చూడగను
దినమణియు నిశిమణియు తేజంబులును మించి
మెనసి దహరాకాశమున నిలిచి ప్రబలన్ ॥అల॥
కళలు మించిన యట్టి కమల కర్ణికచుట్టు
బలసి మెరసెడి రత్న ప్రభల నడుమన్
నిలిచి సద్గురుమూర్తి నిశ్చలాసనమున
వెలుగు పూదోట కేవల బ్రహ్మమగుచున్ ॥అల॥—96



వీరకంకణముగట్టి విజ్ఞాన వాలముబూని
ఆరు మెట్టులనున్న ధీరభటుల ఖండించి
కేరుచగ్ని నేత్రము చారదెరచి తీవ్రముగ
చూర బుచ్చి మూడింటుజొచ్చి బ్రహ్మరంధ్రముపై
ప॥ కంటి కంటి సర్వసాక్షిని నే గంటి
కంటి కంటి నడిమింటి చూపున విమల
కంటిలోనిల్చి వెలుగు ఘనమైన సత్పదమునే ॥కం॥
ఎండ వెన్నెలమించి పుండరీకమున
ప్రబలి యుండెడి యనంతకోటి మార్తాండ తేజోరాశియై

తండోప తండములై తారకజ్యోతి కళలు
నిండి యజాండకోట్ల నెరసి దీపించగనే ॥కం॥

మెరసి నాల్గు పదములుమించి యోగమాయపై
నిరత మానందమునను నిలిచి యతితుర్యుడనై
స్థిరమైన పూదోట పరమసద్గురుగూడి
పరికించి నే కేవల బ్రహ్మమైయున్న నెలవు ॥కం॥—97

## చతుర్థేహ లయ బోధ

### —: స్థూల దేహము :—

జలతరంగము లెగసి జలలీనమైనట్లు
మలినభూతేంద్రియములు మాయప్రకృతియును
నిలిచి నిగమాంతమున నినదంబు నాలించి
తలపు గలపిన స్థూలతనువు లయమౌను

### —: సూక్ష్మ దేహ లయము :—

ప॥ మనసు సంకల్పమున మహదాది జగములౌ
మనసు చిత్పదమంటి మరిసర్వమణగున్ ॥మ॥

అరయ సలిలంబుచే నగ్ని మడిసినరీతి
మరిచతుష్టయములును మమతస్వప్నమును
యురువడగు భ్రూమధ్య నుపనేత్ర జ్వాలలును
పరగ సూక్ష్మపు తనువు భగ్నమైపోవున్ ॥మ॥

### —: కారణ దేహలయము :—

దినకరుండుదయించ తిమిర మణగిన యట్లు
కనుగొనగ సుషుప్తియను గాఢమగు తమము
తనరి యంతర్జ్యోతి తలపులోపలవెలుగ
నణగు కారణదేహమరనిముసమునను ॥మ॥

—: మహా కారణలయము :—

పరికించి సర్వమును జెరచి వెన్నెలబయట
తరచు మెరుపుల దివ్యతరుణి గూడియును
పురుషుడానందమను భోగమున నిరతమును
గరిమె మెరసిన మహాకారణం బడగున్ ॥మ॥

—: సంపూర్ణ ముక్తి :—

అదిమీరి యాత్ముడును నతితుర్యపదమునై
కదసిచూడగ చిదాకాశమవ్వలను
సదయుడౌ పూదోట సర్వసాక్షిని గలసి
అదిగొ తాశూన్యపదమై ప్రకాశించున్ ॥మ॥—98

గాయత్రీ మంత్రోపాసన (చందమామతత్త్వం)

పెక్కు-రంధ్రముల దిరుగు చందమామా
ప్రాణు మిక్కిలి నిరోధించి నే చందమామా
ఉక్కడచి కుండలిని చందమామా దివికి
చక్కగ నెగయించితినే చందమామా

ప॥ గట్టిగ నిరువది నలుగురిని చందమామా గాలి
దిట్టనై కూర్చుక నే చందమామా
అట్టె త్రోవల తడకట్టి చందమామా
మెట్టెరవి రాజుల మించితినే చందమామా ॥గట్టి॥

గ్రక్కున సూక్ష్మ ద్వారమున చందమామా శక్తి
మక్కువ నిద్ర మేల్కొలుప చందమామ
ఎక్కువ రాజుల గెలిచి చందమామా నే
నెక్కి నడవీథి జొచ్చితిని చందమామ ॥గట్టి॥

కంటి మాయకడను జిమ్మి చందమామ దీర్ఘ
ఘంటానాదము మ్రోయగా చందమామ

అంటి జిహ్వాను పూవుదేనె చందమామా బయట
కంటి విమల జ్యోతి కళలు చందమామా ॥గట్టి॥
పట్టైన తొమ్మిదిమెట్ల కిన్నెర చందమామా
పట్టి నేనానంద మందెదను చందమామా
కట్టి యేబదియొక్క తీగల చందమామా
గురుని పట్టునంట మీటితిని చందమామా ॥గ॥

ఒప్పుతో సత్తూరుపైన చందమామా నేను
ముప్పదియారు కళలనో చందమామా
విప్పినేను ప్రణవ గర్భమూన చందమామా నేను
నొప్పుదెలిసి నుంచితినో చందమామా ॥గ॥

పరిపూర్ణమగు పూదోటపై చందమామా నేను
పరమయోగి నంటితీని చందమామ
నిరతమంతర్లక్ష్యముపై చందమామా నేను
పరమ తత్త్వమై యుందునె చందమామా ॥గ॥—99

---

అంటి ప్రాణపానుగూర్చి అష్టపురము లధిగమించి
జంటనేత్ర జ్యోతులెత్తి జలజమనెడి నిచ్చెనెక్కి
ఘంటారావమువింట నిలచి కలికి దివ్యకళలుజూపి
అంటి నీరునగ్నివాయు వక్షరమున గూర్చినే

ప॥ యేమిసేతురా! తండ్రి యేమిసేతునూ!
యేమిసేతూ గురునిపదము ఏకమగుచు నేనుమరచి
ఆముకొనుచు యేను బ్రహ్మానందము నే బొంది ॥ఏమి॥

పంచకోశమధ్యబింధు ప్రణవ పీఠమునను గురుని
అంచితానందబాష్ప సంచయముల జూడగలిగి
పంచ పంచధ్వనుల యాప్రణవమనెడి మంత్రమునను
పొంచియాత్మ నేత్రసుమము పూజజేసి గురునకిపుడు ॥ఏ॥

ఎండ వెన్నెలగ్నిశిఖల మెనయ యేను మూటిమ్రింగి
మండలములుమీరి చిన్మండల ప్రకాశమగుచు
పండి నిండి పూదోట పరమగురునిగూడి నేను
మండుచు నిర్వాత దీపమగుచు బట్టబయటనిలచి ॥ప॥—100



## —: నాలుగు యోగములు :—

పంచభూతములలో ప్రచురించు వర్ణముల
పంచాక్షరగు శుద్ధ ప్రణవమునగూర్చి
మించి నిగమాంతమున మెరసి తనుఘోషించ
ఎంచ మంత్రసుయోగ హితమిదియగాదా!

ప॥ విన్నపము జేసెదను వినరయ్య గురుసుతుల
విన్న కన్నంతనే విస్తరించెదనూ ॥విన్న॥

జంటదృష్టులుగూర్చి సరస బిందువుతోడ
నంటి భూతేంద్రియముల నమరబట్టుచును
కంటిజ్వాలలను తా గాల్చియును సుజ్ఞాని
మింటనిలచినను లయ మిట్టిదియగాదా! ॥విన్న॥

కుండలిని రేచి తుద గుప్తవీధినిజొచ్చి
పండువెన్నెల బయట పదిలుడైనిలిచి
దండి తేజమునందు తా వాయువులుగూర్చి
నిండి వెలిగినను హఠయోగ మిదిగాదా! ॥విన్న॥

పట్టైన శిరమునకు పదియు రెండునుమీరి
బట్టబయటను దివ్యప్రభల విరచితమగు
నట్టి యమృతజ్యోతి యానంద పదమునై
యుట్టిపడు ప్రభు రాజయోగ మిదిగాదా! ॥విన్న॥

సంతతాభ్యాసమున సర్వయోగములు
శివచింతచే తా పరమ శివునంటగూర్చి

అంతలో పూదోట యాత్మారాముని గూడి
మంతుకెక్కినను తన్మయం బిదియుగాదా ! ॥విన్న॥—101



పురత్రయము జెరచియు పొసగజ్ఞానాగ్నిచే
గరిమె మెరయుచు భుజగి నుంకించి దివికి
మరిసర్వ దేవతల మనసుతో సంధించి
పరువెత్తి నడవీధి బయలు పరచకను

ప॥ జంటపక్షులగూర్చి జలజాంత రంగమున
కంటి నను గన్న నిజ ఘనయోగి పదము ॥జం॥

కళల దనరుచుబయట కమ్మిక ప్రకాశించు
అలరునుదకజ్యోతి కంతరంగమున
సొలసిచూడగ పరంజ్యోతి పీఠము మధ్య
నిలచి సద్గురుమూర్తి నిండి ప్రబలగను ॥జం॥

గరిమె మెరయుచు చిద్గగనమున కవ్వలను
నెరయ నిష్క్రియుడునై నిర్ద్వంద్వమగుచూ
సరసుడగు పూదోట సర్వసాక్షిని గూడి
పరికించ నిర్గుణ బ్రహ్మమై యుందూ ॥జం॥—102



పవనసంయోగమున ఫణిరాజు నెగయించి
దివము రాత్రులుమీరి తీవ్రముగ జ్ఞప్తి
త్రివిధ వర్ణములతుద దివిని భ్రూమధ్యమున
శివకరంబైన సుస్థిరయోగి గాక

ప॥ ముక్తియూరకగలదె ముజ్జగము వారలకు
భక్తి మెరయగ గురుని పదముబట్టకను ॥ము॥

జలమధ్యమున హృదయ జలజాంతరంగమున
నలరు నాదముబిందు కళలాక్రమించి

బలిమి స్వయంజ్యోతి పరగచివ్వనమించి
తెలియనిర్లేపుడై తేజరిల్లకను ||ము||

వేదాంతవేద్యమై వెలుగుచును నిరైబట
నాదిమధ్యాంత శూన్యప్రకాశులునై
పాదుకొని పూదోట బ్రహ్మంబుగలసి తుద
మోదమున సజ్జనులు మొససి వెలుగగను ||ము||—103

## కోలాట తత్త్వము

శిరములయిదు యుండు వాని చెలగి రేచరే మీరు
గురుతు దెలసి సూక్ష్మవీధి కూడి నడువరే
శరధు లేడుగడచి వరుస గిరులు దాటరే మీరు
మెరుగుమేరు శిఖరమెక్కి మెరుపు జూడరే

ప॥ కోలు కోలు కోలు చిటుకు కొనల వేయరే చెలియ
కోలు గొల్లాస బయట గురుని గూడరే ||కోలు||

ఒంటి యింటిలోన గురుని యొుడ జూడరే
జంట దొరల యింట వాని నంట గూర్చరే
మింటిమంటి రెంటినడుమ నంటి వెలుగరే (చెలియ)
కంటి దృష్టిచేత పాప లంటి బెనగరే |కోలు|

రమణ జ్యోతులంట గూర్చి రాశికెక్కరే చెలియ
కనులమధ్యనిలచిమీరు ఘనుని జూడరే
అమృత సరసిలోనజొచ్చి ఆటలాడరే చెలియ
విమలమైనతావు మీరు విస్తరించరే |కోలు|

ఎదుటనిలిచి కులుకులాడి ఏలపోదువే చెలియ
మధురమైన పలుకువినుచు మరచియుండరే
సద్దులేనికొండమీద సరగనిలువరే చెలియ
సిద్ధచైదములార పరమ సుఖమ్ము జెందరే |కోలు|

శుద్ధమండలంబుగడచి చిదాబాసుగాంచి చి
న్మండలంబు మించి మూల మర్మమెరుగరే
నిండువిమల కళలబయట నిలిచిచూడరే చెలియ
అండగొనగ పూదోట అభవుగూడరే ||కో|| — 103


శ్రీ జ్యోతిరామలింగస్వామి.

## ఏడవ దళము

# దివ్య దర్శనము




## సద్గురుదేవుడు

మరి రజోగుణమునై మహదాది జగములును
వరుసతో నిర్మింతు వార్తకెక్కగను
నెరసత్వగుణమునై నిఖిలమును పోషింతు
వరయ తామసగుణమునై జెరతువహ్ని

ప॥ గురుమూర్తి మీమహిమ కజనులే మెరుగుదురు
పరమయోగులునైన భక్తులెరుగుదురు ॥గురు॥

విలయమున సర్వంబు నీవు కుక్షినయుంచి
జలరాసిపై స్వర్ణజల జాంతమునను
తెలియ దినకరకోటి దివ్యప్రకాశమై
నిలిచి వెలిలోపలను నిండి ప్రబలుదువె ॥గురు॥

నిరుపమ నిరాతంక నిష్క్రియ నిరాభాస
నిరతిశయ నిర్భేద్యనిష్కళంకుడవై

భరితమగు పూదోటపై నుభయసాక్షివై
యరయగ నిరాకారమై వెలుంగుదువే ॥గురు॥—1

## పంచవర్ణములు, భానుబింబము

వింట పామును శేచితి నమ్మా!
జంటబంతులు మింటి కంట మీటితినమ్మా!
ఘంటారవము నడిమింట మ్రోయగను రుచు
లంటి గురుని గంటినమ్మా!

ప॥ కంటా రాముని జంటా బాయక యుంటినమ్మా!
ఓ యమ్మా! నేనెటువంటి మేలుగంటినమ్మా! ॥క॥

కోటలేడునుదాటి పూదోట నే జొచ్చినపుడూ
తోటవాడూ నన్ను చేపట్టెనమ్మా
పట్టి తారకరాము డాపదవి తన కిచ్చెనమ్మా ॥క॥

పంచవర్ణములనే గంటినమ్మా!
పంచాగ్నిమధ్యను భానుబింబము గంటినమ్మా!
మించి చంద్రునిలో మంచిరత్నముగంటి
పొంచి లెక్కించుకొంటి నమ్మా!
శిరము మీదనుంచి మించి వెలిగితినమ్మా! ॥క॥

పండు వెన్నెల గంటినమ్మా!
మెండు దీప్తుల దండి తేజము గంటినమ్మా!
నిండు మెరుపుల జ్యోతిమండలమున పూదోట
మండలాతీతుని గంటినమ్మా!
నిండు మోహమునంటి నిండి యుంటిగదమ్మా! ॥క॥—2

## అనంత విశ్వమూర్తి శేషశాయి

సిరిమించి కుండలియు క్షీరాబ్ధి మధ్యమున
పరిపూర్ణమగు వేయి ఫణులతో పనర

శిరములను మాణిక్య వరదివ్యకాంతులును
నరయ దివిభువిదిశల నంటి ప్రబలగను
ప॥ కంటి సద్గురుని హృత్కమలాంత రంగమున
అంటి చిద్బ్రహ్మమై యాటలాడగను ॥కంటి॥
దినకరుల శతకోటి దివ్యప్రకాశమై
మనసనెడి ఫణిరాజ మండలాంతమున
కనక బహురత్నమయ ఘనజ్యోతి పీఠమున
ననుదినము నిజగురుండచట ప్రబలగను ॥కంటి॥
మితిలేని చరణములు మితిలేని బాహువులు
మితిలేని శిరములును మీరి వెలుగుచును
మితిలేని నేత్రముల మెరసిలో వెలిగనుచు
నతితుర్య పురుషుడను నాఖ్య విలసిల్ల ॥కంటి॥
పురుషోత్తముని యంగ భూషణంబులు ప్రబల
మెరుగు పచ్చనివలువ మేన మెరయగను
శిరముపై నవరత్న వరకిరీటము వెలుగ
సరసనెప్పుడు ముక్తిసతి ప్రకాసించ ॥కంటి॥
చక్కగా కరములను సర్వాయుధములలర
గ్రక్కునను కర్మలను ఖండించి కేరుచు
దిక్కరింపుచు ముగురి దివ్యస్వరూపమై
చొక్కమగు చిరునవ్వు సొంపు మెరయగను ॥కం॥
పరమ కన్యలు గురుని పదము లర్చించగను
యిరుగడల యోగీంద్రు లెపుడుస్తుతిసేయ
సరసిజాక్షులు వింజామరంబులువీవ
పరమాత్మగని శృతులు భజనసేయగను ॥కం॥
నిలచికొలువై యిల్లు నిజభక్తకోటులకు
తలపోయగా ముక్తిదాత తా నగుచూ
బలిమైన పూదోటపై పరబ్రహ్మమై
యారి సర్వము తా నాయక వెలుంగ ॥కంటి॥— 3



శ్రీ గురుపాదుకా పూజలో

వెలగల సూరారెడ్డిగారి దంపతులు - పేకేరు, పశ్చిమ గోదావరి జిల్లా



శ్రీ గురుపాదుకా పూజలో



తమనంపూడి అదినారాయణరెడ్డిగారి దంపతులు - పేకేరు, ప. గో. జిల్లా.



శ్రీ పూదోట గురు పాదుకాపూజలో
చింతలపాటి వెంకటాచలపతి దంపతులు - గుడివాడ, కృష్ణా జిల్లా



శ్రీ పూదోట గసు పాదుకాపూజలో మావిలేటి శ్రీరాములు దంపతులు
మరియు జగన్నాధరాజు, రమణమ్మ, సుబ్బలక్ష్మమ్మ - భద్రాచలం

—: అనంతజ్యోతిర్మయ మూర్తి :—

పంచభూత వికారములు మరి పంచవింశతి తత్త్వములు ఘన
పంచ బ్రహ్మలు పంచశక్తులు పంచమాత్రలు పంచానిలములు
పంచధ్వనులు ముప్పదియును పరగ నెనిమిదికళలు సర్వము
మించు ప్రణవము నంటగూర్చుచు నెంచి ముక్తినిధాన మిప్పుడు

ప॥ కంటి కంటిస్వామినీ । కంటి కంటీ ।
కంటి నిర్మలస్వాన్తు కేవల ఘనుని నిజపదభక్తి ధ్యానము
నంటి చిన్మయహంసమై ఆనంద వనధిని నోలలాడుచు ॥కం॥

మెరసి నిటలోర్ధ్వమున జూడగ పరమ జ్ఞానులు గొల్వనిర్గుణు
డరుదుగా సాహస్రారమున యజ్ఞకర్ణిక మధ్య వెలుగుచు
నిరతమును దివ్యాంతరంబున నిలిచి బహుమణి కాంతులనుదివి
తిరముగా శతకోటి దినకర దీప్తులను శోభిల్లు తండ్రిని ॥కం॥

నిండి జీవజ్యోతులై పిండాండ బ్రహ్మాండముల వెలుగుచు
పండు వెన్నెలబయట బలిసియు మెండు చిత్కిరణములతోడను
దండి తేజో రాశియై తుద ముందు చుండెడి జ్యోతిమధ్యను
అండగొని పూదోట రామునినంటి తన్మయమైన మేలును ॥కం॥-4

—: స్వ యం జ్యో తి :—

నెరమంట మిణుకుల దొరసివైశ్వానరుడు
మరియు భూచక్రమున మెరసియున్నటుల
అరయ భ్రూయుగముపై సమితముగలో బయట
పరికించ చిత్కళలు విరచితంబైన

ప॥ ఆనందమున జూచి అంటి సద్గురుపదము
తానన్నయోగి పరతత్త్వమై వెలుగు ॥ఆ॥

తనరు వెన్నెలబయట దట్టమగు సత్కళల
పసిబూని యుడురాజు ప్రబలుచున్నటుల

ఘనయమృత కళలతో కదసివేదాంతమున
నెనసి స్వయంజ్యోతి యెపుడు వెలుగగను ॥అ॥
అలరి సర్వముసంటి యంబరంబున మెరసి
తలచ నర్కుడు చాల వెలుగుచున్నటుల
నిలిచి నామదిలోను నిండు చిత్కిరణముల
బలసి పూదోట సత్ప్రభువు ప్రబలగను ॥ఆ॥—5

—: చిదాకాశ లింగము :—

అలరు రేఖలు వర్ణాక్షరంబులు వరుస
చెలగు బ్రహ్మలు సరస మెలగు శక్తులతో
సలలితంబైన నవ జలజములు శోభిల్లు
తలపోసి వీటితావులు తెలియవలయు
ప॥ జిత విషయుడైనట్టి శ్రీ గురుని కరుణచే
మదిలోను వీటి మర్మములు కనుగొనుడీ ॥జి॥
కనుగొనగ సహస్రార కమలాంతరంగమున
దినకరునిగతి నెపుడు తేజరిల్లుచును
మొనసి వెలిలోనిండి ముక్తిరమ కలుకుచును
ఘనత నాదముబిందు కళలపై ప్రబలు ॥జి॥
స్థిరమగు చిదాకాశ సింహాసనముపైని
నిరవయ నిరాకార నిష్కళంకుడునై
మెరయుచును పూదోట మీాదద్వితీయుడై
అరయగా సర్వ సాక్షియై ప్రకాశించు ॥జి॥—6

—: మండల త్రయాతీత తేజోరాసి :—

గంగాయమున మధ్యనతడు మెరసి చెంగలింపుచునుండు నమ్మా
అంగనరో! రామవిభుని యంతరంగమున కనుగొనరమ్మా
పొంగుచు రత్నభూషణములే యంగమున నిండ
అంగనా! యచ్చోట రాముడు యానంద మాడునే

ప॥ అదె చూడరే మీరు కొమ్మా రాముడాత్మేశుడై చెలగునమ్మా
కొదువ లెంచకనన్ను కోరిగోల్లాసమున
పదునైదుకళలంట బట్టికూడెనమ్మా ॥అదె॥

అంటికన్యలు జూడనతడూ నడిమింట నాట్యము దొక్కెనమ్మా
మింట మంటెనడుమ నతడూ జగము లంటి వెలుగూచుండునమ్మా
గెంటక నామదిని నంటి నద్భుతముగా జంటబాయకనా
వెంటదిరిగేస్వామి ॥అదె॥

మండల త్రయముపై నతడు విమలపుండరీకము మించికొమ్మా!
దండి తేజోరాశియై నతడు బయట తరలక ప్రబలునోయమ్మా!
అండపిండాండముల నాముకొని పూదోట నండజేగొని
యున్న యమృతస్వరూపుని ॥అదె॥—7

—: నిరాలంబ ప్రకాశము :—

అనిలంబుచే నధోహిపుని కడు భేదించి
మనసుతోడను సర్వమును గూర్చి వేడ్క
దినరాజ హిమకరుల తెరువులను నడకట్టి
తనరుచును బ్రహ్మరంధ్రము జొచ్చి తుదను

ప॥ కనుగొంటి సద్గురుని ఘన చిదాకాశమున
దివము వెలిలోనిండి తేజరిల్లగనూ ॥కను॥

పరికించి వీక్షించ పండు వెన్నెలబయట
భరితమగు చిద్బ్రహ్మ సౌదామి నలర
గురుతు సాహస్రార కమల కర్ణికయందు
సిరిమించి ముక్తిరమ చెలగి ప్రబలగను ॥కను॥

తెలియ నాదము బిందు కళల విరచితమగుచు
బలిసి వెలిగెడి మూలప్రకృతి కవ్వలను
బలిమి పూదోట నిజ పరమ తాంకయోగి
యొలయుచు నిరాలంబమై ప్రకాశించ ॥కను॥—8

—: గురుపరమేశ్వర దర్శనము :—

—: శతకోటి భాస్కర ప్రకాశము :—

ప్రళయాగ్నిచే భూతపంచకము జెరచి తా
నలుత్రోవలకుమధ్య నడిమి వాకిటను
అలరి చివ్వనజొచ్చి యాకాశముద్రలో
నిలిచి శాంభవి తుదను నిజగురునిగంటి

ప॥ సుజ్ఞాన జనులకిది చూడ నద్భుతపదను
అజ్ఞానులకు మనిని నతిదుర్లబంబూ ॥సు॥
గరిమె తేజత్రయము గడచి వెన్నెలబయట
భరిత చిన్మయనేత్ర పద్మకర్ణికనూ
స్థిర దివ్యకరముపై పరమాత్మరూపమై
మరియు శతకోటి దినమణి దీప్తులలరు ॥సు॥
అష్టదిశలను బృధిని అంబరను నాముకొని
దృష్టాంతమగు దివ్య తేజమై వెలుగు
నిష్టతో పూదోట నిజగురునిపదము తా
నష్ట భక్తులగూడి ద్రష్టనైయుందూ ॥సు!—9

—: బ్రహ్మదీప్తి :—

కన్నగొనలను గురునిజూడగ కాంతిదిక్కుల పిక్కటిల్లెను
ఉన్నతముగ చిదార్కుడలరుచు నుదయమైనపుడూ
పన్నగము పడిగెత్తియాడెను పద్మములు వికసించెతుమ్మెద
తిన్నగా పూదేనెగ్రోలుచు డివికి నెగయగను

ప॥ రాముని నేకంటినమ్మా!
కంటినే నామనసులోపల కలిసివెలిగెడి నిర్వికారుని
నంటి బ్రహ్మానందమున నే నుంటినోయమ్మా! ॥రా॥
గంగయమునలగూడి చివ్వన గంజకియు నెదురెక్కిపారెను
పొంగుచును భ్రూయుగముమధ్యను రంగుమెరయుచును ...

సంగతిగ జలసింధు మధ్యను జలజపీఠము నంటివెలిగెడి
మంగళాస్పదమైన రాముని మగువా ! కనుగొంటి ॥రాము॥

ఘంటానాదము వింటీ !
యమృతము నంటి రసనాగ్రమున గ్రోలుచు
మించివెలిగెడి బ్రహ్మదీప్తులు మెరయ గనుగొంటి
కంటి సాహస్ర రేకుల కమలమధ్యను జ్యోతికవ్వల
నంటియా పూదోటపై నేకంటి నిర్గుణునీ ॥రాము॥—

## —: తాండవ నృత్యం :—

మింటికి బిందువు మెరసి నడువగను
జంటదృష్టి గురునంటి చూడగను
ఘంటారవము నడిమింట మ్రోయగను
అంటి భుజగిపై యానందంబున

ప॥ ఆడెనే ! రాముా డాడెనే ! ఆడుచు పాడుచు నానందంబున
నోడక తా శివయోగి పుంగవుడు ॥ఆడె॥

దిట్టగు మద్దెల ధిమి ధిమి యనగా
చుట్టు వీణలును సుజనులు మీటగా
గట్టిగ పరసతి గానము సేయగ
పట్టుగ జతదప్పక పరమాత్ముడు ॥ఆడె॥

తల్లడించిధర తాండవ మాడగ
ఘల్లున పదముల గజ్జలు మ్రోయగ
జల్లున ముఖకళ స్వేదము జారగ
చల్లని వాయువు సమత విసరగ ॥ఆడె॥

చక్కగ నాహృజ్వనజ మధ్యమున
యెక్కువ సొమ్ములు మిక్కిలి మెరయగ
చుక్కల దుప్పటి చుంగులు జారగ
గ్రక్కున వెలిలోనికి దుముకుచున్నా ॥ఆ॥

చుట్టు మహానులును చూచి పొగడగను
కట్టలుగాని వరకన్యలు జూడగ
దిట్టై పూదోట నట్టై మీాపుచును
బట్టబయలునై పరిపరి విధములు ॥ఆ॥—11

—: జగదాత్మ :—

ఎంచి భుజగిని రేచి యిసవురిని తడకట్టి
మించి ప్రకృతులణచి మింట త్రోవను మెట్టి
పంచవర్ణములపై బ్రహ్మ కళలూగంటి
మించు తేజముమధ్య మెరయు గురుగంటిన్

ప॥ ఆనంద మానందమే! కేవల బ్రహ్మానంద మానందమె!
ఆనందమాడుచు అరయ చిద్గగనమున
జ్ఞానపురుషుండైన మహానివర్యునిచర్య ॥ఆ॥
తల్లడించగ జగము దశశబ్దములువింటి
జల్లునవర్షింప సరగ యమృతమునంటి
చల్లనిచూపుల జగదాత్మ నేగంటి
ముల్లోకములంటి మొనసి వెలుగగంటి ॥ఆ॥
అట్టై నామదిలోన నాటలాడగగంటి
చుట్టు త్రిమూర్తులును స్తుతులు సేయగగంటి
గట్టిగా పరంజ్యోతికడను గురునిగంటి
పట్టైన పూదోట పరమయోగినంటి ॥ఆనం॥—12

—: దేవదేవుని దాగుడుమూతలు :—

పన్న గేంద్రుని దివికితా పసువెత్తించునే
సన్నబిలముజొచ్చి వహ్నిజొరరేచునే
కన్నుగానలకడ వెన్నెల బయటను
తిన్నని పలుకుల కన్నెల బిలుచుచు

ప॥ ముచ్చులలో రాముడు దాగిలి ముచ్చాలాడెనే
యిచ్చమెరయు పొదరింటిలో కేరుచు
నచ్చట ముచ్చట మత్స్యపుటంపుల ॥ము॥

దిట్టమైన మాయను తా దిట్టై పొదన్నునే

గట్టున సచరాచరములంటి గురు డంతట మెలగునే
గట్టిగ నాహృత్కమల మధ్యమున (నట్టై)
అమృతపదమై యద్భుతముగ దా ॥ము॥

ఎండవెన్నెలయు అగ్నిశిఖలు నిండిమించునే
కుండలినీ పడగలనై తా తాండవ మాడునే
అండగొనుచు పూదోటకు నవ్వల
నిండి వెలుంగుచు నిర్వికారుడును ॥ము॥—13

—: ప్రణవాంత నిధానము :—

గురుని దివ్య కరాంబుజము తన శిరసుపై సంయోగభావన
పరుడు రవిశశి వహ్నికడ నిజపద్మ కర్ణికమధ్య చెదరకను
నిరతమును ప్రణవాంత లింగము నిండు చిత్కిరణములతోడను
అరయ నా సుజ్ఞప్తిలోపల అంటి వెల్గు మహానిధానము

ప॥ కంటి సద్గురుమూర్తి నిర్మల ఘనతి సత్పదభక్తి యోగము
నంటి నిష్కళ బ్రహ్మమై తుద నగణితంబైయున్న నిలకడ ॥కం॥
మరియు నాపోజ్యోతిమధ్యను మణులప్రబలెడి జ్యోతిపీఠను
గురుతుగ పరమాత్మయై శతకోటి దినకర విరచితంబుగ
నెరసి దిశి భువిదిశలు నాముకనిలిచి సదసత్త్వయిన తేజో
భరితమై గుణశూన్య భవనమునందు వెలిగెడిస్వస్వరూపము ॥కం॥
ధరను పావనులైన గురుజనులరయు తత్పదయోగఫలమును
మెరుక మరపులు మీరి ద్రష్టయై మెరయుచుండెడి సర్వసాక్షిని
పరమ పదమున నిలిచి కేవలబ్రహ్మమై క్రీడించు సత్క్రియ
శరణతో పూదోట రాముని కలిసియున్న సుకీలకంబును ॥కం॥—14

—: స్వర్ణ పా దు కా ధా రి :—

సర్వయోగము లధిగమించియు చంద్ర దినకరాగ్నిపై
నిజ పర్వతాగ్రమునందు పై దళ పద్మకర్ణికను
నిర్వికల్పజ్యోతి పీఠిని నిలిచి కేవల బ్రహ్మమగుచును
సర్వసాక్షి తేజరిల్లెడి స్వామినిప్పుడును

ప॥ యోగిని కంటినమ్మా!........
కంటి బాహ్యాభ్యంతరంబుల నంటి దిరుగుచునున్న స్వామిని
నామదిలోనిండి చిన్మయ హంసయైయెదుద నాటలాడగనూ ॥యో॥
చరణ యుగములపసిడి పావలు మెరుపుబెత్తము యోగపట్టెయు
అరుగుశాటియు దివ్యభూతియు హరిణ చర్మమును
సరసిజాక్షుని శిరముమీదను స్వర్ణదీప్తుల కురుచ జడలును
గురుని చిరునగు ముఖము కాంతులు గప్పటిల్లగను ॥యో॥
వికలమొందక నిఖిలమూర్తుల వెలిని వెలిగెడి పరమపదమున
శుకుడు మొదలగు పరమయోగులు చుట్టు గొలువగను
సకల వుపనిషదర్థములు నిజ సద్గురునిగని మ్రొక్కగను
ప్రకటమగు పూదోటరాముడు బయట మెలగగను ॥యో॥—15

—: స్వర్ణ పా దు కా ధా రి :—

తరిమి బిందువును రాజదంతద్వారమున జొనిపి
తరణి తారాధిపుల దాటి జ్వాలాబ్ధి
స్థిర త్రికూటాద్రిపై సిరిమించు కంజమున
పరికించ బహురత్న పసిడి పీఠముపై

ప॥ సురరక్షకుని దివ్యసుందరాంగము గంటి
తరుచు చూపులలోను నెరసి వెలగగను ॥సు॥
తెలియ పదముల స్వర్ణదీప్తి పాదుకలపై
కళల మించినభూతి కావి ముంజియును
అలరు దివ్యాంబరము మొలక నవ్వుల మిమల
జలజలోచను పల్లె జడలు మెరయగను ॥సు॥

ఘనులు గొల్వగముక్తి కన్యయును బూజింప
గుణశూన్యమున బలసి కుదురుకొని వెలుగన్
తనకు పూదోట తుద తారక బ్రహ్మమై
బహుకోటి దినకరుల దీప్తులను బ్రబలున్ ॥సు॥—16

—: పరిపూర్ణ కళాధారి :—

జంట జ్యోతుల తుద జలమధ్యమున జూడ
అంటి వెలుగుచు కేరు నతడెవ్వడె?
కంటినె ముగ్గురి గన్నతండ్రిని చెలి
గెంటక నా మదిని నంటివెలుగు గురుని

ప॥ అక్క విననె నీవు అతిభక్తియుక్తితో చక్కగ సద్గురుని
సత్పదము గూడి యొక్కటై సఖియరో వరయోగి బాయకే ॥అ॥

ఉల్లమలర నాహృత్పుండరీకమున ఘుల్లుఘుల్లున నాడె
ఘను డెవ్వడే?
కల్లగాదు నన్ను గలసి పాయకనుండు చెల్లెల వినవె
యాశ్రీగురుడె సఖియా ॥అక్క॥

మించు భూషణములు మేనిపై వెలుగుచు పంచాంగ
మైనట్టి వరుడెవ్వడే?
పంచవర్ణములపై పరిపూర్ణ కళలతో సంచరింపుచు
నుండు సర్వాత్ముడేసఖి ॥అక్క॥

హత్తుక జగములన్నియు తనలోను మొత్తముగ
నుంచిన మూర్తియెవ్వడే?
చిత్తమను పొదరింట చెలగి వెలుగు నిజ
సత్తురూపైనట్టి సర్వాత్ముడే సఖియ ॥అక్క॥

అండపిండాండములు అంటిలోబైట నఖండమై
ప్రబలిన ఘనుడెవ్వడే?
పండువెన్నెల బయట పరిపూర్ణ పూదోట
అండజేసుకవుండు ఆత్మారాముడె సఖియ ॥అక్క॥—17

—: పూ దో ట జ గ దా త్మ డు :—

గడచి షట్చక్రములు గడిభుజగి నెగయించి
కుడి యెడమ నోంకార ఘోషంబు వినుచు
జడియకను జిహ్వపై చంద్రామృతముగ్రోలి
నడిమిల్లుజొచ్చి నా గురుడ నినుగంటి

ప॥ ఎంతధన్యుడనైతి నెనసి నామదిలోను
సంతతానందమున సత్పదంబగుదు ॥ఎం॥

మొత్తముగ చిత్కళలు ముమ్మాలస్థానమున
గుప్తమై లోబయట కూడి ప్రబలగను
నిత్యవస్తులుమీరి సచ్చిదానందమౌ
చిత్త పీఠముపైని శ్రీ గురునిగంటి ॥ఎంత॥

కోరిచూడగ రాజుకుప్పెలో దివ్యగతి
నీరు నారును మించి నిలిచి వెలుగుచును
వేరు లేకను ప్రబలు తారక జ్యోతికిని
సారమగు పూదోట జగదాత్మ గంటి ॥ఎంత॥—18

—: జ్యో తీ పీ ఠ ని వా సి :—

పరమ గురుపాదములు ప్రణవాంతమున జూడ
దివ్య తేజము దిశలనిండి వెలుగొంద
గ్రక్కున కన్నుల జూచి మిక్కిలి భక్తితో మ్రొక్కి
పిక్కటిల్ల నాదబిందు కళలుమించి దిక్కరించి యెదుట తేజరిల్లు

ప॥ ఎంత యద్భుతం బిదమ్మా గురుని
చింతసేయగ మదిని కొమ్మా!
సంతోషమున జ్ఞానవంతులు గొల్వ
రంతుజేయుచు నిగమాంతమున వెలుగొందు ॥ఎం॥

పిండబ్రహ్మాండములు జొచ్చి యతడు
...ండి ప్రకాశించు మించ

పండువెన్నెలబయట పుండరీకము మధ్య
గండి దొంగలగురువు తాండవమాడును ॥ఎం॥
గుట్టుతో జ్యోతి పీఠమున గురుడు
దిట్టడై క్రీడించు మోదమున
పట్టైన పూదోట పరమ సద్గురుమూర్తి
నెట్టుగా బెనగి తా బట్టబయలై తనరున్ ॥ఎం॥—19

## —: తారక జ్యోతి :—

శరధి ముత్యపుచిప్ప స్వాతి చినుకులునమ్మి
గురుతు వక్త్రముదెరచి కాచుకున్నటులన్
అరసి ఘంటస్థానమందమృతపానినై
పరమ ఘోషమువింట పరుని ధ్యానింతున్
ప॥ హరిహర బ్రహ్మాదులరసి చూడగరాని
స్థిర మోక్షమనెడి నిక్షేపంబుగంటి ॥హం॥
నిలిచి కుధరంబుపై నీలకంఠము పొదలి
కలిత మేఘచ్ఛాయగని యాడునటులన్
తలచి నా మదిలోను తారక జ్యోతిగని
చెలగి భ్రూయుగముకడ చిందు ద్రొక్కుదును ॥హం॥
ధరలోన దుర్జనులు తనువుపై నంబరము
మరి మద్యపానులై మరచినటులన్
వరదుడౌ పూదోట పరమయోగినిగూడి
మెరసిత్రైతనువులును మరచి వెల్గుదునూ ॥హరి॥—20

## —: జ్యోతిర్మయ విశ్వమూర్తి :—

బహుచరణ గుదగుహ్య బహుహస్త శీర్ష ముఖ
బహువక్త్ర రసనములు బహుత్వక్కర్ణముల్
బహుఘ్రాణ నేత్రములు బహురూపనామములు
బహు మనోక్రీడలను ప్రబలును విరాట్టై

ప॥ చెన్ను మెరయుచు విమల చిన్నేత్రమునజూడ
అగ్ని గురుముఖ కళను సమితమై ప్రబలుచున్ ॥చె॥

సురసగముపైనుదక జ్యోత్యంత రంగమున
అరయ చిద్వహ్ని జ్వాలాగ్ని మధ్యమునన్
స్థిరస్వరాట్టను రత్న దివ్యమగు పీఠమున
పురుషోత్తముడు నిలిచి పొంగి వెలుగగను ॥చెన్ను॥

తెలియ నిష్క్రియునిపై దివ్యాంబరముప్రబల
పొలుపు మెరయుచు దివ్య భూషణము లలరన్
నిలచి గమ్మెకయోగ నిపుణులును గీర్తించ
తెలివిలో పూదోట దేవుడు విరాట్టై ॥చెన్ను॥—21

—: ఘ న ర త్న కాం తి ధ రు డు :—

ఆదికాలమున సంగమున నుదయమై
వేదమున సద్గురుని వినుతిసేయగను
సాధు పూజితుడపుడు శర్వ నేత్రముదెసవ
భేదసృష్టియు మదిని పెంపుదీపించు

ప॥ గుణములునుగలిగి నిర్గుణుడునై నిర్వైట
తనదు మాయతో తథ్యముగనిలుచు ॥గుణ॥

చెలగియజుడై సర్వ చేతనము నిర్మించు
నిలిచి విష్ణుండగుచు నెరయ పోషించు
అలరి రుద్రుండగుచు నఖిలమును పొలియించు
తెలియనిర్మలమతిని తేజరిల్లునునూ ॥గుణ॥

అనల బింబము మధ్య దినకరుడు ప్రబలగను
ఇనునిపై ప్రబలునిజ హిమకరుని తుదను
గణుతింప చిత్కళుని ఘనరత్నదీప్తిపై
గుణరహితు పూదోట గురునిగన్గొంటిన్ ॥గుణ॥—22

—: పరమసుజ్యోతి :—

పంచవర్ణంబులకు ప్రణవబీజంబునై
ఎంచిచూడగ మదిని ఎపుడు వెలుగుచును
పంచభూతములందు పరువులెత్తుచు తుదను
మించినిగమాంతమున మెరసినటియించు

ప॥ ఇది గురునిరూపమై యెదుట వెన్నెలబయట
నిది పరమహంసమై యెపుడు విలసిల్లున్ ॥ఇది॥

జోడు హంసలగూర్చి సొంపుతో ప్రణవమున
మూడు వర్ణములపై మొనసిచూడగను
మూడు మూడును మరియు మూడు చక్రములపై
వేడుకతో నిర్గుణుడు వెలుగునెప్పుడును ॥ఇ॥

పరమ సుజ్యోతిబై బట్టబయటను చాల
పరికించగా రత్నప్రభల విరచితమై
సిరిమించు పూదోట జితయోగినంటినే
నిరుపమానందమున నిలచి నెలగుదును ॥ఇది॥—23

—: ఘనస్వస్వరూపము :—

అరయనే బదియొక్క అక్షరంబులలోను
పరికించ ప్రకటముగ ప్రణవాక్షరంబున్
తరచు మాతృకలంటి తథ్యముగ మెరయుచును
నిరతమును వేదాంత నికరమై తనరి

ప॥ కంటి కంటినినాడు ఘన స్వస్వరూపమును
అంటి యంతర్జ్యోతి కవల మెరయగనూ ॥కం॥

యెంచిచూడగమదిని నేకాక్షరముపైని
అంచితముగ తానె స్వరాట్టు యగుచూ
పంచవర్ణములతుద పరమ హంసగనేను
ఓలించి దశశబ్దములు ఘోషించి వెలుగుచున్నూ ॥కంటి॥

నాదబిందుకళలు నయముతో మీఱుచును
అది మధ్యాంతశూన్య ప్రకాశుడనై
పాదుకొని పూదోటపై నిరామయుడనై
భేదించి నిర్వైట నిర్బీజమై యుండును ||కంటి||—24

—: చిత్కళా జ్యోతి :—

గుట్టు నినదంబుతో గూర్చ బహు లక్ష్యములు
నట్టిమెడ మధ్య లక్ష్యము ప్రజ్వరిల్లున్
పట్టపగలుగ బయట పంచవర్ణములతో
గట్టిగా సితకరుని గతి ప్రకాసించున్
ప॥ ఎంత నిశ్చితమిది యెంచిచూడగమదిని
కాంతి కపురపుజ్యోతి గతి నిలిచి వెలుగున్ ||ఎం||
అష్టబీజములతుద నమృత స్వరూపమై
సృష్టిలోపలజొచ్చి చెలగి వెలుగుచునూ
ద్రష్టమై నీటిమధ్యను తరచు చిత్కళల
నిష్ట చిద్భాసమై నిలచి ప్రబలగను ||ఎం||
చెలగి సాహస్ర రేకుల జలజమధ్యమున
నలరు అంతర్లక్ష్యమగు దాని కవలన్
నిలచి పూదోట తుద నిజగురుని కరుణచే
తలచి నిర్లక్ష్యమై తానె మెరయుచును ||ఎం||—25

—: ఉదయ భాస్కరుడు :—

ఉదయభాస్కరుని గని నదిమధ్య తీవ్రముగ
విదితమై పద్మములు వికసించినట్లున్
అదిగో నాసాగ్రమున నాత్మారాముని జూచి
పొదలుచును నా మనసు పొంగినటయించు
ప॥ ఇదియెంత యద్భుతాస్పదము తేజోమధ్య
స్థదమలానందమున సద్గురుడు వెలుగన్ ||ఇది||

నిలిచి చంద్రునిజూచి నీటిమధ్యను మెరసి :—
అలరికలువలును చయ్యన విచ్చినట్లున్
తెలివితో నిజగురుని దివ్యపదమును జూచి
యలరహితమై నామదది ప్రకాసించున్ ॥ఇది॥

మిగుల మేఘమును జూచి మేరుగిరిపై చెలగి
అగణితమయూరము లాడినట్లన్
నిగమహా పూదోట నిజగురుని గూడినే
సుగుణపదమై బయట సొంపు మెరయుచును ॥ఇది॥—26

—: మహాద్వైత సిద్ధాంతము :—

—: విద్య, అవిద్య, అచల, చలనముల ఏకత్వము :—

(వేద విరాఢ్ మూర్తి)

నీవె సచరాచరము నీవె పగలును రేలు
నీవె రవిచంద్రులును నీవె తేజమును
నీవె యుడుగణములును నీవె మాతృక తతులు
నీవె విద్యాఽవిద్య లీవె ప్రణవమును

ప॥ మీ మహిమ యెంతనుచు మెరసి వర్ణించుటకు
స్వామి నాకును నలవె సర్వపరిపూర్ణా ॥మీ॥

నీవె శృతి శాస్త్రములు నీవును పురాగిరులు
నీవె మఖమంత్రములు నీవె ధాతువులు
నీవె పూజితుడవును నీవె యజ్ఞభోక్తవును
నీవె త్యాగివి భోగి వీవె సర్వమును ॥మీ॥

నీవె చలనాత్ముడవు నీవె ప్రత్యగాత్మ
నీవద్వితీయుడ వీవగోచరుడవు
నీవె పూదోటపై విశ్వసాక్షివి యగుచు
నీవును నిరంజనుడ వీవె స్థిరశూన్యం ॥మీ॥27

—: చిత్కళా మూర్తి :—

పుండరీకము మధ్య నిండి యోంకారమై
ఎండనీడల తుద నుండు తారక రామా

ప॥ పుండరీకాక్ష ! పుండరీకాక్ష ! అండబాయకనాలో
పండువెన్నెల బయట నిండియుండెడిస్వామి ॥పుం॥

కుండలినీ శిరముపై నిండు చిత్కళలతో
దండి లోకములపైయుండు జగదధి రామా ॥పుం॥

చండ ప్రచండమై దండితేజము వెలి
నిండు పూదోటలోయుండు నిర్గుణా రామా ! ॥పుం॥

ఆజ్ఞమీరక సతియు తమ్ముడు వంటి
తన వెనువెంట నడువగ
సంజ్ఞమీరుచు చిత్రకూటము సరగజేసుచును
ప్రజ్ఞతో సాహస్ర రేకుల పర్ణశాలలోనిలిచి వెలిగెడి
యజ్ఞ పురుషుండైన రాముని
కాప్త భృత్యుడునై ॥పుండరీ॥—23

—: తెలివిలోపల సర్వసాక్షి :—

సదమలత చిద్బిందు మధ్యను జలజనేత్రుని పదములు
పదిలముగ నోంకారకర్ణిక భక్తితో నర్చించగా
కదిసి షోడశ శక్తులిరుగడ క్రమ్ముకొని సేవింపగా
సదయుడై నామనసులోపల చాలవెలిగెడి స్వామికీ

ప॥ శరణు శరణుహో శరణు నిర్గుణనిర్వికార శరణునిష్క్రియ శాశ్వతా
శరణుసురముని భక్తకారణ శరణు సద్గురుస్వామికీ ॥శ॥

తలచ జగములు మాయచేతను తరుచుగా నిర్మించుచూ
బలిమిగా ముప్వురిని జగతికి పనులవారిని జేయుచు
నిలిచి సర్వము జీవబలమున నేర్పుతో నాడించినా
తెలివిలోపల సర్వసాక్షిగ తేజరిల్లెడి స్వామికీ ॥శ॥

సకల భక్తులు నిలిచి నీపద జలజములు నుతియించగా
సుకరమగు వరముక్తి కన్యక సొంపుమెరయుచు దనరగా
వికలమతులకు దూరమగుచును వేడ్కతో విలసిల్లుచూ
ప్రకటముగ పూదోట నిర్గుణప్రభు నిరంజనయోగికీ ।శ॥—29

## —: దివ్యామృత కళాధారి :—

వేదమూలమగు అక్షరద్వయమున
పాదుక తా భవతారకమై
ఆద్యంతంబులు లేకను లోవెలి
నాముక నిగమాంతరమునను
మోదముతో శతకోటి సూర్యులను
మొనసి కూడిన విధమునను
వేదమధ్య దివ్యామృత కళలపై
విమలాత్ముడగు నాగురుడూ

ప॥ వినరయ్యా సద్గురువుల విధము
విన్నకన్న వారలకిది తెలియుచు
వికలాత్ములు యిది యెఱుగరు ॥విన॥

పంచముఖములను సచరాచరముల
ప్రబలజేయు త్రైసంజ్ఞలను
పంచవింశతి తత్త్వంబులలో
సరి పరివిధముల జెలగుచునూ
పంచాగ్నులకడ శూన్యచక్రమున
పరమహంసమై చెదరకను
పంచవర్ణ బీజాక్షరములపై
పరమతత్త్వమగు నాగురుడూ ॥విన॥

దృష్టికి ద్వాదశాంగుళాంతమున
దివ్యతేజమై వెలుగుచును

చేష్టలేక గుణశూన్య నభంబున
  చిత్కిరణంబులు ప్రబలుచును
ఇష్టలింగమై మూలకందమగు
  నింపుగ వెలిగెడి జ్యోతికినీ
ద్రష్టయయ్యెడి పూదోటరాముడు
  తలచిచూడ నానిజగురుడూ ॥విన॥—30

—: బంగారు పద్మమున జ్యోతీపీఠ నివాసుడు :—

చతుష్పదవుల తుదను చెలగి జలరాశిపై
ప్రతిలేని హేమమయ పద్మాంతరమున
అతిరమ్యమైన అద్భుత జ్యోతి పీఠమున
సతతమును వెలిగెడీ సద్గురుడ నీకు

ప॥ వందనము గురుస్వామి వరయోగి ననుగావు
వందనము సుజనహృద్వనజ సంచారా ॥వం॥
చెలగి యిరుగడల రవిసితకరులు ప్రబలగను
కలిత ప్రణవంబనెడి ఘనభేరిమ్రోయ
బలసి వెన్నెలబయట భక్తాళి గనుగొనగ
నిలచి వెలుగుచునున్న నిజరాజయోగీ ॥వంద॥
సరస ముగ్గురుగొల్వ షడ్బ్రహ్మలును బొగడ
సురలు జూడగసతులు సురటులునువీవ
వరుసతో నుపనిషద్ వాక్యములు స్తుతి నేయ
సిరిగుల్కు కైవల్య శివరామ నీకు ॥వంద॥
గణుతింపగా మహా ఘనదివ్యలింగమై
యనుదినము మహాదాదు లంటి వెలుగుచును
దిననాథ శతకోటి దివ్యప్రకాశమై
వినుతించగా మదిని వెల్గుదువె తండ్రీ ॥వం॥
శరణు విశ్వాత్మకా శరణు సర్వాత్మకా
శరణు పరశివరూప శరణు శరణు

శరణు నిర్మలచరిత శరణు నిర్గుణరూప
శరణు పూదోట శ్రీ గురుడ శరణయ్యా ॥వంద॥—31

—: విశ్వరూపి :—

అకళంక సర్వంబు నలరి నిర్మించెదవు
ప్రకటముగనే యర్థబావంబులేదే
ఇక నెట్టి వస్తువుల నిచ్చినిను మెప్పింతు
సకలాత్మ పూజనే సరిగజేసెదనే

ప॥ అన్నియును నీవెతుద నతితుర్యదృష్టిచే
నిన్ను నేజూడగను నిజరామయోగీ ॥అన్ని॥
మెరయ విశ్వంబెల్ల నీవయై ప్రబలగను
పరికించకైవల్య పదమెచట నుండున్
గురుడు శిష్యుడు పరమ గురుమూర్తినీవెయై
అరయ వెలిలో నీవె యాడుదువు తండ్రీ ॥అన్ని॥
చదురైన చిద్బిందు స్థానమున వెలుగుచును
సదమలానందమున సర్వసాక్షిగను
కుదురైన పూదోట గురుమూర్తి నీకన్న
మొదట బేధములేదు మొనసిచూడగను ॥అన్ని॥—32

—: చతుర్వేదసారము :—

పరమేశ నినుజూడ ప్రాపంచ జాలములు
విరివిగా నీకళల విరచితంబగునే
సరస భూతేంద్రియంబుల మెరసి వెల్గుచుబయట
నిరతమును నామదిని నిలిచి ప్రబలుదువే

ప॥ పరమాత్మ నీచర్య భావింప నా కలవె
వరదా౽శ్రుతులును నిన్ను వర్ణించలేవె ॥పర॥
ప్రతిదినము రవిచంద్ర పావకుల తుదనెపుడు
నతివర్ణములమీరి యమృత పదమగుచున్

చతుర్వేదముల సత్య సారమై మెరయుచును
సతతమును నాయెదుట స్వామి ప్రబలుదువె ||పర||

నిలిచి తోయదమధ్య నిండు చిత్కిరణముల
బలసి మధ్యాహ్నోగ్ర భానువిధమునను
నెలవైన యుపరంజి బంగారు విధమున
నలరు పూదోట పరమానందయోగీ ||పర||—33

—: జ్యోతిర్మయ పీఠమున వెలుఁగు తారకరాముడు :—

కలిత శృంగాటమార్గము మించి తెలియగను
జలమధ్య జలజమున సర్వసాక్షిగను
బలిసి నిగమాంతమున భాస్కరునిగతి నెపుడు
నిలిచి వెలుగుచునున్న నిజరామయోగీ

ప॥ శరణు సద్గురుమూర్తి జగదీశ నన్నేలు
సిరిమించు పూదోట శివరామయోగీ ||శర||

అకళంకప్రభలతో నధిక తేజంబగుచు
సకలచేతనకృతుల చాలవెల్గుచును
ప్రకటసాహస్రార పద్మమధ్యను సమ్మత
శ్రీకరంబైనట్టి శివరామయోగీ ||శర||

మురియుచును బంగారు మెరపుల
మూర్తిగా కడు మించుచున్
దారసిమాణిక్య దీప్తుల దనరి సిరిమించుచున్
స్థిరమైన జ్యోతిపీఠమున కొలువై వెలుగు
పరమ తారకమైన పరమాత్మయోగీ ||శర||

తుదను తుంబురు నారదులు వీణలు మీటఁగా
కదిసి గంధర్వులు గానము సేయుగా
తధదియ్యని దివ్యతను సుందరి నటియించగా
అదిగో పైసాక్షిగను ఆనందయోగీ ||శర||

కపిలాది సిద్ధులును కదిసిసేవించగను
యెపుడు పూదోటలో హితవుతో మెరయన్
ఉపనిషద్వాక్యములు వర్ణింపగారాని
అపరిమితమైన పరమానందయోగీ ||శర||—34

## —: చిజ్జ్యోతి పీఠస్వామి :—

నిరతమును నా యెదుట నిలిచి చూడగను
విరివిగా చిత్కళల దివి వెలుగ గనుగొంటి
పరికించ నా హృదయ పంకజంబునను
పరమ సద్గురు దివ్యపదము కనుగొంటి
ప॥ కంటినా కన్నుల కరువు దీరగను
అంటినా మదిలోను ఆటలాడగను ||కం||
సతతమును మహాదాది జగములును జొచ్చి
మితి లేని రూపులై మెరయ కనుగొంటి
శతకోటి దినకరులు సమకూడి నటులన్
ప్రతిదినము నిర్భైటనే ప్రబల కనుగొంటి ||కం||
పరిపూర్ణమై యెపుడు బయట చెదరకను
మెరువడిగా చిత్కిరణముల్ మెరయ కనుగొంటి
సరి లేని చిజ్జ్యోతి చవికెలోపలను
పరికించి పూదోట బ్రహ్మంబు నేగంటి ||కం||—35

## —: సకలాత్ముడు :—

సకలేంద్రియములజెరచి సచ్చిదానందమున
వికలమించుక లేక వెదకి చూడగను
అకళంకమైనట్టి అజ్ఞాంతరంగమున
సకలాత్ముడైనట్టి సద్గురుడ నీకు
ప॥ వందనము గురుస్వామి పనధిగుణ గంభీర
వందనము నా యెదుట వర్తించు తండ్రీ ||వం||

నిలచి నామదిలోను నిర్వాత దీపగతి
　　సొలసి విశ్వములోను చొచ్చి ప్రబలుచునూ
కలసి కలయక బయట కదలక ప్రకాశించు
　　బలసి శతకోటి రవి ప్రభలవెలుగుదువె ॥వం॥

తరచు చిత్కళలలరు తారకజ్యోతిపై
　　పరమాత్మ నీవును ప్రజ్వరిల్లగను
పరికించి పూదోట బ్రహ్మాంబ నినుగలిసి
　　అరయ తన్మయమంది యాటలాడుదువె ॥వం॥—36

## — : భ్రూయుగమధ్య ప్రకాశించు స్వామి : —

వరకిరీటముమేన వజ్రమెరపులసొక్క
సిరిమించ మొఖమంచి చికిలిబాకుజెక్కి
మురియుచు శిరసుపై ముత్యపు తురాయిచెక్కి
అరుదుగ తురంగముపై నాత్మరాముడెక్కి

ప॥ ఇదిగో స్వారీ వెడలెనె చక్కనితండ్రి
　　ఇదిగో స్వారీ వెడలెనే ॥ఇది॥

　　కదిసి వెలుగుచునున్న కైవల్యముననుండి
కొదవలేక శతకోటి దివిటీలువెల్గ
　　సదయుడై సద్గురుడు సజ్జనులు వీక్షించ ॥ఇ॥

వగలమీరిన పసిడి వలువ వల్లెవాటు
　　ముగురుమూర్తులగన్న మూలమైనమోటు
తగినయోగులమదిని తగిలియుండేటిబోటు
　　నిగమాంతమున నిలిచి యుండేటిచోటు ॥ఇ॥

కడువేడ్కతో నగరు ఘనుడు వెడలిరాగ
　　కుడియెడమ రవిచంద్ర గొడుగులువెల్గంగ
ఎడలేక భక్తులు నిరువంక నడువ
　　పుడమిపై వడక పంచభూతకోట్లు కలగి ॥ఇ॥

తెలిసిగురుడు దివ్య తేజీని దుంకించి
తళుకు తళుకునవాలు ఝళిపించి సిరిమించి
యిల శత్రువులదృంచి హితజనుల రక్షించి
నిలిచి భ్రూయుగమధ్య నెరసిప్రకాసించు ॥ఇ॥

గరుడగంధర్వులు గానముసేయగ
అరవింద నయనలు అలరి నటించగ
సురలు చుట్టునుగొల్వ శృతులు కీర్తించగ
పరికించ వూదోట పరమతారకయోగి ॥ఇది॥—37

—: రజితాద్రివాసి :—

తలిచి చూడగ బయట తనరు ఛాయలుమించి
తరచు చుక్కలు మెరయ రామా!
తళుకు తళుకున బ్రహ్మ తరుచు మెరుపులు వెడలి
దశదిశలు నిండి వో రామా!
కళలు మీరిన హృదయ కమలాంతరమున నీ
ఘనపదము ధ్యానించ రామా!
నిలిచి వెలుగుచు మదిని నిర్వాత దీపగతి
నిండి ప్రబలుదువె వోరామా!

ప। నిజగురుడ నీ పదము నిమిషమును బాసినే
నిలువలేనే స్వామి రామా!
సుజన పోషకనాదు సూక్ష్మస్వాంతమునందు
సొంపుతో నిలువవే రామా! ॥నిజ॥

త్రివిధ వర్ణములంటి దివిభువీ దశలంటి
తివిరి సర్వము నంటి రామా!
త్రివిధ శక్తులనంటి త్రివిధాక్షరములపై
దీపింతు నెప్పుడు ఓ రామా!

త్రివిధ వేదములంటె త్రివిద తనువులు మించి
త్రివిధ గుణములు మీరి రామా!
రవిచంద్రులును గడచి రజితాద్రిపై తేజో
రాశివై ప్రబలుదువె రామా ||నిజ||

అరసి సుజనులు జూడ నానందమయుడవై
ఆటలాడుచు నీవు రామా!
భరితసాహస్రదళ పద్మమధ్యమున రత్న
ప్రభలతో దీపించు రామా!
పరిపూర్ణ జ్యోతివై పరగుపూదోటకడ
బ్రహ్మాంబ నినుగలసి రామా!
నిరతమును నిర్భైట నిర్వికారుడవగుచు
నిలచి మెరయుదువె శ్రీరామా! ||నిజ||—38



## ఎ ని మి ద వ ద ళ ం

# ఆ న ం దా ను భ వ ం ( ఉ న్మ ని )




—: రామా ! నీ ఎడబాటు సంహింపరానిది :—

ప్రణవాంతమున నిన్ను పరమభక్తిని నేను
    ప్రార్థించగానె యో రామా
పనిబూని నాపల్కు పరమాత్మ యాలించి
    పర తెంచివచ్చితే రామా
కనుగొనుచు మీ పదము కన్నులకు నొత్తుకొని
    కరుణించు మనసపుడు రామా
ఘనుడ నాశిరముపై ఘన కరాబ్జంబుంచి
    కాచినను నేలితివె రామా !

ప॥ నీ పదము నెడబాసి నిమిషమును సృష్టిలో
    నిలువలేనే తండ్రి రామా !
చూపులో నా హృదయ సూక్ష్మచక్రము నంటి
    సొంపులో నిలువవే రామా ! ॥నీ॥

 

త్రివిధపటలము జించి తిమిరంబునణగించి
    త్రివిధగుణములు జెరచి రామా!
త్రివిధ దీక్షలనిచ్చి దీనరక్షకనాకు
    దివ్యామృతం బొసగి రామా
అపుర నయనాగ్రమున అకలంకమై తనను
    అద్వితీయుని జేయ రామా
దివిభువీ మధ్యమున దినకరునిగతి నేను
    తేజరిల్లితి నె యో రామా ॥నీ॥
అనిలునాకర్షించి ఆకుంచనము జేసి
    అనిలు ననిలుని బెనచి రామా
ఫణి రేచి పదునాల్గు బంధించి స్వాంతమున
    పను వెత్తి తీవ్రముగ రామా
దినమణియు నిశిమణియు తేజంబులును మించి
    దివ్యజ్యోతిలో జొచ్చి రామా
ఘనమైన పూదోట ఘనుడ మిముగూడి నే
    కదంక ప్రకాశింతు రామా ॥నీ॥—1

—: ముక్తి సుందరినిగూడి చిన్మయుమైతిని :—

క్షర మక్షరములు శబ్దాంతరమున సంధించితిగదనె శివ శివ
క్షరములబలికే అక్షరములు శివకరమునగూర్చితినే శివ శివ
వరుస యిండ్ల సతిపతులను తా కైవల్యము జేర్చితినే శివ శివ
పరువడిగా తన బంధు జనుల శివపదమునగూర్చితినే శివ శివ

ప॥ శివ శివా! పరగసతులు నీపాటలు బాడగ
    పల్లవించు మనసు శివ శివ
    ప్రకాశించు మనసు శివ శివ
పరమ పరుడవై భావములోపల
    పరమగుహను నిలుమా శివ శివ

విరివిగ బ్రహ్మాండంబు బగుల వెలియింట
    చిచ్చు నెగసెన్ శివ శివ
మెరుపులు జ్వాలలు నగ్నికణములును
    మేనిని నిండెగదే శివ శివ
గరిమెను స్వర్ణపు కాంతులలర హృత్కమలము
    నెగసెగదే శివ శివా
సరసత చూపులో సతినిగూడినే
    శాంతుడనైతిగదే శివ శివా
శరణ జనులుమీ చరణాంబుజములు
    చేరవచ్చిరిగదే శివ శివ
నిరతము నాపో జ్యోత్యంతరమున
    నిలచి వెలిగిరిగదే శివ శివ
శిరసు నడుమ శతకోటి ప్రభలతో
    చిద్రవి ప్రబలెగదే శివ శివ
పరమ జ్యోతిలో వెలిగెడి నిజగురు
    పదము నంటితిగదే శివ శివ
ఉరువడిగా నడవీధిన చల్లని యూర్పులు
    విసరెగదె శివ శివ
స్థిరమైతనరెడి ప్రణవఘోష విని
    చెలగుచు నుంటిగదే శివ శివ
మెరసి మేరుతుద నమృతధారలు
    మెక్కియు నుంటిగదే శివ శివ
నరసికడను చిన్మయ హంసంబై
    మెరయుచు నుంటిగదే శివ శివ
పరువడిగా చిత్కళలును వెలిలో
    ప్రబలుచు నుండెగదే శివ శివ
సిరులుగుల్కు సుందరిని గూడుచునే
    చిన్మయమైతిగదే శివ శివ

మొరపెట్టెడి నిర్గుణజ్యోతిలో తా
మొనిసి నిల్చితిగదే శివ శివ
మెరసి పువ్వుదోటాత్మరామునిలో
మిళితమైతినిగదే శివ శివ —2

—: అమనస్క- భిక్షు :—

—: తందానతాన తత్త్వము :—

చెంగావి పూల దుప్పటి తందాన తాన నేను
సుంగులు మీరగా గట్టి తందానతాన
సంగతిగ రత్న భూషణములు తందానతాన
మేనరంగైన భూతిబూసి తందానతాన
శృంగారముగ కన్నుగొనల తందానతాన
నుదుట పొంగి బ్రహ్మరేఖ మెరయ తందానతాన
సంగమీడగ బుద్ధి నిల్పి తందానతాన
క్షణిక లింగదేహము వీడి తందానతాన
ప॥ అన్ని మరచి యానందమున తందానతాన
శివుని సన్నిధిని నిలిచి చెలగు తందానతాన
పిన్నముక్తి పాపనుగూడి తందానతాన
గురుని బిరుదుపాటలు పాడు తందానతాన
పట్టైన వైరివర్ణ్య ఫలము తందాన తాన
మెరయ పట్టితి కిన్నెరచేత తందానతాన
అట్టె యేబదియొక తంత్రులు తందానతాన
గురుని పట్టునంట మీటితిని తందానతాన
దిట్టనై వెలిలోను తిరిగి తందానతాన
నేను మెట్టితిని కైవల్యమునకు తందానతాన
వెట్టితిని గురుని కృపను తందానతాన
నేను దట్టమగు బుద్ధితోను తందానతాన
తిన్నగానే రాజవీధిన తందానతాన

యేపురి కన్నెలంట గూర్చుకొని తందానతాన
చెన్నుమీర చతుర్వీధుల తందానతాన
నేను వన్నెమీర దాటితినే తందానతాన
వెన్నెలబయటను నిల్చి తందాన తాన
నేను మిన్నులైదు దాటితినే తందానతాన
పున్నమ చందురుని రీతి తందానతాన
నేను యున్నతముగ మెరసితిని తందానతాన
మెండుగా కిన్నెర పలుకుల తందానతాన
అదిగో కొండ లేదును కరిగె తందానతాన
పుండరీ కాక్షుని చుట్టు తందానతాన
నిలచినిండు భక్తులు మెరతురే తందానతాన
దండి తేజోరాశి బయట తందానతాన
శివుడు నిండుకొలువై యుండునే తందానతాన
నిండు మోసమున గురుడు తందానతాన
పూల దండలు నా మెడను వేయునే తందానతాన
సొక్కుచును సోలుచు గురుని తందానతాన
నేను ఎక్కునైన బిక్షుమడిగితి తందానతాన
గ్రక్కున నమనన్క బిక్షు తందాన తాన
అక్కరతో నందించునే తందానతాన
చొక్కముగు పూదోటలోను తందానతాన
ఎక్కువైన గురునిగూడి తందానతాన
చక్కగా దివ్యజ్యోతిపై తందానతాన
నేను చుక్కరీతి వెలుగుదునే తందానతాన —3

—: ఆత్మారాముని అయోధ్యాపురం :—

పంచ భూతేంద్రియముల నెడి ప్రకృతి బంధములు బాసి
యెంచి సుజ్ఞానులగూడి యింపు మెరయవలెను
మించి సద్గురునిపదము మేదినిపై వెదకిచూచి
ఘోంచి పూజించచెలి ధాకషోళలుళ్లేవె

ప॥ ఇదిగో తాలు నాకునెంచ నెదుటపదిరెంటిపై సఖియ
అదిగో ఆత్మారాముడున్న యయోధ్యాపురము ॥ఇ॥
అదిగో తారాపతి కధికుడై యజునిపురి తానాక్రమించి
అదిగో విష్ణునగరు తా నధిగమించవలెనే
కదిసి రుద్రుని పట్నము గ్రక్కున తానధిగమించి
పదిలుడై స్వర్గముపై నిలిచి భావించవలెనే ॥ఇ॥
ఆ రవిచంద్రుల తడకట్టి సూక్ష్మరంధ్రము భేదించి
ధీరుడై క్రమమున చక్రమును దివి జేర్చవలెనే
శూరుడై పశ్చిమవీధినిజొచ్చి విరజ నధిగమించి
మేరు గిరిపైయెక్కి తూర్పు మెట్టి చూడవలెనే ॥ఇ॥
ఎండ వెన్నెల యగ్ని శిఖ లెగసి కూడియున్నబయలు
నిండితేజమును కైవల్యము నిండివెలుగునే
మెండుగా నోంకారధ్వనులు మేదినీ దివిదిశలునిండ
పుండరీ కాక్షుడుకొలువై పొలతీయుండునే ॥ఇ॥
నిలిచి మూలసౌధముపై నిర్వాత దీపమయిముక్తి
కలికీ! పరమేశ్వరుని ఘనత మెరయునే
నెలత పూదోటలోవెలుగు నిర్గుణరాముని పదము
కలసి బ్రహ్మానందమున నిలిచియుండమే ॥ఇ॥—4

—: తా గు రు రూ ప మ గు ను :—

దిననాధ హిమకరుల తెరువులును బంధించి
అనలు ననిలునిగూర్చి యహిప్తు భేదించి
తను త్రయంబును మించి తనరమదినతిసూక్ష్మ
మగు గుహదాట బ్రహ్మకళలు దివివెలుగు

ప॥ బ్రహ్మ నిష్ఠులకునిది భావించ ననుభవము
బ్రహ్మవాదులకు మది బహుగూఢ మగును ॥బ్ర॥
నెట్టుగా నగ్నిపైనిలిచి యర్కుడు మెరయు
నట్టెదినకరుల ఘుద నద్భుత కిరణమ్ముల

సట్టపగలున మంచి పండువెన్నెలబయట
గట్టిగానుడురాజు కదలక వెలుంగు ॥ప్ర॥
తరచు రత్నద్యుతుల తరలకను శశిమధ్య
నిరత మంతర్జ్యోతి నిలిచి ప్రబలగను
పరమ తత్త్వంబునై భాసిల్లు పూదోట
గురుమూర్తినంట తాగురు రూపమగును ॥ప్ర॥—5

—: అఖండమై వెలుంగుదును :—

దినకరేంద్రులు జనెడు తెరువులును బంధించి
యనిలుని నిరోధించి యానందముననూ
పెనసి ప్రాణాపాను పెనుచిలువ భేదించి
తనరి ముక్తిద్వారమున జొచ్చియేను
ప॥ తలపు మరపులు శూన్యతత్త్వమున సంధించి
అలరుచు నిరాకారమై ప్రకాశింతూ ॥తల॥
దివము రాత్రులుమించి తేజరిల్లుచు బయట
నవచక్రములకు తుద నాతి గనుగొనుచు
కవగూడి యపవర్గ కన్యారత్నమవల
శివకరంబైన వరచిద్రూపుడనై ॥తల॥
పరికించ వెలిలోను ప్రబ్బికొని ప్రబలినే
నరయగా నాదిమధ్యాంత రహితుడనై
నిరుపమానందమున నిలిచి పూదోటపై
నిరతమును నఖండమై నే వెలుంగుదును ॥తల॥—6

—: గురుడు నను నిరాలంబముగ జేసెను :—

యిలమీద జననమై యేనుసుజనులగోష్టి
వలసి మది విజ్ఞాన వాసనస్ఫూర్తిన్
నిలిచి ధరపై నెదకి నిగమాంతరంగమున
తెలియ సద్గురుడెపుడు తేజరిల్లుచను

ప॥ కరుణతో సనుజూచి కరతలామలకముగ
గురుడు సత్పదమనెడి గురి జూపినాడు ॥క॥
గరిమెతో సజ్ఞాన సరసి జాక్షిని గదిమి
పరికించినాడు భవబంధములు ద్రుంచి
నెరవిషయబలములను నేర్పుతో బోదరిమి
చిరమైన చిన్మయుని చేసె సత్కృపను ॥క॥
అదిగో సుజ్యోతిపై అమృత బీజాంతమున
పదిలముగ చేపట్టె భక్తవత్సలుడూ
సదయుడై పూదోట స్వాములును నన్నిపుడు
ముదమున నిరాలంబమును జేసినాడు ॥క॥— 7

## —: సర్వలక్ష్యముల తుద స్వానుభవము :—

నిరవలంబంబనెడి నిజగురుని వక్త్రమున
వరుసతో డుత నమృత వాక్యములు వెడల
అరుదగు చిదాకాశమందు ప్రభవింపుచును
మరియు విద్యారణ్య మార్గమున జనును
ప॥ ఇవి యఖండైక్యమగు వచనరత్నములు
వివరించి చెప్పెదను విమలాత్ములారా! ॥ఇవి॥
అలరి దశధ్వనులతో సతివిచిత్రములై
యలబిందు నగముజుట్టి నతివేగమునను
తలప గోల్లాస మండలము భేదింపుచును
మెలగు సురగిరిపైని మెరువడిగ దుంకు ॥ఇవి॥
ఘనత గండకి నదిని గలసి పారిసుషుమ్న
మనుమధ్యబిలము నందును జొచ్చియదియు
తనరి బాహ్యాగ్రమున తరుచు ఘోషలతోడ
మొనసి ముల్లోకములు నిండి ప్రబలు ॥ఇవి॥
సర్వశృతి శాస్త్రముల సారమై విలసిల్లు
సర్వయోగముల వర సారమై మెలగు

సర్వోపనిషదర్థ సారమై శోభిల్లు
సర్వ లక్ష్యముల తుద స్వానుభవమును ॥ఇవి॥
ఇలను సుజనుల కిది తెలియ జ్ఞానాంజనము
కలిత నిర్గుణముక్తి కలుగు వినరయ్యా!
బలమైన పూదోటపై సత్పదముగూడి
నిలిచి వెలిగెదరు నా పలుకు సత్యమునా ॥ఇ॥—8

—: ఖండాఽఖండ సమరసము :—

ఒంటిస్తోవను కావలున్న భుజగిని రేచి
ఘంటాస్వరము జ్యోతినంటి మ్రోయగను
అంటి రసనాగ్రమున అమృతపానముజేసి
మింట నడినాళమున మెరసి తా చొరగన్
ప॥ చిన్మయముపైని సుస్థిర బ్రహ్మమంటినే
తన్మయానందమున తనరి వెలుగుదును ॥చి॥
కన్నుగొనలో బయట గ్రమ్ముకొని చిత్కళల
చెన్నుమీరుచు మేరు శిఖరమున వెలుగన్
వన్నెలనుమీరి హృద్వనజ మధ్యంబునను
వెన్నముద్దకు తుదను వెలుగు కనుగొంటి ॥చి॥
పండు వెన్నెలమించి పరిపూర్ణ కిరణముల
మండుమండెడిజ్యోతి మధ్యముననూ
అండగొని పూదోట అద్వితీయునిగూడి
ఖండము నఖండమై కడు ప్రకాశింతున్ ॥చి॥—9

—: దివిభువి దిశలునిండి వెల్గుదును :—

ఆరుచక్రములతుద ననలార్కహిమకరుల
మీరి త్రైకూటమును మించి వేడుకను
సారమగు నిగమాంత జలజాక్షి కవ్వలను
నేరుపున సన్నునే నిలిచిచూడగను

 

ప॥ ఇది మహాచిత్రితము యేనుసుజ్యోతిపై
ముదముతో చిదాకాశమున వెలుంగుదును ॥ఇ॥

చెలగి సాహస్ర రేకుల కంజమును దాటి
కలితనాదము బిందు కళల్కాక్రమించి
నిలిచి వెలుగుచు నెపుడు నిర్వాత దీపగతి
నలరి దివిభువి దిశలునంటి వెలుగుదును ॥ఇ॥

పరమసుందరి వేడ్క పసిడి పువ్వులు నించ
శరణజనులిరుగడల మెరసి స్తుతిసేయగను
గురుతైన పూదోట గురుపరబ్రహ్మనై
తరల కెప్పుడు శూన్య తత్త్వమై యుందూ ॥ఇ॥—10

—: చిదానంద నిలయమున నుందు :—

అదిగో నిటలాంతమున నగ్నిమండలముపై
పదినూరు కోట్ల రవి ప్రభల విరచితమై
కదసి వెలిగెడి హృదయ కమలాంతరంగమున
మది ప్రణవమునగూర్చి మహిమ మెరయుచును

ప॥ పరిపూర్ణజ్యోతి తుద పరమతత్త్వంబునై
నిరతమును చిదానంద నిలయమున నుందు ॥పరి॥

శిరసునడుమను చంద్ర చిత్కళల్ యెడ తెగక
నురువడి సుధారసము వర్షించగాను
అరసి యమృతమున్గ్రోలి యూర్థ్వలంబును మించి
మరియు నాహోజ్యోతి మధ్యమున నిలిచి ॥పరి॥

స్వచ్ఛ మానందకరము నా నిండి వెలుగుచును
స్వచ్ఛమగు నిర్భయట సొంపు మెరయుచును
ముచ్చటతో పూదోట మూలబ్రహ్మమునంటి
సచ్చిదాత్మకుడనై చాలవెలుగుదును ॥పరి॥—11

—: పరిపూర్ణ లింగమైన పూదోట లింగము :—

అంగమును పంచలింగాకారమై యుండు
అంగంబునందారు లింగంబులుండు
లింగములలో దిరిగి లీల నడిపెడిప్రాణ
లింగమధ్యను దివ్యలింగంబు గనుచూ

ప॥ లింగాంగ సమరము లీలదెలియంగ గురు
లింగముల సర్వాంగ లింగములు వెలుగు ॥లిం॥

చలన భువనంబులును సర్వాంగ దేవతలు
నలసూక్ష్మ చక్రంబునంటి దిరుగుచును
నిలిచి నయనాగ్రమున నిండివెల్గిన యపుడు
కలసి కలయక గురుడు క్రమముతో మెరయు ॥లిం॥

జంట మూడున్నొకటి సప్తలింగంబులును
నంటి విరచితమగుచు నాదిలింగమున
కంటి మెరపగు వహ్ని ఘనలింగ మంటితుద
మింటిరవిలింగమును మేలిమితో వెలుగు ॥లిం॥

చక్కగా శిరసునను చంద్రలింగము నిలిచి
చొక్కమగు కళలతో సొంపు మెరయగను
అక్కరతో శశిమధ్య నమృత కిరణములతో
గ్రక్కునను జ్యోతిలింగము ప్రకాశించు ॥లిం॥

అట్టి శివకరముపై నతితుర్య లింగమునకు
పట్టగును నిర్గుణ బ్రహ్మలింగంబు
బట్టబయలైయున్న పరిపూర్ణలింగమై
నెట్టుకొని పూదోట నిజలింగమలరు ॥లిం॥—12

—: అమనస్కుడై ప్రకాశించుట :—

చక్కగా నుభయమును సమకూర్చి బెట్టుగా
నుక్కడిచి కుండలిని యూర్ధ్వముఖి జేసి

పిక్కటిల యాకాశ బిలమునందును సనిలు
డెక్కువతో జొచ్చినను మాయ శిధిలమునౌ

వ॥ అది రాజయోగంబు నాత్మ! వివరింపగను
యిది తెలియగను బయట నేకపదమగును ॥అ॥

చిద్రష్టగా సర్వ చైతన్యములు జెరచి
నిద్రమేల్కని తుదను నేత్రంబు దెరచి
భద్రుడై గురుని తన భావమున జూడగను
నిద్రలోపల యోగనిద్ర సమకూడు ॥అది॥

పరిపూర్ణ తేజమగు భావమధ్యను తాను
పరమ హంసయై చిదా భాసుడగుచు
గురుతైన పూదోట గురుని పదమునగూడి
అరుదుగా నమసస్కృడై ప్రకాశించు ॥అది॥—13

—: నిశ్చలానందమున తాండవమాడుట :—

దిట్టైన నాభికి క్రిందుమీదును చాల
చుట్టున్న యహి రేచ గట్టిగా మోదూ
మెట్టితాలు మూల పట్టున నిలిచితా
నట్టి మూడదృష్టి నఖతాత్మ జూచి

ప॥ తలుపులోపలనిలచి చెలగు గురుడు తారకబ్రహ్మమై వెలుగు
నిలిచి వెలిలోనిండి నిశ్చలానందమున తలచ భక్తులమదిని
తాండవ మాడుచు ॥త॥

జంట ద్వారములుబంధించి నడి మింటి ద్వారమును భేదించి
ఘంటారావము వింట సంటె నమృతము బయట
కంటి వేయు రేకుల కమలముపై కళలు ॥తలపు॥

పరికించ నిగమాంతముననను రత్నప్రభలతో విరచితమగునూ
అరయ పరంజ్యోతికవల సర్వసాక్షై సిరిమించు పూదోట
సద్గురుమూర్తి ॥తల॥—14

—: బ్రాహ్మీమృతప దివ్యామృతము ద్రావుట :—

మరియుమందార సుమ మకరందమును నాని
మరి షట్పదము ఘుమ్ముమ్మనగ్రోలినటులన్
గుమత్తైన నిగమాంత ఘోషంబు వినుచునే
మెరసి యానందమున మేను మరచితినె

ప॥ పరమేశ నీ కృపను పద్మాంతరంగమున
పరమ హంసగ నెపుడు ప్రజ్వరిల్లుదును ||పర||

చెలగి శుకమును మధుర ఫలరుచులు గొనుచుమది
నిలిచి శాఖాగ్రమున తా బలికి నటులన్
తెలిసినే బ్రాహ్మీమృతద దివ్యామృతముద్రావి
యొలసి యానందాబ్ధి నోలలాడుదునె! ||పర||

పరగ పికమును చూత పల్లవంబులు నమలి
అరసి పంచమ స్వరములను బలికినటులన్
పరికించి పూదోట బ్రహ్మంబునంటినే
మరచి తన్మయమొంది మరి ప్రకాశింతున్ ||పర||—15

—: లోబయట నే నిర్వికారుడను :—

కలిత నిర్మలహృదయ కమలాంతరంగమున
వలరు నంతర్జ్యోతి యనెడి లింగమును
బలసి శతకోటి శశిభాను ప్రకాశమై
యల తేజరూపమై నిలిచి వెలుగుచునూ

ప॥ ఎంత నిశ్చితమిది యెంచి చూడగమదిని
సంతోషకరమునై చాల విలసిల్లు ||ఎంత||

షట్బ్రహ్మలు మొదలు సచరాచరములై
సృష్టిలోపల జొచ్చి చెలగి వెలుగుచునూ
అష్టదళపీఠమున నమృతస్వరూపమై
నిష్ఠతో వేదాంత నికరమ్మై మెరయున్ ||ఎంత||

సిరతమును లోబయట నిర్వికారంబునై
పరికించ మధ్యాహ్న భాస్కరుని పగిది
అసదైనపూదోట యాత్మారామునిగలసి
పరికించ యీరీతి ప్రబలు చుండుదునూ ॥ఎంత॥—16

—: గురునితో బిందువునుగూర్చ తన్మయము :—

గురుని మార్గముచేత క్రూరులను దునుమాడి
తిరిగి మదివేగమున దివికి నెగయుచును
మురియుచును నాసాగ్రమున నిలిచి సుజ్ఞప్తిచే
పరిపూర్ణదృష్టిచే బ్రహ్మంబు గనుచూ
ప॥ గురుని పదమున బిందుగూర్చి తన్మయమునను
పరమ తారకమగుచు బయట మెరయుచును ॥గురు॥
పగలు రేలునుమీరి పద్మాంతరంగమున
నిగమాంతవేద్యమై నిండి ప్రబలుచును
సగుణ నిర్గుణుడనై సచ్చిదానందమున
అగణితంబై సర్వమంటి వెలుగుచును ॥గురు॥
వివరించి చూడగను విజ్ఞానమయుడనై
సవిశేషముగనేను సత్పదంబగుచూ
అవుర పూదోటపై అమృత స్వరూపమై
దివిభువిదిశలంటి తేజరిల్లుదును ॥గురు॥—17

—: శ్రీ క ర మ గు చి ద్రూ ప ము :—

వడియిడా పింగళలకడ గురునిధ్యానించి
కుడి యడమ నోంకార ఘోషమును వినుచున్
యెడ తెగని భక్తితో నెలమి యమృతముద్రావి
సడిమి వాకిలిదెరచి నయముతోజొచ్చి
ప॥ గురిమీరి తనలోన గురునిపదమున మనసు
పరికించిగూర్చ తా పరమాత్ముడగున్నా ॥గురి॥

ఆకాశమును మొదలు నష్టతనువులుదాల్చి
సాకారమై జగజ్జాలంబు నగుచున్
ఏకాక్షరంబునై యీశ్వరేశ్వరు డగుచు
శ్రీకరంబైనట్టి చిద్రూపుడగుచు ॥గురి॥
నిలిచి నిగమాంతమున నిర్వాత దీపగతి
బలసియు ననేక రవిప్రభల విరచితమై
చెలువమగు పూదోట జితయోగి నంటినే
తెలియ నిర్గుణుడనై తేజరిల్లుదునూ ॥గురి॥—18

—: బ్రహ్మానంద ఘనత :—

వివరించిచూడగను వెలి యంగుళముపైని
త్రివిధవర్ణముల కడ తేజరిల్లుదును
అవిరళంబైనట్టి యబ్జాంతరంగమున
శివయోగి రూపమును జేరి తెలియగను
ప॥ ఆనంద బాష్పంబులధికముగ జడిగొనగ
తానంది గురుపదము తగిలిమ్రొక్కితిని ॥ఆ॥
తరుచు మెరపులు దివిసి దట్టముగ దనరగను
నిరతమును చిత్కళలు నిండి వెలుగగను
స్థిరమైనమాణిక్య దీప్తిచే ప్రబలుచును
పరిపూర్ణమై జ్యోతి ప్రజ్వరిల్లగను ॥ఆ॥
నిలిచి తారకముపై నిర్బీజమైయున్న
తలచి నిజగురుపదము తానుగనుగొనుచు
బలిమైన పూదోట పరమాత్మపదమునే
గలసి బ్రహ్మానంద ఘనత మెరయుదును ॥ఆ॥—19

—: పూదోట గురు నిరూపగుట :—

విమల ప్రణవధ్వని వీనుల వినుచును
పరమున కహి వెడలిన ప్రళయముకోచును

కమల భవాండము గ్రుసనదిరిగెను
అమరినజ్యోతియు సవ్వలదనరుసు
ప॥ అదిగో ! తారక మమృతమగుచును
అదినిర్భైటను నాడుచునుండును ॥అది॥
తనుచు మెరపులను తరలక నెప్పుడు
పరి పరి విధముల ప్రబలుచు వేడుక
అనుదుగ కళలను అమృతము జారగ
నెరదీప్తులలో నిరతము వెలుగును ॥అది॥
అది పదిరెండును అంగుళాంతమున
సదమల తేజంబును తానైనిండియు
చెదరక వెలుగుచు చిద్భానునితుద
నిదియు పువ్వుదోట గురు రూపంబగు ॥అది॥—20

—: అనంత లింగమూర్తిని :—

సరస దశలింగము ల్వరుస పదిలింగముల
నరుదు గగనము నాది యైదు లింగములు
అరయ సంతఃకరణంబాది లింగములైదు
పరగ ప్రాణుండాది పంచలింగములూ
ప॥ అమిత లింగములునై యలరి చరించితుగ
సమములేకను నిరంజన లింగమగుదూ ॥అమి॥
తెలియ నవలింగములు త్రివిధలింగములు మరి
యల బీజ వర్ణంబు లైదులింగములు
బలిమి నాల్గునునైదు బ్రహ్మలింగంబులును
నలరు నధిదైవతములను లింగములునూ ॥అమి॥
మరితను త్రయములను మలినలింగంబులును
సరగ వ్యసనంబులను సప్తలింగములూ
సరసమగు పంచకోశముల నెడి లింగంబులును
గరిమె యాకాశ లింగము లైదు వినుడి ॥అమి॥

కనుగొనగ నేడైదులగు యోగలింగములు
తనరు శబ్దములనెడి దశలింగములును
మొనసి విద్యావిద్యలను లింగములు రెండు
నొనర పూర్ణాత్ముడను నొకలింగమగును ॥అమి॥
అలరు జంగమ స్థావరాది లింగములపై
కలిత చిద్గగన లింగమున కవ్వలను
కలకలేకను యమృత ఘనశూన్యలింగమై
నిలిచి పూదోటకడ నే ప్రకాశింతూ ॥అమి!—21

—: నిరవయ నిరాకార నిర్బీజ స్థితి :—

వినయ భయభక్తితో విమలమగు హృత్కమల
మున దేశికుని చరణములును అర్చించి
తనకు గురుకృపను తీర్థ ప్రసాదములు గైకొని
అనుభవించినంతనే తనయాత్మను చియా

ప॥ విజ్ఞానజ్యోతిమది వెలుగునప్పుడు బలిమి
అజ్ఞానతమమెల్ల నణగు నిమిషమునన్ ॥వి॥
క్షర మక్షరములను సంజ్ఞలను మించినే
పరమ తత్త్వంబునై ప్రబలి యవ్వలనూ
నిరవయ నిరాకార నిర్బీజమై యేను
అరయ సుస్థిరశూన్యమై ప్రకాసింతూ ॥విజ్ఞా॥
బలిసి దివి పృథివి దిక్కులు సందులాముకొని
విలయకాలమునాటి జలరాశిగతిని
నిలిచి పూదోటకడ నే యుభయసాక్షినై
తెలియగ నఖండమై తేజరిల్లుదును ॥విజ్ఞా॥—22

—: పూదోట మర్మజ్ఞనంటితిని :—

ఘనతశబ్దము చిదాకాశమున నుదయించి
వినగవీనులకు దశవిధములౌచాలా

కణగి నమృతము జ్యోతికళల జడిగొనిదుంకి
చనుచు జిహ్వాగ్రమున పడుచుల నిచ్చున్
ప॥ నిలిచినిష్కల బ్రహ్మ నిశ్చలానందమున
అలరి లోనెలినిండి యమితమై మెరయన్ ।నిల।

ఆజ్ఞ మండలముపై నబ్జకన్యను గూడి
విజ్ఞాన ప్రభలతో విరచితంబగును
ప్రజ్ఞతో సాహస్ర పద్మకర్ణిక మధ్య
సుజ్ఞానమగు పరంజ్యోతి పీఠముఃనన్ ॥నిల॥

మితిలేని దినకరులు మెరసి కూడిన రీతి
ప్రతిలేని నిర్బైట బలసివెలుగుచును
మితిలేని పూదోట మర్మజ్ఞునంటెనే
సతతమును నాశా సత్పదంబగును ॥నిల॥—23

—: నిజదాత పదమంటిన యున్మని :—

దివము రాత్రులు మీరి త్రికూటమున నిలిచి
వివరించి లోబయట వెదకి చూడగను
ధవళ వర్ణంబైన తగుమంచి పాత్రలో
శివకరంబై గురుడు చెలగి వెలుగగను
ప॥ అతివ కనుగొంటెనే నాత్మరాముని పదము
చతుర పదవులుమీరి చెన్ను మెరయగను ॥అతి॥

అష్ట ప్రకృతులలోను నంటి దీపింపుచును
షష్ట బ్రహ్మల తుదను సంచరింపుచును
నిష్ఠతో వేదాంత నిలయమై వెలుగుచును
ద్రష్టమై నిర్బైట తరలకను ప్రబలన్ ॥అతి॥

పరమ పదమైనట్టి పరిపూర్ణ జ్యోతిపై
నిరతమును నిర్గుణుడు నిలిచి తనరగను
తరలి పూదోట నిజధాత పదమంటితను
పరికింప నున్మనీ భావమున నుందున్ ॥అతి॥—24

—: ముత్యపు చిప్పలోఁబడిన వర్షబిందువు :—

ఇనుము పరుసముసోకి హేమించియున్నట్లు
మొనసి శుక్తిలో చినుకు ముత్యమైనట్లున్
కనలి భయమున పురుగు ఘన భ్రమరమైనట్లు
వనర పాలును నీరు నొక్కటైనట్లూ

ప॥ పరికించ నా హృదయ పద్మాంతరంగమున
పరమాత్మ ధ్యానించి పరతత్త్వమైతి ॥పరి॥
తరచ నవనీతమున దధియు బుట్టినయట్లు
చెరుకులో మధురంబు జనియించినట్లున్ ॥పరి॥
తిమిరమగు గృహములో దివ్వె వెలిగినయట్లు
శమద సద్గుణముల శశి వెలిగినట్లూ
విమలమగు పూదోట విశ్వసాక్షినిగూఁకి
అమలమై నిర్బైట నమిత పదమగును ॥పరి॥—25

—: గురుని దయచే జన్మభయము వీడెను :—

గురుని కర వీర్యమున కుదురుచు నయోనిలో
నరుడుగా జన్మించి యకళంకమగుచున్
పరగహృత్కమలమున ప్రణవరూపై తాను
నిరతమును సత్కళల నిలిచివెలుగుచును

ప॥ తిరిగి జన్మములనెకి దిగులు తనకేమిటికి
నిరుపమ జ్యోతిపై నిండివెలుగుచునూ ॥తి॥
మనసు తన ముఖకళను మగుడి జనియించగను
మనసుచే జగములు మరిజననమొందున్
మనసుచే నాడించి మనసుచే వీక్షించి
యినునిగతి మనసుతుద నేప్రకాసింతున్ ॥తి॥
ముదముతో నిర్బైట మొనసి వెలుగుచునెపుడు
కదలక నఖండమై కడుచిత్రితమునా

సదయుడగు పూదోట సద్గురుని గలసియును
సదమ లానందమున సత్పదంబగుదున్ ॥తి॥—26

—: నవచక్రములు మించితిని :—

మరియు సద్గురు హస్తమస్తక సంయోగమున
సుస్థిరమ యోని జననము సిద్ధమగుచు
పరమ చిత్కాయమై పద్మాంతరంగమున
నెరయ సత్కళలతో నే ప్రకాశింతూ

ప॥ జననమై నప్పుడే జగదీశ ! మీ కృపను
ఇనునిగతి నిర్భైట నే వెలుంగుచునూ ॥జన॥

త్రివిధ నేత్రముల తుద దివ్య నేత్రము దెరచి
తవిలి విశ్వమును దగ్ధముజేసి తుదను
వివరించ వేదాంత విజ్ఞానమయుడనై
నవచక్రములు మించి నటియింతు నెపుడూ ॥జన॥

హెచ్చి చిద్వ్యోమమున హితవుతో మెరయుచును
అచ్చమగు భక్తిచే నతిశాంతముననూ
ముచ్చటతో పూదోట మూలబ్రహ్మమునంటి
వచ్చమింతయు లేని వరయోగనగుదున్ ॥జన॥—27

—: కంటిపాపల వెనుకగల మింట నాపోజ్యోతిలో :—

ఇంటిలోపల నెరసువంటి తత్త్వము మదిని
కంటి కంటిని అంటి వెలిగి నే చెలియా !
ఇంటనున్న మూటి గెంటినే పదిపది విధముల
నొంటి యింటను నే నుంటినే చెలియా !

ప॥ ఇటువంటి సద్గురుని వీక్షించి నామదిని ఏకపథమైయుందునే
అల త్రికూటముపైని చిత్కళలు కట్టెదురుచూపు
నీ ఘనుసి జేరె చెలులకుదెలియ్యా ॥ఇ॥

కంటి పాపలనంటి మింట నాపోజ్యోతివంటి
యింటను వింటినె చెలియా !
జంటతనమునను మదినంటి జ్ఞానామృతము
నంటి పానము చేసితినే చెలియా ! ॥ఇటు॥
కంటి పూదోటకడ ఘన నిర్గుణబ్రహ్మ
మాటి ప్రబలుచునుంటినే చెలియా ।
అంటి తనుభక్తులను అంటనియ్యక మాయ
మింట మెరయుచునుంటినే చెలియా ! ॥ఇటు॥—28

—: గుణశూన్యుడగు ఆనందమయుడు :—

పంచ తత్త్వములైన పంచశక్తులతుదను
కాంచన ప్రభ వెలుగు కమలాంతరమున
మించి నిగమాంతమున మెరసి సత్కళలతో
నెంచనామదిలోను యెప్పడు విలసిల్లున్
ప॥ అంటి ప్రణవాంతమున నమృతపదమై గురుడు
ఇంటింట దీప మల్లేకనై వెలుగు ॥అం॥
చెలగి వెన్నెల బయట సితకరుని మీరుచును
తలచ నాదము బిందుకళలపై నిలిచి
అలరు నిర్గుణజ్యోతి కవల సద్గురుమూర్తి
వలసి భక్తులమదిని వనరదీపించు ॥అం॥
అరయగుణ శూన్యమున నానందమయుడునై
పరిపూర్ణమగు చిదాభాసుండు నగుచు
తరుచు చిత్కిరణముల తుద తారక బ్రహ్మమై
గురుతైన పూదోట గురుడు మెరయుచును ॥అం॥—29

—: ఓంకార రహిత చిన్మయానందం :—

మందగమనముతోను మర్మవీధినజొచ్చి
పొందించి ప్రణవమున ప్రాసగమరిగూర్చి

చందనపు చిదాగ్నిచే చైతన్యములు జెరచి
బిందు నాదము కళలు భేదించి తుదను

ప॥ ఉన్మనీభావమున నోంకార రహితమై
చిన్మయానందమున జితయోగి నగుదున్ ॥ఉ॥

దృష్టితుద నిలచి తా దినకరునిగతి ప్రబలి
అష్ట ప్రకృతులజొచ్చి యంటి వెలుగుచునూ
ద్రష్టనై సాహస్రదళ పద్మమున నెపుడు
యిష్టలింగంబునై నే వెలుంగుదునూ ॥ఉ॥

అజపాక్షరములాది యఖిల వేదంబులును
భజియింపరానట్టి బ్రహ్మంబునగుచున్
విజయమై పూదోట విభుని స్వరూపమై
నిజముగా వెలిలోను నిండి వెలుగుదునూ ॥ఉ॥—30



## తొమ్మిదవ దళము

# తన్మయానందం




:— ఎరుక మరుపులు మీరిన ఏక స్వరూపము :—

శివరామ మీ దివ్య శ్రీపాద పద్మములు
చెలగి ధ్యానించినే రామా !
పవనము నిరోధించి ప్రాణ పానుల గూర్చి
ఫణిరాజు నెగయించి రామా !
పవన వేగమున నిరువదినాల్గు తత్త్వములు
బంధించి మనసుతో రామా !
దివము రాత్రులు మీరి త్రికూట మధ్యమున
తీవ్రముగ నిలిచినే రామా !

ప॥ ఇక నీదు కరుణచే నిగమాంతమున నేను
ఎనసి వెల్గితి తండ్రిరామా !
అకళంకమై చాల అద్భుతంబై నట్టి
అమృత పదమైతినే రామా ! ॥౩౮॥

నిరతమును నయనాగ్రముగ నిల్చి నిర్బైట
నేనిండు చిత్కిరణముల రామా!
గరిమె మెరయుచు హృదయ కమలాంతరంగముగ
ఘనజ్యోతి లింగమై రామా!
నిరుపమం బైనట్టి నిశ్చలానందమున
నిండి వెలుగుచు నెపుడు రామా
పరమ హంసగనేను పరిపరి విధములను
బైటక్రీడింతునే రామా ॥౨౬॥

సుగుణమను చిన్మయుని సుజ్ఞానకళ
జీవసూత్రమై ఇలకను రామా!
సగుణమగు బిందుముఖ సన్నిధిని
బ్రహ్మాది సర్వమును నిర్మించిరామా!
మ్రుగుప మూర్తులనాది ముల్లోకములు నేను
ముదముచే నాడించి రామా!
నిగమగోచరమగుచు నిర్గుణజ్యోతి తుద
నిష్క్రియుడనై యుందు రామా! ॥౨౬॥

స్థిరుడనై సాంఖ్యమగు చైతన్యముల మించి
చిద్వ్యోమమై నేను రామా
అరయగా సర్వమును నాముకొని నిర్బైట
నమితమై యుందునేరామా!
ఎరుక మరుపులు మీరి యేక స్వరూపమై
నే ప్రకాసింపుచును రామా!
పరమ పదమున నెపుడు బ్రహ్మస్వరూపమై
భాసిల్లుచుందునే రామా! ॥౨౬॥

అనయమును బహుకోట్యర్క ప్రకాశమై
అగణితంబై ప్రబలి రామా!
ఘనత తేజోరాసిపైని కదలక నెపుడు
క్రమముతో నుందునే రామా



పూదోట భిక్షు ఆత్మారాంగారు, చిప్పలపాలెం, తూ. గో. జిల్లా



శ్రీమతి వుప్రాళ్ళ శేషమ్మగారు, కంచగారుబెలగళ్ళ, బళ్ళారి



శ్రీ పూదోట గురుపూజలో
శ్రీ యం. సుభాన్ జీ, లక్ష్మీబాయమ్మ, నాగమ్మగార్లు



శ్రీ [illegible] ఏలూరు

శ్రీ సత్యరాజు శ్రీమతి సుభద్రమ్మ గార్లు

కనుగొనగ పూదోటకడ సర్వశూన్యమగు
ఘన సత్పదంబునే రామా!
పనిబూని కూడుచును పరమాద్వితీయమై
ప్రబలుదును మీ కృపను రామా ॥ఇక॥—1

—: చింతలన్నీ గురుని చింతచే జెరచితిని, అనంతమైతిని :—

నిక్కిలిన్ నీ కృపను రామా గాలినెక్కడన్ జొరనీక రామా
ఉక్కణచి భుజగినీ రామా దివికి చక్కగా నెగయించి రామా!
గ్రక్కున శత్రువుల ఖండించి మాయను
ధిక్కరించి ముక్తి తెరువుబట్టితి రామా!

ప॥ వందనమిదుగో శ్రీరామా నీదు వరపాదాబ్జములకు రామా
అందమైన ప్రణవమందు స్వాంతముగూర్చి
పొందుగా నిగమాంత భూరితేజమునగుదు ॥వం॥

జంటకన్యలహో రామా! బుద్ధి నంటగూర్చుకొని రామా!
అంటి యమృతము ద్రావిరామా!
విమల ఘంటారవమువింట రామా!
ఒంటియింటిలోను అంటి వెలుగుచునున్న
కంటి ముక్తిపాప కళలఁగంటిని రామా ॥వంద॥

సంతతధ్యానమున రామా అంగచైతన్యముల జెరచి రామా!
చింతించినిన్ను హేరామా అంతరాంతమునజొచ్చినే రామా!
చింతలన్నియుగురుని చింతచే జెరచినే
గంతేసి కైవల్య చెంత జేరితి రామా ॥వంద॥

ఎంచి స్వస్థానమున రామా నిన్ను యేకదృష్టినిజూడ రామా!
కాంచనదీప్తుల రామా సూక్ష్మకమలాంతరంగమున రామా
మించి తేజముమధ్య మెరసి చిన్మయహంస
సంచరింతుసదట స్వామి శ్రీరామా ॥వంద॥

నిండు చిత్కారణముల రామా చిన్మండలంబుననిలిచి రామా !
నిండి యనంతమై రామా వెలుగు నిజమైన పూదోటరామా !
అండగొానకమిమ్ము నానందమునగూడి
యుండితి నిర్భయట నునికిచేసుక రామా ! ॥వంద॥—2

—: శంథిలో జేరిన నదీజలమువలె :—

గురుతు పాలును నీరు కూడియుండిన రీతి
గరిమె ఘృతమున ఘృతము కలిసియున్నటుల
సొరిది కర్పూరంబు జ్యోతిలో పొలుచుక్రియ
శరధిలోపలబడిన జలశిలలపోల్కి

ప॥ అలరు నిర్గుణ బ్రహ్మైక్యమును నీ పగిది
చెలగి చెప్పెదవినుడి జిత విషయులారా ! ॥అ॥

కనుగొాన ఘటాకాశమును మహాకాశమును
కలిసి యొక్కడగుచు కడు వేడ్క నున్న యటుల
తనరి యీ సర్వమును తగిలి జీవునితోడ
మొనసి సుప్తినిగూడి మెనసి యున్నటులన్ ॥అ॥

మరి జ్ఞానవిద్యలో మాయ యణగిన విధము
చిరనిరాలంబమున చిన్మయుడుగూడి
నెరయ తిన్మయుడునై నిలిచి పూదోటకడ
నరయ శూన్యమ శూన్యమై ప్రకాశించు ॥అలరు॥—3

—: మూల మాయానుమించి అఖండమైతిని :—

బలిమి విశ్వముజుట్టె పావకుని క్రిందైన
మలిన మురగిని రేచి మహదాది జగముల్
చెలగి జ్ఞానాగ్ని చే పొలియించి తుదనేను
సలరివస్తువు మనోమృతముచే గాంచన్

ప॥ పంచవ్యోమంబులును బయట పడునంతలో
మించి చిద్వ్యోమమున మెరయు సద్గురుడు ॥పం॥

పట్ట పగలైనట్టి పండువెన్నెల బయట
దిట్టమగు బహు వర్ణతతులతో ప్రబలు
అట్టె సాహస్రదళ అబ్జ కర్ణికనంటి
చుట్టి సర్వము పరంజ్యోతి ప్రబలగను ॥పం॥

మొనసి దుర్ఘటమైన మూలమాయనుమించి
తనరుచును నే పరమ తత్త్వమై తుదను
పనిబూని పూదోట పరమ యోగినిగూడి
కనుగొనగ నఖండమై కడప్రకాశింతూ ॥పం॥—4

—: నవచక్రములు భేదించి నిరంజనుడనైతిని :—

పరువడి తనుత్రయము ప్రళయాగ్నిచే జెరచి
మెరసి పగలును రేలు మీరి స్వాంతమున
గరిమె నవచక్రములు గరిమెతో భేదించి
పరమ తత్త్వంబు నిర్బైట వీక్షింతూ

ప॥ చిన్మయంబై శుద్ధ చిరపదంబంటినే
తన్మయానందమున తనరి వెలుగుదును ॥చిన్మ॥

తెలియ శతకోటిరవి దీప్తులను ప్రబలుచును
నలరు దశశతయు తారల కమలమునను
నిలిచి స్వయంజ్యోతి నిఖిలంబు నాముకొని
బలసిగుణ శూన్యమున ప్రబలుచుండగను ॥చిన్మ॥

పరమాత్మయందమిత బ్రహ్మాండనికరములు
విరచితంబై తుదిని నెరమాయ నణగు
సరిలేని పూదోటస్వామి చిన్మాత్రపై
నరయగ నిరంజనుండై ప్రకాశించూ ॥చిన్మ॥—5

—: పూదోట నిష్కళ బ్రహ్మము :—

వరనవ ద్వారములు సరసముగ బంధించి
గురుతు కుండలి లేచి గుహమార్గమునను
తరిమి బిందుపురాజ దంతద్వారమున జొన్పి
మెరసి పగలును రేలు మించి చూడగను

ప॥ పరమ దహరాకాశ పదమందు చెదరకను
నిరతము నిరామయుడు నెరిప్రకాశించూ ॥పర॥

తెలియ శతకోటి శశికళల విరచితమునై
యలరు జలరాసిపై నమితమై తనరు
నిలిచి స్వయంజ్యోతి నిశ్చలానందమున
బలసి గుణ శూన్యమున ప్రబలు చుండగను ॥పర॥

అరయ దీపించ బాహ్యాభ్యంతరములందు
భరితమగు నిర్గుణ ప్రకృతి తుదను
సిరిమించు పూదోట శివయోగి పుంగవుడు
పరికించ నిష్కళ బ్రహ్మమై యుండూ ॥పర॥—6

—: తన్మయ జాగ్రత్తు :—

షల్లింగములమీరి చంద్ర దినకరులకడ
జల్లున సుధారసము చాలద్రమంకగను
మల్లెపువ్వులమింట మహిత సద్గురుమూర్తి
యెల్లలోకములపై యెపుడు వెలుగగను

ప॥ కంటి సద్గురుపాద కమలములు భక్తిచే
నంటి తన్మయమంది యపుడె మేల్కంటి ॥కంటి॥

రంతుసేయుచును నవరత్న పీఠంబునను
పంతుమీరుచు చిద్భానుడైచాల
వింతలగు మహదాది విశ్వముల దీపించి
సతతము నిష్క్రియుడు సత్కళల వెలుగున్ ॥కంటి॥

శుక శౌనకాది మునిసురలు సేవింపగను
సకలాత్మనిను శృతులు చాల స్తుతిసేయన్
సుకరముగ పూదోట సుగుణ రామునినంటి
సకలమై వెల్గినే అకలంక మగునన్ ॥కంటి—7

—: కైవల్య గురుమందిరమున అఖండమైతిని :—

చిత్తతేజిని నెక్కి శీఘ్రముగ దుంకించి
హత్తిసుజ్ఞానులను నంటి కొలువగను
కత్తి ఝుళిపించి దుష్కర్మలను దృంచితా
సత్తుగుణములు దనర చనుదెంచి బయట
ప॥ వేదాంత సారమగు విజ్ఞానజ్యోతి తుద
పాదుకొని తారక బ్రహ్మమైయుండూ ॥వే॥
అంబునిధి మధ్యమున నకళంక దీప్తులను
నంబుజము పుదనరి యానందమునను
కంబు కందరిచాల ఘన దివ్య పుష్పములు
అంబరంబున నిల్చి యతివచల్లగను ॥వే॥
గురిమీరికైవల్య గురుమందిరము జొచ్చి
పరమసుందరిని నెడబాసి వెలుగుచును
పరికించ పూదోట ప్రభునిరంజనుడనై
నిరతము నఖండమై నిలచివెలుగుచును ॥వే॥—8

—: చిన్మయంబును మించి శూన్యమైన సిద్ధి :—

అరయుచు నపానుని మెరసి తానెగయించి
తరిమి ప్రాణునితోడ తగగూర్చి వేడ్క
ఉరగపతి నెగయించి యూర్ధ్వ ముఖమును జేసి
పరమ హంసయై హృదయ పద్మమున వెలుగ
ప॥ ఇది యోగసిద్ధియగు విదితముగ మదిలోను
స్థిరయుక్తుడైతుద సర్వసాక్షి తా నగును ॥ఇది॥

చెలగి రవిశశి తేజములు మించి నిర్భైట
నిలిచి యోంకారమై నిండి వెలుగుచును
బలిసి శతకోటి రవి ప్రబల విరచితమునై
వెలిలోనునిండి తుద నిలిచి ప్రబలినను ॥ఇది॥
ఘనత చిత్కళలతో గ్రమ్ముకొని వెలుగుచును
దనరు మించిన విమల తారక జ్యోతికిని
మిన్నయౌ చిన్మయంబును మించి పూదోట
ఘన నిర్గుణునిగూడి కడ శూన్యమైన ॥ఇది॥—9

—: వేదాంత వేద్యమై వెలుగుడును :—

ఘంటానాదము వినగనె గాడ్పులు రేచి
జంటనాడులు బంధించి సర్వశాంతుడనై
గెంటించి కుండలిని గెలిచి మాయను నే
నొంటి వీధినిజొచ్చి త్రైవర్ణములు గడచి
ప॥ కంటి సద్గురుని చిద్గగన మవ్వలనూ
నంటి తన్మయమంది నేనచట మేల్కంటి ॥కం॥
కలిత నిర్మలహృదయ కమలాంత రంగమున
నలయు నాదము బిందు కళలశోభితమై
బలసి బహుకోట్యర్క ప్రభల విరచితమై
నిలిచి వెలిగెడిముక్తి నెలతను నేమీరి ॥కంటి॥
మీది సాకారమును నేమించి నిర్భయులై
ఆది మధ్యాంత శూన్యప్రకాశుడనై
పాదుకొని పూదోటపై బ్రహ్మమగుచు
వేదాంత వేద్యమై నే వెలుగుచుందు ॥కంటి॥—10

—: పరమదహరాకాశ పదమైతిని :—

అజ్ఞానమైనట్టి యంగ చైతన్యముల
సుజ్ఞాననేత్రమున చుట్టి మెరయుచును

అగ్ని చక్రముమించి అబ్జ కర్ణికపైని
ప్రజ్ఞతో నిజగురుని పదములును గంటి

ప॥ కంటి కనుగొనల నిజఘనయోగి రూపమును
అంటి నిగమాంతమున నాటలాడగను ॥కంటి॥

నటన కుండలిని రేచి నాసాగ్రమునుజొచ్చి
పట పట భ్రూమధ్య బయలు పరచుకను
నిటలోర్ధ్వమున నిలిచి నిండు చిత్కిరణముల
ఘటములోపలి దీపకళి కెగతి వెలుగన్ ॥కంటి॥

సిరులుమీరుచుబయట చిద్భాను బింబమై
నిరతమును నిర్బైట నిండి వెలుగగను
పరికించి పూదోట బ్రహ్మంబుగూడినే
పరమదహరాకాశ పదమునై యుందూ ॥కంటి॥—11



పురికొల్పి దృష్టులను భ్రూయుగముపైగూర్చి
పరికించి రవిచంద్ర పావకుల కడను
గరిమెతో నాదుహృత్కమలాంత రంగమున
నిరుపమంబై జ్యోతినిండి వెలుగగను

ప॥ నిలిచి భక్తిని నేను నిజగురునిగను గొంటి
కలిసి బ్రహ్మానందగరిమె మెరసితినీ ॥నిలి॥

తనరుచును మహదాది తత్త్వములలో వెలిగి
గుణరహితుడై మదిని గోచరింపగను
అనుదినము నామదిని యవలోకనము సేయ
ఘనదివ్య తేజమై కడప్రకాశించన్ ॥నిలి॥

పరికించగుణ శూన్యభావమున బలుకుచును
అరుదుగానిర్బైట అమృత పదమగుచు
అరయ చిద్వ్యోమమున కవలనిర్గుణుడనై
సరిలేని పూదోట స్వామిఃంటితినీ ॥నిలి॥— 12

—: సందులేకను నిండిన సహజ స్వరూపము :—

పొందుగా జలసింధు పొంత నద్భుతముగా
యిందు భాస్కరుల తుద నెలమితో నెపుడున్
సందులేకనునిండి సహజస్వరూపమై
అందమగు జ్యోతిపై యాటలాడగను

ప॥ శంకలన్నియునుడిగి నిశ్శంకతో మదిని
పొంకముగ సద్గురుని పూజ సేయుచును ॥శం॥

సకల భూతములందు సంచరింపుచు తుదను
వికలమించుక లేక విజ్ఞానమునను
సుకరమగు లోబయట సొంపుతో మెరయుచును
అకలంక దీప్తులను అమితమై ప్రబలి ॥శం॥

గురుతైన నిగమాంత కోమలాంగిని మీరి
అరసి చిద్వ్యోమంబు నాక్రమింపుచును
సరిలేని పూదోట జగదాత్మ గలిసినే
పరమ దహరాకాశ పదమునై యుందున్ ॥శం॥—13

—: పూదోట గురునిగూడక తన్మయ సుఖములేదు :—

లేదు షణ్మతముల లేదు బహునిధి సదుల
లేదు స్నానంబుల లేదు దానముల
లేదు మహి వేల్పులను లీలనర్పించినను
లేదు జపతపములను లేదు స్తోత్రముల

ప॥ ఇలను నిర్గుణముక్తి ఈ వేషధారులకు
తెలిసి చూచిన లేదు స్థిరభక్తులార ! ॥ఇల॥

లేదు రేచకముచే లేదు పూరకముచే
లేదు కుంభకముచే లేదు యిాభ్రమల
లేదు కేవలకుంభకాది క్లేశములచే
లేదు లంబికముచే లేదు చిత్పవము ॥ఇల॥

లేదు అష్టాంగాది యోగశిద్ధులకైన
లేదు ధర మంత్ర సాధకులకైన
లేదు హఠరాజయోగాది మార్గములచే
లేదు కైవల్యమును లేదు వినరయ్య! ॥ఇం॥
లేదు ఆసనక్రియల లేదహంకారముల
లేదు వ్రతశీలముల లేదు అపవర్గం
లేదు బహు లక్ష్యముల లేదు ధ్యానంబుచే
లేదు భక్తినిగాని లేదు సత్పదము ॥ఇ॥
లేదు నిజస్వాములను లెస్సగానమ్మకను
లేదు భవచ్ఛేదనము లేదు సుస్థిరము
పాదుకొని పూదోటపై గురుని గూడకను
లేదు తన్మయ సుఖము లేదు జనులారా ॥ఇల॥—14

—: సర్వము నుబ్రహ్మమే! :—

కులము నాచారమును గలవారమని ద్విజులు
వెలిజాతి వీడనుచు వీక్షించి రాళ్ళ
చలముచే వ్రేయుచును చండాలుడని గదిమి
బలు కోపమునదిట్టి బాధింతురతని

ప॥ సర్వమును బ్రహ్మమని చాటెంచగా శృతులు
గర్వులును విజ్ఞాన క్రమమెరుగ రయయో! ॥సర్వ॥
మొనసి రేతో రక్తములుగలసి పెనుగొన్న
తనువు లొక్కటిసుమ్మి తలపబహుపగుణి
తనువులన్నిటినుండి తార తమ్యము లేక
కనుగొనగ నాత్మొకొక్కడు ప్రబలు నిజము ॥సర్వ॥
తెలియ నజ్ఞానులే యిలను శూద్రులటంచు
బలిమి విజ్ఞానులే బ్రాహ్మణులటంచు
పలుమారు ముల్లోకములయందు సిద్ధమని
నిలచి యపవర్గసతి నిజముగా బలుకు ॥సర్వ॥

వినుడి సత్యంబు నీ విమల వాక్యంబులును
ఘనత త్రైమూర్తులివి కాదనగలేరు
తనరుచును యోగీంద్రులును భక్తితో మ్రొక్కి
మనమలర నిష్క్రియుని మహిని పొగడుదురు ॥సర్వ॥

సర్వరూపకుడునైన సర్వాంతరాత్ముడై
సర్వమునుమించి నిజసగుణ నిర్గుణుడై
సర్వమగు పూదోట సద్గురుడు వెలుగుచును
సర్వసాక్షిగనుందు సజ్జనులు వినుడీ ॥సర్వ॥—15

—: క్షరాక్షరముపై సాక్షిని :—

—: సమాధికి అతీతుడను :—

నహి సర్వరూపములు నహి సర్వనామములు
నహి సర్వక్రియలు మరి నహి వర్ణములునూ
నహి సర్వగుణములును నహి సర్వకోర్కెలును
నహి సర్వభోగములు నహి సర్వచర్యల్

ప॥ ఇన్నివగలను మీరి యే నిరాకారమై
అన్నిటికి తుదనిలిచి యలరి వెలుగుచును ॥ఇన్ని॥

నహి సర్వకర్మములు నహి సర్వపుణ్యములు
నహి సర్వదూషణలు నహి స్తోత్రములునూ
నహి సర్వవాసనలు నహి రాకపోకడలు
నహి రాగద్వేషములు నహి ప్రమోదములు ॥ఇన్ని॥

నహి సర్వద్వంద్వములు నహి సర్వసంపదలు
నహి సర్వవేదములు నహి కల్మషములు
నహి యష్టసిద్ధులను నహి విద్యావిద్యలును
నహి పంచతనువులును నహిరె సర్వమునూ ॥ఇన్ని॥

నహి సమాధులు పెక్కు నహి పంచధారణలు
నహి సర్వధ్యానములు నహి సంశయములు

నహి సగుణ మోక్షములు నహి బంధత్రయములును
నహి పరమయోగమును నహి చిదానందం ॥ఇన్ని॥
నహి పూర్ణపురుషుడును నహి పరమ పురుషుడును
నహి నాల్గుభూమికలు నహి త్రివిధపదవుల్
నహి క్షరాక్షమును నహిరె పూదోటకడ
బహు చిత్రితములకు పై సాక్షి నగుదూ ॥ఇన్ని॥—16

—: కదలి కదలని ఘననిరాలంబమును :—

నెర నిరాకారమై స్వప్రకాశింపుచును
పరమ సాకార చిత్పదమగుచు నేను
అరసి మూల ప్రకృతి నాదిస చరాచరము
పరికించ నేనయై ప్రబలుచుండుదునూ
ప॥ మఱియు నేరూపనామ క్రియల క్రీడించి
వరుస యిన్నియుగాక నొకడనై యుందూ ॥మరి॥
తలపోయ బహుముత్యములలోను సూత్రమును
మెలగి చొచ్చినరీతి మెరసి యాత్ముడనై
అలరి పిండాండ బ్రహ్మాండములలో జొచ్చి
తెలియ పరిపూర్ణమై దీపింతు నేనూ ॥మరి॥
కదలి కదలక నెపుడు ఘననిరాలంబమై
ముదముతో యిన్నిటికి మూల బ్రహ్మమునై
యిదిగో పూదోటపై నేసర్వ సాక్షినై
పదిలముగ నిజశూన్య భావమై యుందూ ॥మరి॥—17

—: తన్మయానందమున తాను నిర్గుణుడు :—

తన్మయానందమున తను పంచకము జెడును
తన్మయానందమున తత్త్వములు నణగున్
తన్మయానందమున తలపు మరపులు లేవు
తన్మయానందమున తరచు భ్రమలణగున్

ప॥ నిర్లేపులార యిది నెమ్మదిని వినరయ్య
నిర్లక్ష్య భావమును నే తేటపరతున్ ॥నిర్లే॥
తన్మయానందమున దరజిహ్వారుచులు జెడు
తన్మయానందమున తాజితేంద్రియుడౌ
తన్మయానందమున తవిలి వెలిలో మరచు
తన్మయానందమున తా నిష్క్రియుడు నౌ ॥నిర్లే॥
తన్మయానందమున తపుచు గాడ్పులుపొలుచు
తన్మయానందమున తలపమది జెడును
తన్మయానందమున తరుచు జీవుడు గూలు
తన్మయానందమున తాసిత్యుడగును ॥నిర్లే॥
తన్మయానందమున దశశబ్దములు లయము
తన్మయానందమున తరగు నమృతమునూ
తన్మయానందమున తొలగు విద్యయు నవిద్య
తన్మయానందమున తాను నిర్గుణుడునౌ ॥నిర్లే॥
తన్మయానందమున తాను మేల్కాని యెపుడు
తన్మయంబును లేక తా నుభయసాక్షై
తన్మయానందమున దగ్ధమగు పూదోట
తన్మయము మీరెపుడు తా ప్రకాశింతు ॥నిర్లే॥—18

—: భ్రమరకీటకన్యాయము :—

మరి షట్పదములును మందార పుష్పముల
కరుగు పగిదిని ధరను నచల పురుషులును
పరమ సద్గురు చరణపద్మములు గుర్తెరిగి
ధర భక్తజనులు తీవ్రమున జేరుదురు

ప॥ ఎంతకాలమునకైన నిల కర్మజీవులును
చింతించి జ్ఞప్తి సుస్థిరుని దెలియరును ॥ఎం॥
జితవిషయులైనట్టి శివయోగులును మదిని
గలిమిమీరెఘనుచు చిద్గగనపీఠములపై

నతి తురీయభక్తిచే నద్వితీయుని చాల
హితవుతో నర్చింతు రతి ముదంబునను ॥ఎం॥

అరయ దేశికునికృప నమృతాంగులయ్యెదరు
మరి భ్రమరకీటకముమాడ్కి- నిముషమునన్
గురువైన పూదోట గురుని స్వరూపమై
నెర నిరాకారులై నిల్చి వెలుగుదురు ॥ఎం॥—19

—: ఆదిమజ్యోతిపై నిలచిన నిర్లేపను :—

పెక్కు- నాడులు శోధించి పెనుబాము ఛేదించి,
గ్రక్కున కర్మాది రిపుల ఖండించి మృత్యువును
దిక్క-రించి కడు సూక్ష్మదీర్ఘ వీధినిజొచ్చి
చక్క-గా భూచక్రముపై సంచరించెడి జ్ఞానికి

ప॥ ఎక్కు- వేడవి? తక్కు-వేడవి? మన్మథు దొంగచిక్కు-లేడవి?
సొక్కు-లేడవి చిత్క-ళతో పిక్కటిల్లి
వెల్గులో నొక్క-డై యున్నవానికి
కల్ల లేడవి సొల్ల లేడవి! ॥ఎక్కు-॥

తెల్లమిగ బహురత్న దివ్యభూషలును ప్రబల
ఘల్లు ఘల్లున పరమ కన్య యెదుట చెలగి
జల్లున హేమపూలు జలజాక్షిపై నించ
పొల్లుబోని ముక్తి చాలబొంది మించుభోగికి! ॥ఎక్కు-॥

జన్మాదులకు మళ్ళ నేడాదిశెళ్ళ నేడాది
నిర్మల శాంతమనము ఉల్లములో
ముక్తుడై చల్లనై యున్నవానికి ॥ఎక్కు-॥

అగ్గలమానినదంబు నాలకించిమదిలోను
తగ్గక దివ్యామృతము తాలిమితోగ్రోలి బయట
దిగ్గున జగజ్జ్యోతి దీప్తులుతా వీక్షించి
ముగ్గురి స్వరాట్టునంటి ముందె కూర్చు యోగికి

నెగ్గు లేడవి సిగ్గు లేడవి కాలచక్ర నిమ్నత లేడవి
మొగ్గు లేడవి సుజ్ఞానదృష్టిని భగ్గున భూతేంద్రియంబులు
భస్మము జేయువానికి ॥ఎక్క॥
చతుర పదవులు మించి శీఘ్రముగ జ్ఞప్తిలోను
అతితుర్యమైయున్న ఆత్మనిధామము
మితిలేని భక్తితో మెరసి యవలోకించి
సతతము నద్వైతసౌఖ్య మందు ధీరునికి
మతము లేడవి వ్రతము లేడవి నిగమాది
విద్యలతతు లేడవి వినుతు లేడవి
ముజ్జగముల ప్రతిలేని శివతత్త్వభావమై యున్నవానికి ॥ఎక్క॥
మండలములు మీరిన పండు వెన్నెలబయట
మండుచున్న పరంజ్యోతి మహిమ చివ్వనమించి
అండగొనక పూదోట అఖిలాత్మగూడి యఖండ
తేజోసాక్షియై యుండు నిర్వాణికి
అండ యేడది దండ యేడది విలయాగ్నిచే మండ నేడది
గండ మెడచి కేవల యోగమే పండినిండి
నిరాలంబ పదమైయున్న వానికి ॥ఎక్క॥ —19॥



ఆదిత్యగ్నులును మీరి యాకాశపదముననను
అదిస్వర్ణ కంజమున నదిగోచరించున్
అదియు చిత్కిరణముల నమితమై ప్రబలుచును
అదియు నాపోజ్యోతి యంతమున మెరయన్
ప॥ అది యమృతకరము తుద నతితుర్యపదమగుచు
నదియు పరమాత్మడై నది సాక్షియగును ॥అ॥
అది వర్ణముల తుదను నగణితంబైయుండు
అదియు లో వెలినుండి అచలమై వెలుగున్
అది సుజనహృదయమున నాటలాడుచునుండు
నదియు వేదాంత మందకళంకమగును ॥అది॥

అదినాద బిందుకళలంటి ప్రబలుచునెపుడు
సదిదివ్యతేజమై యదిప్రకాసించున్
అది జ్యోతిపైనిలిచి అదియు నిర్లేపమగు
అదియు పూదోట నిజ అభవుడై మెరయున్ ||అది||—20

—: పూదోట విభుని గూడితిని :—

త్రివిధవర్ణములపై దినకరుని గతినెపుడు
దివిభువి మధ్యమున తేజరిల్లుచును
అవిరళంబుగ హృదయాభ్యంతరంగమున
వివరించ నిర్గుణుడు వెలుగుచుండగను

ప॥ కనుగొంటి నా మదిని కదసి ప్రబలుచు నెపుడు
దనరుమించిన గురుని తాను జేరితినీ ||కను||

పది వర్ణములమీరి ప్రణవ స్వరూపమై
ముదముతో నిర్భైట మొనసి ప్రబలుదునూ
అదిగో వెలిలోనుండి యానందమయుడునై
సదయుడై నాయెదుట సంచరించగను ||కను.|

అజహరి రుద్రులకు నరసిచూడగరాని
నిజసత్పదంబునై నిలిచి మెరయుచును
భజియింపగానట్టి బ్రహ్మంబు గనుగొనుచు
విజయమున పూదోట విభునిగూడితినీ ||కను||—21

—: చింతలన్ని మానినస్థిర సౌఖ్యపదము :—

పంచధారణచే ప్రళయాగ్ని రేచినందుకు
ఏమందురా! రామ ఏమందును

పంచశిరసుల భుజగి పరువెత్తినందుకూ ||ఏమందు||
పంచభూతేంద్రియములు భగ్నమైనందుకు ||ఏమందు||
పంచశుకములు తెరవు పై కెగసినందుకూ ||ఏమందు||

ప॥ అలచెన్ను మాయనే నధిగమించినందుకూ ॥ఏమందు॥
తలపులో పూదోట దాతనంటి నందుకూ ॥ఏమందు॥
సన్న బిలమునందు చనుదెంచి నందుకు ॥ఏమందు॥
సన్నిధి నున్నమాయ ఝుడిసి పారినందుకు ॥ఏమందు॥
తిన్నగా రసనాగ్ర దివ్య చక్రము దిరిగె ॥ఏమందు॥
కన్నుగొనల బ్రహ్మ కళలు గ్రమ్మిక ప్రబలె ॥ఏమందు॥
పట్టున రవి శశి కట్టుబడినందుకూ ॥ఏమందు॥
గట్టిగనాదము గగనవీధిన మ్రోఁదె ॥ఏమందు॥
అట్టెదివ్య చంద్రామృతమంటె నందుకు ॥ఏమందు॥
పట్టువిడుపులు చెదరి పరువెత్తినందుకు ॥ఏమందు॥
ఎక్కి త్రికూటముపై నెదుట తన్నూజూడ ॥ఏమందు॥
గ్రక్కున జ్వాలాబ్ధికడ స్వర్ణపద్మమున ॥ఏమందు॥
చక్కగ రవిమధ్య చంద్రులుదయించ ॥ఏమందు॥
నిక్కి నిరవయజ్యోతి నిలిచే చంద్రునిమధ్య ॥ఏమందు॥
అంతర్జ్యోతి తుద నమృతపదమైనందుకూ ॥ఏమందు॥
పంతముతోనే నస్పృథమైయుండినందుకు ॥ఏమందు॥
కంతుమీరి పూదోట రాముసంట ॥ఏమందు॥
చింతలన్నీమాని స్థిరశూన్యమైనందుకూ ॥ఏమందు॥—22

—: నిర్బీజమైన నిరవలంబము :—

అమితమగు బ్రహ్మమం దలరుచును నుదయించి
అరయ చిన్మయుడనై రామా!
అమరగా నమృతకాయముదాల్చి నిన్ను బాయకను
నిరతమును నేనుంటి రామా!
సమరసానందమున జలమధ్య జలజమున
చాపహంసగనేను రామా!
విమలమగుజ్యోతి పుంజంబగుచు నిర్భైట
వెలుగుచుండుదునె హే రామా!

ప॥ విన్నపము జేసెదను వినవయ్య నామనవి
విజ్ఞానపురుష హే రామా
నిన్ను నేనెరనమ్మి నే నీ స్వరూపమై
నిలిచి ప్రకాశింతు రామా ॥వి॥

నిజమైన కైవల్య నీరజాక్షినిమీరి
నిర్భైట మెలగుచును రామా!
అజహరీ రుద్రాదు లరసిచూడగరాని
యల నిరంజనుడనై రామా!
భజియింప వేదములు భక్త సంరక్షకా
బ్రహ్మమైయుందు నే రామా
సుజన హృదయాబ్జమున సుజ్ఞాన మయుడనై
సొంపు మెరయుదు నె హే రామా ॥వి॥

పరికించి సర్వజీవుల మహాప్రళయమున
ప్రణవ గర్భమున రామా!
విరివిగానుంచినే విమలాంబరమురీతి
విశ్వసాక్షిగ నెపుడు రామా!
స్థిరమైన పూదోట జితయోగి నినుగూడి
తేజరిల్లుదు నేను రామా!
నిరవలంబంబ నెడి నిజశూన్యతత్త్వమై
నిర్బీజమైయుందు రామా! ॥వి॥—23

—: బయలులో నిండితిని :—

అరసి దేహత్రయం బనిలుచే భేదించి
గరిమె జీవత్రయము గరిగించి వేడ్క
మఱియు గుణత్రయము మదిలోను నలయించి
పరగ మాతృక త్రయము ప్రణవమున గూర్చి

దశ శబ్దములఁ మ్రింగి తరలకను నిర్రైబ్బట
దిశలు భూనభమంటి తేజరిల్లుచును
విశదమగు పూదోట విభునిరూపమంటి
తత్త్వసి పదంబున కేవలాద్వైతమైతిన్ ॥సు॥—27



## పదియవ దళము

# అఖండస్వభావము




—: నిర్వికారుడగు పూదోట గురు చక్రవర్తిని :—

నినదంబుచే నిలయానిలుని దివిచియును
ప్రాణుని నాభిక్రింద తిరమును జేసి పామును
నొసర మీదికి దరిమి బెనచి రెంటిని క్రింద
కను వినుకు యూర్ధ్వ ముఖమును జేసినపుడు

ప! యిది తెలియ బ్రహ్మైక్య మిపుడు సిద్ధింపదే
ముదముతో వినరయ్య ముని ముఖ్యులారా! ||యిది||

గురుతైన ఘన పంచ కోశములు భేదించి
పరికించి త్రైవర్ణ పటలములు ద్రెంచి
అరసి యజ్ఞానమను సంబరము బోజిమ్మి
మెరసి యంతఃకరణావనిక ద్రుంచి వేడ్కన్ ||యి||
కలిత నాదము బిందు కళలపై లంఘించి
లలిత జ్ఞానావరణ ఘులరి గ్రెంటించి

చెలగుచు చిదాంబరము చించి నిర్భయలునై
అలసర్వ శూన్యమై నిలిచి వెలిగినను ||య||

కనుగొనగ సాకారమును నిరాకారమై
మొనసి కారణ కార్యములలోను జొచ్చి
తనరుచును తెరపి లేకను నిండి నభముగతి
యెనసి యేమిటి నంటకను ప్రకాశింతూ ||య||

నిరుపమ నిరాతంక నెరనిరంజనుడనై
నిరతిశయ నిర్లేప నిర్వికారమునై
సిరిమించు పూదోట గురుచక్రవర్తినై
పరమభక్తుల మదిని పాదుకొని మెరతు ||య||—1

—: నిరవలంబమై వెలిలో నిండియుందును :—

సుజన సంగతిని తా శోధించి తత్త్వముల
నిజగురుని మార్గమున నిలిచి వేడుకను
అజహరి రుద్రాదు లరసిచూడగ రాని
నిజ సత్పదంబునై నేవెలుంగుదునూ

ప॥ భ్రమరకీటకగతి పరమాత్మ ధ్యానించి
అమితమగు నిజశూన్యమై యుందు నెపుడూ ||భ||

జలమధ్యమున హృదయ జలజాంతరంగమున
కలితనాదము బిందు కళలాక్రమించి
మొలక నగవుల దివ్య మోహనాంగిని మీరి
తలపోయ శుద్ధచైతన్యమై యుందు ||భ||

ఎరుకగురునితో గూర్చి యెరుకలన్నియు మరచి
ఎరుకలకు మొదలైన యెరుక తానగుచు
పరికించ పూదోటపై నిరవలంబమై
అరయ వెలిలో నిండి మెరయుచుండుదును ||భ||—2

—: నాకన్న అన్యములేని అఖండమును :—

చించి వర్ణత్రయము చిన్నేత్రమును దెరచి
పంచ వింశతితత్త్వ ప్రకృతి పొలయించి
యెంచి చూడగను తా నేకాక్షరంబునై
మించి నిగమాంతమున మెరయుచుండుదును

ప॥ తనకన్న మదిలోను తలచ నెవ్వడులేడు
ఘనతరాఖండమై కడను ప్రబలుదునూ ॥తన॥

దివము రాత్రులుమీరి దేవనగమునిలచి
త్రివిధ వేదములకడ దేదీప్యమగుచూ
త్రివిధ మూర్తులనంటి దివిభువి మధ్యమున,
వివరించ తా నెపుడు వెలుగుచుండుదునూ ॥తన॥

అష్ట ప్రకృతులుమీరి యానందమయుడనై
నిష్ఠతో చిద్బైట నిలచి వెలుగుచునూ
యిష్టమగు పూదోటపై నిర్గుణుండనై
దృశ్య ద్రష్టల తుదను తా ప్రకాశింతున్ ॥తన॥—2౨

—: అన్ని దిశలూనిండియున్న ద్రష్టను :—

విజ్ఞాన నేత్రంబు విదితముగ దెరిచియును
అజ్ఞాన త్యాగమున ఆనందమునను
సుజ్ఞానమైనట్టి జ్యోతి స్వరూపమై
ప్రజ్ఞతో సహస్రదళ పద్మమున మెరతు

ప॥ పట్టైన సద్గురుని పరిపూర్ణ కరుణచే
కొట్టి దుర్గుణరిపుల ఘోష సేయుదును ॥ప॥

అష్టదిక్కులు నీలాంబరము లాముకొని
ద్రష్టనగుచు లోబయట తరలకను ప్రబలి
యిష్టమగు వేదాంత మేకాత్మసుండనై
నిష్ఠతో సమ్మతపద నియతమై యుండున్ ॥ప॥

సుగుణమై యున్నట్టి సుజ్ఞాన జ్యోతిపై
సగుణ నిర్గుణమైన సద్గురుని గనుచు
అగుణుడగు పూదోట యాత్మరాముని గలసి
నిగమగోచరమగుచు నిండి వెలుగుదును ॥ప —3

—: నే న మృ త రా సి ని :—

నేనె నిర్భయమైన నిర్గుణ బ్రహ్మంబు
నేనె నిజవస్తువగు నిర్లేపకుడను
నేనె మరియొకడు తుద నిలచి చూచిన లేడు
నే నిరంజనుడనై నే వెలుంగుదునూ

ప॥ రూఢిగా నా స్వస్వరూపమిది వినరయ్య
వేడుకతో జెప్పెదను విజ్ఞానులారా ॥రూ॥
నే నద్వితీయమగు నెరియ చిన్మయుడనై
నేనె నిర్వాణ కన్యనుగూడి చాలా
నేనె యఖిలమును నరనిమిషమున నిర్మించి
నేనె అన్నిటజొచ్చి నెరసి ప్రబలుదునూ ॥రూ॥
నేనె యీసాకార నికరములగు కవ్వాలను
నేనె నిరక్షరమగుచు నిష్కలంకుడనై
నేనె పూదోటపై నే సమృతరాసినై
నేనె ప్రకాసింతు నిర్వికారుడనై ॥రూ॥—4

—: సర్వసాక్షినైన అమృత శరధిని :—

ఆప మతములనిలను అరసిచూచినను
నిస్సారమంతేకాని సత్పదము లేదు
కోరిన నఖండైక్య సారమును శీఘ్రముగ
ధీమలకు సిద్ధించు స్థిరశాంతులారా!

ప॥ కనుగొనగ గురు వాక్యమున భక్తుడప్పుడె
తనరి సుస్థిర పూర్ణ తత్త్వమై నిలుచున్ ॥క॥

సాకార పదవులును సరకు సేయక వరనిరా
కారమైనట్టి లలిత నిర్గుణుడై
సాకారమగుచు నిరాకారమై యెపుడు
ఆకాశమును రీతి యమితమై వెలుగు ||క||
అరసి తెలియగను, బాహ్యాభ్యంతరములందు
మెరసి ప్రకాశించి నిర్వికారుడునై
పరికించ పూదోటపై సర్వసాక్షియై
నిరుపమానందామృత శరధియై ప్రబలు ||క||—5

—: విశ్వజాలము లెల్లనిండిన విమల చిన్మయుడను :—

అమిత జలకుంభముల నచలుడై దినకరుం
డమరి ప్రతి బింబములునై ప్రబలినటులన్
విమల చిన్మయుడనై విశ్వజాలములలో
క్రమముతో బహు జీవకరుడనై మెరతు
ప॥ సదమలానందమున సజ్జనులు విసరయ్యా
యిది తెలియ చిరముక్తి ఇపుడె సిద్ధించూ ||స||
దొరసి ఘటమఠము లందున నభముండు విధమున
అరయ బయటను గాడ్పు చరియించు పగిది
అరయగ నిరంజనుడనై ప్రకాశింపుచును
పరికించ సర్వమును ప్రబ్బికొనియుండు ||సద||
తలపోయ శుద్ధ చైతన్య పురుషునికినే
కొలది బెట్టగరా నగోచరుడ నగుచు
తలపు మరపులు మించి తరలక యఖండమును
తెలియ పూదోటకడ తేజరిల్లుదునూ ||సద||—6

—: మహాద్వైతమగు సర్వసాక్షి :—

అది సర్వశూన్యమును అది నిరాకారమును
అది నిర్వికల్పమును అది యగోచరమ్మూ

అది చిదాకాశమును అది నిరంజనుడునై
అది నిర్గుణప్రకృతియై వెలుగు నెపుడూ
ప॥ ఆ వస్తువై నేను అమితమై ప్రబలుచును
తావుకొని వరభక్త తతులమదినుందూ ॥౩॥
అది మూడురూపములు నఖిలమును నిర్మించు
అది కార్య కారణములై వరుసలోను
అదిలోను వెలుపలను ఆముక ప్రకాసించు
అది ప్రత్యగాత్మపై యమృతపదమగునూ ॥౪॥
అది క్షరాక్షరములై యది నిగమవేద్యమై
అది నిరక్షరమునై యకలంకమగుచు
అది పువ్వుదోటకడ నది మహాద్వైతమై
అది సర్వసాక్షియగు నచలాత్ములారా! ॥౫॥—7

—: సవికల్ప నిర్వికల్ప రహితుడను :—

నహి యర్ధదానములు నహి భోగమోక్షములు
నహి సుకృతదుష్కృతులు నహికర్మములును
నహి సంపదాపదలు నహిభావా ఽ భావములు
నహి ప్రకృతి వికృతియు నహి కపటములును
ప। తనుచు రూపంబులై తాప్రకాశింపుచును
అరయగ నిరాకారమై యుందు వినుడీ ! ।౧॥
నహిరె వర్ణాశ్రమములు నహిచిత్తచలనములు
నహి సర్వకల్పములు నహి నిర్వికల్పం
నహి యెరుక మరుపులును నహి నిందస్తుతులు మరి
నహి ప్రియా ప్రియములును నహికల్మషములూ ।౨॥
నహి సగుణములు పెక్కు నహి నిర్గుణంబదియు
నహి శుభాశుభములును నహి సర్వసిద్ధుల్
నహి జాగ్రత్స్వప్నములు నహి సుషుప్తితుర్యములు
నహిరె అంతఃకరణ నహి యింద్రియమ్ములు ॥౩॥

నహి సర్వమతములును నహి తృష్ణాతృష్ణలు
నహి యశను యశములు నహి మనోవృత్తుల్
నహి రాగద్వేషములు నహి జడాజడములును
నహి హితాహితవులును నహి హంకృతులునూ ॥త॥
నహి భేదవాదములు నహి సుఖాసుఖములును
నహి యాత్మ విమలాత్మ నహి జ్ఞానమజ్ఞానం
నహిరె పూదోట కడనయముతో వెలుగుచును
బహు దూరమైయుండు ప్రకృతి జనములకు ॥త॥—8

—: యోగ సమాధి రహితుడను :—

నహి యష్ట ప్రకృతులును నహివర్ణ మాతృకలు
నహి అంగవేల్పులును నహిశక్తి చయము
నహిరె నవకంజములు నామరూప క్రియలు
నహి దివారాత్రులును నహికాలగతులూ
ప॥ పరికించ యాసగుణ భావములు నేగాను
అరయ సుస్థిర శూన్యమయి ప్రకాశింతున్ ॥ప॥
నహిజీవుడు వర్తించు నాల్గు దేహంబులును
నహి ఈశ్వరుని వసుస నాల్గు గాత్రములు
నహిరాక పోకడలు నహిసర్వ యుగ్మములు
నహిబంధ ముక్తులును నహిద్వైమాయలును ॥ప॥
నహిశాస్త్ర జ్ఞానములు నహిసర్వలక్ష్యములు
నహినాల్గు పదవులును నహి మోద ఖేదము
నహిమంత్ర తంత్రములు నహి యష్టసిద్ధులును
నహిసర్వ కోర్కెలును నహిసంశయములు ॥ప॥
నహిసర్వవాసనలు నహిసర్వ శబ్దములు
నహిసర్వ తేజములు నహిసమాధులును
నహి సర్వయోగములు నహిపంచ ధారణలు
నహిసర్వధ్యానములు నాకవేమిటికి ?

నహిపూర్ణ జీవుడును నహి ప్రత్యగాత్ముడును
నహి బ్రహ్మకూటమియు నహి తన్మయమును
నహి పువ్వుదోట కడ నాడు నేడన కెపుడు
బహుదృశ్యములకు నే పై సాక్షినగుదూ ॥ప॥—9

—: ఆదిమధ్యాంతశూన్య ప్రకాశుడను :—

లేదు కాయత్రయము లేదు స్థానత్రయము
లేదు పురుషత్రయము లేదు శృతిత్రయము
లే దవస్థాత్రయము లేదు వర్ణత్రయము
లేదు బీజత్రయము లేదు గుణత్రయము
ప॥ మరి సర్వరూప నామక్రియలు నే గాను
నెర నద్వితీయమగు నిజశూన్యమగుదూ ॥మ॥
లేదు శక్తిత్రయము లేదీపణత్రయము
లేదు కారణత్రయము లే దజ్ఞత్రయము
లేదు కర్మత్రయము లేదు తేజోత్రయము
లేదు వాసనాత్రయము లేశమాత్రమునూ ॥మరి॥
లేదు నినదము బిందు లేదు బహుసత్కళల
లేదు అజ్ఞానమును లేదు విజ్ఞానం
లేదు చిద్రూపమును లేదు పూదోట తుద
ఆది మధ్యాంతశూన్య ప్రకాశుడను ॥మరి॥—10

—: సర్వవేద కారణుడను :—

నేనే నిర్భేద్యుడను నేనె చిన్మాత్రుడను
నేనే యీ సాంఖ్యమగు నిఖల రూపుడను
నేనే యన్నిటిజొచ్చి నేనంతరాత్మనై
నేనే ప్రకాశింతు నిర్వికారుడనై
ప॥ నేనే త్రివాసనలు నేమించి మెరయుదును
నేనే సత్సుఖమైన నిర్వాసనుడను ॥నే॥

నేనే నిగమాదులును నే సర్వయోగములు
నేనే నాదము బిందు నేనేసత్కళలు
నేనే స్వయంజ్యోతి నే శుద్ధప్రణవమును
నేనే యన్నిటికిని నే మూలమూను ॥నే॥
నేనద్వితీయుఁడను నే నిర్వికల్పుఁడను
నేనె నిర్లేపుఁడను నేనె నిర్గుణుఁడను
నేనె పూదోటపై నే సర్వసాక్షినై
నే నిరాకారుఁడను నిష్కళంకుఁడనూ ॥నే॥—1

—: స్వర్ణమందిర సుందరాంగుఁడను :—

కనుగొనఁ చిదాంబరంబను స్వర్ణగేహమున
ననుదినము రత్న సింహాసనముపైని
ఘననిరంజన లింగమను నాఖ్య గలిగినే
మనమలరగా నిరామయుఁడనై యెపుడూ
ప॥ పాదుక ప్రకాసింతు పరమజ్ఞానుల యెదుట
ఆదిమధ్యాంతశూన్య ప్రకాశుఁడనై ॥పా॥
పొలుపుమించిన దివ్య భూషణంబులువరుస
నిలిచి సర్వాంగముల నెరసి మెరయగను
తెలియు పచ్చపిశాటి తేజరిల సజ్జనుల
సొలయ మన్మథకోటి సుందరాంగుఁడనై ॥పా॥
మురియుచును నావద్ద ముక్తికన్యక యెపుడు
గరిమె విద్యుల్లేఖ గతి ప్రబలగాను
వరుసతో నుపనిషద్ వాక్యములు స్తుతిచేయ
పరమభక్తులుచుట్టు బలసి కొలువగనూ ॥పా॥
వినుఁడి నా వాక్యమును విమలాత్ములార మది
కినిసి సాకారాముక్తిని గోరవలదు
పనిబూని నిర్గుణబ్రహ్మపదమునుగూడి
జనన మరణములు లేక మెుససి నిలరయ్యా ॥పా॥

అలరు యోగుల కులంబను సుధారాశిపై
నిలిచి హిమకరుని గతి నే వెలుంగుచునూ
చెలగి పూదోట దేశిక చక్రవర్తినై
తలచ సుస్థిర శూన్యతత్త్వమై యెపుడూ ॥పా॥—13

—: చిదానంద శరధికావలి నిరాలంబము :—

అరయ పిండాండ బ్రహ్మాండముల వెలిలోను
భరితమయి పరమాత్మ ప్రబలుననుచు
సరగ సుజ్ఞప్తిచే స్వానుభవమున నే
నెరిగి సర్వము విడిచి నే బ్రహ్మ మయితి
ప॥ జలలిప్త మగు క్షీరములు హంసదావి ధర
సలిలములు విడుచు క్రియ శరణజనులారా! ॥జల॥
కలితమగు సర్వయోగములు భేదించి మది
తలచి నిగమాంత శాస్త్రములు శోధించి
అలరు విద్యావిద్య లాక్రమిం చవ్వలను
తెలసి అసి పదమునై తేజరిల్లుదును ॥జల॥
తరచు రూపములపై తారక బ్రహ్మమయి
మెరయుచు చిదానంద శరధిదాటుచును
అరదు పూదోటకడ సద్వితీయుండునై
నెరనిరాలంబమయి నే ప్రకాశింతు ॥జల॥—13

—: ప్రతిలేని నిర్గుణ బ్రహ్మము :—

అరయ నా నిజయోగ మాయాశబ్దమునను
నరుడు స్థావర జంగమాది జగములును
విరచితంబైన నేమెంసి యన్నిటిలోను
తరుచు జీవంబులై మెరసి ప్రబలుదును
ప॥ నిలిచి కైవల్యమున నిష్క్రియుడనై నేను
అలనిరంజన లింగమై ప్రకాశింతు ॥ని॥

అకలంకమైనట్టి యచలాత్మ్ముడును మాయా
చకితుడై వంర్తిచు చైతన్యునికిని
సకల రూపములపై సాక్షినై దివిరీతి
వికల మించుకలేక వెలుగు చుండుదును ॥ని॥
అతితుర్యమగు చిదానందాబ్ధి కవ్వలను
సతిగూఢమై యెపుడు నమృత పదమగుచు
మితిలేని పూదోట మీరుచు నఖండమై
ప్రతిలేని నిర్గుణ బ్రహ్మమై యుండూ ॥ని॥—14

—: నిరుపమ - నిరాకార - నిర్బీజస్వామిని :—

జనని కుక్షిలోనుండి చనుదెంచి మహినాదు
తను గుణంబుల వెంట తగిలి తిరుగకను
కనుదోయికెదుట నన్యకాంతలును నిల్వనే
తగ మాతృభావముగ తలచు వీక్షింతు
ప॥ శరణ జనులార నే సత్యముగ జెప్పెదను
పరికించ నిది విమల బ్రహ్మతుల్యంబు ॥శర॥
ధరపైని కనకంబు తలచ లోష్టంబును
సరగ రెంటిని నేను సమముగా జూతు
తిరిగి కుజనులు గొట్టి తిట్టి బాధించనే
పరమ సాత్వీకమున పరితాప మొందన్ ॥శర॥
సవికల్పమును మించి సగుణ నిర్గుణుడనై
శివయోగినై చాల జితవిషయుడనునై
వివరించి యవధూత వేషంబుగై కొనుచు
నవనిపై చరియింతు నతిముదంబునను ॥శర॥
బలసి వెలిలోపలను పరిపూర్ణ తేజమై
విలయాంబు రాశిక్రియ విరచితంబగుచు
అలసుచును నాదిమధ్యాంత శూన్యంబునై
నిలిచి యఖండమై నే ప్రకాశింతు ॥శర॥

అరయఁగ ననంతమై యానందమయుఁడనై
నిరవయ నిరాతంక నిరవలంబమునై
గరిమె పూదోటపై ఘననిరంజనుడనై
నిరుపమ నిరాకార నిర్బీజమగుదు ॥శరణ॥—15

—: సర్వాంతరాత్మను - సర్వ కళాధరుడను :—

అల నిరామయుడనై యతి తుర్యగాత్రమై
బలు స్వయంజ్యోతిగా ప్రణవ బీజమునై
తెలియ నాదము బిందు కళలు త్రిమూర్తులై
యలరు పిండాండ బ్రహ్మాండ నికరమునై
ప॥ అన్నియైగాక తుది యాకాశమునురీతి
యిన్నిటికి దూరమై నే ప్రకాశింతు ॥అన్ని॥
సర్వ చక్రంబులై సర్వ మాతృకలునై
సర్వవర్ణంబులై సర్వ వేల్పులునై
సర్వరూపంబులై సచరాచరంబులై
సర్వయోగములపై సాక్షినైయుందు ॥అన్ని॥
వేదబృందంబునై వేదాంతసారమై
ఆద్యనాదులనై అమృతాక్షరమునై
మోదమున పూదోట మూలబ్రహ్మంబునై
ఆదిమధ్యాంత శూన్య ప్రకాశుడను ॥అన్ని॥—16

—: అద్వితీయ నిరామయుడను :—

వినయ భయ భక్తితో విజ్ఞానులార మీ
మనమలర వినుడి యేకమని యెరిగింతు
తన స్వస్వరూపమును తథ్యముగ జెప్పెదను
ఘనులార. చిన్నే త్రమునను గనుగొనుడీ
ప॥ ఆది మధ్యాంత శూన్యప్రకాశుని నన్ను
మోదమున నిగమాంతముదిత యెరుగదుగా ! ॥ఆ॥

నెర చిదాకాశమగు నేత్రమున వీక్షించి
యరయ సర్వంబగుచు నద్వితీయుడనై
నెరయు వెలిలోపలను మెరసి దివి భువి దిశలు
తెరిపిలేకను నిండి తేజరిల్లుదును ||ఆది||

విలయ కాలమునాటి జలరాశికై వడిని
నలయుచు ననంతమై యమితమై యేను
వలసి పూదోటకడ వరనిరామయుడనై
తెలియ భక్తుల మదిని నిలిచి వెలుగుదును ||ఆది||—17

—: వేదాంత వేద్యమైన బట్టబయలును :—

నిరవలంబమను గురుడనై నిల్చి చిదానందమునను
పరికించ ప్రత్యగాత్మనై ప్రబలుచుందునె కొన్నాళ్ళు !
అరసి పిండాండ బ్రహ్మాండంబు లరనిముసమున నే నిర్మించి
నెరసినే పూర్ణాత్ముడనై మెరయుచుందునె కొన్నాళ్లు

ప. రూపనామక్రియలపై నిరూపమై నేయుందును ||రూ||

మలిన సతిని గలసిపేను మాయసంసారాబ్ధిలోను
వలసి మునిగి తెలివిదప్పి వరలుచుంటినె కొన్నాళ్ళు !
కులుకులాడి నెడబాసి గొడ్డుసతినిగూడ కవల
తలపు మరపులాక్రమించి తరలకుందునె కొన్నాళ్లు ||రూ||

ఆదిమధ్యాంత శూన్యమై యూనుకొని వెలిలోపలను
మోదమున నే బట్టబయలై మొనసియుందునె కొన్నాళ్ళు !
పాదుకొని పూదోటపై సర్వసాక్షిని యగుచు
వేదాంత వేద్యమై యేను వెలుగుచుందునె సతతము ||రూ||—18

—: నిరాకార సర్వాకారిని :—

నెర నిరకారమగు నిజగురుస్వామినై
సరస చిద్రూపమగు పరమభక్తుడనై
అరయ విజ్ఞానమను నమృతాంకురంబునై
సరస ప్రణవంబాది సర్వాక్షరములై

ప॥ వినుడి సజ్జనులార విశ్వతోముఖుడనై
పని లేక నిన్నిటికి పై సాక్షినగుదూ ॥విను॥

బలిమి నంబరమాది పంచభూతంబులై
కలిత ముప్పదియారు ఘన తత్త్వములునై
తలప సర్వాంగములదొరగు దైవతములై
అలర శృతిబృందమై యఖిలమును నగుచు ॥విను॥

అమితరూపంబులై యమిత నామంబులై
యమితమగు క్రియలునై సమిత గుణములునై
యమిత వస్తువులునై యమిత భోగంబులై
యమిత సంసారినై యచల నిష్క్రియునై ॥విను॥

సర్వమంత్రంబులై సర్వార్చకుడనునై
సర్వయోగంబులై సర్వధారణలై
సర్వలక్ష్యంబులై సర్వధ్యానంబులై
సర్వమునుగాక తుది సత్పదమునగుదూ ॥విను॥

తనరు పూర్ణాత్మనై తా ప్రత్యగాత్మనై
మొనసి నిర్గుణుడనై మూలబ్రహ్మమునై
కనుగొనగ పూదోటకడ యద్వితీయమై
ఘనత సహజానందమున వెలుంగుదును ॥వి॥—19

—: జ్యోతిర్మండలాంతమున నిర్బీజము :—

మోదించి ప్రణవమును మొనసి యమృతముగ్రోలి
శోధించి వాకిటనుజొచ్చి మెరయగను
సాధించి త్రిపురములు సద్గురుని కృపనునే
భేదించి కుండలిని బిందునెగమీటి

ప॥ ఆనందమున గురుని నంటి తన్మయమునను
తానన్నయోగి నిజతత్త్వమై వెలుగున్ ॥ఆనం॥

అష్టపురముల తుదను నమృత స్వరూపమై
యష్టదళ పీఠమున నంటి ప్రబలుచును
నిష్టతో దృష్టితుద నిలిచి చిత్రితములై
సృష్టిలోపల జొచ్చి చెలగి వెలుగుచును ॥ఆనం॥

పండువెన్నెల బయట పరిపూర్ణతేజమై
మండుచుండెసి జ్యోతి మండలాంతమునన్
నిండు పూదోటలో నిజగురుని తానంటి
పండి నిర్బీజమై బయట మెరయుచును ॥ఆనం॥—20

—: పరమాణు ముఖకళలతో బ్రహ్మాండములు నిర్మింతును :—

మోనమున నేనున్న మూల మతిగూఢమగు
వాద భేదములేని స్థానమనియగును
పాదుకొని నిర్గుణ బ్రహ్మమై వెలిగినే
నాది మధ్యాంత శూన్యప్రకాశుడను

ప॥ ఇది స్వానుభవార్థ మెరిగింతు వినరయ్య
యిది తెలియ సత్పదంబిపుడె సిద్ధించు ॥ఇ॥

పరమాణు ముఖకళను బ్రహాండములు పెక్కు
వరుసతో నిర్మించి యొక్కనిముషమునన్

నెరచి దాకాశమై నిండి వెలిలోపలను
నరయ ప్రత్యగాత్మనై ప్రకాశింతూ ॥ఇ॥

ఆకారమై తనరు నఖిలంబు మీరుచును
నే నిరాకారమై సాకారమగుచు
యేకార్ణవమురీతి నేను పూదోటకడ
నాకాశమును పగిది సమితమైయుందు ॥ఇ॥—21



11 వ దళం

# జీవన్ముక్తి (సేవాయోగం)




—: అఖండ వేదపురుషుడు, చిన్మయమూర్తి :—

ఏనె భూతములైదు యేనె పవనంబులును
నేనె యింద్రియ నికర మేనె విషయములు
ఏనె అంతఃకరణ మేనె మాయ యమాయ
ఏనె జీవుడ నివి యిన్నియునుగాను

ప॥ నేను చిన్నేత్రమున నిలిచిచూడగ బయట
నేనె సుస్థిర శూన్య తత్త్వమై యుండు ॥నేను॥

నేనె నవకంజములు నేనె స్వరంబులును
నేనె మాతృకతతులు నేనె వర్ణములు
నేనె శక్తులువరుస నేనె దైవతములు
నేనైదు భూతములు నిన్నియునుగాను ॥నేను॥

నేనమిత రూపములు నేనమితనామములు
నేనమిత క్రియలు మరి నే చరాచరముల్

నేనె శృతులాదిగా నే సర్వవిద్యలును
యేనె స్రష్టాగ్నులును నేనన్నిగాను ॥నేను॥

నేనె నది నిధులుమరి నే పుణ్యక్షేత్రములు
నేనె మంత్రార్చనలు నేనెవేల్పులును
నేనె యోగముధ్యానమేనె సలక్ష్యములన్ని
యేనె చిత్రితములేనె యిన్నియునుగాను ॥నేను॥

నేనె ప్రణవము మొదలు నే సర్వశబ్దములు
నేనె విజ్ఞానమును నేనె విమలాత్మన్
నేనె పూదోటకడ నేనిరాకారుడను
నేనె యిన్నిటిపైని నే సర్వసాక్షిన్ ॥నేను॥—1

—: అ ఖ ం డ వి రా ట్జ్యో తి :—

పంచభూతవికార పంచకంబులు నేను
పంచ జ్ఞానేంద్రియంబులు పంచేంద్రియములు
పంచ వాయువులు విషయ పంచకంబులునసల
పంచకము జీవతత్త్వ పంచకము మరియు

ప॥ అన్ని చిద్వ్యోమమున నంటగూర్చక మరియు
చెన్ను మెరయుచు జ్ఞప్తి స్థిర నృత్యమాడు ॥అన్ని॥

పంచ వింశతితత్త్వ ప్రాపంచజాలమును
అంచితంబుగ ముప్పదియారు మాత్రలును
పంచ వ్యోమంబులును పంచ నవ దేవతలు
పంచ పంచ ధ్వనులు పంచ వర్ణములు ॥అన్ని॥

కాంచ నద్భుత తేజో కళలు చివ్వనమీరి
పొంచి సుజ్యోతిపై పూదోట గురుని
అంచితంబుగగూడి యమృతస్వరూపమై
మెంచి సర్వైటనే మించి వెలుగుదును ॥అన్ని॥—2

—: కాలాతీత నిరవలంబను :—

నేను నీవను భేదబుద్ధి నాకేలయుండును
కాను పంచాపంచకంబును కానువాతములు
కాను వర్ణబీజములు కాను యింద్రియములు
కాను సర్వాంగవేల్పులును నేను నిర్లేపుడను

ప॥ ఏటి ధ్యానము బ్రహ్మమందు నాకేటి కూటమి
సాటిలేని నిరవలంబ సద్వస్తునై నేను ॥ఏటి॥

నేటుగ నిరాకారమైనిల్చి నే మెరయుచును
ఏల నావంటివానికి తనువులు చాలు చాలంటి
నాలుగు పదవుల భోగము లొల్లనంటి
కాలవశముచేత నిన్ని గ్రాగి పోవగంటి ॥ఏటి॥

తాలిమిసుస్థిర శూన్యతత్త్వమై నేనుంటి!
ఏమిసేతును సేసువాలు నాకేమి లేవుగా!
నామ రూప క్రియలలోను నటియించి యవ్వలను
కోమలమైన వరముక్తి రామామణికి తుదను
నేమమలర పూదోటపై సిరిమించి ప్రబలుచును ॥ఏటి॥—3

—: సగుణ నిర్గుణ సాక్షి :—

ఇలను వర్ణాశ్రమాదులును తత్త్వనికరమును
సల వర్ణమాతృకలు సంగవేల్పులును
కలిత నవచక్రములు గడచి తీవ్రత నేను
తెలిసి నాదము బిందు కళలాక్రమించి

ప॥ నిగమాంతసారమగు నిర్వాణసతికవల
సగుణ నిర్గుణములకు సాక్షినై యుందూ ॥నిగ॥

సర్వ శాస్త్రంబులును సర్వ నిగమాదులును
సర్వసిద్ధులు ఘనత సాకార పదవుల్

సర్వయోగంబులును సర్వ లక్ష్యంబులును
సర్వ ధ్యానంబులును సరిమించి యేను ॥నిగ॥
వినుడి సాత్వీకులై వీక్షించు భక్తులకు
మనమలరగాను చిన్మండలముపైని
యొనర పూదోటకడ వరనిరంజనలింగ
మను నాఖ్యగలిగినే తనరి వెలుగుదునూ ॥నిగ॥—4

—: అణువున పరమాణువు మహత్తుకు బృహత్ :—

వరుస ముప్పదినారు వరతత్త్వములు శృతులు
మరియంగ దివిజులును మహదాది జగముల్
వరుస నవకంజములు వర్ణమాతృక తతులు
నరయ సచరాచరములై ప్రకాశింతు

ప॥ శరణ జనులార నాచర్య జెప్పెద వినుడి
నెరసి యన్నియుగాక నిర్గుణుడనగుదు ॥శ॥
అరయ విద్యుల్లేఖ యర్కేందు శిఖరీతి
తెలియ నక్షత్ర సుస్థిర దీపగతిని
కలితనీవార శూకముక్రియను సూక్ష్మమై
తలప నణుతుల్యమై తా వెలుంగుదును ॥శ॥
సర్వసద్భక్తులై సర్వయోగంబులై
సర్వలక్ష్యంబులై సర్వధ్యానములై
సర్వమై పూదోట సరిమించి యెప్పుడును
సర్వసాక్ష్యంబునై సాక్షినై యుందూ ॥శర॥—5

—: నే నఖండ పరబ్రహ్మమును :—

నేనె విరాట్కాయము చిత్రితములు నేనె నవచక్రంబులు
దళములు
నేనె వర్ణమాతృక నికరంబులును నేనెపంచకోశములు
సవిద్యయు

నేనె యనిలదశకము త్రైశక్తులును నేనె
అష్టదిక్పతులు మనువులును
నేనె జంగమ స్థావరంబులును నేనె
రూప నామక్రియల నేనె యలరుదును

ప॥ నేనే బ్రహ్మమురా! సత్యము నేనే బ్రహ్మమురా! ॥నేనే॥
వెలుపలలోపల నేనే ప్రబలుచు నేమిటినంటక ॥నేనే॥
యేనే బ్రహ్మముసిద్ధము నేనె నిరంజన యోగినిగట్టిగ ॥నేనే॥
నేనె అష్టసిద్ధులు మణిమంత్రము నేనె గానవిద్యలు
నిగమాదులును ॥నేనే॥
నేనె రుషులు నిర్మల మునిబృందము నేనె యోగచర్యలు
త్రైవేల్పులు ॥నేనే॥
నేనె బిందు నినదము సత్కళలును నేనె యుపనిషద్
వాక్యసమూహము
నేనె యోగవిద్యను పరమామృతము నేనె యాత్మా
ప్రత్యగాత్మలపై ॥నేనే॥
సర్వ దృశ్యములై కాకను నేనె సర్వాకారుడ నిష్క్రియుడను ॥నేనే॥
నేనె నిరాశ్రయ నిష్కళంకుడను నేనె నిరాకారము
నిర్లక్ష్యము ॥నేనే॥
నేనె నిరాభాసము నిర్ద్వంద్వము నేనె నిరవలంబము నిర్బీజము॥నేనే॥
నేనె పుట్టుదో టవ్వలనెప్పుడు నేనె అఖండంబై
వెలుంగుదునూ ॥నేనే॥—6

—: నేనే నిర్బయలు మరి నే మహాద్వైతమును :—

నేనె బహుసాంఖ్యమును నేనె తారకము తుద
నేనె యమనస్కమును నే పరాత్పరుడన్
నేనె చిద్రూపుడను నే పరమపురుషుడను
నేనే క్షరా క్షరము నే నిరక్షరము

ప॥ గురుసుతులు వినుడి ! నిర్గుణ బ్రహ్మసారమిది
పరికించ నా పలుకు బహు సత్యమగును ॥గురు॥

నేనె నిర్ద్వంద్వమును నే నిర్వికారుడను
నేనె నిష్క్రియుడ వర నే నిరాశ్రయుడ
నేనె నిస్సంగుడను నే నిష్కళంకుడను
నేనె నిర్భేద్యుడను నేనె నిరవయుడన్ ॥గురు॥

నేనె నిర్లేపుడను నేనె నిరాంతకమును
నేనె నిర్మోహుడను నే నిగమవేద్యున్
నేనె నిర్వాసనుడ నే నిరాభాసకుడ
నే నిరాపేక్షకుడ నే నగణితమునూ ॥గురు॥

నేనె నిర్లక్ష్యమును నేనె నిర్బీజమును
నే నద్వితీయుడను నేనె నిర్భైలు
నే నిర్వికల్పుడను నే మహాద్వైతమును
నే నమృతరాసిమది నే నిరంజనుడన్ ॥గురు॥

నేనె వెలిలోపలను నే సర్వవ్యాపకుడ
నే ననంతంబగుదు నే కదలకెపుడూ
నేనె పూదోటకడ నే నిరవలంబమై
నేనె వెలుగుచునుందు నిఖిలసాక్షినగుచూ ॥గురు॥—7

—: పరిపూర్ణ దేవుడు :—

తానె సర్వమునాదు తలపోయ వెలిలోను
తానె పరిపూర్ణమై తరలకెప్పుడును
తానె ముజ్జగములకు తానె బహు దూరమై
తానె వెలుగుచునుండు తత్త్వజ్ఞులారా !

ప। చాటించి చెప్పెదను సత్యమగు నాపలుకు
పాటించి వినరయ్య భక్తకోటులును ॥చా॥

తానె నిగమాంతమున దనరు నిర్గుణసత్తిని
తానె సమకూడుచును తరలకెప్పుడునూ
తానె నతితుర్యమగు తారకబ్రహ్మమై
తానె మెరయుచునుండు ధర్మాత్ములారా ॥చా॥
తానె నిస్సంగుడను తా నిర్వికల్పుడను
తానె యకలంకుడను తానగోచరుడన్
తానె పూదోట తుది తా మహాద్వైతమై
తానె కేవల శూన్యతత్త్వమై యుండూ ॥చా॥—8

—: జనన మరణ ఎరుక మరుపు సమాదీ రహితుడను :—

నహిపంచ భూతములు నహి యష్ట ధాతువులు
నహి యనిల పంచకము నహి యాకుస్థలముల్
నహి దశేంద్రియములు నహి దివిజ బృంద మును
నహిబీజ వర్ణములు నహి త్రి హంకృతులు
ప॥ అలరి నే నాది మధ్యాంత శూన్యంబైన
అలనిరంజన లింగమై వెలుంగుదును ॥అల॥
నహిసప్త వ్యసనములు నహిషష్ఠ చోరకులు
నహి త్రివిధ మోహములు నహిగుణత్రయము
నహిషష్ఠ వహ్నులును నహి త్రివిధమలములును
నహి యేడవస్థలును నహి గమనములునూ ॥అల॥
నహి స్నాన సంధ్యలును నహిశుచి యశుచులుమమరి
నహిజపతపంబులును నహిశిలల పూజల్
నహిపుణ్య పాపములు నహిస్వర్గనరకములు
నహి జననమరణములు నహిశుచి యశుచులును ॥అల॥
నహి సమాధులు పెక్కు నహి త్రివిధబంధములు
నహి రేచకము బలిమి నహి పూరకమును
నహి కుంభకమును వర నహి నికుంభకమును
నహిమనోధారణలు నహి ముద్రలైదు ॥అల॥

నహి నాద దశకమును నహి సుధామృతకళలు
నహిధ్యాన ధ్యేయములు నహి యమలజ్ఞప్తిన్
నహి ఎరుక మరపులును నహిపువ్వుదోట వెలి
మహిమమీరుచు నిరామయుడనై యుందూ ॥అల॥—9

—: నేనే పరబ్రహ్మమును :—

తలపు మరపులు మించి తాశూన్యతత్త్వమై
అల పరబ్రహ్మమై యమృతుండ నగుచూ
తెలియ నిష్క్రియుడనై తేజరిల్లుచు నెపుడు
తలచి బ్రహ్మైక్యమును తథ్యముగ నేనూ

ప॥ అరయ సంశయము నాకణుమాత్రమును లేదు
పరిశుద్ధులార నా పలుకు సత్యము నా ॥అర॥
సర్వమును నేనయై సచ్చిదానందమున
సర్వమును నేగాక సర్వదంబగుచూ
సర్వమునకును మూల సారమగు కందమై
సర్వ శూన్యమున నిజసాక్షినైయుందూ ॥అర॥
ఆది మధ్యాంత శూన్య ప్రకాశుడనునై
పాదుకొని విజ్ఞాన ప్రజలమదిలోను
ఏదిక్కు జూచినను నేనయై పూదోట
మీద నెప్పుడు నిలచి మెలగుదును వినుడీ ॥అర॥—10

—: ముక్తి సతీసేవిత నిరంజన లింగదేవుడను :—

సిరిమించు నవరత్న సింహాసనముపైని
అరయనే యోగపట్టాభిరాముడనై
ధరమీద సజ్జనులు మెరసి చుట్టునుగొల్వ
పరమ శాంతుల చూచి చిరునగవుతోను

ప॥ అలరి సాంఖ్యము తారకామనస్కముచాల
నలసినేకృపసేతు వరభక్తులకునూ ॥అల॥

యిన చంద్ర తేజములు యిసుగడల ప్రబలగను
మొనసి శృతి బృందములు మ్రొక్కిస్తుతి సేయన్
పని బూని నిర్వాణ పడతి సేవించనే
తనరి ప్రకాశింతు ఘనులు జూడగను ॥అలరి॥
తలపులకు దూరమై తా సర్గుణుండనై
అల నిరంజనలింగమై వెలుంగుచునూ
నిలిచి పూదోట తుద నే శూన్యభావమై
బలసి వెలిలోపలను ప్రబ్బికొనియుందూ ॥అలరి।—11

## —: సర్వ జగన్ని ర్మాణ ద్రష్ట ను :—

జగములును నిర్మింతు సంపూర్ణముగ నేను
జగములకు వెలిలోను చాల ప్రబలుచును
జగములకు దూరమై సర్వసాక్షినియగుచు
జగములును నాశూన్య జఠరమై వెలుగున్
ప॥ నేనె ఇన్నియుగాక నే నిరామయుడనై
నే నిరాలంబమగు నిజవస్తువగుదున్ ॥నేనె॥
వనర నేనున్న తావును మహా గూఢమగు
కన లేరు సురలు మునులు త్రిమూర్తులునూ
వినుడి శృతి శాస్త్రములు విమలగాయిత్రి నా
ఘన స్వస్వరూపమును కని కాన లేరూ ॥నేనె।
పరమ సాకార చిత్పథమునై మిగిలితుద
కరతలామలకముగ కనుపడుదు నెపుడున్
నెరయ నిర్లేపులగు నిజభక్తవరులునను
పరికించ పూదోటపై ప్రకాసింతూ ॥నేనె —12

## —: అనంత విశ్వమూర్తిని :—

నేనె భూతములైదు నేనష్ట దిక్కులును
నేనె భూచరములు నే జలచరములు

నేనె ఖేచరములు నేస్థావరంబులును
నేనె యాత్ముఁడనాత్మ నేక్షరాక్షరముల్

ప॥ అన్ని నేనై కాక యద్వయా నందమున
యిన్నిటికి ద్రష్టనై నేగూఢమగుదున్ ॥అన్ని॥

నేనె కర్తను భోక్తను నేనె త్యాగిని భోగి
నేనెశృతి శాస్త్రిములు నే పురాణములు
నేనె యోగంబులును నేధ్యానధారణలు
నేనె త్రైలక్ష్యములు నేనిష్క్రియుఁడను ॥అన్ని॥

నేనె నాదము బిందు నిజమైన సత్కళలు
నే నవిద్యను విద్య నిర్వికారుఁడను
నేనె పూదోటవెలి నిశ్చల నిరంజనుఁడ
నేనె భక్తులమదిని నిలిచి వెలుగుదును ॥అన్ని॥—13

—: తనకన్న వేరు లేని తత్త్వమూర్తిని :—

తానె ముప్పదియారు తత్త్వ నికరంబులును
తానె నవకంజములు తరచు రేఖలును
తానె యేబదియొకటి తలపోయ మాతృకలు
తానె సర్వాంగముల తనరు దేవతలు

ప॥ ఇన్నియును నేనె నాకన్న లేశములేదు
అన్నిటి కనతిదూరమై వెలుంగుదును ॥ఇన్ని॥

తానె అంగత్రయము తానె స్థానత్రయము
తానె వేదత్రయము తానె వర్ణత్రయము
తానె అక్షరత్రయము తానె జీవత్రయము
తా నవస్థాత్రయము తా శక్తిత్రయము ॥ఇన్ని॥

తానె త్రిగుణములును తానె త్రిమూర్తులును
తానె త్రైహంకృతులు తా బింమత్రయము
తానె త్రైవాసనలు తానె నిర్వాసనయు
తానె పూదోటవెలి తా నిరామయుఁడున్ ॥ఇన్ని॥—14

—: పరమస్వరాట్టగు ఖండాఖండ స్వరూపుడను :—

పంచాంగమున శక్తి పంచకము నిర్మించి
పంచ వింశతి తత్త్వ ప్రకృతి రూపమగుచూ
పంచవర్ణములపై ప్రణవ స్వరూపమై
ఎంచి సర్వమునంటి నే వెలుంగుదునూ

ప॥ మరియు నాపోజ్యోతి మధ్యమున చెదరకను
నిరుపమానందమున నిండి వెలుగుదునూ ॥మరి॥

దృష్టి ద్వయంబుపై తెలిసి త్రికూటమున
సష్టదళ పీఠమున నంటి యెప్పుడునూ
యిష్టలింగంబునై ఏకాక్షరంబునై
వష్టనక్షులపైని శాంత తేజమునై ॥మరి॥

త్రివిధ పదముల జగతి తీవ్రముగ నడుపుచును
త్రివిధ వేదములకడ స్థిరము తానగుచూ
త్రివిధ నేత్రముల తుద దివ్య నేత్రుడ నగుచు
త్రివిధాక్షరములంటి దీపింతు నెపుడూ ॥మరి॥

స్థిర భూతిరసము తన దేహమున వెలుగొంద
పరిపూర్ణమగు జ్యోతి భవనంబు కడనూ
పరమహంసై నేను బయలు లోపల చెలగి
పరమ తారక మనెడి బ్రహ్మంబు నగుచూ ॥మరి॥

పండు వెన్నెలబయట పరమస్వరాట్టునై
నిండు చిత్కిరణముల నిలిచి వెలుగుచునూ
అండగాని పూదోట యాత్మరామునిగూడి
ఖండము నఖండమై కడప్రకాశింతున్ ॥మరి॥—15

—: సర్వభూత వ్యాపకుడను అమృతకాయుడను :—

పరమ హంసనునేను బ్రహ్మంబు ముఖకళను
అమనుగా జన్మించి యమృతకాయుడనై

మరియు నాపోజ్యోతి మధ్య నద్భుతముగా
పరమ పదమున నెపుడు ప్రజ్వరిల్లుదునూ

ప। మృత్యువును దరిమి యర్మిలి మూలసౌధమున
నిత్యశాంతుడనగుచు నే వెలుంగుదునూ ॥మృ॥

త్రివిధ కాలంబులును త్రివిధ స్థలంబులును
త్రివిధ వర్ణంబులును త్రివిధమాతృకలున్
త్రివిధ గుణములు మరియు త్రివిధమూర్తులు శృతులు
త్రివిధ జీవములపై తేజరిల్లుదునూ ॥మృ॥

సగుణ నిర్గుణుడనై సర్వభూతములలో
సుగుణవృత్తిని చాల జొచ్చి వెలుగుచునూ
నిగమగోచరుడనై నిర్భైట మెరయుచును
అగుణమగు పూదోట యాత్మరాముడనై ॥మృ॥—16

—: శుద్ధమగు బయలయ్యు అనంతరూపుడను :—

బయలైనే నిలిచి యుందునమ్మా
నాబయలునందు పరమ భక్తుడు వెడలునమ్మా
బయలు బయలునే పరికించంగ
నిర్భయలు నిరంజన బ్రహ్మంబగుదును

ప॥ ఎంత యద్భుతము వినవె కొమ్మా! ఔరౌర!
నాయంతవాడు లేడె యోకొమ్మా! ॥ఎంత॥

శాంత తేజమై అంతయునేనై
ఆముక ప్రబలుదు ॥ఎంత॥

రూప నామక్రియ లగుదునమ్మా
రూపులలోను రూఢిగను నే దీపింతునమ్మా
రూపుచూపులకు రూపై మెరయుచు
రూపులతో దను నిరూపుడనౌదును ॥ఎంత॥

మూడుపదవులగుదు నోయమ్మా
　మూటికి నాది మూలమై విలసిల్లుదునమ్మా
మూడు రెండు పదవులు మీరుచునే
　వేడుకతోడుత వెలుగుచునుందుదు ॥ఎం॥

ముక్తి దాతనై యుందునమ్మా
　వరశూన్యపదము భక్తులకునే నొసగుదునమ్మా
యుక్తిదనర నిజయోగినగుచు
　విరక్తుడనై నే రసికుడ నగుదును ॥ఎం॥

నిరవలంబనై యుందునమ్మా
　గూఢమై యెపుడు నిర్వికారమై యుందునమ్మా
మెరసి ఎపుడు పూదోటకునవ్వల
　నరయగ సహజా నందుడ నగుదును ॥ఎం॥—17

—: చింతారహితులైన గురు సేవకులు :—

పంచేంద్రియములచే పట్టుబడనివారము
వంచన లేక సద్గురునివద్దనే క్రీడింతుము
సంచితంబులుమాన్ప సద్గురుని గొల్తుము
చింతలుడిగి గురుని సేవలూ జేతుమూ

ప॥ రామయోగి వారము రసికులమై యుందుము
నామ రూపక్రియలుమించి నటన సల్పుచునుందుము ॥రామ॥

గురుకర జాతులలో కూడియుండువారము
సరసిజనేత్రుని దివ్య చరణసేవ జేతుము ॥రామ॥

నాలుగు పదవులు నగుచు దాటినవారము
కాలములుమీరి ముక్తికన్యనుగూడి యుందుము ॥రామ॥

చేష్టలేనివారము గురునిష్ట చెదరకుందుము
ద్రష్టలగుచు జ్యోతిపై పరమ తారకమగుచు నుందుము ॥రామ॥

అరయ నపవర్గమునందు నచ్చుతాక్షరమై యుండుము
గురువైన పూదోట గురుని కూడి యుండేవారము ॥రామ॥—18

—: సర్వకళారహితుడు సర్వలక్ష్యరహితుడు :—

కుడియెడమ బంధించి చలనాహి వెడలించి
తడబడక సర్వతత్త్వముల మించియును
నడిమి వాకిలి జొచ్చి నయనాగ్రమున గురుని
యెడ తెగని భక్తిచే యెనయ వీక్షింపన్

ప। ఇదియు జీవన్ముక్తి యెంచగా మదిలోను
చెలగి చిదాత్ముడై నిలచి మెరయగను ॥ఇ॥

మెరసి దినకరు నిందుమించి పంచవర్ణముల
అరయ లోబయట నిజాబ్జాంతమునను
పరిశుద్ధ బిందువది స్ఫటిక భాండములోన
స్థిరముగా కర్పూరదీపగతి వెలుగున్ ॥ఇ॥

అలరి స్థావర జంగమాదులను దీపించి
కళలమించిన జ్యోతికళి కెతుదను
బలిమైన పూదోట పరమ యోగినిగూడి
తెలియ నిర్లక్ష్యమై తేజరిల్లగను ॥ఇ॥—19

—: ఆనంద మయుడగు అర్భకుడను :—

ఎనసిక్షీరోదకము లేకమై యున్నట్లు
మనసు వాయువు గూడి మర్మవీథిన్
చనుచు నంతనె లేచి సర్వతత్త్వములతో
ఘన చిదాకాశమున కలిసి తానిలిచినను

ప॥ అల సర్వయోగముల నాయాస మేటికిని
తెలివిలో తన దివ్య రూపంబుగనిసన్ ॥అల॥

గురుయోగ శిద్ధుడై కుజన సంగతి బాసి
మరిసృష్టిలో యోగమహిమ జూపకను
అరయగ నిరాశుడై ఆనందమయు డగుచు
తిరుగు నర్భకురీతి పరులు మెచ్చగను ॥అల॥

తెలియ వెన్నెల బయట దీపించు సహస్రదళ
జలజమధ్యను జ్యోతి చవికెలోపలను
అరయ పూదోట కడ సద్వితీయునిగూడి
నిలిచి నిర్లక్ష్యమై నే వెలుంగుదును ॥అల॥—20

—: సచ్చిదానందాఽతీతుడు :—

బాధించి కుండలిని పరగనూర్ధ్వము జేసి
వేధించి మర్మబిలవీధి జొచ్చియును
శోధించి శశిమధ్య జ్యోతికరమున వాయు
సాధించినను ప్రాణసమర సంబగును

ప॥ ఇది బ్రహ్మతుల్యమగు నెంచగా జనులార
విదితముగ నిదితెలియ విజ్ఞానియగును ॥ఇది॥

చిత్త పీఠముతుదను శ్రీగురుని ధ్యానించి
సత్తు చిత్తానంద సంజ్ఞలును మీరి
హత్తి ప్రణవమునందు నంటగూర్చిన మనసు
చిత్తముడిగిన బింధుమాత్ర సమరసము ॥ఇది॥

బలిమి సాహస్రదళ పద్మాంతరంగమున
నిలిచి స్వయంజ్యోతి నేర్పుతో మీరి
అలరు పూదోట తుద నాత్మరాముని పదము
వలసి కలసినను జీవన్ముక్తి యగును ॥ఇది॥—12

—: ముగురు మూర్తులమించిన పరిపూర్ణ దేవుడు :—

ముగురు మూర్తులమించి కొమ్మా!
అతడు మూలమేడను యుండునమ్మా!
సగుణ నిర్గుణమైన కొమ్మా!
సర్వసాక్షిని నే గంటినమ్మా!
పగలు రేలునుమీరి పద్మాంతరంగమున
అగణితమైనట్టి యాత్మరామునిగూడి
ప॥ ఇక నేమిసేతునే కొమ్మా। రాము నెడబాయగా లేను గాదమ్మా
అంగన! విను మంతరంగమున నన్నెపుడు
పొంగుచు లాలించు పుణ్యాత్ముని గూడి ॥ఇక॥
పలుకుల వలపించునమ్మా! యతడు భాషించి ననునేలు నమ్మా
నిలిచి వీక్షించగా కొమ్మా! అతడు నిగమాంతమున
ప్రబలు నమ్మా
పొలతి వినవే మంచి పూదోట చవికెలో
అల్లరాముని నేను గలసి పాయగ లేను ॥ఇక॥
అరసి తెలియగాను కొమ్మా! అత డద్భుతమై యుండునమ్మా!
తెరిపిలేకను నిండికొమ్మా! బయట తేజరిల్లుచు నుండునమ్మా!
పరిపూర్ణమందు సుస్థిరుడైన పూదోట గురుడు జీవన్ముక్తి
కరుణించెనమ్మా ॥ఇ॥—22

—: ముక్తిభావమున భక్తితో గురుసేవ జేయుము :—

చేరబోము కుజనులను శాంతులనే గూడియుందుము
ఊసువిడచి కైవల్యమున నునికి జేసినవారము
గురుని దివ్యబోధరీతి జ్ఞానమార్గ వర్తులము
ముక్తి భావమున భక్తితో గురునిసేవ జేయుదుము
ప॥ మంత్రములవారము మేము మంత్రములవారము హా
తంత్రముల ప్రమంతుము మంత్రములో వెలుగుచు
పరతంత్రమైనవారము ॥మం॥

రెంటి నంటి రేతుము యొంటి త్రోవనడుతుము
కంట తారవింట బయట నంటియుండువారము ||మం||

కామాది దుర్గుణముల ఖండించి మెలగుదుము
హేమ జ్యోతి తుదనునేము నేకాక్షరి నుందుము ||మం||

మూడు యిండ్ల మూలమై మూటి నంటకుందుము
మూటి రెంటిరోసి మేము మూటిమీద యుందుము ||మం ||

వేదమూలమై వేదాంతమైనవారము
పాదుకొని పూదోటరాముని పదమునంటినవారము ||మం||—23



పండ్రెండవ దళము

# సద్ధర్మ గాధలు




దయచేసెనొకఘనుడు తనువు విడిచెనొకనికై
దయచేసె నొకదిట్ట ధాత్రిభరముడిపెన్
దయచేసె నొకరాజు దగ్ధమగు మహీపతిని
దయచేసె నొకజపిత తరుచు మత్స్యములన్

ప॥ యిట్టి మహాత్ములయశము యిందునందున చాల
గట్టిగ ప్రకాసించు ఘనులు వినరయ్యా ॥యిట్టి॥

దయచేసె నొకఘనుడు తనరికుండలి సతుల
దయచేసె నొకప్రోఢ తలచి చ్రటాతిన్
దయచేసె నొకతపసి దాదిప్రియ సుతుల
దయచేసె నొకమూసి ధాతసుతుపౌత్రున్ ॥యిట్టి॥

దయచేసె నొకయింతి తగనన్న మిడియొకని
దయచేసె నొక నైలత తథ్యముగ ద్విజుని

దయచేసె నొకప్రోఢ దనుజ వైరులకుసుధ
దయచేసె నొకమగువ త్రైప్రతివ్రతలన్ ॥యిట్టి॥

దయచేసె నొకపక్షి ధరపొగలు వనచరుల
దయచేసె నొకహంస తవిలి కాకమును
దయచేసె నొకకోతి తలపోసి దినకరుని
దయచేసె నొకగజము తవిలి మానవునీ ॥యిట్టి॥

దయచేసె నొకమీను తనయుడును గిరిచరుని
దయచేసె నొకకపియు తగురాజ సుతులన్
దయను వీక్షించి తనదాసులకు వరముక్తి
దయచేసె పూదోట తారక బ్రహ్మమ్ ॥యిట్టి॥— 1



గురునికై యంగుళిని కొంక కిచ్చెనొకండు
గురునికై యొకఘనుడు కూల్చె భూపతులన్
గురునికై యొకరాజు కులము మానము విడచె
గురునికై యొకదిట్ట కొనివచ్చె కధరన్

ప॥ గురుభక్తి వినుడియిల కొనకొంగు పసిడిగతి
కరతలామలకమగు శరణులకు మోక్షం ॥గురు॥

గురునికై యొకఘనుడు కోరిమఖమునుజేసె
గురునికై యొకప్రోఢ కూలెరణమునను
గురునికై యొకతండ్రి కుసుమ బాణునిగెల్చె
గురునికై యొకమేటి కూల్చెదైత్యులను ॥గురు॥

గురునికై యొకటొంగ కూలె తన సుతునిచే
గురునికై యొకపులుగు కూలె మహిలోను
గురుని పదములునమ్మి గురుసుతులు పూదోట
గురుని స్వరూపులై మెరయుదురు వేడ్కన్ ॥గురు॥— 2



జననమై బోయకులమున జార చోరుడై
వనర దుర్గుణుడునై వర్తించి తుదను
వనర నారదుని విమలోపదేశమున
మునులలో నధికుడై మొనసి వెలుగొందు

ప॥ అతడు చిదానందుడనెడి బ్రహ్మణ్యుడగును
హితవుతో జెప్పెద నే నిల జనములార ॥అ॥

పరిశుద్ధుడై గురుని చరణములు నెరనమ్మి
అరయ రామాయణం బలరి జెప్పుచును
పరమభక్తులు నదియు పఠనంబు జేయుచును
స్థిరమోక్షమున నిలచి తేజరిల్లెదరు ॥అ॥

ముని సింహమని యతని ముల్లోకములవారు
కనుగొనుచు పరమ యోగియని మ్రొక్కగను
ఘనుడు పూదోట రామునికి వరపుత్రుడై
తనరుచును రామమంత్రమును జపియించు ॥అ॥—3

---

పరమ జ్ఞానులునైన బ్రహ్మర్షి రాజర్షు
లరయగా దేవర్షులాది మునివరులు
నెరయ నిర్లేపుడను నేర్పుతో శ్రీసూతు
పరగ బ్రహ్మాసనముపై నునిచి వేడ్క

ప॥ అట్టిసూతుని కులము నడిగినంతనె జనులు
మెట్టిబహునరకముల మిడిసి పడియెదరూ ॥అ॥

అలరి శౌనకు డాద్యచలముని పుంగవులు
లలితముగ నద్వైత రహస్యములు మాకు
తెలియ జెప్పుమటన్న దేశికుని కృప నతం
డల స్వానుభవార్థములు విస్తరించు ॥అ॥

ధరశూద్రుడని యతని తప్పదుంచ బ్రహ్మహత్య
గురుతు రేవతీసుతునకు జుట్టుకొనదే
సరసయోగీంద్రుడేజాతి నుదయించినను
పరికించ పూదోట గురుడు చేపట్టు ॥అ!—4

ఒక బాణమునగూల్చు వనచరుని నొకతపసి
ఒకనేసె నేమరచి వనజభవు తండ్రి
ఒకడు కానకనేసె వసుధపై ద్విజసుతుని
ఒకడు పులుగునునేసె యొకర బొంకుచును

ప॥ తలపోయ నెంతవారలు కాలమహిమంబు
తెలిసి గడువగలేరు ధీరాత్ములారా! ॥త॥

ఒకడు శునకమునేసి వరవిద్యగోల్పోయె
ఒకడు సోదరునేసె నొనర క్రోధమునన్
ఒకడు మామనుజంపె వరశాంతకపటుడై
ఒకడు స్తంభమునేసి యొక దైత్యుగూల్చెన్ ॥త॥

ఒకడు మూర్ఖునినేసె వసుధ ప్రియసుతకునై
ఒకడు గిరిచరునేసె వరకులము జెరచన్
ఒకడు బాలకునేసె వనజభవులోజొచ్చె
ఒకడు మృగములనేసి వసుధపై నీల్గెన్ ॥త॥

ఒకడు కిటినేయగని నొక యిర్వురనుబోరి
రొకడు బ్రాహ్మణినేసి వసుధపతి పొలిసెన్
ఒకడు రాజులనేసి వనదిచెంతనుజేరె
ఒకడు అసురనునేసె వైరులార్వగను

ఒకడు సర్వముగాల్చు నొక్క నిముషములోను
ఒకడు స్వాత్మయందు వసుధ జనులారా!
ఒకడు పూదోటకడ వరశూన్య తత్త్వమై
అకలంకమై చాల అమృతుడై వెలుగు ॥తల॥—5

—•—

ఒక మూసిసతిగోరి యొకఘనుడు భ్రష్టయ్యె
ఒక యింతికాసించి యొకబలుడు గూలు
ఒక విప్రుభార్య పొందొక జారి కలుషుడగు
ఒక దాసిని రమించి యొకరాజు వృద్ధయ్యె!

ప॥ తలపోయ నెట్టివారలు మన్మధునిమాయ
తెలిసిగెల్వగలేరు సుస్థిర భక్తులారా! ॥త॥

ఒక సుందరినిజూచి వలసి బహుమోహమున
ఒకడు జిహ్వను నెంచ వసుధజను లెరుగ
ఒక నెలతమదిగోరి వలసి యతిప్రియముతో
నొకండురమున నుంచు వన్నె మెరయగను ॥త॥

ఒక పొలతితోగూడి వలసి కామాంధుడై
ఒకడు శిరమున దాల్చువార్త కెక్కగను
అకలంకుడై చాల నలరు పూదోటకడ
నొకట బొచ్చెములేని వాడు నా గురుడు ॥త॥—6

—•—

కావడే యొకతండ్రి కాకోదరుని సతుల
కావడే యొకద్విజుడు కష్టంపురాజున్
కావడే యొక యెరుకు కమలారివంశజుని
కావడే యొకహాని గరిమె భూపతిని

ప॥ ఉపకారమే మేలు యుర్విపైజనులార
అపకారమే కీడనుచు శృతులు బల్కుకు ॥ఉ॥

కావడే యొకపక్షి కాకుత్స్థ కులజులను
కావడే యొక సిద్ధఘనుడు పినతల్లిన్
కావడే గిరిచరుడు ఘనదైత్య సతి సుతుని
కావడే యొకద్విజుడు తన కడుపులో ప్రోడన్ ||ఉ||

కావడే జలసుతుడు కంజారికులజులను
కావడే సురవైరి గగన సంచరుల
కావడే అర్కజుడు కరుణతో ద్విజసుతుని
కావడే సితకంఠ ఘనరాజ సుతులా ||ఉ||

కావడే యంతకుడు కరుణద్విజు లిరువురిని
కావడే యొకరాజు కనుగొనుచు హరిణిన్
కావడే యొకతపసి కడు వేడ్క మహీపతిని
కావడే యొకముంగి కలుషద్విజసుతుని
కావడే యొక స్వామి గర్భస్థుడగువాని
కావడే గొడ్రాలి ఘనత చరాచరముల్
కావడే సజ్జనులకడు వేడ్క వీక్షించి
కావడే పూదోట ఘనరామయోగీ! ||ఉ|—7



ఒక్క గురుసుతు జెనకి యొకడు సిగ్గునజెను
ఒక్కరాజును జెనకి యొకయసురగూలెన్
ఒక్కగొల్లని జెనకి యొకపలువ నష్టమగు
ఒక్కపుణ్యుని జెనకి యొకవిభుడు పొలిసెన్

ప|| ఇట్టివారలు జెడిరి యిలను సజ్జనులార
గట్టిగా మీకెపుడు కలహంబు వలదు ||ఇ||

ఒక్కశిశువును జెనకి యొకజోగి ధరనీల్గె
ఒక్క బ్రాహ్మణి జెనకి వసుధపతి పొలిసెన్

ఒక్కదిట్టను జెనకి మునువేద్గురిల తెగిరి
ఒక్కధీరుని జెనకి యొకతులువ గూలెన్ ॥ఇ॥

ఒక్కసతికాసించి వనర నిరువురుగూలి
రొక్క పడతిని గోరి యొకడు భ్రష్టయ్యె
ఒక్కయింతిని వలచి యొకరాజు మృతినొందె
ఒక్కపొలతినిగోరి యొకబోయగూలె
ఒక్క పులుగును జెనకి వనధి గడగడ వణకె
ఒక్కదంతిని జెనకి యొక మకరి తుసిగె
ఒక్కమీనును జెనకి యొకదొంగ నష్టమగు
ఒక్కకిటిజెనకి మహియొక బలుడుగూలెన్ ॥ఇ॥

దిక్కనుచు సద్గురుని దివ్యపదములు నమ్మి
తక్కుపిక్కులు లేక దాసబృందమును
చొక్కమగు పూదోట చక్కనయ్యను గూడి
మిక్కిలి యనంతమై మెలుగుదుపు వినుడీ ॥ఇట్టి॥—8

---

పొలిసె నొకదాసపుడు భూతవిభుపట్టిచే
పొలిసె స్నేహమున యొకపులుగు పులినోటన్
పొలిసె జంబూకమాశ నిల వింటికోపుచే
పొలిసె విప్రుడు రాచనెలత మోహమునన్

ప॥ తెలియగా ఈ విచిత్రతమ మహిమలన్నినే
వలసి చెప్పెదవినుడి వసుధజనులారా! ॥తెలి॥

పొలిసె గజసర్పములు పురహరుని భక్తికై
పొలిసెనొక యూర్ణనాభి శంకరునిచేర
పొలిసె నాగము కమఠములు వినతసుతునిచే
పొలిసె మర్కటమొకటి హలధరుని చాతన్ ॥తెలి॥

పొలిసె నొక యింతిమహీ భూసురుని కోపమున
పొలిసె నొక మకరమును యిలవానరునిచే
పొలిసె మాయల తపసి భూవిభునిబంటుచే
పొలిసె కర్కటనుచే పొసగ నొకబకము ॥ తెలి॥

పొలిసె సతితనవిభుని భూరికోపాగ్నిచే
పొలిసె నొక్కడు భార్యవలన శాపమునన్
పొలిసె నొక్కడు జార పొలతిపై మోహమున
పొలిసె నొక్కడు ప్రాణచెలికానివలనన్ ॥ తెలి॥

పొలిసె నొకచోరకుడు జలమధ్యమీనుచే
పొలిసె నొకశిశువుచే పొలతి ప్రజలలరన్
పొలియరెన్నటికైన పూదోట గురునిపద
జలజములగూడు వర సద్భక్తవరులు ॥ తెలి: —9



కావడే యొకనరుడు కంజాక్షులేడ్గురిని
కావడే యొకదిట్ట ఘనహాని మఖము
కావడే యొకవిభుడు ఘన తపసివేడినను
కావడే యొకరాజు కాకమును వేడ్కన్

ప॥ ఇటువంటివారలును నిహపరంబులయందు
పటుకీర్తిచే నెపుడు ప్రబలుచుండుదురు ॥ఇ॥

కావడే యొకఘనుడు కదసివల్లవి జనుల
కావడే యొకదిట్ట కమలాక్షి వేడ్కన్
కావడే యొకవిభుడు ఘన విప్రసూతులను
కావడే యొకపతియు గరిమె నాగమును ॥ఇట్టి॥

కావడే యొకవిభుడు కామారి కలజులను
కావడే యొకదిట్ట కపటకు ఘనుని

కావడే యొకహాని ఘనత త్రికులజులను
కావడే కేశవుడు కామారి దయను ॥ఇట్టి॥

కావడే యొకపక్షి కష్టంపు మానవుని
కావడే యొకయెలుగు ఘనరాజ సుతుని
కావడే మూషకము ఘన కపోతకకులము
కావడే గిరిచరుడు కని రాచపట్టిన్ ॥ఇట్టి॥

కావడే సన్మాయ క్రమముతో సగుణముల
కావడే యొకతండ్రి కడుజీవ తతులన్
కావడే సద్గురుడు ఘనభక్తకోట్లమరి
కావడే పూదోట ఘన రాజయోగీ ॥ఇ—10



చెడిపోడె యొకడు తన చిన్నిశిశువుతో బోరి
చెడిపోవడే యొకడు స్త్రీల చెరబట్టి
చెడిపోవడే యొకడు దూషించి సభమధ్య
చెడిపోవడే యొకడు ధర శిశువులను ద్రుంచి

ప॥ కనుగొనగ యిట్టి హంకారులిల గూలుదురు
వినరయ్య సజ్జనులు వివరింతునేనూ ॥క॥

చెడిపోయె నొకడు నా చిన్నిబాలకునిచే
చెడిపోయె నొకడు మహి శ్రీకంఠువలనన్
చెడిపోయె మునియొకడు స్త్రీల పలుకుల జిక్కి
చెడెను భూపతి మృగముచే శాపమునను ॥క॥

చెడిపోయె నొక యోగి క్షితి విభుని వ్రతమునకు
చెడిపోయె నొక తులువ శివుని కోపమునన్
చెడరె యిరువదివేలు సిద్ధ పురుషుని వెనకి
చెడిపోడె యొకఘనుడు సృష్టి విప్రునిచే ॥కను॥

చెడిపోయె నొకపలువ శీఘ్రముగ మునులచే
చెడిపోయె నొకమౌని స్త్రీ మోహమునను
చెడిపోయె నొకరాజు చెలగి యనృతముబలికి
చెడిచనిరి యింతులిల జితవిషయువలనన్ ॥కను॥

చెడెను సర్వము విలయ శిఖిని తుద నిమిషమున
చెడె నవిద్య సువిద్య చిద్వహ్నిచాతన్
చెడరెన్నటికినైన శ్రీగురుని వరసుతులు
చెడఁడు పూఁదోట సుస్థిర నిరంజనుడు ॥కను॥—11

---

మోసపోయెను నొకండు మునిపత్నిఁ జూచి మది
మోసపోయె నొకండు మోహించిసుతను
మోసపోయె నొకండు మోహనకాంతగని
మోసపోయె నొకండుమును మెరుకచేతన్

ప॥ విధిని గెలువగవశమె విశ్వమున నెవరైన
సదయులై వినరయ్య సర్వజ్ఞులారా ॥వి॥

మోసపోయె నొకండు మొనసి గజమనివేసి
మోసపోయె నొకండు మోసి తలిదండ్రిన్
మోసపోయి రిపుపురును మొనసి జూదములాడి
మోసపోయెను మరొకడు ముసలతాడనలన్ ॥వి॥

మోసపోయెను నొకతె ముదివిప్రుశాపమున
మోసపోయెను నొకతె మురహరునిచేతన్
మోసపోయెను నొకతె మోహించి సితకరుని
మోసపోయెను నొకతె మునిమంత్రమునను ॥వి॥

మోసపోయి రిపుపురును మును బ్రహ్మసుతులచే
మోసపోవడే యొకడు మూర్ఛింపు సతికై

మోసపోయి రిపువుకను ముని అగస్త్యునిచేత
మోసపోవడె యొకడు ముద్దుబాలునిచే ||వి||

మోసపోరే ముగ్గురు మునిసతిని జెరచుటకు
మోసపోరే ప్రజలు మును మాయచేతన్
మోసపోడెప్పుడును మాలబ్రహ్మంబైన
వాసిగల పూదోట వరరామయోగీ ||వి||—12

---

ఒకడు మైమాంసంబు నొసగె ఖగమునకునై
యొకడు తన చర్మంబు నరులకును నొసగెన్
ఒకడు తనశల్యములు నొనర యింద్రునకొసగె
నొకడు గుఱపలుకుకై వసుధ గోల్పోయెన్

ప|| ఇట్టి ధైర్యములేక ఇలమీద జనములకు
వట్టిమాటలచేత వచ్చునే యశము ||ఇట్టి||

ఒకడు తనసతినిచ్చె ప్రకటమగు భక్తికై
నొకడు తనసుతునిచ్చె యొకడు వేడినను
యొకడు సర్పమునకై యొనర ప్రాణములిచ్చె
ఒకడు చక్షువులిచ్చె వహ్నినేత్రునికి ||ఇట్టి||

ఒకడు తమ్ముల7గాచె వనజ సఖుసుతుకృపను
ఒకడు పుత్రునిజంపె వరజంగమునకై
నొకడైన పూదోట వరయోగిపుంగవుకు
సకల భక్తులగాచు సజ్జనులు పొగడన్ ||ఇట్టి||—13

—: అల్లో గురుమూర్తి ! అల్లో ! తత్త్వము :—

కల్లజనములిలను కలిమాయచేజిక్కి అల్లో గురుమూర్తి అల్లో
పిల్లవాండను వావివరుసలను తప్పెదరు ||అల్లో గురుమూర్తి అల్లో||
కల్లుపడి మతములను కడవర్ణములు జెడును ||అ||

కల్లుభంగి జ్ఞానములు ఘనమగును ||అ||
వెల్లరిచె తామసులు వికటించెదరు ఘనుల ||అ||
తల్లడించెదరు దొరలు త్రుళ్లెదరు తురకలును ||అ||
త్రుళ్ళేటి స్త్రీ పురుషులెల్ల తుదమశిసెదరు ||అ||
అల్ల శివశరణులును అవనిపై నిలిచేరు ||అ||
అల్ల నందనమెకను అరుదెంచేనే ప్రభువు ||అ||
తెల్లముగ నందిముఖమున దేవుడును నిలిచీని ||అ||
అల్ల శేముషీజలంబతని శిరమున ద్రుంకు ||అ||
మల్లెపూవులశాటి నా మహాత్ముడుగప్పి ||అ||
తెల్లభూతిబూసి తిరుమణి మెరయగను ||అ||
ఒల్లునిండాసొమ్ము లుల్లసిల్లునె యెపుడు ||అ||
అల్ల దివ్యాన్నంబు లారగించేనే శివుడు ||అ||
అల్ల తారాసుతుం డాకుజుట్టిచ్చెనే ||అ||
పిల్లకోతి గురుని బిరుసు పదములుబట్టె ||అ||
చల్లగా సతులు వింజామరలు వీచెదరు ||అ||
చెల్లాటమున హారతులు చేడెలిచ్చెదరు ||అ||
ఇల్లాలు ముక్తిసతి యెదుట వెలుగునె యెపుడు ||అ||
ఎల్లపుడు జయభేరి యెదుట ఘోషించునే ||అ||
మెల్లగను నారదాదులు మెరసి పాడెదరు ||అ||
ఘల్లు ఘల్లున దివ్యకన్య నాట్యముద్రొక్కు ||అ||
అల్ల భక్తులుచూచి యానంద మందెదరు ||అ||
ముల్లోకములవారు మొనసి కీర్తించెదరు ||అ||
కొల్లలుగ వరముక్తి కొమ్మనుచు నిచ్చునే ||అ||
జల్లున కనకవర్షము స్వామిపై గురిసీని ||అ||
ఉల్లాసమున సబ్ధులుపొంగి యుండేనె ||అ||
జల్లునను వికసించు చాలకంజములు ||అ||
చల్లగాను ధరణి సర్వఫలములనిచ్చు ||అ||
తల్లడించకుడీ హరి ధరణిపై ప్రబలీని ||అ||

అల్ల కృతయుగచర్య నాత్మారాముడు నడపి ||అ||
ఉల్లాసమున గురుని యుపదేశమార్గమున ||అ||
తల్లక్రిందైయున్న తక్షకుని కాచితిని ||అ||
చెల్లా చెదరైపోయె సర్వ తత్త్వంబులును ||అ||
త్రుళ్ళిపడిరి ముగ్గురు తుదను చక్రముతిరుగ ||అ||
అల్లన నగుచును రసనాగ్రమున నేను ||అ||
అల్లరివాకిలి మూాత నటుబోవ జిమ్మి ||అ||
ఇల్లుసొచ్చి పోవ నెదుట జోతినిగంటి ||అ||
ఇల్లెల్ల మేలైన హేమంపుకళలే ||అ||
అల్ల హృత్కమలంబు నంటె మెరసితినే ||అ||
చల్లని పువ్వుల చవికెలోపలనే ||అ||
అల్లిబిల్లైయుంటి హంసతల్పంబుననే ||అ||
కొల్లలుగ ముక్తిసతి కూడి కు॰డకయుం౦డ ||అ||
వల్లు మరచితుదను యొక్కటైయుంటినే ||అ||
అల్ల యవధూతయను అమృత వాక్యములే ||అ||
బల్లిదులునైన సద్భక్తులకు దెలియు ||అ||
ఎల్ల జనములు చదువ నిలముక్తి కలుగునే ||అ||
కల్లగాదీమాట ఘనత బ్రహ్మాస్త్రమే ||అ||
చల్లగా పూదోట సద్గురుడు తుదిసాక్షి ||అ||—14






—: జోలపాట :—

బంగారు చేలముల్ చుంగుగాగట్టి
సంగతిగ రత్నభూషణములనుబెట్టి
రంగుపాపట బొట్టు రమణులును బెట్టి
అంగనామణులు శ్రీహరి తొట్లబట్టి

ప॥ లాలి లాలంచు నూచెదరు మేలుతోగురుని
బాల లిరుగడనిలిచి పాట బాడుచును ॥లాలీ॥

పరమ దివ్యపు తొట్ల భావముననుంచి
విరివి త్రాళ్లుగ చతుర్వేదములు బెంచి
సిరులు మించినపాన్పు చెలులు మోదించి
పరమ కన్యలువేడ్క బ్రహ్మంబునుంచీ ॥లాలీ॥

దిట్టమగు కైవల్య పట్టణము నిండ
చుట్టు బహు జ్యోతులును శోభిల్లుచుండ
పట్ట పగలుగ కళలు బలిసి దివినిండ
అట్టె నాదమువింట యబ్జాక్షుడుండ ॥లాలీ॥

సకల సురనికరములు సన్నుతింపగను
శుక శౌనకాదులును చూచి పొగడగను
ప్రకటముగ ముగ్గురును ప్రబలికొలువగను
అకలంకమగు శృతులలరి మ్రొక్కగను ॥లాలీ॥

నిదురపో నిగమాంత నిజయోగి పుంగవా
నిదురబో సర్వాంగ నిజ నిర్మలాంగా
నిదురబో అవధూత హృదయాబ్జ భృంగా
నిదురబో పూదోట నిజరామలింగా ॥లాలీ॥—



శ్రీ పూదోట లింగావధూతస్వామివారి పాదుకార్పితముగా శ్రీపూదోట తత్త్వగీతామృతముయొక్క ముద్రణకు ధన సమర్పణజేసిన

## శ్రీ పూదోట గురుపుత్ర భక్తమండలి

| మొత్తం | పేరు |
|---|---|
| 516-00 | శ్రీ టి. సి. పుల్లారెడ్డిగారు మోరగుడి కడపజిల్లా |
| 400-00 | శ్రీ కాకర్లపూడి సత్యనారాయణరాజుగారు గాడిలంక తూర్పుగోదావరి జిల్లా |
| 250-00 | శ్రీయుత ఉప్పాళ్ళు వెంకటగౌడుగారి జ్ఞాపకార్థం వారి ధర్మపత్ని శేషమ్మగారు కంచగారు బెలగళ్ళు బళ్లారి జిల్లా |
| 216-00 | శ్రీ చాడం మునెయ్యగారు మోరగుడి కడప జిల్లా |
| 200-00 | శ్రీ గుర్రం కొండప్పగారు మోరగుడి కడప జిల్లా |
| 216-00 | శ్రీ వెలగల సూరారెడ్డిగారు శ్రీమతి వీరాయమ్మగారు పేకేరు పశ్చిమగోదావరి జిల్లా |
| 216-00 | శ్రీ తమనంపూడి ఆదినారాయణరెడ్డిగారు శ్రీమతి గంగాయమ్మగారు పేకేరు పశ్చిమగోదావరిజిల్లా |
| 216-00 | శ్రీ నడిమింటి కేశవయ్యగారు శ్రీమతి శేషమ్మగారు పామిడి అనంతపురం జిల్లా |
| 216-00 | శ్రీయుత వెంకనగౌడుగారి జ్ఞాపకార్థం కుమారులు నాగనగౌడు శివారెడ్డిగారు కంచగారు బెలగళ్ళు బళ్ళారి జిల్లా |
| 160-00 | శ్రీయుత చింతలపాటి వెంకటాచలపతిగారు శ్రీమతి వెంకట సుబ్బమ్మగారు గుడివాడ కృష్ణాజిల్లా (రిటైర్డ్ ఓర్సీలు) |
| 116-00 | శ్రీయుత పెనుమత్స రామభద్రరాజుగారి భార్య శ్రీమతి సూరాయమ్మగారు గుడిమెళ్ళంక తూర్పుగోదావరి జిల్లా |
| 116-00 | శ్రీయుత కీ॥ శే॥ యమ్. రామచంద్రారెడ్డిగారి జ్ఞాపకార్థం వారి ధర్మపత్ని శ్రీమతి తులశెమ్మగారు మలగవల్లి కర్నూలు జిల్లా |
| 116-00 | శ్రీయుతులు జూటూరు కొండారెడ్డి ఛాయమ్మగార్ల జ్ఞాపకార్థం కుమారుడుపుల్లారెడ్డిగారు తరిమల అనంతపురంజిల్లా |

116-00 శ్రీయుతులు కీ॥ శే॥ కె సుబ్బారెడ్డిగారి జ్ఞాపకార్థం వారిధర్మపత్ని ఆదిలక్ష్మమ్మగారు తరిమల అనంతపురంజిల్లా
116-00 శ్రీయుతులు కీ॥ శే॥ తల్లం సాలమ్మ వెంకటరామయ్యగార్ల జ్ఞాపకార్థం కుమారుడు సుబ్బయ్య శెట్టిగారు పామిడి
అనంతపురం జిల్లా
108-00 శ్రీయుతులు కీ॥ శే॥ నీలం చిన్నపురెడ్డిగారి జ్ఞాపకార్థం వారి ధర్మపత్ని శ్రీమతి సుబ్బమ్మగారు యిల్లూరు
అనంతపురం జిల్లా
116-00 శ్రీయుత గుండా ఎల్ల శేషయ్య గారు
బేతంచెర్ల కర్నూలు జిల్లా
116-00 శ్రీయుత శ్రీ కాకుల చిన్నారాయణశెట్టిగారి భార్య శ్రీమతి శేషమ్మగారు గోవిందపల్లె కర్నూలు జిల్లా
116-00 శ్రీయుత గుండా సుబ్బరాయుడుగారు
నంద్యాల కర్నూలు జిల్లా
100-00 శ్రీయుత ఆత్మారాంగారు చిప్పలపాలెం
తూర్పుగోదావరి జిల్లా
64-00 శ్రీయుత మాగంటి పుష్పవతెమ్మ వీరయ్యగారు ఏలూరు
60-00 శ్రీయుత గుండా యెల్లయ్యగారు బేతంచెర్ల
58-00 శ్రీయుత సోమా యీశ్వరయ్యగారు నంద్యాల
51-00 శ్రీయుత కలిదిండి రామలింగరాజుగారి భార్య శ్రీమతి వెంకట నర్సయ్యమ్మగారు పెద్దపుల్లేరు పశ్చిమగోదావరి జిల్లా
58-00 శ్రీయుత కోకిలతోట శివారెడ్డిగారు గజ్జెల్లి కర్నూలుజిల్లా
54-00 శ్రీయుత నడిమింటి సత్యమయ్య లక్ష్మిదేవమ్మగారు
పామిడి అనంతపురం జిల్లా
55-00 శ్రీయుత నడిమింటి సూర్యనారాయణశెట్టి
అంపమ్మగారు పామిడి అనంతపురం జిల్లా
54-00 శ్రీయుత గాజ తిమ్మయ్య గారు
అంబాపురం కర్నూలు జిల్లా

10-00 శ్రీమతి తోటకూర వెంకాయమ్మ గారు భర్త
వెంకటరాజు గారు అనాతవరం తూర్పుగోదావరి జిల్లా
10-00 శ్రీమతి పేరిచర్ల వెంకట సుబ్బాయమ్మ గారు భర్త
వెంకట సుబ్బరాజు మాఘం తూర్పుగోదావరి జిల్లా
25-00 శ్రీమతి దంతులూరి సీతమ్మ గారు భర్త సూర్యనారా
యణరాజు గారు అన్నంపల్లి తూర్పుగోదావరి జిల్లా
10-00 శ్రీమతి సాగి సుభద్రాయమ్మగారు ఇలపఱ్ఱు ప.గో. జిల్లా
6-00 శ్రీమతి సత్తి మీనాక్షమ్మ గారు
పేకేరు పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీయుత పులగం సత్యనారాయణ రెడ్డి గారు
పేకేరు పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీమతి భూపతిరాజు అచ్చయ్యమ్మ గారు
ఆలమూరు తూర్పుగోదావరి జిల్లా
15-00 శ్రీమతి గొట్టుముక్కల సీతాయమ్మ గారు
పాలకోడేరు పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీమతి దంతులూరు సూరాయమ్మగారు భర్త
రామరాజుగారు కోపల్లె ప-గోదావరి
10-00 శ్రీమతి దంతులూరి సీతాయమ్మగారు భర్త
సుబ్బరాజుగారు కోపల్లె పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీమతి భూపతిరాజు సూరాయమ్మగారు భర్త
సుబ్బరాజుగారు వేండ్ర ప|| గో.| జిల్లా
15-00 శ్రీమతి భూపతిరాజు సూర్యకాంతమ్మగారు భర్త
పుల్లమరాజుగారు వేండ్ర ప|| గో.| జిల్లా
10-00 శ్రీమతి కోనూరు కృష్ణయ్యమ్మగారు వేండ్ర ప|| గో|| జిల్లా
10-00 శ్రీమతి దంతులూరు శీతాయమ్మగారు భర్త జగన్నాధ
రాజుగారు కోపల్లె ప: గో/ జిల్లా
10-00 శ్రీమతి వత్సవాయి జానకమ్మగారు రామరాజుగారు
మంచిలి ప|| గో|| జిల్లా

10-00 శ్రీమతి దంతులూరు సుభద్రాయమ్మగారు భర్త
శ్రీ సత్యనారాయణరాజుగారు కోపల్లె ప॥ గో॥ జిల్లా
10-00 శ్రీమతి వేగేశన సత్యవతమ్మగారు భర్త
సత్యనారాయణరాజుగారు కోపల్లె ప। గో॥ జిల్లా
10-00 శ్రీమతి కలిదిండి నర్సాయమ్మగారు భర్త
చిన్నవెంకటరామరాజుగారు పెదపుల్లేరు ప॥గో॥జిల్లా
10-00 శ్రీమతి కలిదిండి అలివేలి సీతామణెమ్మ గారు భర్త
శ్రీరామచంద్ర రాజుగారు పెద్దపుల్లేరు పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీమతి పెనుమత్స భాగ్యలక్ష్మీదేవి గారు భర్త సూర్య
నారాయణరాజు గారు పడమరవిప్పర్రు ప॥ గో॥ జిల్లా
25-00 శ్రీమతి యిందుకూరి పుల్లాయమ్మ గారు భర్త
శ్రీ కృష్ణంరాజుగారు భుజబలపట్నం కృష్ణా జిల్లా
25-00 శ్రీయుత సయ్యపరాజు సరోజమ్మ గారు, భర్త
సత్యనారాయణ రాజుగారు భుజబలపట్నం కృష్ణాజిల్లా
10-00 శ్రీమతి వెల్లంకి లక్ష్మీతులశమ్మగారు భర్త
కోటేశ్వరరావుగారు గుడివాడ కృష్ణా జిల్లా
10-00 శ్రీమతి పేరిచెర్ల సుబ్బలక్ష్మమ్మగారు
ఆయుర్వేద డాక్టరు పాలకోడేరు పశ్చిమగోదావరి జిల్లా
10-00 శ్రీమతి కాజ సుశీలమ్మగారు భర్త కృష్ణమూర్తిగారు
డాక్టరు గుడివాడ కృష్ణా జిల్లా
10-00 శ్రీయుత చింతలపాటి శివరామయ్యగారు విజయవాడ
25-00 శ్రీయుత కల్లమడి బాలసుంకయ్య పార్వతమ్మగారు
మాతృశ్రీ వీరమ్మ తరిమల అనంతపురం జిల్లా
25-00 శ్రీ జూటూరు దాసప్ప అండ్ సన్సువారు తిమ్మనచర్ల
అనంతపురం జిల్లా
25-00 శ్రీ పోలా చిన్నవెంకయ్య అండ్ బ్రదర్సు తిమ్మనచర్ల
25-00 శ్రీ బుర్రిజింటి వీరారెడ్డిగారు అర్ధగేరి ఆలూరు తాలూకా
కర్నూలు జిల్లా

10-00 శ్రీ భీమిరెడ్డిగారి తిమ్మారెడ్డిగారు అర్ధగేరి
10-00 శ్రీ కె. రామచంద్రారెడ్డిగారు ,,
10-00 శ్రీ హెచ్. టి. రామకృష్ణారెడ్డిగారు ,,
10-00 శ్రీ హెచ్. టి. లింగమ్మగారు ,,
15-00 శ్రీ హెచ్. టి. వెంకటరెడ్డిగారు ,,
10-00 శ్రీ హెచ్. మాణిక్యంరెడ్డిగారు ,,
10-00 శ్రీ చెరుకూరి రాఘవయ్యగారు వన్నూరు బళ్ళారి జిల్లా
10-00 శ్రీ పంపా రెడ్డిగారు గజ్జెళ్ళి కర్నూలు జిల్లా
10-00 శ్రీమతి కోకిలతోట లక్షుమ్మగారు గజ్జెళ్ళి ఆలూరు తా॥
5-00 శ్రీ హెచ్. లింగారెడ్డిగారు గజ్జెళ్లి
30-00 శ్రీ కీ. శే. కె. శేషయ్యగారి జ్ఞాపకార్థం
కుమారుడు నాగయ్యగారు తిరిమల
25-00 శ్రీ కాలువ పెద్దవెంకటరామయ్యగారు
నేమద్దుల ధర్మవరంతాలూకా అనంతపురం జిల్లా
6-00 శ్రీమతి కదిరప్పగారి లక్షుమ్మ తిరిమల
20-00 శ్రీ వి. శివయ్యగారి జ్ఞాపకార్దం కుమారుడు
రాజగోపాలగుప్త తిరిమల
20-00 శ్రీ ఆర్. రామలింగారెడ్డిగారు అడ్వకేటు హైదరాబాదు
10-00 శ్రీ జూటూరు గురప్ప భార్య శ్రీమతి తులశమ్మ తిరిమల
15-00 శ్రీ రాచపుడుగు గురప్పగారు సంద్యాల
10-00 శ్రీమతులు సాధుమాతలు భారతమ్మ యోగమ్మగారలు
కోపల్లె శాంతి ఆశ్రమం ప. గోదావరిజిల్లా
25-00 శ్రీయుత నడిమింటి పెద్ద సత్యమయ్య గారు. అనంతపురం
10-00 శ్రీమతి కె. చెన్నమ్మ గారు శ్రీరామ మందిరం
హాస్పేట బళ్ళారి జిల్లా
25-00 శ్రీ సుభాం జీరావుగారు. వీరి మాతృదేవి శ్రీమతి
లక్ష్మీ బాయమ్మ గారు బేతంచర్ల

## శ్రీ పూదోట తత్త్వగీతామృతమునందుగల ముద్రణలో తప్పొప్పుల పట్టిక

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| I | కులక్షేపము | కాలక్షేపము |
| x | వీణాతంతుల | వీణాతంత్రుల |
| xvi | కధముచేయు | కధనముచేయు |
| 9 | అట్టెనీవును నిల్చి | అట్టె నీవును నిల్చి |
| 23 | పక్కటిల్లుచు | పిక్కటిల్లుచు |
| 24 | గట్టెల్లి | గట్టెక్కి |
| 36 | శరధులును నుప్పెంగి | శరధులు నుప్పొంగె |
| 37 | మే సర్పము | మేటి సర్పము |
| 40 | కళలుబసి | కళలుబలసి |
| 42 | తిరుమణియునుగొనల | తిరుమణియు కనుగొనల |
| 49 | ఘూణవీనుల్ | ఘ్రూణవీనుల్ |
| 50 | పరమాత్మపై | పరమాత్మవై |
| 53 | వనజభవవిష్ణు | వనజభవశివవిష్ణు |
| 55 | భుజియించ | భజియించ |
| | పొసగ జేయునే | పొసగ బాయగ జేయునే |
| | ప్రణుతి సరగ | పణతి సరగ జేయునే |
| 57 | ననుదయ | నన్నుదయ |
| 63 | దనుజకులమున | దనుజకులమను |
| 65 | నిష్ఠతో శ్రీగురిని | నిష్ఠతో శ్రీ గురుని |
| 66 | దృష్టాంతమగు విమలి | దృష్టాంతమగు విమల |
| 70 | విరివిగా బంధుముఖ | విరివిగా భిందుముఖ |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 75 | పాపు డుదయించతని | పాపడుదయించతని |
| 77 | కలయనీయక | కలసి కలయక |
| 81 | నిష్కరుడై | నిష్కళుడై |
| 83 | దాని జననమై | దాన జననమై |
| 102 | పరికించ మదిలోని | మదిలోన |
| 104 | ఘనుల ధుషించిరా | ఘనుల దూషించిరా |
| 110 | నలరి కూడకును | నలరి కూడకను |
| 124 | అజ్ఞాన జీవులను | అజ్ఞాన జీవులును |
| | కంచు కంబర | కంచు కంబరయ |
| 143 | తగులవడకును | తగులవడకను |
| 147 | త్రైలక్షములను | త్రైలక్ష్యములను |
| 153 | కోరకును | కోరకను |
| 156 | ఎరుగ ఔట్లు | ఎరుగు ఔట్లు |
| 161 | వరగురుని పదములో | పదముల్ |
| 180 | మన్మధునిచే బోదరిమి | మన్మధుని బోదరిమి |
| 185 | మదిని నాశము | మదిని నాశయు |
| 198 | తెలిసి సద్గురిని | తెలిసి సద్గురుని |
| | వలసద్యానము సేయ | వలసి ద్యానము సేయ |
| 200 | పొంకమగు తేజనెక్కి | తేజినెక్కి |
| 208 | విషము తలకె | తలకెక్కి |
| 210 | సర్వము ఆమక | ఆముక |
| 222 | మెట్టిన సద్గురు | మెట్టి సద్గురు |
| 232 | గురుపద బ్రహ్మమును | గురుపరబ్రహ్మమును |
| 236 | పరమ యోగులును | యోగులను |
| 238 | సతి పుత్ర ధన ధాన్య | సతి పుత్ర ధనధాన్య |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 243 | వికటమగు పూదోట బ్రహ్మంబు గూడుచును అను పంక్తి పూర్తిగా తప్పు | |
| 244 | విమరాత్ములగుచున్ | విమలాత్ములగుచున్ |
| 258 | అష్టమదములనుడుపి | అష్టమదములనుడిపి |
| 261 | నెరనెరగి పూజంచు | పూజించు |
| 274 | తత్త్వము నెం. 142ఎ | తీసివేయుము |
| 288 | అలరుచు చిద్వీజము | చిద్బీజమున |
| 293 | బ్రహ్మపదమంటి కా | బ్రహ్మపదమంటి తా |
| 337 | సర్వశూన్యమున దెలుగు | సర్వశూన్యమున వెలుగు |
| 342 | విస్వసాక్షినిగూశి, | విశ్వసాక్షినిగూఢి |
| 348 | నింగికిని బోవిూలె | నింగికిని బోమిూటి |
| 350 | సదయుడై వెరగున్ | సదయుడై వెలుగున్ |
| 352 | విధునిరూపై తిన్ | విభునిరూపై తిన్ |
| 358 | యూర్థ్వముఖముగ | యూర్ధ్వముఖముగ |
| 373 | నడిమికంటె | నడిమికంటి |
| 375 | పంచశిరముపణి | పంచశిరములపణి |
| 377 | మారుతము విస్తమగుచో | లిప్తమగుచో |
| 383 | ముక్తిరాజునై యుండు | యుండు |
| 400 | శిరములను మాణక్య | మాణిక్య |
| 403 | మొలకనవ్వుల మిమల | నవ్వుల విమల |
| 415 | నీ పద్వితీయుడ | నీ వద్వితీయుడ |
| 416 | నిలిచిసర్వము | నిలిచి సర్వము |
| 436 | మూడదృష్టి | మూడవ దృష్టి |
| 465 | మయుగుణత్రయము | మరియు...... |
| 472 | యీ సాకార నికరములగు | నికరముల |

| పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 476 | సర్వ వేదకారణుడను అను తత్త్వమున | |
| | 1 నుండి 10 పంక్తులు నేనె అని యుండవలె. నేనే తప్పు | |
| 479 | చకితుడై వంర్తించు | చకితుడై వర్తించు |



# చిత్రపటముల పుట సంఖ్యా క్రమము

నెం. పుట



---

ప్రతులు వలయువారు:

**అవధూత ఆనందనాదస్వామి**

శ్రీశ్రీశ్రీ పూదోట లింగావధూతస్వామివారి మఠం, బేతంచెర్ల పోస్టు, కర్నూలుజిల్లా.

లేదా

**శ్రీ నాగావధూతస్వామి**

శ్రీరామ మందిరం, తరిమల పోస్టు, అనంతపురం జిల్లా

అని వ్రాయవలయును.